# విజ్ఞప్తి

గాంధీజీ రచనలను తెలుగులో ప్రచురించు నుద్దేశముతో గాంధీస్మారకనిధి, ఆంధ్రశాఖవారిచే 1959 జూన్ మాసములో గాంధీ సాహిత్య ప్రచురణ సలహా సంఘము నెలకొల్పబడినది. మన అదృష్టవశమున పూజ్యులు, శాసనసభాధ్యక్షులు, పద్మభూషణ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు అధ్యక్షులుగను, ఆంధ్ర పితామహ, పద్మభూషణ శ్రీ మాడపాటి హనుమంత రావుగారు ఉపాధ్యక్షులుగ నుండుటకంగీకరించిరి. వారి అమూల్యమగు సలహాలతో ప్రచురణ కార్యక్రమము రూపొందించబడినది.

పుస్తకరూపములో పూజ్య బాపూజీ రచించిన గ్రంథములను వివిధమూలములనుండి విభిన్న శీర్షికలు క్రింద నవజీవన్ ట్రస్టు వారిచే సంకలనము చేయబడిన గ్రంథములను, గాంధీజి జీవితం, ఆదర్శములగూర్చి సుప్రసిద్ధ రచయితల గ్రంథములను తెలుగులో సులభశైలిలో ప్రచురించుటకు నిశ్చయింపబడినది.

ప్రచురణ కార్యక్రమము, పైనందిన కార్య నిర్వాహణ, ...వర్గమున కప్పగింపబడినది. గాంధేయ ఉద్యమములతో సన్నిహితముగానుండిన రచయితలకు భాషాంతరీకరణ బాధ్యత నప్పగింపబడినది. 1959 అక్టోబరు 2వ తేదీన గాంధీ సాహిత్య ప్రచురణాలయ ప్రారంభోత్సవము శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

గారిచే జరుపబడెను. ప్రథమ దశయందు శ్రీ స్వామి సత్యప్ర
కాశ్, ముదుగంటి జగ్గన్నశాస్త్రిగారలు కార్యభారము వహిం
చిరి. వారికి మేము కృతజ్ఞులము. ప్రస్తుతము తల్లాప్రగడ రామ
చంద్రరావు, ఎమ్. ఏ., పైడిమర్రి సత్యనారాయణమూర్తిగార్లు
కృషి చేయుచున్నారు.

సంవత్సరమునకు 250 పుటలు గల 6 గ్రంథములను
ప్రచురింప సంకల్పింపబడినది. ఆ కృషిఫలితంగా ఆయిదుపుస్తక
ములు వెలువడినవి. అందు మొదటి గ్రంథము ఈ ఢిల్లీ డైరీ.
ఈనాడు పూజ్యబాపూజీ సహచరులు, ఆయన సిద్ధాంతములకు
మూర్తీభవించిన మహాత్ములు, మన రాష్ట్రపతి శ్రీ బాబు
రాజేంద్రప్రసాద్ గారు వీటికి ఆవిష్కరణ మొనరించుట మన
పుణ్యఫలము.

ఆంధ్రప్రదేశ్ నందుగల వివిధ సంస్థలు, వ్యక్తులు ఎక్కు-
వగా వీటిని ఉపయోగించిననాడే యీ ప్రచురణల ఆశయము
సిద్ధించగలదు. గాంధీసాహిత్యమును బహుళ ప్రచారములోనికి
తీసుకొనివచ్చు బాధ్యతను విద్యామంత్రిత్వశాఖ, సమాజవికా
సశాఖ, వికేంద్రీకరణ ఫలితముగా నూతనముగా ఏర్పడిన పంచా
యితీ సమితులు, జిల్లా పరిషత్తులు, ఇతర సహకార సంస్థలు
వహింపవలెనని మా విజ్ఞప్తి. ఒకనాడు గాంధీజీ పిలుపును శిరసా
వహించి ఆయనకు ప్రియతములయినవారు ఆంధ్రులు. ఈనాడూ
పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు— అందరు ఆంధ్రులహృద

యములందు బాపూజీ సందేశ, ఆదేశములు సజీవములై యున్నవి. కాన యింటింటా యీరచనలకు స్థానముండగలదని మా హృదయపూర్వక వాంఛ.

గాంధీజీ తన జీవితకాలమందు, తన మృత్యుముఖమునందు భారతప్రజలకేకాక యావత్ప్రపంచానికీ అందిచ్చిన ఆదర్శములు, ఆదేశములను తరతరములుగా మాతృభాషలయందు పఠించి, మననముచేసికొని మన మాచరణలో పెట్టవలసియున్నది. ప్రపంచమునందు ప్రబలుచున్న దౌర్జన్యము, యుద్ధభీతి అంతరించి, సర్వోదయసిద్ధి పొందుటకు గాంధేయమార్గ మొక్కటే రాచబాట యని ప్రపంచప్రజానీకము గుర్తించు సూచనలు ఆశారేఖవలె పొడగట్టుచున్నవి. తెలుగునందు వెలువడుచున్న యీ రచనలు ఆంధ్రమహాజనుల హృదయములను గాంధేయమార్గమునందు లగ్నమొనరింపగలవని యాశించుచున్నాము.

శ్రీ రామనగర్
కాకినాడ
3-8-1960

ఇట్లు
విధేయుడు
మల్లవరపు వెంకటకృష్ణారావు,
గాంధి స్మారకనిధి, ఆంధ్రశాఖ,
గాంధీ సాహిత్య ప్రచురణాలయం, అధ్యక్షుడు.

# ఆంగ్ల ప్రచురణ కర్త సూచన

15-8-47 కు పూర్వపు, దరిమిలా, ఫలభరితమైన చరిత్రను వర్ణించుటకు యిది తరుణముకాకున్ననూ, గాంధిజీ ప్రార్థనో పన్యాసాలు అందులో ఒక అమర అధ్యాయమగును. ఈభక్తా గ్రేసరుని హృదయాలాపములు చరిత్రాత్మకములు. వాటిని ప్రార్థనయొక్క అంతర్భాగంగా భావించి వినవలెనని గాంధిజీయే ఒకచోట చెప్పిరి. (111 వ ఉపన్యాసం.)

ఆయన సంభాషణలు మూడుభాగములుగా నున్నవి. (1) నౌకాలీ సంచారంలో, (2) కలకత్తాలో, (3) ఢిల్లీలో యివ్వబడినవి. మూడూవే యీపుస్తకంలో చేరినవి. ఈపుస్తకము స్వతంత్రభారతమునకు ఆయన ఒసంగిన అంత్యసందేశము. ఆయన ఆత్మ మనతోనుండి ఆయన కలగాంచిన స్వతంత్రభారత నిర్మాణమునకు తోడ్పడును గాక.

అహమ్మదాబాద్ 20-3-48

# ఆంధ్ర అనువాదకుని వినతి



లోగడనే యీపుస్తకములో అత్యధిక భాగం సుమారు 2 వంతులు అనువదించబడెను. తక్కినది అనువదింపజేసి ప్రచురింపచేయుమని కొందరు స్నేహితులకు వప్పగించబడెను. కాని ఆంధ్రరాష్ట్రస్థాపనోద్యమములోని తీవ్రఘట్టములలో దిగినందున యీపుస్తకము సంగతి యోచించ వీలుకాలేదు. కాలయాపన జరుగుటచే మొదటి అనువాదమును, యితరస్నేహితులు చేసిన అనువాదమును, అసలు ఆంగ్లగ్రంథమును, కాలగర్భమున పడిపోయెను.

ఈ ఆంధ్రగ్రంథమును అచ్చొత్తించుటకు గాంధీ స్మారక నిధివారు సమ్మతించిరి. అసలు ఆంగ్లగ్రంథము 392 పుటలను 200 పుటలలోనికి సంగ్రహపరుప మనిరి. అందుచేత యీపునః పాకము అవసరమయ్యెను. చాతుర్మాస్యల దీక్షకు యిది అనుకూలమైన సత్కార్యము. ఈవిధముగా మహాత్మునియందుండే భక్తిశ్రద్ధలకు యిది ఒకచిహ్నముగా చెలువొందును గాక!

# తొలిపలుకు

సుమారు 400 పుటలుగల యీపుస్తకములో మహాత్మా గాంధీ జీవితకాలంలోని చిట్టచివర నాలుగున్నర నెలలలో ఒసంగబడిన ప్రార్థనానంతరోపన్యాసములు గలవు. 10-9-47 మొదలు 30-1-48 వరకు ఆయన దినచర్య యిందులో కలదు. అనేక ప్రాణాలకు; ఆస్తికి; జీవితానికి ప్రాధాన్యతనిచ్చే నైతిక, ఆధ్యాత్మిక అమూల్య అంశాలన్నింటికీ నష్టము కలిగించిన కర్మలచేత ఆయన మిక్కిలి ఆవేదన పడెననువిషయం అందరెరిగినదే. ఈ పుటలలో అది స్పష్టముగా కనబడును. మానవత్వమునకు అనుకూలమైన జీవితప్రమాణాలను పునరుద్ధరించి నిలబెట్టుటకు ఆయనచేసిన అతిమానవ ప్రయత్నములును యిందులో కాననగును. ఆయన వ్రాతలలో, వచనములలో, మామూలుగా నుండునట్లే యీపుటలలోకూడ ఆయన అనేకవిషయములను చర్చించినారు. కాని దేశంలోని వివిధసంఘాలమధ్య ముఖ్యంగా హిందువులు, ముస్లిములు, సిక్కులుమధ్య- శాంతి, సఖ్యతల నేర్పరచుటకు సంబంధించిన ప్రసంగములే ఇందులోనికెల్ల అర్థవంతములు, ఆశ్చర్యమును గొల్పునవి అయియున్నవి.

ఆయన ఉద్దేశ్యములు ఫలించుటకు బదులు, వాటికై ఆయన జీవితమే కోల్పోవలసివచ్చినదంటే, మనజీవితములు మన కార్యములు ఎంత నిందాస్పదములైనవో తెల్లమగుచున్నది.

సాంఘికసమైక్యత కుదర్చలేకపోతే ఆయనకు జీవించవలెననే అభిలాష పోయిందనేసంగతి యీపుటలలో స్పష్టముగా నున్నది. 30-1-48 వ తేదీన యీదేశానికి సంభవించిన మహావిషాద సంఘటనకుముందు సూచనలయిన నిరాశా, నిరుత్సాహములు యిందులో అంతర్లీనమై యున్నవి. సత్య, అహింసలు నిష్కామమైన అనేకపంథాలలో తమ గమ్యమును అందుకొనుచుండును. మహాత్మాజీ బ్రతికియుండి చేయని మానవాతీతమైన అద్భుత కార్యము తన మరణంద్వారా ఆయన నెరవేర్పగలుగుట సంభవము. ఆయన పనిచేసి ప్రాణా లర్పించిన శాంతిసఖ్యతల పునఃస్థాపనమునకు యీగ్రంథం తోడ్పడగలదు.

17_3_1948 రాజేంద్రప్రసాద్



# 1

10_9_47

## శవాలపురి

సర్కారుసాయంతననిషేధాజ్ఞ వలన సభకు కొద్దిమందే వచ్చిరి. కాని గాంధీజీ ఢిల్లీనంతా ఉద్దేశించిమాట్లాడెను. "సహద్ర" లో దిగినపుడు తనను చూడవచ్చిన పటేల్, రాజకుమారి వగైరాలలో పటేల్ ముఖాన మామూలుచిరునగవు లేదు. అతనినోటినుండి ఎగతాళిమాటలు వెల్వడలేదు. అచట తాను కలసిన ప్రజలు, పోలీసులుకూడా యీ చీకటివైఖరినే కనబరచిరి. కలకలలాడే ఢిల్లీ తటాలున "శవాలపురి"గా మారిందా ? మరొక వింత. తనకు సంతసముగూర్చు భంగీనివాసమున గాక, బిర్లారాజభవనమున తనకు బస నేర్పరచిరి. ఈ మార్పువల్ల నొప్పి కలిగింది. కాని వాల్మీకులమధ్య గాని, బిర్లాభవనంలో గాని (అక్కడ అంతకుముందు అతడు తరచుగా ఉండేదే) అతడు బిర్లాసోదరుల అతిథియే. వారి మనుష్యులే భంగీనివాసంలోకూడా తనను నిష్ఠతో సేవించేవారు. పటేల్ యీ మార్పుకు కారకుడు కాడు. ఆయన పిరికివాడు కాడు. భంగీనివాసంలో తనకు ప్రాణాపాయం కలుగునని భయపడి యుండడు. భంగీలమధ్య నివసించుట అతనికి సంతోషమే. న్యూఢిల్లీ కమిటీ వారు చేసిన పొరపాటువల్ల, భంగీలు క్రిక్కిరిసియున్న గుడిసెలలో నుండుట కాయనకు తగు వసతి లేకపోయెను.

# శరణార్థుల సమస్య

పూర్వము తా నుండే యిల్లు యిపుడు శరణార్థుల క్రింద నున్నది. తన అక్కరకంటె వారి అక్కర ఎక్కువ గదా! శరణార్థుల సమస్య మన జాతికంతా సిగ్గుచేటు కాదా? అటునైపున జిన్నా, లియాకత్ మొదలగు పాకిస్తాన్‌నాయకులు, యిటునైపు నెహ్రూ, పటేల్ తమ తమ రాజ్యములలో అధికసంఖ్యాకుల వలెనే, అల్పసంఖ్యాకులుకూడ ఆదరింపబడుదురని ప్రతిజ్ఞ చేసిరే! మంచిమాటలతో లోకాన్ని మోసం చేయుటకా వారు చెప్పింది? లేక మనఃస్ఫూర్తిమాట యని, దానిని నిలువబెట్టుటకు ప్రాణాలర్పిస్తామని ఋజువు చేయుటకా? తమ స్వగృహమైన పాకిస్థాన్ నుండి హిందువులను, సిక్కులను, మానధనులగు అనీలులను, భైబందులను ఏల తరిమివేసిరి? క్వెట్టా, నవాబ్‌షా, కరాచీ లలో యేమిజరిగింది? పశ్చిమపాకిస్తాన్ కథలు వింటే, చదివితే, కడుపు తరుగుకొనిపోవుచున్నది. ఇది గూండాలపనియని, తాము శక్తిహీనుల మని యెబ్బందంకూడా చెప్పరాదు. ఏ రాజ్యంలోకాని, ప్రజ చేసేపనికి ఆరాజ్యం పూర్తిబాధ్యత వహించవలెను. కారణా లడుగరాదు. కర్తవ్యం చేసి చావవలెను. సామ్రాజ్యతత్వభారముచే నలిపివేయబడి వీ రిపుడు విధిలేక పని చేయుటలేదు కదా! కాని లోకమందు తలయెత్తుకొని, తిరగ వలెనంటే, యిపుడు శాసనప్రకారం పరిపాలన జరప వీలుండ దని వారు చెప్పరాదు. ఢిల్లీప్రజలు, లేక శరణార్థులు మామాట

వినరు, చట్టబద్ధులు కారు, అని సిగ్గు విడిచి లోకానికి చెప్పి ఇండియామంత్రులు తమ "దివాలాకోరుతనమును" ఒప్పుకోవలెనా? ఈ ప్రజల వెర్రికి లొంగేకంటే తమకర్తవ్యంలో చచ్చినా మేలని మంత్రులకు చెప్పెదను. ఆయన స్వరం చాలా బలహీనంగా నుండెను. శవాలపురివలె కన్పడిన ఢిల్లీలో తన సంచారమును ఆయన వర్ణించెను. తానున్న యింట్లోకూడ పండ్లు, కూరలు లేవు. ఎవరో ముస్లిములు కాల్పులు చేసినంతమాత్రాన, సబ్జి మండి కూరలఅంగళ్లు మూయవలసినదేనా ? కొందరు శరణార్థులకు తినుబండారములు లేవు. దొరికినవి తినుటకు తగినవి కావు. ఈ పొరపాటు పాలకులది, శరణార్థులదికూడా. వారు మామూలు పనులుకూడా సాగించక, తమకు నష్టము కలుగునని గ్రహించక పోయిరి. వారు సర్కారులను నమ్మి చట్టబద్ధంగా నడిస్తే తమ నిజమైన కష్టాలు తీరేవి.

ఆల్వార్, భరత్పూర్ రాజ్యాలనుండి తరుమబడిన మియోలకై హుమాయూన్ గోరీవద్ద యేర్పరచిన శరణార్థుల శిబిరం ఆయన చూచెను. ముస్లింమిత్రులు పంపినది గాక వారికి వేరే తిండి లేదు. వారు ఉద్రేకులు. కష్టనష్టాలు కలిగించగలరు. వారు పోదలచితేతప్ప, వారిని పాకిస్తాన్ పంపుట కష్టనివారణోపాయము కాదు. వారినికూడా తోడిమానవులవలె చూచి, రోగానికివలె, వారిలోపములకు మందువేయవలెను.

ఆతరువాత ఆయన జామియామిలియాకు వెళ్ళెను. దాని నిర్మాణంలో ఆయన ఎక్కువ పాల్గొనెను. ఆయన ముఖ్య

స్నేహితుడగు డాక్టరు జకీర్ హుస్సేన్ కోపంతోగాక, దుఃఖముతో తన అనుభవములను తెల్పెను. ఈమధ్య జలంధర్ పోయినపుడు తాను ముస్లిం అయిఉన్న నేరానికి ఆయనను కోపావేశులగు సిక్కులు చంపబోయిరట. కాని ఒక సిక్కు దళాధిపతిన్నీ, హిందూ రైల్వే అధికారిన్నీ అడ్డుపడి ఆయనను కాపాడిరి. ఆయన వారికి కృతజ్ఞత తెల్పెను. అనేకమంది హిందువులు చదివిన యీజాతీయసంస్థను కోపిష్ఠిశరణార్థులు పాడుచేతురను భీతి కలిగెను. అచట 100 మంది శరణార్థులు చెప్పిన గాథ విని గాంధీజీ సిగ్గుతో తలవంచెను. పిమ్మట దివాన్ హాల్ శిబిరం, వేవెల్ కాంప్ శిబిరం, కింగ్స్ వే శిబిరంలోనున్న సిక్కు, హిందూ శరణార్థులను ఆయన చూచెను. గాంధీజీ లోగడ పంజాబుకు చేసిన సేవలను వారు మరచిపోలేదు. అయినా, కొందరిముఖములు ఎఱ్ఱబారెను. హిందువులయెడ గాంధి హృదయకాఠిన్యత వహించెననియు, వారివలె ఆయన బాధ పొందలేదనియు, వారివలె ఆప్తులను కోల్పోలేదనియు, వారివలె తనకు యిల్లువాకిలి సర్వస్వము పోలేదనియు వారు గాంధీజీని నిందించిరి. ఈ భారతరాజధానిని సౌమ్యస్థితికి తెచ్చుటకు మీరు ఢిల్లీలో నున్నారని చెప్పి మమ్ము ఎట్లు ఓదార్చగలరు? చచ్చినవారిని బ్రతికించలేము. కాని మరణమనేది భూతకోటికి దైవం యిచ్చిన వరం. అది యెప్పుడు యెలా దొరుకుననునదే భేదం. దానిని సహించుటకు, క్రియ యొనరించుకొనుటకు సక్రమమైన సత్ప్రవర్తన ఒక్కటే ముఖ్య మార్గము,

# నిజమైన సిక్కు

ఆనాడు గాంధీజీని చూచిన ఒక సిక్కుమిత్రుడు 'గ్రంథ సాహెబ్' దృష్ట్యా తాను నిజమైన సిక్కును కానని యతనితో మనవిచేసెను. అలాంటివానిని ఒకనినైనా చూపమని గాంధిజీ కోరగా అతను తనచేత కాదనెను. "నేనే అలాటి సిక్కును. గ్రంథసాహేబ్ సూత్రాలప్రకారం బ్రతుక చూచుచున్నాను. వెనుక నాన్కానాసాహేబ్ విషాదగాథవేళ, సిక్కుల నిజమైన స్నేహితునిగా తనను పరిగణించి" రని గాంధీజీ తెల్పెను. గురు నానక్ హిందూముస్లింతేడా పాటించలేదు. మానవకోటి అంతా అతనికి ఒక్కటే. తన సనాతనధర్మం అలాంటిదే. కనుక తాను ముస్లింకూడానని చెప్పుతూ దైవ మొక్కడే! మనలను రేయింబవళ్లు రక్షించేశక్తి యొక్కటే యను ముస్లింప్రార్థన నతడు చదివి వినిపించెను.

సత్యమైన, భయరహితమైన జీవితము గడుపుడని, విరోధము, ద్వేషము యితరులయెడ కనుపరచవద్దని, ఆయన శరణార్థులను కోరెను. కోపవశమున వేగిరపడి యోచనలేని పనిచేసి, కష్టపడి సంపాదించుకున్న స్వాతంత్ర్యసువర్ణ ఫలమును పోగొట్టుకోవద్దనెను.

## 2

12-9-47

### పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతపు వార్త

ఆ ప్రాంతంనుంచి వచ్చు కలతపరచే కబుర్లనుగూర్చి తన మితిలేనిదుఃఖమును గాంధీజీ వెల్లడించెను. ఆరాష్ట్రీమును ఆయన బాగా ఎరుగును. వారాలతరబడి ఆయన అట సంచారము చేసెను. ఖాన్‌సోదరులయింటిలో సురక్షితముగా నుండెను. అచట మాజీమంత్రి అయిన గిరిధరలాల్ పూరీని, ఆయన భార్యను- ఇద్దరూ చక్కని ప్రచారకులు— వెంటనే కాపాడమని వచ్చిన తంతి ఆయనకు అపరిమితమైన బాధను, లజ్జను కలిగించెను. అచ్చటి ముస్లింలవలెనే అక్కడనున్న హిందువులను సిక్కుల నందరిని కాపాడుట అక్కడి సర్కారుయొక్కయు, జిన్నా యొక్కయు కర్తవ్యమై యున్నది.

కోపం, కొద్దిపాటి వెర్రి. కోపంవలన యేఫలితం కలుగదు. దానివలన పగ పెరుగుతుంది. ఆభావమే, అన్నిచోట్ల జరుగు భయంకరకార్యములకు కారణం. ఢిల్లీలో జరిగినదానికై తమ సమీపమందున్న హిందూసిక్కులపై ముస్లిములు కసి దీర్చుకుంటే, వారికి కలిగే మేలేమి? అలాగే సరిహద్దు పశ్చిమ పంజాబు ప్రాంతములలో స్వమతస్థులపై చేయబడిన క్రూరకృత్యములకై ఢిల్లీలోని ముస్లిములను హింసించిన, సిక్కులకు హిందువులకు కలుగు మేలేమి? ఎవనికో, యేకొందరికో పిచ్చి ఎక్కితే,

అందరూ వెట్టివాళ్లు కావలెనా? హత్యలు, దోపిళ్లు, గృహాద హనములు, వీటివలన తమమతముల నాశనము చేసుకున్నారని ఆయన ఆయామతాల వారిని హెచ్చరించెను. తాను మతాలను గూర్చి శ్రద్ధగా చదివెను. ఏమతం యిలాటి వైరిని బోధించుట లేదని ఆయన చెప్పెను. ఈ సూత్రమునకు ఇస్లాంమతముకూడ మినహాయింపు కాదు. వైరిపనులను వెంటనే ఆపమని ఆయన వేడుకున్నారు. జీర్ణించుకోలేక స్వాతంత్ర్య మను మధురాహార మును కోల్పోతిరని, ముందుతరాలు నిందచేయునట్లు వర్తిం చకండి. ఈ వైరితనాన్ని విడువనిచో, లోకంలో మనఖ్యాతి మట్టిపాలవుతుంది.

## గతం మరువండి

లోకములో సాటిలేని సుందరమైన జుమ్మామసీదుకు వెళ్లి అచ్చట దుఃఖసముద్రములో మునిగియున్న ముస్లింస్త్రీపురుషు లను చూడగా, గాంధీజీకి నొప్పి కలిగెను. మృత్యువు అందరికీ కలుగుననియు, చచ్చినవారికై చింతించి లాభము లేదనియు, చింతించినను వారు తిరిగి రారనియు అచ్చటి బాధితుల నత డోదార్చెను. ఈ గొప్పదేశపు భవిష్యత్తును ప్రతివాడు కాపాడ వలెను. రోజూ తనను చూడవచ్చే ముస్లింమిత్రులందరితో "మీభావాలు పూర్తిగా స్పష్టముగా చెప్పుడు" అని సలహా నిచ్చెను. ఢిల్లీలోకాని, భారతంలో ఎక్కడ కాని ముస్లిముల ప్రాణాలకు ఆపద వచ్చుట గొప్పవిషాదము. తన దీర్ఘమైన జీవిత

ములో అనేక అనుభవములు పొందిన వృద్ధునిమాట వినవలె నని యతడు వేడుకొనెను. చెడుగుకు ప్రతిగా చెడుగుచేయుట వృథా. మంచికి ప్రతిగా మంచిచేయుటలో సద్గుణము లేదు. చెడుగుకు ప్రతిగా మంచిచేయుటయే నిజమైన నీతి. చాలమంది ముస్లిములు తోడ్పడుట కిష్టపడిరి. కాని ఢిల్లీలోనివారి సాయము కోరవలసిన తరుణ మిదికాదు.

గతమును మరువండని, తమబాధలను యేకరువుపెట్ట వద్దని, ఒండొరులతో సఖ్యత నేర్పరచుకొని, శాంతిగా బ్రతక నిశ్చయించుకొనుడని హృదయముల నుత్తేజపరచు పదములతో హిందూ, సిక్కు, ముస్లిములకు గాంధీజీ విజ్ఞప్తి చేసెను. ముస్లి ములు భారతదేశపౌరులగుటకు గర్వపడి త్రివర్ణపతాకమునకు వందనము చేయవలెను. తమమతమునందు తమకు విశ్వాస ముంటే, ఏహిందువుడును తమకు శత్రువు కాజాలడు. అలాగే హిందువులు, సిక్కులు శాంతిప్రియులగు ముస్లిములను ఆదరించ వలెను. ముస్లిములు, సిక్కులు, హిందువులు తమ ఆయుధ ములను సర్కారుకు ఒప్పగించవలెను. వారిపై సర్కారు చర్య తీసుకోరాదు. పశ్చిమపంజాబుప్రభుత్వము అచ్చటి ముస్లిములకు ఆయుధములిచ్చుట నిజమైతే, అది మిక్కిలి పొరపాటు. చివర కది స్వనాశనమునకే దారితీయును. వెంటనే ఆపని ఆగవలెను. లైసెన్సులేకుండా ఎవరివద్ద ఆయుధములుండరాదు.

త్వరలో ఢిల్లీలో శాంతి యేర్పరచి తనను తూర్పుపశ్చిమ పంజాబులకు పోనివ్వమని ఆయన వారినికోరెను. అందరికి వర్తించ

గల ఒకే సందేశము ఆయన ఉపదేశించగలడు. ఢిల్లీప్రజలకు తాత్కాలికంగా ఉన్మాదం కలిగినా, త్వరలో వివేకోదయం కలిగిందని చెప్పనిండు. ఇప్పుడు సిగ్గుతో, చింతతో, తలవంచుకొన్న పటేల్, నెహ్రూలు అపుడు తల ఎత్తగలరు. తమదేశానికి అమూల్యమైన, సమిష్టిఆస్థి అయిన దేశప్రఖ్యాతిని కాపాడి, మచ్చలేకుండా చేయుట వారి కర్తవ్యం.

## రాష్ట్రీయస్వయంసేవకసంఘం

ఆ సంఘగురువుతో గాంధీ, డాక్టరు మహాతాలు మాటలాడిరి. ఈ సంఘంకూడా రక్తపాతంలో పాల్గొన్నదన్నారు గాని, అది యబద్ధమని ఆగురువు గాంధీజీకి గట్టిమాట యిచ్చెను. ఆ సంఘం ఎవరికిని విరోధి గాదు. ముస్లిముల హత్య వారి కార్యక్రమంకాదు. శక్తికొలది హిందూమతమును కాపాడుటే వారి కర్తవ్యం. వారు శాంతిప్రియులు అని గురూజీ చెప్పి, ఆసంగతులన్నీ ప్రకటించమని గాంధీజీని కోరెను.

# 3

13-9-47

## సర్కారును నమ్మండి

ఆచార్య రుద్ర క్రైస్తవవిశ్వాసపరుడు. భారతదేశాభిమాని. 1915 లో ఆయనయింట, గాంధీజీ బసచేసెను. ఆయనే హాకీం అజమాల్ ఖాన్, డాక్టరు అన్సారీలతో గాంధీజీకి పరిచయము కలిగించెను. వీరిద్దరూ హిందువులను, ముస్లిములను,

యితరభారతీయులను సమాన గౌరవప్రేమలతో ఆదరించేవారు. వేలకొలది బీదహిందువులకు ఉచితంగా హాస్టల్ సదుపాయమునిచ్చెను. ఆతడు ఢిల్లీనగరము ప్రేమించిన సర్దారు. వారిద్దరిని అయోగ్యులందామా? హిందువులకు, సిక్కులకు వెరచి అన్సారీ కుమారుడు, అల్లుడు యిల్లు విడిచి పూటకూటి కొంపలో నుండుట లజ్జాకరము. అట్టి ఉత్తమోత్తములను కన్న ముస్లిముజాతికి భారత యూనియన్‌లో భద్రత లేనిచో తనజీవితముమీద తనకే రుచి నశించునని గాంధీజీ యెరుకపరచెను. ముస్లిములందరు పంచమాంగదళమని చేయబడిన నిరాధార ఆరోపణను ఆయన సమస్త నిరాకరించెను. యూనియన్‌లోయుంటే 4½ కోట్ల ముస్లిములు అంతచెడ్డవారైతే, ఇస్లాంమతానికి వారే గోరీ కడతారు. యూనియన్‌లోని ముస్లిములు దానియందు భక్తిగలిగి యుండవలెనని జిన్నా సలహా చెప్పెను. ప్రజలు సర్కారును నమ్మి దేశద్రోహులను శిక్షించుపని దానికే వదలవలెను. తమపై వేసుకోరాదు.

## సర్వులకు శరణ్యము దేవుడు

పాతకోటలోని ఒకేశిబిరాన్ని ఆనాడు గాంధీజీ చూడవెళ్లెను. అనేకమంది ముస్లింశరణార్థులు అచ్చట నుండిరి. మరికొందరు అప్పుడుకూడా వస్తుండిరి. ఆ పెద్దగుంపుకు కొన్ని సానుభూతిమాటలు గాంధీజీ చెప్పదలచెను. ఆ ముస్లింప్రచారకుల మాట విని, ఆ గుంపు కూర్చొని, గాంధీజీ సలహాలను ఓర్పుతో వినిరి. వారిచూపులలో కోపము వెల్లడియయ్యెను. మధ్య

మధ్య కేకలు వేయకుండా ఆ ప్రచారకులు ఆక్షే తోడ్పడిరి. దివాన్ చమన్‌లాల్ భుజములమీద ఆనుకొని గాంధీజీ మాట్లా డెను. ఆయన హీనస్వరంతో చెప్పిన వాక్యములు బిగ్గరగా చమన్‌లాల్ చెప్పెను. కోపము వీడి నెమ్మదిగా యుండమని గాంధీజీ కోరెను. ఎంతహోదాలోనున్నవాడైనా, మానవుడు గాక, దేవుడే సర్వులకు శరణ్యము. మానవుడు పాడుచేసిన దానిని దేవుడు బాగుచేయును. ఈ రెండుసంఘాలలో కొందరిలో చెలరేగిన వైరి తగ్గి ఢిల్లిలో పూర్వపుశాంతి యేర్పడే వరకు తాను విశ్రాంతి బొందనని ఆయన మాట యిచ్చెను.

## రెండురాజ్యాల కర్తవ్యం

ఆనాడు అనేకమంది హిందువులు, ముస్లిములు వచ్చి ఆయనను కలసి ఒకేవిధమైన దుఃఖగాధను వినిపించిరి. ఇది యుభయ సంఘాలకు లజ్జాకరము. తాను రెండు సంఘాలకు సమానంగా నిజమైనసేవకుడననెను. జనాభామార్పు ప్రాణసంకటమైన యురి అని ఉభయసంఘాలు నిశ్చయించుకోవాలి. అందువలన మరింత దుర్భరదుఃఖము కలుగుతుంది; తమ తమ పూర్వపుస్థలాలలోనే ఉభయులు శాంతిసఖ్యతలతో నివసించవలెను. ప్రస్తుత మనస్పర్థను శాశ్వత శత్రుత్వంగాచేసికొనడం పిచ్చితనము. రెండు రాజ్యములు తమ అల్పసంఖ్యాకులకు పూర్తిసంరక్షణకూర్చి హామీ యివ్వవలెను. ఇద్దరు కూర్చుని యీ సమస్య తేల్చుకోవాలి. లేదా పోట్లాడుకొని ప్రపంచంలో నవ్వులపాలు కావలె

నని గాంధీజీ తెల్పెను. యూనియన్ నుంచివచ్చిన ముస్లిము శర ణార్థులకు ధనసహాయము చేయమని కోరుతూ జిన్నా చేసిన ప్రక టనలో పాకిస్థాన్‌లో ముస్లింలు చేసిన దుర్ణయాలను ఉపహరిం చకపోవుట చాల పొరపాటు. తమ తమ అధికసంఖ్యాకులు చేసిన దుష్కృత్యాలను రెండుసర్కారులు పూర్తిగా బాహా టంగా ఒప్పుకోవలెను.

## అసఫాలీ సాహెబ్

అమెరికాలో రాయబారిగా యుండిన అసఫాలీమీాద మూాకనింద వేయుట తప్పు. ఆయన యేండ్లతరబడి కాంగ్రెసు వాది. హాకీంసాహెబుకు, అన్సారీకి, మౌలానా ఆజాదుకు స్నేహితుడు. అచంచలదేశాభిమాని యని పేరుపొందినవాడు. ఆయనను అమెరికానుండి తిరిగిరమ్మని పిలిపించలేదు. ముఖ్య విషయాలపై ఆయన ప్రధానమంత్రితో సంప్రదించుటకు వచ్చెను. అట్టిముస్లిములు యిచ్చట హాయిగానుండలేకపోవుట సిగ్గుచేటు. తనరాజధానియైన ఢిల్లీలో ఒక ముస్లిం అయినా అరక్షితుడుగా నుండుట అన్యాయం.

# 4

14-9-47

## మన పతనం

ఇద్గాలోను, దాని ఎదురుస్థలంలోను ఉండేశిబిరాలను గాంధీజీ దర్శించెను. అచ్చటి ముస్లింశరణార్థులు బీదలు. ఎవరి

లోను కోపమనునది కన్పించలేదు. ఒక్క యెముకల పోగగు ముసలివానిశరీరంలో ఎదురు రొమ్ము ఎముకలన్నీ కనపడు చుండెను. అనేకచోట్ల కత్తిపోట్లు అగపడెను. ఆయనకంటె చిన్న దైనను శిథిలమైన ఆయనస్త్రీకిని సమానముగా కత్తిపోట్లు తగి లినవి. వారిని జూచి గాంధీజీ సిగ్గుపడెను. ఏ మతమైతే నేమి ? స్త్రీపురుషులందరు ఆయనదృష్టిలో సమానులే.

## శరణార్థిశిబిరాల పారిశుద్ధ్యం

వాటి అపరిశుద్ధత, పెంటపోగులు వర్ణించతరముకాదు. అచట చెరువు ఎండినది. నీరు ఎటనుండి వచ్చుచున్నదో ? ఎలాగో కాలకృత్యాలు తీర్చుకొనుచున్నారు. నేనే శిబిరాధిపతి నయితే, సైనికులు, పోలీసులు నావశంలో ఉంటే, పలుగు, పార, నేను చేతబూని సైనికులచేత, పోలీసులచేత అలాగే చేయించి మీరును చేయుడని శరణార్థులను కోరి, ఆప్రదేశము లను పరిశుభ్రమైనస్థితికి తెచ్చేవాడను. అసలు పెంటపోగులు పోసినచోట యీశిబిరాలు కట్టారు. వాటిని బాగా శుద్ధంచేయక ముందు, తోడిమానవుని అక్కడ ఉండమనవచ్చునా ? ఈ మార్పుకు ధనం అక్కరలేదు. కొంచెం ముందుయోచన కొంచెం పారిశుద్ధ్యప్రేమ యుంటే చాలు. హిందూశిబిరాలు యింతకన్న బాగాలేవు. ఈ అపరిశుభ్రత అనేది మనజాతికి ఒక కళంకము. ఆదోషము ఎంతత్వరలో పోతే అంతమేలు.

# ప్రజల, ప్రభుత్వాల కర్తవ్యం

జాతీయాభివృద్ధిని అటకాయించిన యీ దారుణమగు స్థితికి కారణమేమి? హిందువు లేక సిక్కుగానుండుట నేరమా? లేక పశ్చిమపాకిస్తాన్‌లో అచ్చగా భయభ్రాంతులవల్ల ఇటిల్లు ఎంతమంది సిక్కులు, హిందువులు వచ్చుచున్నారా? లేక తూర్పుపాకిస్తాన్‌లో జరిగినదాని కిది కక్షయా? తమయిండ్లను వదలిపోవలెననే భయము ఢిల్లీలోని ముస్లిములకు యేలకలిగింది? రెండుప్రభుత్వాలు కూలిపోయినవా? ప్రజలేల వాటిని నిర్లక్ష్యం చేశారు? ముస్లిములవద్ద యుండే లైసెన్సులేని ఆయుధాలను సర్కారు తీసుకోరా? దానిని నడపువారు అసమర్థులైతే సమర్థులకు చోటిత్తురు. ప్రజలు యేర్పరచుకున్నదే, ప్రజల ప్రతిబింబమే ప్రభుత్వము. వ్యక్తులే శాసనాధికారమును చేబట్టి అమలుజరుపుట తప్పు; ప్రజాస్వామ్యమునకు విరుద్ధము. ఈ చట్టరహితచర్య ప్రబలితే, అటు పాకిస్తాన్‌కు యిటు భారతానికి మేలుసేయదు. కర్తవ్యము చేయుటకు లేదా కాట్టిపై కెక్కుటకు తాను తయారై యున్నట్లు గాంధీజీ చెప్పెను. ఈ వైరిసోదరహత్యలు, జాతీయ ఆత్మహత్య, ప్రభుత్వవిద్రోహచర్యలు, చూచేకోరిక ఆయనకు లేదు. దైవం యీపిచ్చిని పోగొట్టుగాక!

# 5

15—9—47

## హృదయమథనం

మృదువై, ప్రాణప్రదమై హాయిగొల్పు జడివానధ్వని వింటూ రాత్రి పడుకొన్న వేళ, వివిధశిబిరాలలో పడియున్న వేల కొలదిశరణార్థుల సంగతి నామనసుకు తట్టినది. గాలి, వాన, కొట్టని గట్టిపంచలో నేనుంటిని. మానవుడు తోటిమానవునిపై జూపు క్రూరత్వంచే కాకపోతే, వేలకొలది స్త్రీలూ, పురుషులు, బిడ్డలు, నీడలేక, తిండిలేక, యీ ఎగ్గు పొందెదరా? కొన్ని చోట్ల మోకాటిలోతు నీటిలో వారుండిరి. ఇదంతా అనివార్యమా? కాదు, కాదని కడుపుగగ్గోలు పెట్టుచున్నది. నెల రోజులబిడ్డయగు స్వాతంత్ర్యశిశువుయొక్క మొదటిఫలము యిదియా? కడచిన 20 గంటలు యీభావాలు నావెంటనంటె. నామౌనం ఒకవరప్రసాదం. అది అంతర్వీక్షణ కలిగించెను. ఢిల్లీ పౌరులు వెర్రివారా? వారిలో మానవత్వంలేదా? దేశప్రేమ, స్వాతంత్ర్యప్రేమ వారిమనసును కరిగించవా? ఈ స్థితికి మొదటి బాధ్యత హిందువులది, సిక్కుల దన్నందుకు నన్నుక్షమించండి. వారు ద్వేషప్రవాహాన్ని ఆపలేరా! ఓ ఢిల్లీముస్లిములారా! భయమువీడి భగవంతునినమ్మి, మీావద్దనుండే ఆయుధాలు సర్కారుకివ్వండి. వాటినిగూర్చి సిక్కులు, హిందువులు జంకు చున్నారు. వీరివద్ద ఆయుధములులేవని కాదు, మోతాదుభేదం-అంతే. అల్పసంఖ్యాకులు దేవుడు, దేవుడుసృజించిన మానవుడు

మంచిచేతురని నమ్మవలెను. అలా తామెవ్వరినినమ్మరో, వారిపై కత్తిగట్టి యుద్ధంచేయుదురు. ఇక్కడ ఖచ్చితమైన సలహాయిది. అది స్థిరము, లోపరహితము అయినది. నేరస్థులనుండి ఈప్రభుత్వం మిమ్ము కాపాడుతుందని నమ్మండి. అక్రమంగా పోగొట్టిన ఆస్తికి ప్రభుత్వం పరిహారమిస్తుంది. చచ్చినవారిని యే ప్రభుత్వం బ్రతికించలేదు. మీఅక్రమచర్యలవలన పాకిస్తాన్‌నుండి పరిహారం కోరేహక్కు మీసర్కారు పోగొట్టుకొనుచున్నది. న్యాయం కోరేవారు న్యాయంచేయవలెను. శుభ్రమైనచేతులతో అడగాలి. అన్నివిధాల సమంజసమైన యీధైర్యోపేతకార్యం చేస్తే, యీ సమస్య తగ్గిపోతుంది. హిందువులు, సిక్కులు సరిగావర్తించి, లేచిపోయిన ముస్లిములను పిలువండి. అపుడు పాకిస్తానేకాదు లోకమెల్ల మెచ్చుకుంటుంది. అపుడు ఢిల్లీకి, భారతానికి అవమానం, వినాశం లేకపోతవి. కోట్లకొలది మతానుచరులను మార్చుటదురూహ్యం. ఈ మార్పిళ్లువదులుకుంటే, పాకిస్తాన్ దోషము నివారింపబడుతుంది. నేను ఒక్కడనైపోయినా, యీసూత్రం చెప్పుతూ ధైర్యంతో నిలువగలనని నానమ్మకం.

## 6

17—9—47

### బలవంతం లేదు

ఢిల్లీ బట్టలమరలలో పనిచేయు కార్మికులకోర్కెమీద గాంధీజీ ఆసాయంత్రము అచటికివెళ్లెను. ఒకశబ్దవిస్తృతయంత్రం

చెడగా మరొకటి పెట్టిరి. చిట్టచివరకూర్చున్నవానికి దానిద్వారా కూడా గాంధీజీమాట వినబడలేదు. అపు డొకపంజాబీస్నేహితుడు గాంధీజీమాటలను తనపెద్దగొంతుతో తిరిగి చెప్పెను. ఆవిధంగా పని జరిగెను. నిన్నటి అనుభవంపిమ్మట, శ్రోతలందరూ కోరితే తప్ప, బహిరంగప్రార్థనలు జరుపరాదని గాంధీజీ నిర్ణయించెను. ఆయన ఎవరిని ఎప్పుడూ బలవంతపరుపలేదు. ఆధ్యాత్మికమైన ప్రార్థనలలో బలవంతము అసలే ఉండరాదు. తనను సంతోషపరచ వలెననే ప్రశ్న అంను లేనేలేదు. లక్షలకొలది జనులు, యీప్రార్థ నలవలన బాగుపడ్డారు. ఇట్టి ఉద్రేకకాలములో బాధితులు కోప పడుట సహజమే. ఉంటే ప్రార్థన అంతా ఉండవలెను. లేకపోతే ప్రార్థనయే లేకపోవలెను. ఒక్కొక్కరు ఒక్కొక్కభాగానికి ఆక్షేపించరాదు. నామట్టుకు ఖురాన్‌లోని సురాలు యీ ప్రార్థన లోనుంచి కదల్చరానిభాగం.

శరణార్థుల కోపం, అసహనం తా నర్థముచేసికొనగలడు. కాని స్వాతంత్ర్యార్థులకేల మనసు కోపము నణచుకొనవలెను. సర్కారును నమ్మవలెను. తన అహింసామార్గాన్ని యిపుడు వినే వారు లేరు. కాన ఎంతకోరికయున్నను దాని నిపుడు బోధించుట లేదు. ప్రజాస్వామికప్రభుత్వాలు అవలంబించేపద్ధతి ఆయన యిపుడు తెల్పెను. అదేదంటే- వ్యక్తియిచ్ఛ, సాంఘికయిచ్ఛకు లోబడియుండవలెను. సాంఘికయిచ్ఛ అంటే సర్కారుయిచ్ఛ. ప్రతివాడు శాసనఅమలుదారుడైతే రాజ్యం పోతుంది. అరాజ

కము యేర్పడుతుంది. స్వాతంత్ర్యం నశిస్తుంది. కాన కోపా న్నణచి, రాజ్యంద్వారా న్యాయం సంపాదించవలెను. సర్కారుకు ఆమాత్రంచోటు యిస్తే, ప్రతి హిందు, ప్రతి సిక్కు మర్యాదగా పూర్వపుకొంపలకు పోవచ్చును. పాకిస్తానులో ఇండ్లు పాడుబడ్డవి. ప్రాణాలు పోయినవి; ఆడపిల్లలను చెరిచారు; నిర్బంధముగ మతాంతరులు కావింపబడినారు; ఈ మొదలుగాగల అపరిమితబాధ లను వీరు పొందారు. కొంచెం తమాయిస్తే బాలికలు తిరిగి వస్తారు. మతాంతరులు తిరిగి తమమతం స్వీకరింతురు. ఆస్తులు తిరిగి వస్తవి. కాని న్యాయమార్గానికి అడ్డం రాకూడదు. ముస్లి ములను యీ దేశంనుంచి వెళ్ళగొట్టగోరుతూ, యీ మేళ్ళు పొందలేరు. అది ఘోరమైన కోరిక. అల్పసంఖ్యాకులైన హిందు వులకు, సిక్కులకు పాకిస్తాన్‌లోనూ, అట్లే ముస్లిములకు తూర్పు పంజాబులోను దుఃఖాలు కలిగినవి. పాపమును బంగారు త్రాసులో తూచుటకు వీలులేదు. నేరస్థాపనకుగల సాక్ష్యం లేదు. ఉభయులు నేరస్థులమని ఒప్పుకుంటే చాలు. సరియైన సమన్యాయ మునకు ఒక్కటే మార్గం. రెండురాజ్యాలు తమతమ తప్పులను పూర్తిగా ఒప్పుకోవలెను. తగవువిషయాలను పంచాయతీకి వేసు కోవలెను. లేదా తామే పైసలా చేసుకోవలెను. ఏదీకుదరకపోతే, మోటపద్ధతి యుద్ధము. ఆవిషయమే తన కసహ్యం. బుద్ధిపూర్వ కంగా పాకిస్తాన్‌పోనట్టి ముస్లిములను యిళ్ళకు రమ్మని పొరుగు వారలు పిలువవలెను. వారి పూర్తిరక్షణకు హామీ పడవలెను. తన స్వంతప్రార్థన యేమంటే— సోదరహత్యాకాంక్ష అనే ఆసుర

యీ దేశాన్ని ఆవరించకముందు దైవం తనను యిటనుంచీ తొలగించునుగాక. అదే ఆయన ఆఖరుకోరిక.

## కార్మికుల ధర్మం

సంపూర్ణఐకమత్యంతో పనిచేయుచూ ఉత్తమమార్గము చూపిన హిందు ముస్లిం కార్మికులను ఆయన అభినందించెను. వారిలో కులతత్వం పనికిరాదు. లోగడనే తానుచెప్పినట్లు కార్మికులు తమశక్తిని గుర్తించి వివేకంతో నిర్మాణాత్మకంగా పనిచేస్తే, వాళ్ళే పరిశ్రమల పాలకులవుతారు. ఇప్పటియజమానులు ధర్మకర్తలవుతారు. భూగర్భంనుండి కార్మికులే బయటికి లాగిన వెండి, బంగారుల మూలధనంకంటె కార్మికుల కాయకష్టమే ఎక్కువ విలువైన, స్థిరమైన మూలధనం.

# 7

18_9_47

## ప్రార్థన అవిభాజ్యం

దార్యాగంజినుండి తిరిగివచ్చి బిర్లాభవనఆవరణలో కొద్దిమందితో కలసి ప్రార్థన చేయుటకు గాంధీజీ వచ్చెను. ఖురాన్‌లోని సూరాలపఠనమునకు ఎవరికైనా ఆక్షేపణ యున్నచో బహిరంగప్రార్థనలు ఆయన చేయదలంచలేదు. ప్రార్థనోద్దేశ్యం ఎవరినినొప్పించుట గాదు. చాలా యోచించినపిమ్మట పేర్చికూర్చిన ప్రార్థనాభాగములను వదల వీలులేదు. ప్రార్థన సలుపుదామా వద్దా అని చేతులు ఎత్తండని కోరగా, ఒక్కరూ వ్యతిరేకంగా

చేతు లెత్తనందున, ప్రార్థనలు జరుపబడెను. ఖురాన్ భాగాలు చివరగాక మొదట్లోనే పఠించబడెను.

## గజేంద్రమోక్షము.

ఆ సాయంత్రము పాడిన గజేంద్రమోక్షము పాటనిగూర్చి ఆయన ప్రవచనం చెప్పెను. దేహానికి అన్నంవలెనే ఆత్మకు ప్రార్థన అవసరము. భారతమును పశుధర్మమునుండి రక్షించుటయే తమ యుద్దేశ్యము. దైవానుగ్రహంవల్లనే అది సాధ్య పడును.

## ఢిల్లీ తరువాత పంజాబు

దర్యాగంజిలో ముస్లిమున్నేహితులతో కలిసిన సంగతి వారికి తెల్పెను. పాకిస్తాన్ భారతాలలో నుండే ప్రతి ముస్లిం, హిందూ, సిక్కు తమ తమ స్వంతయిండ్లలో సుఖముగా ప్రతిష్ఠింపబడేవరకు, ఆయనకు విశ్రాంతి యుండదు. ఢిల్లీలో లేదా భారతంలో ముస్లిములు లేనిచో జుమ్మామసీదు యేమగును? పంజాబులో సిక్కులు లేనిచో, నంకానా సాహేబు, పంజా సాహేబు యేమగును? ఈ పవిత్రప్రదేశాలను యితరపనులకు ఎన్నడూ మార్చరాదు. పంజాబులో జరిగినపన్న ఘోరపాపాల పరిహారమునకై తాను పంజాబు పోవుచున్నాననెను. ఢిల్లీలోని ముస్లిములకు న్యాయము కల్పింపలేకపోతే, తాను పంజాబులోని హిందూసిక్కులకు యెలా న్యాయం చేయించగలడు? ఢిల్లీలోని హిందూముస్లిములు మరల సోదరులవలె వర్తిస్తుంటే కర్తవ్య

పాలసం లేదా కాటిక ప్రయాణం" అనే సందేశంతో ఆయన పాకిస్తాన్ పోవును. ఇచ్చటివారు పవిత్రులుగా నుండవలెను. హిందూమతం సముద్రంవంటిది. సముద్రము ఎన్నడూ అపవిత్రం గాదు. అలాగే భారతంకూడా అపవిత్రం కారాదు.

## సైనికుల, పోలీసుల కర్తవ్యం

వీరు పక్షపాతం వహిస్తున్నారట. నిజమైతే, అది దుఃఖ కరము. వీరే పక్షపాతులు, నేరంలో భాగస్థులు అయితే, చట్టాలు అమలుపరిచే దెలా? దుర్భావాలకు, లంచగొండితనము నకు లొంగిపోవద్దని గాంధీజీ వారిని హెచ్చరించెను. జాతిమతాలకు అతీతులై ఎల్లరకు నమ్మకమైన బంట్లుగా నుండమని ఆయన వారిని కోరెను.

# 8

19-9-47

## అతిశయోక్తులను ఆపండి

కచ్చాతారాచంద్ పేటలో అన్నివైపుల ముస్లిములు, మధ్యన హిందువులు నుండిరి. వీరందరు లీగర్లనియు, హిందువులకు వ్యతిరేకంగా విపరీతఆందోళన చేసిరనియు, పాకిస్తాన్ లోని ముస్లిములు ప్రవర్తించినట్లు యిచ్చటి హిందువులు వర్తించవలెననియు, ఇచ్చటి ముస్లిముల నందరిని బయటికి తరుమవలెననియు ఒక హిందూప్రచారకుడు చెప్పెను. అందులో అతిశయోక్తులు మెండుగా నున్నవి.

## ధైర్యంతో నిర్భయంగా ఉండండి

పై వాదనను గాంధీజీ అంగీకరించలేదు. తప్పుకు మరొక తప్పు చేర్చినయెడల, అవి ఒప్పుగా మారవు. కాన జనాధిక్యత గల ముస్లిములమధ్య ధైర్యంగా, నిర్భయంగా, సగర్వంగా యుండమని ఆయన బోధించెను. అటనుండి పాటోడిభవనంలోని అనాధాలయం చేరెను. భయమువలన తొలగించబడిన అనాథు లను తిరిగి అచ్చటకు పిలిపించమని చెప్పెను. డిశంబరు 7 వ తేదీన ప్రక్కనున్న ముస్లింకొంపలనుండి బారుచేయబడిన తుపాకి గుండ్లవలన, ఒకబిడ్డ మరణించెనట. మరొకబిడ్డకు గాయములు తగిలెనట. ఇప్పటి నివాసులకు ఆపద రాకుండా యిరుగుపొరుగు ముస్లిములు హామీగా వుందురని గాంధీజీతో వచ్చిన మౌలానా అహమ్మదుసేట్, యితర ముస్లిములు చెప్పిరి. పిమ్మట ముస్లి ముల మధ్యనున్న ఏకైకహిందువైన భార్గవాయింటివద్దకు ఆయన వెళ్లెను. అది ముస్లిములతో నిండియుండెను. హిందు వులు, ముస్లిములు, యితరభారతీయులు సోదరులవలె, స్నేహి తులవలె నివసింతురని తన 12 వ యేట గాంధీజీ కాంచిన కలను నిజమొనర్పమని ముస్లిములను ఆయన కోరెను. ఆ కలనైనా సఫలం చేయవలెను. లేదా తన్నైనా తీసుకొనిపొమ్మని గాంధీజీ బిర్లాభవనంలో ఆ సాయంత్రం దేవుని ప్రార్థించెను.

# 9

20-9-47

## దేవుడు భయమును తొలగించును

ఎవరి ఆక్షేపణా లేనందున సురాలతో కలిసిన ప్రార్థన జరుపబడెను. తనను నమ్మినవారి మనస్సులలోని భయమును దేవుడు తొలగించును. ఇప్పుడు పాడినపాట అర్థ మది. భయము బారినుండి బయట పడదలచినవారు, యితరులను భయపెట్ట రాదు. ఢిల్లీలోని ముస్లిములను, యితరులు నేడు భయపెట్టుట తప్పు.

సరిహద్దుప్రాంతములో బన్ను అనేది ఒక నగరం. అందులోనున్న ముస్లిముస్నేహితు డొకడు పూర్వం గాంధీజీకి బసయిచ్చినవాడు. ఇప్పుడు తమను ఆయన కాపాడజాలకున్నాడు గాన, తమనందరిని ఢిల్లీకి పిలిపించుడని కొందరు గాంధీజీని వేడిరి. తన కాశక్తి లేదనియు నెహ్రూ, పటేలుకు వారికథ వినిపింతు ననియు ఆయన తెల్పెను. దేవుడుతప్ప మరొకరు మనలను కాపాడ జాలరు. మరుదినం, మరునిమిషం తాను ఉందునని ఎవరైనా చెప్పగలరా? శాశ్వతుడగు దైవముమీదనే ఆధారపడవలెను. ఎట్లున్నను, చెడుగుకు బదులు చెడుగు చేయరాదు.

## అల్పసంఖ్యాకుల రక్షణ

పాకిస్తాన్‌లోని హిందు, సిక్కులు భయపడటం, అచ్చటి ప్రభుత్వమునకు కళంకము. జిన్నా యిచ్చిన హామీలను ఆ సర్కారు నిల్పలేదన్నమాట. ఎవరి మాన ధన ప్రాణాలు తమ

చేతులలో ఉన్నవో అట్టి అల్పసంఖ్యాకుల రక్షణ సాగిస్తాను, ఇండి యాలలోని అధికసంఖ్యాకుల కర్తవ్యంగా సంకేతనాలెను.

## సోదరులు శత్రువులైనారా ?

లోగడ జలియన్‌వాలాబాగ్ రంగంలో రక్తప్రవాహాలు కార్చిన సహయోధులు హిందూముస్లింసోదరులు శత్రువులైనా రంటే ఆయన కేమియు తోచుటలేదు. బొంబాయిలో [illegible] వరకు యిది కూడవని ఆయన మందలించెను. 'శాంతి నిల్పని దైవమా' యని ప్రతిరోజు, ప్రతిగంట కన్నీరు కార్చుచు దైవా నికి మొరబెట్టుచున్నట్లు ఆయన చెప్పెను. శాంతిరానినాడు తనని తీసికొనిపోవలెనని ఆయన కోరిక.

## శరణార్థులు

ఢిల్లీలోను, తూర్పు పశ్చిమ పంజాబులోను ఉన్నవారెట్లా యీ వానాకాలములో ఎలా ఉంటారో? ఇళ్లు లేవు. ఉన్న యిళ్ళకు కప్పులు లేవు. 57 మైళ్ళ పొడుగున నడచివస్తే కుటుంబాల మాట యెత్తితే, తల తిరిగిపోతుంది. లోకచరిత్రలో పూర్వన్నా యిలాంటిది లేనేలేదు. ఎంతలజ్జాకర మిది? వెంటనే యీ పిచ్చిని అణచవలెను. ఎవరిది ఎక్కువతప్పు? అని చర్చించేకాలము గా దిది.

## ముస్లిములకు రాజభక్తి అవసరం

భారతంలోఉండే ప్రతిముస్లిం భారతానికి గాని, పాకిస్తాన్‌పై భక్తి గలిగియున్నాడనే ఆరోపణను ఆయన నిరాక

రించెను. తండోపతండాలుగా వచ్చి యీ వాదు అబద్ధమని ఆయనతో ముస్లిములు తెల్పిరి. ఏమైనాకాని, దేశంమొత్తము మీద నాలుగున్నరకోట్ల ముస్లిములను చూచి యితరభారతీయు లేల భయపడవలెను? సేవాగ్రాంవంటి గ్రామాలలోనున్న ముస్లిములు బీదలు. హాని చేయజాలరు. వాళ్ళకీపాకిస్తాన్ గొడవే లేదు. ద్రోహులని వాళ్ళను ఎందుకు తోలివేయాలి? ద్రోహు లుంటే చట్టము శిక్షిస్తుంది. అమెరీ కొడుకును ద్రోహియని కాల్చివేయలేదా? అది తనకు యిష్టమైనపని కాకున్నా, ద్రోహుల గతి అంతే. పాకిస్తాన్‌యందలి భక్తిని పెంచుటకే కొందరు ముస్లింఉద్యోగస్తులు యిక్కడ ఉన్నారంటారు. హిందువులనంద రినీ కాఫీర్లుగా భావించడం పూర్తిగా తప్పని ముస్లింపండితులు చెప్పారు. ముస్లింలు, క్రైస్తవులు, యూదులువలెనే హిందువులు కూడా ప్రమాణగ్రంథాలు అనుసరించేవారే. ముస్లిముల జూచి భయపడవద్దు. వారిపై దయ చూపండి. పూర్వపుయిండ్లకు రమ్మని పిలువండి. ఆపద రాకుండ కాపాడండి. అదే శాంతి మార్గం; అదే ప్రాణమార్గం; ఆ మార్గం త్రొక్కితే పాకిస్తాన్ ముస్లిములేగాక, సరిహద్దుకొండజాతులుకూడా సరిగా ప్రవర్తి స్తారు. ఇక్కడినుండి ముస్లిములను, అక్కడనుండి హిందువులను, సిక్కులను తోలివేయుట శాశ్వతయుద్ధం అన్నమాట. హిందూ ముస్లింమతాల నాశనమన్నమాట. మంచివల్ల, మంచిప్రేమవల్ల ప్రేమపుట్టుతవి. పగదీర్చుకొనే విషయమున మానవుడు దుర్మార్గ లను దైవమునకే విడిచివేయవలెను.

# 10

21-9-47

## ఆక్షేపణదారుని ఆదరించుట

ఖురాన్ చదువవద్దని ఎవరో ఒకరు ఆక్షేపించినందున, బిర్లా ఆవరణలో ప్రార్థనలు ఆరోజున ఆపారు. ఆక్షేపణదారునితో వాదింపదలచలేదు. ప్రజలహృదయాలలో [illegible] ప్రదేశమును గాంధీజీ గుర్తించబట్టే, ఆక్షేపించినవాడొక్కడేయైనను, అతనిని గాంధీజీ గౌరవించెను. కాని దేవునిగాని, మానసిక స్వరాజును గాని గాంధీజీ వదలినట్లు భావించరాదు. ప్రార్థనకు సంపూర్ణ సహకారములు అవసరము. ఇట్టి ఆక్షేపణలనుండి నేర్చుకోవలసినది ఒకటే నీతి— ప్రజాసేవ చేయదలచినవారికి అంతులేని సహనశక్తి, ఓర్పు ఉండాలి. తన భావాలను బలవంతంగా యితరులమీద ప్రసరింప జేయరాదు.

## ఫలించనిచెట్టు వాడిపోవును

హిందువులు, ముస్లింలు ఎక్కువమంది యిరుగుపొరుగున నివసించేచోటికి ఇందిరాగాంధీతో కూడా గాంధీజీ వెళ్ళెను. అచ్చటి హిందువులు మహాత్మాగాంధీకి జై అని అరచిరి. కాని, యిప్పటి స్థితిగతులలో గాంధీవిజయం అసంభవమని వారు గ్రహించలేదు. మూడుమతములమధ్య స్నేహభావం లేకపోతే, ఆయన జీవింపవలెనని కోరుటలేదు. ఐకమత్యమే బలమని, అనైకమత్యమే దుర్బలమని ఆయన గట్టిగా బోధించుచున్నారు. పంచ

లేనిచెట్లు వాడినట్లు, తనసేవవల్ల సాంఘికసఖ్యత కలుగనిచో, తన శరీరం పడిపోవలసిందే. ఇది నిజమే. ఫలాపేక్ష లేకుండా, పనిచే యవలెనన్నదీ నిజమే. అపేక్షకన్న నిరపేక్ష ఫలప్రదమన్న మాటా నిజమే. ఉపయోగకాలము దాటిన శరీరం పోయి, క్రొత్తశరీరం రావలసిందే. అనశ్వరమైన ఆత్మ, క్రొత్తఆకారముల దాల్చి సేవల ద్వారా స్వర్గమును చేరుచున్నది.

## మీ యిళ్ళు వదలవద్దు

హిందువులు బాధపెట్టుదురేమో, చంపుదురేమో అని జంకక మీ యిండ్లను వదలవద్దని గాంధీజీ ముస్లిములకు సలహా చెప్పెను. ఆ వివేకం లేకపోతే, మృత్యువాతనుండి తప్పించుకొను టకు వారు యితరవిధాలు అనుసరింపవచ్చును. వీరిని వేధించిన హిందువులు, సిక్కులు తమమతములనే అవమానించుకొందురు. భారతావనికి తీర్చలేనికీడు చేతురు. 4½ కోట్లను చంపుట లేక పాకిస్తాన్‌కు పంపుట, సాధ్యమని తలచుట అచ్చంగా వెర్రితనమే. తానే అట్లు సూచించారని వేసిన పుకారు పొరపాటు. ఆయన ఎన్నడూ అలా సూచించలేదు. సర్కారువారి పోలీసు లేక సేన యొక్క సహాయంతో ముస్లిముల నుద్ధరింపరాదని ఆయనభావం. కాని హిందు, సిక్కుల కోప మణగి వారు మర్యాదగా పిలిస్తే ముస్లిములు తిరిగిపోవచ్చును. అంతవరకు ఖాళీయైన కొంపలను సర్కారు కాపాడాలి.

## సర్కారు ఎప్పుడు రాజీనామా యివ్వాలి

సర్కారుకు ఆ శక్తి లేనప్పుడు, రాజీనామా నివ్వాలి మంత్రిమండలికి ఆయన సలహా నిచ్చాను. వారెవరినిమ్మట వచ్చే మంత్రివర్గం ముస్లిములనందరిని చంపవలెనని, లేదా పాకిస్తానుకు పంపవలెనని, ఒకపత్రిక సూచనచేసింది. జాతీయఆత్మహత్య లాటిది. హిందూమతనిర్మూలన మది. అలాంటి పత్రిక ప్రచురించబడవలసిన దేనా? పత్రికాస్వాతంత్ర్యమంటే విషప్రచారప్రచారం చేయు టేనా? పూజ్యభావముతో భారతంవైపు చూచే లోకం యికముందు అట్లు ప్రవర్తించదు. కొందరెవరికి ఉన్నతాధికారులకు, ఆ వైరికి వ్యతిరేకంగా ఆయన బోధించుచునే యుండును.

# 11

22-9-47

## ఆక్షేపణదార్ల కర్తవ్యం

ఒకరే ఆక్షేపించినా, నేను ప్రార్థనను ఆపుట సన్నద్ధుడను ఈసంగతిని మరికొంచెములోతుగా విచారించవలెను. ఇది, బహిరంగ ప్రార్థనలంటే, ప్రతివాడు రావచ్చుననే దాని యర్థం. ఈ స్థలం వ్యక్తుల సొంతం. ఖురాన్‌సహితప్రార్థనలలో నమ్మకమున్న వారే యిచ్చటికి వచ్చుట భావ్యం. బహిరంగప్రదేశములలో చేసే ప్రార్థనలకుకూడా యిదేసూత్రం వర్తించును. ప్రార్థనాసమావేశం వాగ్వివాదసభ గాదు. విశాలమైన బహిరంగప్రదేశముంటే, అనేకమతాలవారు, అచట ప్రార్థనలు సలుపుకోవచ్చు. ఆక్షేప

ణాలు కలవారచటకె పోరాదు. లేకపోతే, ప్రతి-చోటా అల్లరులు లేస్తవి. ప్రజాస్వాతంత్ర్యమన్నది పరిహాసాస్పద మౌతుంది. మర్యాదగల సమాజంలో ప్రాథమికసత్వములను అమలుజరుపుటకు పోలీసుసహాయ ముండరాదు.

## యోగ్యమైన సహనము

కాంగ్రెసుప్రదర్శనస్థలాల్లో అనేక మతకక్షలు, రాజకీయ కక్షలు, ఒండొరులతో తగవులులేకుండా సభలు చేసుకొనేవారు. భావాలు భిన్నంగా ఉన్నా, ప్రత్యక్షవిరుద్ధంగా ఉన్నా, తగవులకు దిగక, పోలీసును పిలువక తమపనులు చేసుకొనేవారు. అరుదుగా వ్యతిరేకంగా కొందరు వర్తించేవారు. అట్టివారిని ఎల్లరూ ఖండించేవారు. ఆ యోగ్యమైన సహనభావం ఎక్కడికిపోయింది? స్వేచ్ఛ వచ్చినకారణాన, దానిని దురుపయోగం చేయుటద్వారా దానివిలువ పరీక్షించుచున్నామా? ఇది తాత్కాలిక మగును గాక!

ఇదంతా ముస్లిములు చేసిన దుష్కృత్యాల ఫలితమని నాతో చెప్పవద్దు. ఆ సంగతి నిజమేఅయినా, అసాధారణమైన వత్తిడి కలిగినప్పుడు విరిగిపోయేటంత దుర్బలమైనదా మనసహనశక్తి? మర్యాదను, సహనమును ఎంతవత్తిడికలిగినా వదలరాదు. లేదా, మనకు దుఃఖం తప్పదు. మనవిమర్శకులు మనకు స్వాతంత్ర్యార్హత లేదని ఎత్తిపొడుస్తారు. మన సమిష్టిసంస్కృతి ప్రత్యక్షంగా కనుపించకపోతే, ఆ భారతీయులను ప్రేమించే నాకు గర్వభంగ మౌతుంది.

ఇండియా అపజయంపొందితే, ఆశియా అంతమౌతుంది. అనేక సంస్కృతులకు, నాగరికతలకు ఆలవాలమంటారు—భారత దేశాన్ని. ఆశియాలో, ఆఫ్రికాలో మరెక్కడగాని ఉండే పరతాపితులగు ప్రజలకు, భారతదేశం ఆశాజ్యోతిగా వెలుగుచుండాలి.

## లైసెన్సులేని ఆయుధాలు

ఇది యొక చిక్కుసమస్య. వీటిని బయటికి లాగవలసినదే. బుద్ధిపూర్వకముగా కొద్దిగా వచ్చుచున్నవి. కాని అది చాలదు. విదేశీపరిపాలనలోకూడా దొంగఆయుధాలు ఉన్నా, ఎవరూ అపుడు ఆరాటపడలేదు. అపుడు ఒకసూత్రం, ఋషులకు ఒక సూత్రం వర్తింపచేయరాదు. కుక్కను కొట్టుటకై దానికి పిచ్చి పేరు పెట్టరాదు. 60 యేళ్లు అవస్థలపాలై ఆర్జించిన స్వాతంత్ర్యాన్ని, నిలువబెట్టుకొనుటలో వచ్చే కష్టాలను దాటి, గట్టెక్కవలెను. అందువల్ల మన అర్హత, ఔదార్యము పెరుగును.

## అధికసంఖ్యాకుల కర్తవ్యం

అల్పసంఖ్యాకులు ద్రోహులవుతారేమో అనే భీతిచే, వారిని చంపటం, లేక వెళ్ళగొట్టడం వట్టి పిరికితనం. వారిహక్కులను జాగ్రత్తగా కాపాడకపోతే, అధికసంఖ్యాకులు నవ్వుల పాలవుతారు. ఆత్మవిశ్వాసం ఉంచుకొని, ప్రత్యర్థులను ధైర్యంగా నమ్మాలి. అదే మంచి రక్షణోపాయం. ఢిల్లీలోనుండే మూడు మతాలవారు, ఒండొరులను స్నేహంతో కౌగలించుకొని మిగతా ఇండియాకు, లోకానికి మంచిమార్గం చూపాలి. ఇతరచోట్ల

జరిగేవాటిని ఢిల్లీ మరువాలి. వ్యక్తిగతంగా కసి తీర్చుకుందాం, ప్రతీకారం చేదాం, అనే దుష్టసూత్రాన్ని వదలాలి. అవి రాజ్యాంగపుపనులు, వ్యక్తులవి కారాదు.

## 12

23_9_47

### అందరియెదుట తప్పు ఒప్పుకొనుట

శ్రీమతి మనుగాంధీ, అబ్బాగాంధీలు గడచినరోజు అర్పించిన క్షమాపణమాట గాంధిజీ యెత్తెను. ఆదివారమునాడు కీర్తన పాడుచుండగా లయ, తాళం తప్పినందున వారు నవ్వు ఆపుకోలేకపోయిరి. ఆబాలికలు ప్రార్థనాపవిత్రతను గ్రహించలేదే యని ఆయనకు మిక్కిలి నొప్పికలిగెను. వారు ఆయనకు క్షమాపణ తెల్పిరి. కాని అది అనవసరము. వాళ్ళపై ఆయనకు కోపము లేదు. తనమీదనే తనకు కోపము వచ్చెను. ప్రార్థనా కాలములో దైవంలో లీనమయ్యే ఆవశ్యకతను వారికి తాను నచ్చజెప్పజాలకపోయెనుగా! బహిరంగంగా క్షమాపణ కోరవలెనని చెప్పిన ఆయన సలహాను వారు సంతోషంతో శిరసావహించిరి. శుద్ధహృదయముతో చేసిన క్షమాపణ, చేసినవానిని పవిత్ర మొనర్చును. అట్టి తప్పు మరల దొరలకుండ కాపాడును.

పాకిస్తాన్‌లో హిందువులకు, సిక్కులకు కలిగే బాధలను గూర్చి యిచ్చటివారు కోపపడవచ్చును. కాని అందుచేత గీత, ఖురాన్, బైబిలు, గ్రంథసాహేబు, జండ్ అవస్తలోని భాగపఠనము

నకు వారు ఆక్షేపించరాదు. ఆ యా మతానుచరులు వాటిని అనుసరించకపోయినా, ఆ యా గ్రంథములలో జ్ఞానసర్వస్వములు భద్రపరుపబడి యున్నవి.

## ధైర్యంగా మరణించే నేర్పు

నేడు రావలపిండి, డేరాగాజీఖాన్‌లనుండి రాయబారాలు వచ్చెను. రావల్పిండినిర్మాతలు హిందువులు, సిక్కులే. ఇచ్చట హాయిగా కాలం గడుపుచుండినవారు నేడు నిల్వ నీడ లేని శరణార్థులైనారంటే, ఆయన గుండెలు అవిసిపోయెను. ఇప్పటికి లాహోరునిర్మాణానికి కారకులైన హిందువులు, సిక్కులు నేడచటనుండి వెడలగొట్టబడిరి. అలాగే ఢిల్లీనిర్మాణంలో పాల్గొన్న ముస్లింలకు దుర్గతి పట్టింది. 15—8—47 తేదీనున్న భారతదేశపు కేళీవిలాసాలకు అందరూ కారకులే గదా! పాకిస్తానులో ఎప్పటినైనా ఉన్నట్టి హిందువులకు, సిక్కులకు ఆ ప్రభుత్వం పూర్తి రక్షణ యివ్వాలి. అల్పసంఖ్యాకులకు అలాంటి రక్షణ కల్పించడం, రెండుప్రభుత్వాల కర్తవ్యం. ఇప్పటికిని రావల్పిండిలో 18000, వాహశిబిరంలో 30000 హిందువులు, సిక్కులు ఉన్నారట. ఆ యిల్లు వదలి వచ్చుటకన్న, చివరవానివరకు చచ్చుటకు వారు సిద్ధం కావాలి. ధైర్యంతోను, గౌరవంతోను, చచ్చేనేర్పునకు ప్రత్యేకతర్ఫీయతు అక్కరలేదు. దైవనామము ప్రార్థనావిశ్వాస మున్న చాలును. అప్పుడు స్త్రీల అపహరణలు, నిర్బంధ మతపు మార్పిళ్లు ఉండవు. ఆయన పాకిస్తాన్ పోవలెనని అంటూ

తొందరపడుచున్నారు. కాని ఢిల్లీలో ఆయనమాట నెగ్గకున్నచో పాకిస్తాన్‌లో విజయం పొందుట అసాధ్యం. పాకిస్తాన్‌లో ఎచ్చట తిరిగినా, దైవం ఒకనినే రక్షకునిగా పెట్టుకొని ఆయన పోదలంచెను. ముస్లిములు మొదలగువారందరియొక్క ఆప్తస్నేహితుడుగా, ఆయన అచటికి పోవును. కాబట్టి ఆయనప్రాణాలను వారి చేతిలో పెట్టును. తనప్రాణం హరించగోరేవాడు వస్తే, సంతోషముతో అంతమొందుటకు ఆయన తయారుగా నున్నాడు. ఇతరుల కిచ్చిన సలహా, తాను అపుడు అమలు జరిపినట్లగును.

## శరణార్థులకు యిండ్లు

శరణార్థులు ఇండ్లు యిప్పింపమని అడిగిరి. ధర సింహాసనం, నభంబు గొడుగు అని ఆయన వారికి చెప్పెను. నిర్బంధంచేత ఖాళీచేయబడిన ముస్లింగృహములలో ప్రవేశింపరాదు. అందరూ పనిచేస్తే, ఒక్కరోజులో అన్ని పాకలు వేయవచ్చును. అందువల్ల శరణార్థులకోపము అడంగును. తన పంజాబుప్రయాణం సుకర మగును.

# 13

24–9–47

## భారతం, బలంలేని పడవ

నేడు పాడిన కీర్తనలలో తన బలంలేని పడవను సముద్రమును దాటించమని కవి, దైవాన్ని ప్రార్థించును. అలాగునే భారతాన్నికూడా అవతలిబడ్డుకు చేర్చమని గాంధీజీ వేడెను.

# సర్కారుకు అవకాశం యివ్వండి

హిందువులను ముస్లిములు పాకిస్తాన్‌నుండి తోలివేసి నపుడు, భారతదేశంలో ముస్లిములకు ఎందుకు చోటు ఉండ వలెనని శరణార్థుల వాదం. పగదీర్చుకొను ప్రతీకారభావమే దాని మూలం. యుద్ధం చేసి పాకిస్తాన్ తీసుకుంటామని ముస్లింలీగు లేవదీసిన నినాదం, సవాలు, రెండును తప్పే. బలప్రయోగంచే దేశవిభజన జరిగేదికాదు. నిశ్చయం. ఇప్పుడు కాంగ్రెసు, ఆంగ్లే యులు సమ్మతించకపోతే నేడు పాకిస్తాన్ ఉండేదికాదు. దానిని తిరుగతోడరాదు. తమ కెలా స్వాతంత్ర్యం వచ్చెనో పాకిస్తాన్ ప్రజలు గ్రహింతురుగాక. ప్రత్యర్థిగా పోరాడింది కాంగ్రెసు. ఆయుధం సాత్వికనిరోధము. దానికి ఆంగ్లేయులు లొంగి అవతలికి వెళ్ళిరి. బలప్రయోగంచేత పాకిస్తాన్‌ను భగ్నపరుపజూచుట, స్వరాజ్యమును పాడుచేయుటయే. ఇండియాలోనున్న రెండు ప్రభుత్వాలు తగాదాసంగతులను తమలోతాము తేల్చుకోవాలి. పౌరులు అట్టి అవకాశం ఆ సర్కారులకు కలిగించాలి. ప్రతి రోజూ జరిగే ప్రాణహాని ఎంత పాపం! ఎంత హానికరం!

పౌరులే పోట్లాడ పూనుకున్నచో, వారికి స్వరాజ్యార్హత లేదని లోకానికి ఋజువు చేతురు. ఒక్కరాజ్యం దారుణ నక్ర మంగా వర్తిస్తే, రెండవది ఆదోవ పట్టక తప్పదు. లోకంకూడ అలా వత్తిడి చేయును. భారతదేశంలో యితరమతస్థులకు చోటు లేకుండా చేతామన్నచో కాంగ్రెసుచరిత్రనంతా తల్లక్రిందులు చెయ్యాలి. అది అసంభవము.

కతియవార్‌లోని సంస్థానాలన్నీ ఒక వైపున, జునఘడ్ మరోవైపున ఉండి యుద్ధం చేస్తారా ? తక్కిన సంస్థానాలన్నీ కలసినచో, జునఘడ్ విడిగా నుండనోల్లదు. దానికి చట్టసమ్మతమైన ప్రవర్తన అత్యావసరము.

# 14

25—9—47

## భారతసమ్మేళన- సర్కారు కర్తవ్యం

ఎవరో ఒకచీటీ వ్రాసిరి. పాకిస్తాన్ తోలివేసే హిందువులను, సిక్కులను, గాంధీజీ సలహాప్రకారము హిందూదేశంలో నిలువ యుండవలసిన ముస్లిములను, వీరిద్దరిని భారతసర్కార్ భరించ గలదా ? అని ఆచీటీలో వ్రాయబడి ఉన్నది.

పాకిస్తాన్‌లో హిందువులకు, సిక్కులకు కలిగే అక్రమ ప్రవర్తనను భారతసర్కారు గమనించి వారిని కాపాడుటకు గట్టి కృషి చేయవలసిందే. అంతేగాని పాకిస్తాన్‌వలె ముస్లింలను బయటికి నెట్టరాదు. మనఃస్ఫూర్తిగా వెళ్లదలంచినవారిని క్షేమంగా తీసుకొనిపోయి సరిహద్దున వదలి రావలెను. పాకిస్తాన్‌లోనివారిని రక్షించుటకుగాను యిక్కడ ప్రజలు సర్కారుతో పూర్తిగా సహకరించాలి. ప్రతీకారమార్గం పట్టి వెర్రిఎత్తినట్లు వర్తిస్తే 40 రోజులు యీడుగల స్వాతంత్ర్యపుశిశువును చంపెదరు.

రామరావణులమధ్య జరిగిన అసమానయుద్ధంలో ధర్మ

మును నిష్కర్షగా అనుసరించబట్టి రాముడు గెల్చినాడు. ఇష్టరును తప్పటడుగులు వేస్తే, ఎవరిని సమర్థించ గలము?

## ద్రోహులకు శిక్ష

బ్రహ్మాండమైన ఆంగ్లరాజ్యమును ఎదిర్చిన వీరులు నేడు భీరువు లైరా? వీరులు దేవుని తప్ప అన్యుని జూచి భయపడరు. రాజద్రోహం పెద్ద నేరం. సర్కారు తగిన శిక్ష విధించును. కాని అనుమానంమీద అవతలికి నెట్టుట భావ్యము కాదు.

## పోలీసు, సైనికుల కర్తవ్యం

ఇక్కడి పోలీసు, మిలిటరీ హిందువుల పక్షమును, అక్కడి వారు ముస్లిములపక్షమును వహిస్తున్నారని వినుటచే గాంధీజీకి మిక్కిలి చింతగలిగెను. విదేశీయుల వశంలో నున్నపుడు మన కర్తవ్యం మనకు తెలియదు. నేడో ఆంగ్లఉద్యోగియులుకూడా జాతీయనౌకరులే. లంచగొండితనానికి, పక్షపాతానికి, వారు లోబడరాదు. పోలీసు సేనను జూచి భయపడవద్దు. వీరు కోటాను కోట్లు. వారు కొద్దిమంది. మీరు సరిగా యుంటే వారును అట్లే ఉండకతప్పదు.

## మంటలను ఆర్పు టెట్లు?

ఆరోజు రాజప్రతినిధిని, ఢిల్లీలోని వివిధసంఘప్రముఖులను, వర్కింగ్ కమిటీని, ఆయన కలిసెను. ఈ ద్వేషప్రతీకారఅగ్నిజ్వాలలను ఆర్పు టెట్లని అందరు అడిగిరి. శక్తివంచన లేకుండా మానవుడు ప్రయత్నించి, ఫలితమును పరమేశ్వరునికి వదలవలెను.

# 15

26—9—47

ప్రార్థనకు పూర్వం అడుగగా సభలోని యువకు డొకడు ఆక్షేపించెను. సురాలు వదలి జరుపమనెను. ప్రార్థనఅంతయు ఆపుటకు గాంధీజీ తయారయ్యెను. తక్కిన సభ్యులందరూ ప్రార్థన కావలెననిరి. ఆక్షేపకుడు ఊరకుండెను. పూర్తి ప్రార్థన జరుపబడెను.

## గ్రంథసాహెబ్

బాబా కరన్‌సింగ్ అనుచరులు గాంధీజీని కలసి యిప్పటి హత్యాకాండ సిక్కు మతమునకును, అన్ని మతములకునుకూడా వ్యతిరేకమని తెల్పిరి. దేవుని అల్లా, రహీమ్ మొదలగునామములతో పిలువవచ్చునని నానక్ రచించిన పాట పాడి వినిపించిరి. దేవుడు హృదయస్థమైతే పేరుతో పనియేమి? నానక్, కబీరు వివిధమతసమన్వయమునకై ప్రయత్నించిరి. మరచి యింటివద్ద వదలిన ఆకీర్తనను మరునాడు తెత్తునని గాంధీజీ తెల్పెను.

## గాంధీజీ అభిలాష

తన కష్టగాథ తెలుపుచూ లాహోరువాస్తవ్యులు పండిత ఠాకూర్ దత్తా గగ్గోలుపెట్టి ఏడ్చెను. ఎవరిస్థానమందు వా రుండి ధైర్యంతో చావవలసిందని గాంధీజీ చెప్పిన సలహా నమ్మిననూ, ధైర్యం లేక తప్పించుకొని వచ్చినాననెను. గాంధీజీ హొమ్మనమంటే తిరిగి వెళ్ళుటకు తయారుగా నుండెను. కాని ఢిల్లీలోనే యుండి

శాంతి స్థాపనమునకు తోడ్పడమని గాంధీజీ తెల్పగా ఆయన అంగీకారము చేసెను. ఇచట శాంతిస్థాపన జరిగితే, నూతనబలంతో పశ్చిమ పాకిస్తాన్‌లోని లాహోరు, రావల్పిండి పట్టణములకును, సరిహద్దు ప్రదేశమునకును, సింధుకును పోవ ఆయన తయారుగా నుండెను. ఆయన అందరిసేవకుడు, క్షేమాభిలాషి. ఆయన పయనమునకు ఎవరూ అడ్డుపెట్టరు. సేనారక్షణ ఆయనకు అక్కరలేదు. తన ప్రాణాలను ప్రజలకు ఒప్పగించును. పాకిస్తాన్‌నుండి తరుమబడిన ప్రతిహిందు, సిక్కు సగౌరవముగా స్వగృహానికి వచ్చే వరకూ ఆయన విశ్రాంతి పొందడు.

## సిగ్గుచేటు

అనేకమంది ముస్లిములకుకూడా ఉచితసేవ చేసిన వైద్యుడు పండితదత్తా, లాహోరు వదలి రావలసివచ్చిందంటే, అది సిగ్గుచేటు. ఢిల్లీలో హిందూముస్లిములకు సేవ చేసి గాంధీజీచే తెరిపించిన టిబియాకళాశాలను స్థాపించిన హకీంఅజ్మల్ ఖాన్ సంతతివారు, ఢిల్లీని ఆ కళాశాలను వదలవలసివస్తే, అదియు సిగ్గుచేటే.

## అన్యాయమును సహించరాదు

అన్నిరకాలయుద్ధాలకు వ్యతిరేకి గాంధీజీ. కాని పాకిస్తాన్ ఋజువైన తనతప్పును ఒప్పుకోనక, స్వల్పమని చెప్పి సమర్థించినా, పాకిస్తాన్‌నుండి న్యాయం కలుగకున్నా, భారతసమ్మోళనం యుద్ధానికి దిగవలసివస్తుంది. అది తమాషా గాదు. నాశనకారి. కాని

అన్యాయమును సహించమని ఆయన యెన్నడూ సలహా యివ్వ లేదు. న్యాయమైన పనికొరకు హిందువులందరూ హతముచేయ బడినా ఫరవాలేదు. యుద్ధం వచ్చినా, పాకిస్తాన్‌లోని హిందువులు దానియందు భక్తులుగా నుండాలి. ద్రోహులు కారాదు. అలాకాకపోతే, పాకిస్తాన్ విడిచి రావాలి. అలాగే భారతసమ్మేళనములో ముస్లిములును దానియందు భక్తులుగా నుండాలి. ద్రోహులు కారాదు. లేనిచో సమ్మేళనాన్ని వదలిపోవాలి. ప్రజలు ప్రభుత్వాన్ని వశపరచుకొని తమవైపు త్రిప్పుకోగలరు. తాను (గాంధీజీ) అట్లుగాక సత్య, అహింసల అవతారమూర్తియైన దేవుని పూజించును.

## హిందువులే హిందూమతాన్ని నాశనం చేయగలరు

ఒకపుడు ఇండియా తనమాట వినేది. ఇపు డాయన వెనుకపడినాడు. యంత్రాలు, వాయుసేన, సముద్రసేన, మొదలగునవి కోరేవ్యవస్థలో ఆయనకు స్థానం లేదు. వీటికి ఆయన ఒప్పుకోడు. ఎలా స్వాతంత్ర్యము సంపాదించారో, ఆ శక్తి ద్వారానే, దానిని నిలుపుకోదలచితే, వారిని నడుపుటకు ఆయన తయారే. ఒక్కనిముషములో ఆయన శరీరదుర్బలము, నిస్పృహ మటుమాయమగును. నవ్వుతూ పాకిస్తాన్ తీసుకున్నాము. కత్తి కట్టి హిందూస్తాన్ తీసుకుంటామని ముస్లిములు అంటున్నారట. ఆపనిని తా నెన్నడూ సాగనివ్వడు. భారతాన్నంతా ముస్లిం మతములోనికి మార్చుదామని కొందరు భ్రమపడుతున్నారట.

యుద్ధంవల్ల ఆపని యెన్నడూ జరుగదు. పాకిస్తాన్ హిందూ మతాన్నిగాని, హిందూస్తాన్ ముస్లింమతాన్నిగాని, యెన్నడూ చంపలేవు. ఆ యా మతస్థులే ఆ యా మతాన్ని చంపుకోవాలి.

## సత్యమే జయించును

తాను మహాత్ముడే అయితే అణిమాదిశక్తుల ప్రయో గించి భారతాన్ని, హిందువులను, సిక్కులను రక్షించుమని క్రిందటిరోజు ఒకస్నేహితుడు సూచించాడు. తాను మహాత్ము డని ఆయన చెప్పుకోవడం లేదు. ఆయన సామాన్యమానవుడే. ఇతరులకంటె దుర్బలుడుకూడా. కాని తాను యితరులకంటె ఎక్కువ దైవభక్తిగలవాడు కావచ్చును. హిందూ, సిక్కు, పార్శీ, ముస్లిం, క్రైస్తవ భారతీయులందరూ దానికై ప్రాణా లర్పించుటకు తయారుగానుంటే, భారతావనికి ఎన్నడూ యేఆపద రాదు. సత్యమే జయించును. అనృతం జయించదని మహా ఋషులు చెప్పినపలుకును మీరు జ్ఞాపక ముంచుకోవాలి.

# 16

27_9_47

## రాముడే పరమవైద్యుడు

తన జబ్బునుగూర్చి తన సమ్మతిలేకుండ పత్రికలలో ప్రక టించినందున ఆయనకు నొప్పికలిగెను. ఆ జబ్బువలన ఆయనపనికి ఆటంకంకలుగలేదు. ఆయనకు నయముగాకూడ ఉండెను. డాక్టరు డిన్‌షామెహతాగారు గాంధీజీ స్వంతవైద్యుడని వర్ణించుట తప్పు.

గాంధివద్దకు వైద్యానికిగాక ఆధ్యాత్మికసమస్యలకొరకు, అతడు వచ్చియుండెను. ఆయన గాంధీజీకి మిత్రుడు.

డాక్టర్ సుశీలనయ్యార్, డాక్టర్ జీవరాజ్ మెహతా, డాక్టర్ బి. సి. రాయి, డాక్టర్ గిల్డర్, కీ. శే. డాక్టర్ అన్సారీ ఆయన స్వంతవైద్యులేయైనను, ఆయన ఆమోదంపొందని ప్రకటన చేసేవారుకారు. ఇపుడాయనకు రాముడొక్కడే వైద్యుడు. శారీరక, మానసిక, నైతిక, రోగములను నయముచేయువాడాయనయే. ఆనాడు భజనలో పాడినపాట భావము అదియే. డాక్టర్ డిన్షామెహతాతో మాటలాడునపుడు, ఆభావమే స్థిరపడింది. శ్రేష్టమైన ఔషధం రామనామమే. రాముడు ఆవహించిన వారికి నీటి మట్టి వైద్యంకూడా అనవసరం.

భాగ్యవంతులతో ఢిల్లీలో సరిగాయుండే డాక్టరు జోషీ బీదలకు ఉచితముగా మందు ఇచ్చుచున్నాడు. కొందరికి అన్నం పెట్టి నయముచేసి తిరుగుప్రయాణఖర్చులుకూడ ఇచ్చుచున్నాడు. గాంధీజీ అట్టివానినికూడా కోరక రామునిమీద ఆధారపడుచున్నారు.

## గ్రంథసాహెబు కీర్తన

నిన్నపాడినది గురుఅర్జునదేవు రచించిన కీర్తన. ఆయన దానిని గురునానకు దని వచించెను. ఇది మనదేశంలో సహజమే. ఆ కీర్తనలో ఉన్నదేమంటే, దేవుని రాముడని, ఖుదాయని పలుపేర్లతో పిలువవచ్చును. కొందరు కాశీయాత్ర, కొందరు మక్కా

యాత్రచేయవచ్చును. కొందరు దేవాలయంలో, కొందఱు మసీదులో పూజించవచ్చును. కొందఱు తలలువంచవచ్చును. కొందఱు వేదములను, కొందఱు కోరాన్‌ను చదువవచ్చును. కొందఱు కాషాయమును, కొందరుధోవతమును ధరింపవచ్చును. కొందఱు హిందువులని, కొందఱు ముస్లింలని పిలుచుకోవచ్చును. కాని దైవ శాసనమును సరిగా అనుసరించినవాడు, ఆ దైవరహస్యమును గ్రహించగలడని గురునానకు చెప్పెను. ఇట్టిభావాలు హిందూ మతములో సర్వత్ర యున్నవి. కనుకనే నాలుగున్నరకోట్ల ముస్లిములను ఇండియానుండి తరిమివేయగోరుకొను పిచ్చి తన కర్థమగుట లేదని ఆయన అనెను.

## అది పొరపాటా ?

కాంగ్రెసు ఇదివరకే మూడుతప్పులు చేసిందని, ఇప్పుడు అన్నిటినిమించిన 4 వ తప్పు చేయబోతున్నదని, ఒక ఆర్యసమాజికుడు వ్రాసెను. హిందువులకు సిక్కులకు ఇరుగుపొరుగున ముస్లింలకు పునరావాసం కల్పించుట, పెద్ద తప్పిదమట. కాంగ్రెసు తరుపున మాటలాడకపోయినా, ఆనాలాటితప్పు చేయుటకు తయారుగా నున్నానని గాంధీజీ తెల్పెను. వెర్రిఎత్తిన పాకిస్థాన్‌వలె వెర్రిపనులు చేయుట తప్పు, నేరము. ఈ వెర్రి అణగినపిమ్మట, గాంధీజీసలహా మంచిదని ప్రజలు తెలుసుకొందురు.

## ఘోరమైన అసహనం, జోక్యం

ఆరోగ్యశాఖామంత్రిగా నున్న రాజకుమారి, క్రైస్తవురాలు. అందుచేతనే హిందువు సిక్కు అని చెప్పుకుంటుంది. అన్ని

శిబిరాలు చూస్తున్నది. కొందరు క్రైస్తవ బాలురను బాలికలను చేర్చి ముస్లింశిబిరాలవద్ద పనిచేయుటకు పంపగా ఎవరో బుద్ధిహీనులు, వారిపై కోపపడి ఇళ్లలోనుంచి వెళ్ళగొట్టెదమని బెదిరించిరట. కొందరు భయపడి వెళ్ళిపోయిరటకూడా. ఇది ఘోరం. ఒకచోటనున్న హిందువులు ఈ బీదక్రైస్తవులను రక్షించుటకు పూచీ పడిరట. అది సంతోషప్రదము. ఇళ్లు వదలివేసినవారందరు త్వరగా స్వంతఇండ్లకు వచ్చి బాధపడే మానవాళికి, ఇతరుల జోక్యం లేకుండా సేవచేసే అవకాశం కలుగునుగాక.

## ఆయనవిశ్వాసం సడలిందా ?

యుద్ధాన్నిగురించి క్రిందటిరోజు ఆయన చెప్పినమాటలకు వార్తాపత్రికలు అపార్థం కల్పించారు. యుద్ధానికి నిజంగా సమ్మతింతురా ? అని కలకత్తావారు కొందఱు ప్రశ్నవేశారు. ఆయన సర్వకాలసర్వావస్థలయందు అహింసపై ఆధారపడినవాడు. యుద్ధాన్ని ప్రోత్సహించడు. ఆయన నడిపే రాజ్యాంగంలో పోలీసులు, సైనికులు ఉండరు. ఇప్పటి భారతసమ్మేళనాన్ని తాను నడుపుటలేదు. భారతానికి పాకిస్తాన్‌కు మధ్యనుండే వివిధ అవకాశములను ఆయన చర్చించెను. ఆ రెండుదేశాలు పరస్పర సంప్రదింపులవల్ల తగవులు పరిష్కరించుకోవలెను. అలాకానపుడు పంచాయితీకి వేసుకోవలెను. కాని ఏఒక్కరో తప్పు చేస్తూనే యుండి, పైనచెప్పిన మార్గాలు రెంటిలో దేనికీ ఒప్పుకోకపోతే, అపుడు రెండవవారికి యుద్ధమే గత్యంతర మగును. కోపోద్రిక్తు

తైన వ్యక్తులు తమ శత్రువులపై పగదీర్చుకొనుటకు, హింసా కాండకు, "వప వలుచుటకు" ముందు తీసుకొనదగిన చర్యలను ఆయన తెల్పెను. పౌరులు ఒండొరుల వప వలుచుటకు పూను కుంటే, సత్యమైన రాజ్యపాలనం అసాధ్యమగును.

# 17

28_9_47

## చర్చిల్ చేసిన పొరపాటు

ఖురాన్ శ్లోకపఠనమునకు ఎవరైన ఆక్షేపింతురా యని అడుగగా ఇద్దరు ఆక్షేపించిరి. గాంధీజీ ప్రార్థనను ఆపెను. కాని అత్యధికసంఖ్యాకుల అభిలాషలను భంగపఱచుట తప్పని ఆక్షేపణ దార్లకు ఆయన తెల్పెను. వీరి అసహనం దేశమందు కన్పడు ఒక రోగచిహ్నం. వాటినిబట్టే విన్స్టన్ చర్చిల్ ఈ దేశంపై ఆక్రోశ పడ్డాడు. ఆయన ఉపన్యాసంలోని ముఖ్యాంశములు (1) ఇప్పటి భయంకరహత్యాకాండ ఆయనకు ఆశ్చర్యం కొలుపుట లేదట. (2) ఇది ఈ హత్యలకు అంకురార్పణయే. అత్యున్నత సంస్కృతి కలిగి, ఆంగ్లేయుల శాంతమైన ఉదారమైన నిష్పక్షపాతమైన పరి పాలనక్రింద తరతరాలుగా శాంతంగా జీవించుచున్న జాతులు, ఇప్పుడు నరమాంసభోక్తలకు ఉండే రక్తపిపాసతో ఒండొరులపై దూకుచున్నారు. (3) గత 60, 70 ఏళ్లనుండి లోకంలోకల్లా శాంతంగల భూభాగంలోని జనాభా బాగా తగ్గిపోతుంది. నాగర కత వెనుకాడుతుంది. ఆశియా కని విని ఎరుగని విషాధగాధ వెలువడుతుంది.

చర్చిల్ గొప్పవాడు. ఆంగ్లేయప్రభువుల వంశములోనివాడు. వారివంశం ఆంగ్లచరిత్రలో ప్రసిద్ధి కెక్కింది. 2 వ ప్రపంచ యుద్ధం వచ్చినపుడు ఆయన ఆంగ్లరాజ్యాంగమును నడిపించి, విచ్ఛిత్తి గాకుండ కాపాడెను. అమెరికా మొదలగు స్నేహితులను ఆంగ్లదేశంవైపు త్రిప్పింది ఆయనయే. కాని యుద్ధానంతరం వచ్చిన ఎన్నికలలో ఆయనను ఓడించి, కార్మికమంత్రివర్గం ఏర్పడ్డది. ప్రాణహాని, ఆస్తినష్టం పొందిన ఆ దేశాన్ని రక్షించుకొనుటకు ఆ ప్రజ చర్చిల్‌ను వైదొలగమనిరి. ఆ మంత్రివర్గం ధైర్యంగా సామ్రాజ్యాన్ని విచ్ఛిత్తి చేసి, భారతానికి, పాకిస్తాన్‌కు స్వాతంత్ర్యం ఇచ్చెను. ఇప్పుడు వారిది కంటికగుపడని హృదయసామ్రాజ్యం. మరింత తేజోవంతమైన దిది. ఆ సత్కార్యంలో చర్చిల్, కన్సర్వేటివ్‌లు మొదలగు రాజకీయకక్షులన్నీ పాల్గొన్నవి. ఆ మార్పుకు అప్పుడు సమ్మతించిన చర్చిల్, ఇప్పుడాపనిని తూలనాడరాదు. ఆంగ్లేయులు చేసిన అధికారత్యాగంతో పోల్చదగినది ఆధునికచరిత్రలో అగుపడదు. సత్పురుషుడు అశోకుడు చేసిన అధికారత్యాగం నిరుపమానమైంది. కాని అది పూర్వకాలంనాటి చరిత్ర.

చర్చిల్ ఉపన్యాసమునుగూర్చినవార్తలో తప్పులు లేవని ఆయన ఆశించెను. ఆయన సంభాషణవలన ఆయన జాతికి అపకృతి కల్గెను. ఆంగ్లేయులు విరమించినపిమ్మట, భారతీయులకు ఇలాటి దురదృష్టం పట్టునని ఆయన ఊహించియుంటే ఆదోషం యొక్క బాధ్యత "అత్యున్నతసంస్కృతిగల" దేశీయులపై

గాక సామ్రాజ్యస్థాపకులగు ఆంగ్లేయులపైననే పడునని అతడు ఆలోచింపలేకపోయెనే! చర్చిల్ వేగిరపాటుచేత అలా మాట్లాడియుండును. కోట్లకొలది జనాభాలో ఏకొద్దిలక్షలమందో క్రూరరాక్షసకృత్యములు చేస్తే ఆ పాపాన్ని దేశానికంతకు ఆపాదింపరాదు. చర్చిల్ ఇక్కడికి వచ్చి, నిష్పక్షపాతంగా విచారించుకోవాలని గాంధీజీ కోరెను. పార్టీ రాజకీయాలకు అతీతమైన ధర్మాన్ని మనస్సులో పెట్టుకుని, ఆంగ్లేయుల ఔదార్యాన్ని పెంపొందించుదృష్టితో ఆయన ఇక్కడికి రావలెను. భారతాన్ని విభజించుటవల్లనే, ఒండొరులతో పోట్లాడుకొమ్మని ఇద్దరను అనుద్దేశ్యంగా ఆహ్వానించినట్లైంది. సమానహోదాగల రెండు రాజ్యాలు సృజించటం తప్పు. విషయపరిజ్ఞానం కలిగించుకోకుండా, తన కామన్‌వెల్తులోని భాగస్వాములను చర్చిల్ ఖండించినాడు. చర్చిల్ దుర్భాషలకు అవకాశ మిచ్చింది మీరేనని ఆయన సభికులకు తెల్పెను. ఇప్పటికైనా భారతీయపౌరులు తప్పుత్రోవనుండి తప్పుకొని ఒప్పైనమార్గం పట్టవచ్చును. కాలము మించిపోలేదు.

తనది అరణ్యరోదనమని గాంధీజీకి తెలుసును. స్వాతంత్ర్య సంభాషణలు ఆరంభం కాకపూర్వం, ఆయన వాక్కుకుండే పటిమయే ఉంటే ఈరాక్షసిగోల జరిగేదికాదు. చర్చిల్ అతిశయోక్తులతో పలికిన వైపరీత్యానికి చోటు ఉండేదికాదు. ఈపాటికి ఆర్థికం మొదలగు సమస్యలు, కొంతవరకైనా పరిష్కారం అయ్యేవి.

# 18

29-9-47

## భ్రాతృహత్యల ఫలితం

పత్రికావిలేఖరులు లండన్‌కు ఏమివార్తలు పంపారోగాని, యుద్ధాన్నిగురించిన నా ప్రసంగం అక్కడ హడల్ పుట్టించిందట. వార్తాసంగ్రహాలు అపాయకరములు. వక్త భావాన్ని సరిగా తెలుపనపుడు, మరింత చిక్కు కలుగుతుంది.

1896 లో దక్షిణాఫ్రికానుగూర్చి నే వ్రాసిన కరపత్రమును, అక్రమంగా సంగ్రహపఱుపబట్టి, నాకు ప్రాణసంకటం ఏర్పడ్డది. నన్ను దక్షిణాఫ్రికాలో చంప ప్రయత్నంచేసిన 24 గంటలలోపల ఆ కరపత్రసంగ్రహం అచ్చు తప్పులతడికె అని తెలుసుకొని నిరపరాధిని నిర్దోషిని యగు నన్ను చంపపూనుకున్న వారు ఆ కోపమును విడిచి పశ్చాత్తాపపడసాగిరి. తాను చెప్పని, వ్రాయని సంగతులకు తనమీద బాధ్యత పెట్టరాదు. యుద్ధం పేరు ఎత్తడమే తప్పైతేతప్పు, నేను చెప్పిన ఏవాక్యంవల్లను పాకిస్తాన్ భారతములమధ్య యుద్ధాన్ని పురికొల్పలేదు. ఆమోదించలేదు. పిల్లవాడైనాసరే పాముపేరు ఎత్తితే, ఆ ఇంట్లో పాము కనుబడుతుందని మనలో ఒక వెర్రినమ్మకము ఉన్నది. యుద్ధాన్నిగూర్చి అట్టి పిచ్చినమ్మకం లేదనుకుంటాను. ప్రస్తుత పరిస్థితులను పరిశీలనచేసి, నిజమైన యుద్ధకారణం ఎప్పుడు వస్తుందో తెల్పుటచేత, నే నీ రెండుదేశాలకు మేలు చేసినవాడ

నైనాను. యుద్ధం నివారించుటే నా యుద్దేశ్యం. బుద్ధిలేని హత్యలు, దోపిళ్ళు, గృహదహనాలను ప్రజలు సాగించితే, వాటివల్లనే ప్రభుత్వాలు యుద్ధానికి దిగవలసివస్తుంది. ఫలాని కారణాలవల్ల ఫలానికార్యాలు కలుగునని బహిరంగంగా చెప్పాట తప్పా!

యుద్ధంలోకి పరిణమించే భ్రాతృహత్యలను నివారించుటకే, నా శక్తి అంతా ఉపయోగపడుచున్నదని భారతానికి తెలుసును. ప్రపంచంకూడ ఆ సంగతి తెలుసుకోవాలి. మానవ కార్యకలాపాలను నడుపవలసినది అహింసయే యని శపథము చేసిన మానవుడు యుద్ధం పేరెత్తితే, అది దానిని ఆపుటకే. ఇది నా ప్రధానసిద్ధాంతం. చచ్చేదాకాకూడా, దీనినుండి ఎన్నడు వైదొలగను.

## 19

30—9—47

### సర్కారు కర్తవ్యం

ఆరోజు తనను చూడవచ్చిన మియన్‌వాలీకాపురస్థులు వెనుక మిగిలిపోయిన స్నేహితులనుగూర్చి ఆదుర్దాపడిరి. పాకిస్తాన్‌లోని వివిధప్రదేశములలో వేలకు వేలు జనం వెనుక నిలిచిపోయారు. వారిని బలవంతంగా ముస్లింమతంలోకిచేర్చెదరో, చంపెదరో, అన్నం పెట్టక మాడ్చెదరో, లేక స్త్రీలను అపహరింతురో, అని వారు భయపడసాగిరి. అన్నిచోట్లనుంచి ఇదే

ఫిర్యాదు వచ్చెను. అట్టివారిని రక్షించుట ఇండియాసర్కారు వారి కర్తవ్యం. అలా చేయజాలనపుడు, ఆ సర్కారు రాజీ నామా ఇవ్వవలయును.

పాకిస్తాన్‌లో అల్పసంఖ్యాకులను రెండువిధాల రక్షించ వచ్చును. అచ్చటి హిందువులును సిక్కులును భారతసమ్మేళనం వైపు కన్నెత్తిచూడకుండా, జిన్నాయు ఆయనమంత్రులును తమను రక్షిస్తారనే విశ్వాసం కలుగునట్లుగా ఆ సర్కార్ ప్రవ ర్తించవలెను. ఖాళీఅయిన ఆస్తులను తిరిగివచ్చే శరణార్థులకై నిలువ ఉంచాలి. ఎవరిమతంమీాదా దాడి చేయరాదు. అక్కడ గాని ఇక్కడగాని ఏమతానికిచెందిన చిన్నపిల్లఅయినా సరే, నిర్భ యంగా తిరిగేటట్లు ఏర్పాట్లు చేయవలెను. క్రమశిక్షణలేని ప్రజ ఏలాభం పొందజాలదు. ప్రజాస్వామ్యంలో ప్రజలే ప్రభుత్వాన్ని నిలబెట్టగలరు; పడగొట్టగలరు.

## వ్యక్తిశక్తి

ఎవరికి విసుకువచ్చినాసరే, ఆయన ఈ సంగతి చెప్పక తప్పదు. ఎవడిమతాన్ని వాడే కాపాడుకోవాలి. చిన్నపిల్లలకు కూడా ఆసంగతి బోధించి మతరక్షణకై ప్రాణత్యాగం చేసేశక్తి కల్పించవలెను. 12 వ ఏటనేగదా ప్రహ్లాదుడు తనతండ్రికి వ్యతిరే కంగా నిలువబడి తనమతాన్ని కాపాడినాడు! ప్రతిమతములో ఇటువంటి వీరనిదర్శనా లున్నవి. గాంధీజీ తన బిడ్డలకు ఈలాంటి విద్యయే చెప్పెను. స్త్రీలను అబలలనుట తప్పు. గట్టివిశ్వాసంగల

స్త్రీ ఏ తుంటరులనూజూచి భయపడరాదు. సర్కారు స్త్రీలకు రక్షణ ఇవ్వవలసినదే. అలా వారు చేయకపోతే, వీరు మతం మార్పుకు ఒప్పుకుంటారా ఏమి ?

## భారతీయముస్లింలు

ఇచ్చటి ముస్లింలమీద హంగామా చేస్తున్నారే! వీరెవరో విచారించారా ? వీరిలో ఏ కొద్దిమందో విదేశంనుండి వచ్చినవారు. తక్కిన కోటానుకోట్లు హిందూమతం వదలి ఇస్లాం మతం స్వీకరించారు. అస్పృశ్యులు, శూద్రులు విచక్షణజ్ఞానంతో గాక, హిందూమతంలోని బాధలనుండి తప్పించుకొనుటకుగాను ఇస్లాం పుచ్చుకొన్నారు. మీ బాధవల్లనే వాళ్ళను అందులోనికి మీరే తోలినారు. ఆ బాధ్యత మీదే. అట్టి మీ సోదర సోదరీలను చంపుట భావ్యం కానేరదు.

# 20

1—10—1947

## సేవారంగం అపరిమితము

ఆ క్రిందటిరోజు ఒక సోదరి నాకొకచీటీ ఇచ్చింది. తానూ తనభర్త సేవచేయ ఆతురపడుచున్నామనియు, కాని ఏమిచేయవలెనో ఎవరును చెప్పలేదనియు ఆమె సూచించింది. అలాంటి ఫిర్యాదులు చాలా వచ్చినవి. అందరికీ ఒకేజవాబు ఆయన చెప్పదలంచెను. అధికారక్షేత్రం పరిమితమైనది. సేవారంగం భూమివలె అపరిమితమైనది. ఎందరికైనా పని కలుగును.

అసలే, ఢిల్లీనగరం అపరిశుభ్రం. ఈ శరణార్థులరాకతో, అసహ్య మైనది. శరణార్థుల శిబిరాలు మరింత పాడుగానున్నవి. అటు శిబిరాలవద్ద కాకపోయినా, తమ ఇండ్ల చుట్టుప్రక్కనైనా బాగుచేయవచ్చును. ఇంకొకరి ఆజ్ఞకొరకు ఆగియుండరాదు. ఈ పనివల్ల మంచిఫలితం కలుగును. శారీరక మానసిక ఆధ్యాత్మిక పరిశుభ్రతను పెంపొందింపవచ్చును.

బాబా బచ్చితర్‌సింగ్ పిలిచిన ఢిల్లీపౌరప్రముఖుల సభకు నెహ్రూ రాలేకపోయెను. కాన గాంధీగారే మాటలాడవలెనని బాబా కోరెను. ప్రశ్నలు అడుగండి, జవాబుచెప్తానని ఆయన సూచించగా, ఎవరో ఒకరు లేచి దీర్ఘమైన సంభాషణ చేసెను. దానిసారం ఏమన, ఢిల్లీలోనుండి ముస్లింలు యూనియన్‌యందు భక్తి కలిగియుండి, ఫైఫ్త్ కాలమ్ లేకుండా, తమవద్దనున్న ఆయుధాలను, మందుగుండున్న సర్కారుకు స్వాధీనపరిస్తే ఢిల్లీపౌరులు ముస్లింలయెడ స్నేహంగా ప్రవర్తించగలరు. ఆ రెంటికి గాంధీజీ సమ్మతించెను. వాటికి మరియొకషరతు ఆయన కల్పెను. ఈ షరతుల అమలుజరుపు బాధ్యతను సర్కారుకు వదలవలెనని ఆయన సలహా ఇచ్చెను.

## వ్యక్తిగత ప్రతీకారం వ్యర్థం

పురానాఖిల్లావద్ద 50000 లున్నూ, హుమాయూన్‌గోరీ వద్ద మరికొన్ని వేలున్నూ ముస్లింశరణార్థు లుండిరి. పాకిస్తాన్‌లోని హిందువులు, సిక్కులు పడే బాధలను ఏకరువుపెట్టి, ఇచటి

శరణార్థులు అనుభవించే బాధలను సమర్థించరాదు. హిందువులు, సిక్కులు పడ్డ బాధలకు తగిన పరిహారము కల్పించేబాధ్యత భారత సర్కారుకు వదలవలెను. లాహోరులో మంచి మంచి విద్యా సంస్థలు, వైద్యసంస్థలు కలవు. ఇవన్నీ వ్యక్తిగతధర్మములచే నేర్పడినవే. ఈసంస్థలను వీటి ధర్మాదాయములను ఖామందులకు వాపసు చేయవలసినదే. ఇంకొకరు చేసిన చెడుగుల ననుసరించుట వల్ల న్యాయం కలుగబోదు. ఇద్దరు గుర్రపుస్వారికి పోయినప్పుడు, ఒకరు పడ్డాడనేకారణముచేత, రెండోవాడుకూడా పడితే ఇద్దరి ఎముకలు విరుగుతవి. ఇక్కడుండే ముస్లింలు దేశభక్తి లేనివారైతే, ఆయుధాలను ఒప్పగించకపోతే, నిరపరాధులను చంపుటకు అది కారణ మగునా? ఈ రెండురాజ్యాలలో జరిగే ఘోరకృత్యాలవల్ల భారతదేశప్రఖ్యాతి అడుగంటుచున్నది. స్వాతంత్ర్య నాశనం, మతవినాశనం తప్పక కలుగును. కాని భారతదేశపు స్వాతంత్ర్యంకొరకు ప్రాణార్పణ చేసిన గాంధీ ఈ విధ్వంసం చూడనొల్లడు. ఈ మంటలను చల్లార్చవలె లేదా వాటిలో మాడిపోవలె. ఆయనకు ఇంకొకత్రోవ లేదు.

## విదేశీముస్లింలు ఇచ్చిన తంతెలు

ఇప్పటి భ్రాతృహత్యాకాండ తాత్కాలికమే యనియు, త్వరలో ఈ పిచ్చి పోయి పూర్వపు మంచిస్థితి వచ్చుననియు, అమ్మాన్ దేశంనుండియు, మధ్యప్రాచ్యములనుండియు, వచ్చిన ముస్లిముల తంతెలనుగూర్చి ఆయన చెప్పెను. పక్కగ్రామము

నుండి అల్లరిమూక వచ్చి ఢిల్లీ ఆస్పత్రిపై దాడి సలిపి, నలుగురు రోగులను చంపి, మరికొందరిని గాయపఱచినారట. ఇది ఎంత అనర్థమైన పిరికిపని!

నయినీనుంచి అలహాబాద్ వచ్చే రయిలులో నుండి, కొందరుముస్లింలను క్రిందికి పడవేసినారట. ఇవి ఎంత అవమానకరమైన పనులు! ప్రతిభారతీయుడు తలలు వంచుకోక తప్పదు.

# 21

2-10-47

## సిక్కుగురువుల సందేశం

బాబా సర్దార్ కరల్‌సింగ్ కార్యదర్శి సర్దార్ సంతోల్ సింగ్ ఆరోజున గాంధీజీతో మాటలాడుతూ గురువు అర్జునదేవ్ చెప్పిన భావాన్నే గురుగోవిందసింగ్ ధృవపఱచెనని తెల్పెను. ముస్లింలనుచంపమని గురుగోవిందసింగ్ తన అనుచరులకు బోధించెనని సిక్కులలో కొందఱును, ఇతరులలో అనేకులును తప్పుగా తలచియున్నారు. ఎక్కడ, ఎలా, ఏ పేరుతో మానవుడు దేవుని పూజించినా దేవుడు అందరికి సమానుడేయని పదవగురువు స్పష్టపఱచెను. మానవుడుకూడ ఆ దివ్యజాతివాడే. మానవుల రూపురేఖలలో భాషాభావములలో భేదముండవచ్చును గాని అందరు ఒక మూసలోనివారే. ఒకేగుండె కలవారే. చచ్చి మట్టి అయ్యేవారే. గాలి, ఎండ అందరికి సమానమే. తననీళ్లు త్రాగవద్దని గంగ ముస్లింల నిషేధించునా? మేఘాలు అందరిపై వాన కురి

యును. పతితుడైన మానవుడే పరస్పరభేదాలు కల్పించును. సిక్కుగురువుల, ఇతరమతకర్తల భావాలు తెలిసినవారు భారతం అచ్చంగా హిందూరాజ్యం కావలెనని చెప్పలేదు.

## కృపాణము యొక్క సరియైన యుపయోగం.

సిక్కులు అహింసావాదులు కారు. గురుగోవింద్ సింగ్ కాలములోని ముస్లింలు మతభ్రష్టులైనందున వారితో పోరాడ మని తన అనుచరులను ఆయన ఆజ్ఞాపించెను. సిక్కు ధరించిన కృపాణము నిరపరాధుల రక్షణకొరకు; క్రూరప్రభువులపై విజృంభించుటకొరకు ఉద్దేశింపబడింది. కాని నిరపరాధులను, పిల్లలను, ముదుసళ్ళను, వికలాంగులను చంపుటకు గాదు. ముస్లింలతో చేసే యుద్ధాలలోకూడా ఉభయపక్షాలలోని క్షతగాత్రులకు సిక్కులు సేవచేయవలసిందే. కాని ఇప్పుడా కృపాణమును దురుపయోగం చేస్తున్నారు. అట్టివారు దాన్ని ధరించరాదు.

## జన్మదిన అభినందనాలు

దినమంతా స్వదేశవిదేశాలనుండి తంతులు వచ్చినవి. మౌంటుబాటెన్ సతి, విదేశీరాయబార ప్రతినిధులు, స్నేహితులు వచ్చారు. శరణార్థులుకూడ పూలు పంపారు. కొందరు డబ్బు పంపారు. మరికొందరు ఆశీస్సులు పంపారు. ఇవన్నీ అభినందనాల వలె ఆయనకు తోచలేదు. దుఃఖోపశమనపు సందేశాలవలె ఇవి తోచెను. ఆయన హృదయంలో ఆవేదనతప్ప మరేమీ లేదు. పూర్వమొకపుడు ప్రజానీకం తనమాట వినేది. కాని ఇపుడు

ఆయనమాట వినేవారు లేరు. భారత సమ్మేళనంలో ఇపుడు ముస్లింలు ఉండరాదంటారు. రేపు పార్శీలు, క్రైస్తవులు, ఐరోపీయనులు ఉండరాదనవచ్చును. 125 ఏళ్ళు బ్రతుకమని కొందరు ఆశించారు. ఆయన కా కోరిక ఇపుడులేదు. ద్వేషము, హత్యలు ఉధృతమగుచుండగా ఆయనకు ఊపిరి ఆడదు. ఈ వైరితనము మానుకొనమని ఆయన వేడుకొనెను. తమ హృదయాలనుండి ద్వేషాన్ని తొలివెయ్యాలి. పాకిస్తాన్ పడినగోతిలో తాను పడరాదు. వ్యక్తిగతంగా కసి తీర్చుకోరాదు. అందరికి అరిష్టమే అది.

## 22

3-10-47

### అందరు సమానంగా నేరస్తులే

అభినందనతంతెలు అమితముగా వస్తున్నందున ప్రతివారికి జవాబు ఇచ్చుట దుస్సాధ్యము. అనేకమంది, అందులో కొందరుముస్లిములుకూడా, శుభోదర్కమైన సందేశాలుపంపారు. వాటిని ప్రచురించమన్నారు మిత్రులు. కాని ఇది సమయం కాదు. అహింసాసత్యములయందు ప్రజాళికి ఇప్పుడు నమ్మకము లేదు. ఏమతమువారైనాసరే, చెడుగు చేయువారు సమానంగా నేరస్థులే.

### సత్యాగ్రహమా, దురాగ్రహమా?

అనేకచోట్ల సత్యాగ్రహము సాగుచున్నదని వార్తలు వచ్చుచున్నవి. అవి దురాగ్రహములు కావుగదా? మరలలో,

రైల్వేలలో, తపాలాకచ్చేరీలలో, కొన్ని ప్రాదేశికరాజ్యాలలో జరిగే సమ్మెలు అధికారఆక్రమణకొరకు చేసే ప్రయత్నాలు. ఇప్పుడు ఒక ఘూరమైన నిషా సమాజాన్ని వణికించుచున్నది. సాధన, సిద్ధి ఒకటేనని నమ్మనివారు, తమ ఉద్దేశ్య నిర్వహణాకై ఈ అవకాశం తీసుకుంటున్నారు.

## మంచిపని దాని కదే ఆశీర్వాదము

తాముచేసే పనులను, తాముసాగించే ఉద్యమాలను, ఆశీర్వదించమని కోరే జాబులు వచ్చుచున్నవి. ప్రతి మంచిపనిలోను దానిని బలపఱచే ఆశీర్వాదఅంకురములు అందులోనే ఇమిడియున్నవి. పరాయివారి వాక్సహాయం వారి కక్కరలేదు. మంచిపని చేస్తుండే మంచివాడు ఈ సూత్రం వెంటనే గ్రహిస్తాడు. సత్యం ఎల్లపుడు స్వయంప్రకాశం. ఎన్ని చిక్కులు కలిగినా, ఆ సత్యాన్ని అనుసరించడం ప్రజల కర్తవ్యం. సత్యాగ్రహం చేసేవారు హృదయమథనం చేసికొని తాము సత్యమునకై పెనగులాడుచున్నారా లేదా యని చూసుకోవలెను. లేనిచో, అది ఎగతాళిపని అగును. నిజంగా తనకు హక్కులేనిదానికై తగువుపెట్టేవాడు అహింసను అవలంబింపజాలడు. అది లేనిదే అతనికి సత్యము గోచరింప జాలదు.

## శరణార్థుల శిబిరాల పారిశుద్ధ్యం

ఆ యా శిబిరాలలోను ఢిల్లీనగరంలోను ఉండే అపరిశుభ్రతనుగూర్చి అయన చెప్పెను. పాకీపని తనకై మరొకడు చేయవలయునని ప్రతివాడు కోరును. ఈ అస్పృశ్యత హిందూమతా

నికి పెద్దకళంకము. అది పోవాలంటే ప్రతివాడు పాకీపని చేయ వలెను; భంగీ కావలెను. అది చెడుపని గాదు. మురికిని పోగొట్టే పని. కనీసం తన ఇంటి చుట్టుప్రక్కల తాను బాగుచేసుకుంటే ఢిల్లీ అందమైననగరము ఔతుంది. ఇంకా మంచిఫలితాలు కలుగతవి. తానే శిబిరాలు నడిపితే, ఇలాంటిపనులన్నీ శరణార్థులు చేసుకొనునట్లు వారిని తాను మార్చగలుగును. చీట్లనో, జూదమునో ఆడుచూ పోమరిగానుండి తిండితినుట అవినీతి. వడుకు, నేత, కుట్టు, వడ్రంగం, వ్యవసాయం మొదలగువాటిలో ఏదో ఒకటి నేర్చుకుని తమకాళ్ళమీద తాము నిలడాలి. ఇతరులపై ఆధారపడరాదు. ఇప్పటిబాధలుకూడా కొంతవరకు మఱచిపోతారు. కష్టాలనుగూర్చి కన్నీరు కార్చుచూ కూర్చుండుటకన్న అపకారికి ఉపకారము చేయుట మంచిది.

## ఒక ఫ్రెంచివాని సలహా

125 ఏండ్లు బ్రతికి ఇప్పుడు సాగించుచున్న పనిని పూర్తి చేయమని గాంధీజీకి ఆ స్నేహితుడు చెప్పెను. ప్రతిదానికి దైవంమీద బాధ్యత యుంటే, కీడులోనుంచి మే లాయన కలిగించును. గాంధీజీ కృంగి కృశించరాదని ఆయన సలహాఇచ్చెను. ఇతరుల మంచిమాటలవలన తన్నుదా మోసగించుకొన తలంచుకొనలేదు. ఇదివరకు చేసిన మంచిని అందరు మఱువవలెను. గతకాలపు ప్రతిష్ఠమీద ఆధారపడక, వర్తమానకాలములో ప్రజాసేవ చేయకలిగితేనే, బ్రతకాలని కోరుకోవలెను. ప్రజలు

తమతప్పును తెలుసుకొని, తనమాటను వింటే, అప్పు డాయన బ్రతుకకోరును. తనచే మరింత సేవచేయించాలని దైవానికుంటే ఆయన తనను బ్రతికించును. లేదా తొలగించుట ఉత్తమము.

# 23

4-10-47

## గొంగళ్ళకొరకు విజ్ఞప్తి

తనయెదుట కూర్చున్న డాక్టరు సుశీలనయ్యర్ శరణార్థులకు, హిందువులకు, ముస్లింలకు సమముగా సేవచేయుచున్నది. పురాణఖిల్లాలో రోజూ నాలుగుగంటలు గడుపుచున్నది. ఆ క్రిందటిరోజు రెడ్‌క్రాసుదళముతాలూకు డాక్టరు పండిట్‌తోను, మిత్రసేవాదళముతాలూకు హోరెస్ ఎలెగ్జాండర్, రిచ్చర్డుసైమండ్సులతోను, కలిసి ఆమె కురుక్షేత్రశిబిరం చూచింది. అచ్చటి జనం ఇప్పుడు యిరువదిఅయిదువేలు రోజూ పెరుగుచున్నారు. రోజూ వేసే గుడారాలు చాలుటలేదు. చావకుండా నిలిపేతిండి వాళ్ళకు ఇస్తున్నారు. అప్పుడే రోగాలు వస్తున్నవి. ఇరుపక్షాలలో ఎక్కడైనా బుద్ధికలిగి ఉంటే ఇంతబాధ కలిగేదికాదు. పగతీర్చుకోవాలనే అవేశంవలన బాధపడే జనులసంఖ్య పెరుగుచున్నది.

ఘోరకృత్యాలు చేయుటలో హిందువులు ముస్లింలు ఒకరినొకరు పోటీపడుచున్నారు. స్త్రీలను, బిడ్డలను, సిన్న తనుగుద్దలను అందరిని వేధిస్తున్నారు. "భారతస్వాతంత్ర్యానికి వలె కష్టించాను. రామరాజ్యం ఏర్పడుచేవరకు 125 ఏండ్లు

బ్రతుకుదా మనుకున్నాను. ఇప్పటి విషాదమును చూస్తూ ఊర కుండలేను. దైవానుగ్రహమువల్ల మీతప్పులు తెలుసుకొని సవరించుకోండి. లేదా దైవం నన్ను ఈ లోకంనుండి తొలగించుగాక! ఒకప్పుడు మీరు నన్ను ప్రేమించారు. నామాటవిన్నారు. అనుసరించారు. మొదటిది పోలేదేమో గాని, తక్కిన రెండూ పోయినవి. బానిసలుగా ఉన్నంతవరకేనా నాతో ప్రయోజనము? స్వతంత్రభారతంలో నాతో పనిలేదా? స్వాతంత్ర్యమంటే—మానవత్వానికి నాగరికతకు స్వస్తి చెప్పుటేనా?"

### ఇప్పుడు చలికాలం వస్తున్నది

ఢిల్లీలో పంజాబులో చలి హెచ్చు. గొంగళ్లు రజాయీలు, ముతకదుప్పట్లు ఇవ్వండి. హిందువులు ముస్లింలు ఈ దానాలలో పాల్గొనవచ్చును. ఏదీ ఏసంఘానికీ ప్రత్యేకించవద్దు. సర్కారు ఈపని చేయలేదు. రేపటినుండి ఈదానాలు రావలెను. భారతప్రజానీకం ఈ దురదృష్టులకు తోడ్పడవలెను.

## 24

5-10-47

### తన జబ్బు

దీనినిగూర్చి మరల ఎవరో పత్రికలలో వ్రాశారు. కొంచెం దగ్గు జ్వరం వచ్చింది. దాని ప్రకటనవల్ల తనకుగాని, ఇతరులకుగాని లాభము లేదు. కొందరికి అనవసరముగా ఆదుర్దా కలుగును. ఇకముందు దీనినిగూర్చి పత్రికలలో వ్రాయరాదు.

## గోంగళ్ళు

ఇద్దరు రెండు పంపారు. ఒకరు పది పంపారు. సిక్కులు హిందువులు ముస్లిములపై తిరిగి దెబ్బ కొట్టకపోతే, మీరు కూడా బ్రతికేవారు కారని ఎవరో నాకు తంతి పంపారు. అది మతిభ్రష్టమైన సూచన. తనజీవితం దేవుని అధీనంలో ఉంది. ఆయన అనుమతి లేనిది, ఎవరును తన్ను చంపజాలరు. ఏ మానవుడు తన్నుగాని ఇతరులనుగాని కాపాడజాలడు. నూరుమంది ముస్లింలలో 98 మంది ద్రోహులని ఆ తంతి చెప్పేసంగతి నమ్మజాలను. గ్రామాలలో ఉండే ముస్లింలు ద్రోహులు కాజాలరు. వారు ద్రోహులయినచో, ఇస్లాంను నశింపజేస్తారు. హిందూ ముస్లింలు ఒకరితోనొకరు పోట్లాడుతుంటే, యుద్ధం తప్పదు. రెండురాజ్యాలు నశిస్తాయి. రక్షణ కోరినవారిని సర్కారు కాపాడవలెను. చివరకు ఎవరిమతాన్ని వారే కాపాడుకోవలెను.

## మరల చర్చిల్

సామ్రాజ్యవిచ్ఛిత్తి చేసి ఇండియాప్రజలకు బాధలు కల్పించారని చర్చిల్ లేబరుమంత్రివర్గాన్ని తిట్టాడు. బర్మాకు కూడా ఇదేగతి పడుతుందన్నారు. తన జాతికన్న తనపార్టీని హెచ్చుగా అభిమానించాడు. ఇండియాలోని లక్షలగ్రామాలకు ఈ గంగనవెర్రి ఎత్తలేదే? ఎత్తినను, భారతదేశమును బానిసత్వంలో పడవేసియుంచుటకు అది తగినకారణమా? స్వాతంత్ర్యం పొందే హక్కు మంచివాళ్ళకేనా ఉన్నది? త్రాగుడులేని బాని

సత్వాంకంటె త్రాగుడుడున్న స్వాతంత్ర్యం మేలు అనిన్నీ, స్వపరి పాలనలో దుష్పరిపాలనకు హక్కు కలదనిన్నీ, సుపరిపాలన మైనను స్వపరిపాలనకు సరిపోదనిన్నీ, ఆంగ్లేయులే మనకు నేర్ప లేదా? సోషలిజం అంటే, చర్చిల్ కు గిట్టదు. లేబరు సోషలిష్టు గాక తప్పదు. వివేకంతో ఆచరింపతగిన మహాసిద్ధాంత మది. ఇంగ్లండులో లేబరుమంత్రివర్గం ఏర్పడినదంటే, అది సోషలిజం యొక్క విజయమే. సిద్ధాంతంలో లోటు లేదు; కార్యకర్తలలో లోపాలు ఉండవచ్చును. లేబరు తనశక్తిని హోదాను తెలుసు కుంటే, ఇతరపార్టీల నన్నిటిని అది అణచగలదు అనే చాలా ఏండ్లనుండి నా భావము. ఇప్పుడు అందరిపార్టీల సమ్మతితోనే, ఆంగ్లాధికారమును ఇండియానుండి లేబరు ఉపసంహరించింది. వచ్చే ఎన్నికలలో చర్చిల్ గెలిచినా, లేబరు సమకూర్చిన స్వాతంత్ర్యాన్ని చంపి భారతాన్ని మరొకసారి బానిసత్వంలో పడవేయగలడా? భారతీయులందఱు మనుష్య శరీరములతో కోటను గట్టి దాన్ని నిరోధింతురు. బర్మాను కాజేసిన విధము, ఇండియాను లోబఱుచుకొన్న విధం, చర్చిల్ జ్ఞాపకము ఉంచుకోవాలి. అవమానకరములు ఆ చేష్టలు. ఇప్పుడా చరిత్ర ఎత్తుకొనకుండుట మంచిది. మనం మనుజులవలెగాక అడివిమృగా లవలె వర్తిస్తే, కష్టించి ఆర్జించిన స్వరాజ్యం భ్రష్టమైపోతుంది. ఒంటరిగా భారతాన్ని రక్షించేబాధ్యత తనపై వేసుకొనుటకు తా నెవరు?

# 25

6—10—47

## ఆహార సమస్య

రాజేంద్రప్రసాద్ పిలుపుమీద, ఆహారవిషయం తెలిసిన వారు ఢిల్లీలో చేరారు. ఈ ముఖ్యవిషయంలో ఏదైనా తప్పు చేస్తే, కోటానుకోట్లప్రజ లనివార్యమగు ఆకలిమంటలకు లోనై చస్తారు. సహజంగా లేక కృత్రిమంగా వచ్చే కరువులవలన లక్షల కొలది జనం మాడటం, మరణించటం, మనం యెఱుగనిదికాదు. సరియైన సమాజంలో నీటిఎద్దడి, తిండికరువు, తప్పించటానికి ముందుగానే తగిన ఆలోచనలు చేయవలెను. ఆమాట అటు ఉంచి, ఇపుడు వచ్చిన ఆహారక్షామము తప్పించుకోగలమా అని యోచించవలెను.

## స్వయంసహాయం

స్వయంసహాయం, స్వావలంబనం నేర్చుకుంటే, మనం ఈ సమస్యను పరిష్కరింపగలము; ఈ పాఠం మనకు జీర్ణమైనచో విదేశాలమీద ఆధారపడటం, చివరకు మనం దివాలాతీయటం తప్పుతుంది. మనం 40 కోట్ల జనం. పెద్ద పెద్ద నదులు, రకరకాల భూసారం, తరగని పశుధనంగల పెద్దదేశం మనది. మన పశువులు తగినన్ని పాలు ఇవ్వనిచో, తప్పిదం మనదే. గడచిన కొన్ని వందల ఏండ్లనుండి ఉపేక్ష చేయక ఉండినచో, మనకేగాక లోకానికి గూడా కావలసినంత తిండి చూపేవారము. గడచిన యుద్ధం కలిగించిన కడగండ్లను తొలగించేవారము. ఇతరులు ఉచితంగా

ఆహారం ఇస్తే, కృతఘ్నులమై నిరాకరించమని నా అర్థం గాదు. మనం బిచ్చమెత్తరాదు. అపుడు మననీతి పాడగును. దేశం లోపల సరుకురవాణా కష్టాలు చాల ఉన్నవి. త్వరగా సరుకు కదల్చలేము; లోకంలో జనం పరిపూర్ణులు కారు. తిండికి పనికి రాని పదార్థాలు పంపించే అవకాశం లేకపోలేదు.

## పరాయిసహాయముయొక్క అర్థం

విదేశీసహాయంవలన మన అక్కరలలో మూడు శతాంశ ములు కలిసివచ్చునట. మనలోటు ఇంతే అయితే- దీనిని నిపు ణులు స్థిరపఱిచారు- పరాయిపంచకు పోనక్కరలేదు. పరాయి సహాయంవైపు మ్రొగ్గితిమా, మన అవకాశాలను ఉపయోగిం చక ఉపేక్షచేస్తాము. పనికివచ్చే ప్రతి అంగుళం భూమిలో, డబ్బు పంటలుగాక తిండిపంటలు వేయవలెను. బంజరుభూములను సాగు లోకి తేవలెను.

ఆహారసరుకుల కేంద్రీకరణం వినాశకరం. వికేంద్రీకరిస్తే, దొంగబజారులు చస్తవి. రవాణాకయ్యే కాలహరణం, ధన వ్యయం పోతవి. పప్పుదినుసులు కాయధాన్యాలు పండించే పల్లె టూరివాళ్ళకు, ఎలుకల వగైరానుంచి ఎలా కాపాడాలో తెలు సును. రవాణాలో ఈ ఎలుకలవలన నష్టం ఎక్కువ కలుగుతుంది. లక్షలకొలది రూపాయిలు, టన్నులకొలది ధాన్యాలు ధ్వంసం అయిపోతవి. ప్రతివాడు ఆహారం పండించే ఆవశ్యకత గుర్తిస్తే, కరువుసంగతి మఱచిపోతాము. ప్రతివ్యక్తి ఎలా సహాయపడు దురో, వివేకవంతులు యోజింతురుగాక.

## తఱుగును తగ్గించుట ఎలా ?

ప్రతిహిందువు ప్రతిఏకాదశినాడు ఒకపూటో రెండు పూటలో ఉపవాసంచేస్తే తరుగే ఉండదు. మలమలమాడే జనం కొఱకు ఉపవాసంచేయుట, ముస్లింలవర్గాలకును నిషిద్ధంకాదు. ఈ స్వల్పత్యాగంయొక్క సాఫల్యాన్ని తెలుసుకొంటే, విదేశీ సహాయం వదలుకున్నా నష్టం లేదు.

## రేషనింగ్ వలన కలిగే ప్రయోజనం అతిస్వల్పము.

ఉత్పత్తిదార్లజోలికి పోకపోతే, సంతలోకి మంచిసరుకు వస్తుంది. ఇప్పుడది దుర్లభము.

## ట్రూమన్ సలహా

అమెరికా ప్రజలు తక్కువ రొట్టె తిని, ఆ గింజలను ఐరోపాకు పంపమని అమెరికాఅధ్యక్షుడు ట్రూమన్ సలహా చెప్పాడు. ఈ త్యాగంవలన వారి ఆరోగ్యం చెడదన్నాడు. ప్రజాహితమైన ఈ సలహా ఇచ్చినందుకు గాంధీజీ ట్రూమన్నును అభినందించెను. లాభంకొఱకు ఆయన ఇలా చెప్పినాడనటం గాంధీజీ అంగీకరించలేదు. దైవము ఒక్కడే మానవ హృదయాలను తెలుసుకొనును. ఉద్దేశ్యాలనుబట్టిగాక బయటి కార్యముల వల్లనే మనుష్యులమంచిచెడ్డలు తేల్చవలెను. ఆకలిగొన్న ఐరోపా కొరకు అమెరికా త్యాగం చేస్తే మనవాళ్ళకొఱకు మనం చేయలేమా ? మనదేశానికి గౌరవంతెచ్చే స్వయంసహాయాన్ని ఉపయోగించుకొని, పిమ్మట చస్తే చచ్చెదముగాక.

# 26

7–10–47

## మరికొన్ని గొంగళ్ళకై విజ్ఞప్తి

మరికొన్ని గొంగళ్ళు వచ్చినవి. కాని ఈ దానాలు చాలవు. లక్షలకొలది ఇళ్ళులేని నిర్వాసులకు ఈ కొద్ది దానాలతో తోడ్పడజాలము. కొద్దికాలములో ఎక్కువ గొంగళ్లు వసూలు చెయ్యాలి.

## కాంగ్రెసుసిద్ధాంతానికి కట్టుబడి ఉండాలి

డెహరాడూన్ వద్ద ఒక ముస్లింను హత్యచేసినందుకు గాంధీజీ దుఃఖము పొందెను. ఆతని లోప మేమి ? ముస్లింగా ఉండుటేనా ? భారతంలోని ముస్లింలకు ఈ దేశం వదలిపొండని ఆయన చెప్పవలెనా ? వా ళ్ళెక్కడికి పోతారు ? రైళ్ళలో కూడా రక్షణ లేదే ? పాకిస్తాన్‌లో ముస్లిమేతరులు ఇలా బాధ పడుచున్న సంగతి నిజమే. రెండుతప్పులు కలసి ఒక ఒప్పు కానేరవు. ఇక్కడ ముస్లింలను కొట్టుటచే అక్కడి హిందువులను కాపాడజాలము. మీ మీ మతానికి, మీ కాంగ్రెసుసిద్ధాంతానికి అంటిపెట్టుకుని ఉండుడని ఆయన కోరెను. 60 ఏండ్లనుండి దేశానికి కాంగ్రెసువలన అపకారం రాలేదు. కాంగ్రెసుమంత్రులు తప్పు చేస్తే, వారిని తొలగించండి.

## ఆహారపుకంట్రోలు

తనసలహా అంగీకరిస్తే ఒక్కరోజులో ఆహారచిక్కు తీరునని ఆయన గట్టినమ్మకం. నిపుణులు తనమాట వింటారా ?

## మంత్రులకు హెచ్చరిక

ఆంగ్లేయులవలెనే ఇప్పటిమంత్రులు నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారని అనేకమంది చెప్పుచున్నారు. నిదర్శనాలు చూపుచున్నారు. మంత్రులతో ఈ విషయమై నేను చర్చించలేదు. దేనికి బ్రిటిష్‌వారిని నిందించామో, ఇప్పు డాపనులు జరుగరాదు. ఆర్డినెన్సులు చేయరాదు. న్యాయశాఖ, కార్యనిర్వహణశాఖ వేరు చేయవలెను. శాసనసభలే శాసననిర్మాతలుగా నుండవలెను. మంత్రులచర్యలు కోర్టువిచారణకు లోబడి యుండవలెను.

న్యాయవిచారణ చౌకగా త్వరగా న్యాయంగా జరుగవలెను. ఒక హైకోర్టు లక్షలకొలది ప్రజలకు ఉపకరింపజాలదు. పంచాయతీరాజ్యం ఏర్పడవలెను. పాతపద్ధతులలోకి జారవద్దని మంత్రులను ఆయన హెచ్చరించెను.

## రామరాజ్యంలోని రహస్యం

ప్రజలు తమ సర్కారునందు భక్తిశ్రద్ధలు కలిగి తమ సర్కారును బలిష్ఠం చేయవలెను. వారిని తొలగించే హక్కు వారికి ఉండనేఉంది. జవహరులాల్ నిజమైన రత్నమే. అచ్చహిందూరాజ్యం ఏర్పడుటకు ఆయన ఒప్పుకోడు. ముస్లింలకు మిత్రుడైన సర్దారూ ఒప్పుకోడు. గాంధీజీ సనాతనుడైనా, దక్షిణాఫ్రికానుండి ఆయనవెంట ఇమాంసాహెబు వచ్చాడు. సబర్మతీ ఆశ్రమంలో నున్నాడు. అచటనే చనిపోయాడు. అచ్చటనే ఉన్న అతనికూతురిని, అల్లుని వెళ్ళగొట్టవలయునా? అన్నిమతా

లను గౌరవించమని హిందూమతం బోధిస్తుంది. అదే రామరాజ్యములోని రహస్యం. పండిట్జీ వర్గాలు తప్పటడుగులు వేయుచో, వారిని తొలగించండి. వారుగాని మీరుగాని అంతరాత్మకు వ్యతిరేకంగా నడువరాదు. భారతం హిందువులదే అంటే వినాశం తప్పదు.

# 27

8-10-47

## డబ్బుకంటె గొంగళ్లు మేలు

ఇంకా కొన్నిగొంగళ్ళు వచ్చినవి. గొంగళ్లు ఇవ్వనా, డబ్బు ఇవ్వనా అని అడిగిన స్నేహితునకు, గొంగళ్ళే ఇమ్మని గాంధీజీ చెప్పెను. సభకు వచ్చుచుండగా ఒకరు ఇచ్చిన రు 500 లు ఆయన తీసుకొనెను. డబ్బుకన్న గొంగళ్ళే ఇచ్చుట మేలు.

## ధైర్యవంతుల అహింస

డేరాడూన్నుండి ఒక పెద్దమనిషి వస్తున్న రైలుగదిలో, హిందువులు, సిక్కులు క్రిక్కిరిసి యుండిరి. క్రొత్తగావచ్చిన బాటసారి యొకడు అనుమానానికి గురియై, తాను (చమార్) చెప్పులుకుట్టువాడ నని చెప్పెను. అతనిచేతిమీద పొడిచిన పచ్చ వల్ల అతను ముస్లిం అని గ్రహించి, వానిని కత్తితో పొడిచి, యమునానదిలో పడవేసిరి. ఆ డేరాడూన్ మానవుడు ఆదృశ్యం చూడలేకపోయెను. "మీ ప్రాణాలకు ఆపద కలిగినను సరియే, వాని ప్రాణం కాపాడుటకు మీ రెందుకు జోక్యం కల్పించుకో

లేదు ? మీ ప్రాణం పోతే, వాని ప్రాణం కాపాడేవారు. అది ధైర్యవంతుల అహింస అయ్యేది. దానివలన ఇతర బాటసారులు కూడా ధైర్యం వహించేవారు" అని గాంధీజీ చెప్పగా, తన కా విషయం తట్టలేదని ఆ వ్యక్తి ఒప్పుకొనెను.

బాటసార్లందరు అల్లరికే పూనుకొన్నపుడుకూడా, గాంధీజీ ఇదే సలహా ఇచ్చేవారు. ఆంగ్లేయులపై మనం ప్రయోగించింది ధైర్యవంతుల అహింస కాదని గాంధీజీకి ఇపుడు అర్థమైంది. అందువల్లనే దేశానికి ముప్పు వచ్చింది. శేషించిన తన జీవితకాలమును ధైర్యవంతుల అహింసను బోధించుటకు ఆయన ఉపయోగించును. అది కష్టమైన పనే కాని తప్పదు. పాకిస్తాన్ లోను, భారతంలోను, జరిగే పనులు తప్పులే; సమానమే; తేడా లేదు. ఇప్పుడు స్నేహం కుదరాలంటే, గతాన్ని మరవాలి. మాటలలో చేతలలో ప్రతీకారభావం పోతే, నిన్నటి శత్రువులు నేటి మిత్రులు అగుదురు.

## వార్తాపత్రికల కర్తవ్యం

వార్తాపత్రికలకు చాలా పలుకుబడి ఉంది. అబద్ధపు వార్తలు, ఉద్రేకం కలిగించే వార్తలు ప్రకటించరాదు.

రివారీలోని హిందువులపై, మీవోలు దాడిచేసినారన్న వార్త ఆయనకు బాధ కలిగించెను. మర్నాడే, అది అబద్ధమని తెలుపబడెను. తామిచ్చే వార్తలను, వాటి రూపురేఖలనుగూర్చి సంపాదకులు, సహాయసంపాదకులు మిక్కిలి జాగ్రత్తగా నుండ

వలెను. స్వతంత్రరాజ్యంలోని పత్రికలను, సర్కార్ అదుపులో నుంచలేదు. ప్రజలే వాటిని అదుపులో నుంచవలెను.

పోలీసులు, సేన కూడా సర్కారుకు ముఖ్యాంగములే. వాళ్ళు కలహప్రియులతో కలవరాదు. సాంఘిక దురహంకారానికి లోబడరాదు. తమకు ప్రాణసంకటమైనప్పటికీ, అల్పసంఖ్యాకులను వారు కాపాడితీరవలసిందే. ఈ ప్రధానధర్మమును వారు నిర్లక్ష్యం చేయరాదు. పాకిస్తాన్‌వారికికూడా ఇదేసూత్రం వర్తించును. వాళ్ళు విన్నా వినకపోయినా, వీళ్ళైనా లక్ష్యపెట్టవలెను.

నెత్తురు కార్చకుండా ఇండియా స్వరాజ్యం సంపాదించినందులకు లోకం ఆశ్చర్యపడుచున్నది. దాని కర్హులమని మన సక్రమప్రవర్తనవలన మనం ఋజువుచేయవలెను. స్వతంత్రదేశములోని పోలీసు, మిలిటరీ అవినీతికి లోబడరాదు. ప్రతిపౌరుడు సరిగా ప్రవర్తించకపోతే, స్వతంత్రప్రభుత్వాలు నిలువనేరవు. అహింసావ్రతము నాచరించమని నేను కోరుటలేదు. చట్టబద్ధమైన సక్రమప్రవర్తన కావలెనంటున్నాను. నా మాటలు విననిచో పిమ్మట పరితాపం పొందకతప్పదు.

## 28

9—10—47

### త్వరగా గొంగళ్లు ఇవ్వండి

ఆనాడు 30 గొంగళ్లు వచ్చినవి. అక్టోబరు మధ్యనుండి ఢిల్లీలో చలిఅధికం. కాన త్వరగా ఇవ్వాలి. సకాలంలో చేయని దానధర్మాలవిలువ తగ్గిపోతుంది.

## ఓర్పుతో వింటే చాలదు

ఓర్పుతో వింటున్నందుకు సంతసమే. అది వినదగిన సలహా అయితే, ఆ ప్రకారం ఆచరించవలెనుకూడ.

## పాకిస్తాన్‌లోని అల్పసంఖ్యాకులు

పాకిస్తాన్‌లోని హిందూ, సిక్కులస్థితి భయంకరంగాఉంది. దేశపు మార్పిడి కష్టమైన పని. కొంతమంది దోవలో చస్తారు. ఇక్కడ శిబిరాలస్థితి అధోగతిగా నున్నది. కురుక్షేత్రంలో వేలకొలది జనం ఆరుబయట ఉంటున్నారు. వైద్యసహాయం చాలా తక్కువ. ఆహారపుకొఱత ఎక్కువ.

వెనుకనున్నవారిని త్వరగా రప్పించమని పశ్చిమ పాకిస్తాన్‌నుండి వచ్చిన స్నేహితులు ఆయనతో చెప్పారు. తాను సర్కారు కాదుకదా! ఒక వ్యక్తి మాత్రమే. ఎంత సదుద్దేశం ఉన్నా, ఇలాటి విపరీతపరిస్థితులలో, ఏ సర్కారుగాని తన అభీష్ట ప్రకారం జరుపలేదు. తూర్పుబెంగాల్‌నుండికూడా అల్పసంఖ్యాకులు పారిపోవుచున్నారట. ఆయన నౌకాలీలో తిరిగి పిరికితనం వదలమని బోధించారు. ఆయన సహచరులు సతీసుబాబు, ఖాదీ ప్రతిష్టాన్‌లోని కార్యకర్తలు, ప్యారీలాల్, కనూగాంధి, అంతుల్ సలాం, సర్దార్ జీవన్‌సింగ్ ఇంకా అక్కడే ఉన్నారు. ప్రజాప్రభుత్వాల కర్తవ్యమేమని ఆయన యోజింపసాగెను. పారిపోవువారు కొత్తచోటు బాగుంటుంది అనుకుంటారు. అది భ్రమ. వేలకొలదిగా వచ్చిపడే శరణార్థులను ఏ ప్రభుత్వమూ భరింపజాలదు.

మొదట సౌకర్యాలు కల్పించలేరు. దైవంమీద ఆధారపడి, స్వగృహాలలోనే ఉండిపోవలెను. అవసరం వస్తే ధైర్యంగా చావవలెను. రెండు ప్రభుత్వాలు సక్రమంగా సహకారంతో వర్తించవలెను. లేదా యుద్ధం తప్పదు. ఆయన దానిని ఎన్నడును కోరడు. సేనలు ఆయుధాలుగల సర్కారులు ఇంకోమార్గం త్రొక్కలేరు. కాని అది సంపూర్ణవినాశం తెచ్చును. దేశాలమార్పిడిలో కలిగే చావులవలన మేలేమీ కలుగదు.

# 29

10-10-47

## ఎక్కువగొంగళ్ళు వచ్చాయి

ఎక్కువగొంగళ్ళు గాంధీజీవద్దకు చేరినవి. కొంతడబ్బు, బంగారపు ఉంగరంఒకటి వచ్చినవి. బరోడానుండి 800 గొంగళ్లు తయారుగానున్నవని తంతి వచ్చింది. రైల్వే సౌకర్యం కలిగితే ఇంకా పంపుతామన్నారు. ఇలా వస్తుంటే, ఈ చిక్కు త్వరలోనే తీరుతుంది.

## తిండి, బట్ట— కరువు

స్వాతంత్ర్యం వచ్చినపిమ్మట ఈ కరువు పెరిగినట్లున్నది. కాని హేతువులు కనపడవు. ఇవి స్వాతంత్ర్యచిహ్నములు కావే! రక్తపాతరహితముగా సంపాదించబడిన స్వాతంత్ర్యం మరింత అమూల్యమైంది. అట్టి స్వాతంత్ర్యంవల్ల ఈ సమస్యలు మరింత త్వరగా పరిష్కారం కావలెను.

కంట్రోలు రేషనింగ్ పద్ధతి ప్రకృతికి విరుద్ధం, వ్యవహార సరళికి భంగకరం. కావలసినంత సారవంతమైన భూమి, ఎక్కువ నీరు, కొదువలేని జనము ఉండగా ఆహారకొఱత ఎట్లు కలిగింది? స్వావలంబకు లగునట్లు ప్రజలకు బోధించవలెను. "మీమీద మీ రాధారపడక తప్ప" దని చెప్పగానే దేశం అంతా ఉత్తేజంతో ఉప్పొంగుతుంది. రోగంకంటె, రోగభయం చాలామందిని చంపు తుంది. స్వయంసహాయానికి ప్రూనుకుంటే ఆపదలు వస్తవనేభీతి అడుగంటుతుంది. ఆహారకంట్రోలు తొలగించుటచేత, కరవు రాదు; ఆకలిచావులు ఉండవు. ఇది ఆయన దృఢమైన విశ్వా సము.

బట్టలకరవుకూడా ఉండరాదు. కావలసినదానికన్న ఇండి యాలో ఎక్కువగా ప్రత్తి పండుచున్నది. వడకవచ్చు, నేయ వచ్చు. ఈ కంట్రోలు పోవలసిందే. పోతే, ధరలు కొద్దిగా పెరు గవచ్చును. ఆరునెలలదాకా బట్టలకొనుగోళ్ళు ఆపితే, ధరలు తప్పకుండా తగ్గుతవి. మధ్యకాలములో ఖద్దరు ఉత్పత్తి చేయండి. తగినంతబట్ట, అన్నం తనంతటతానే తయారుచేస్తే, ప్రజలదృక్పథం మారుతుంది. ఇదివరకు వచ్చింది రాజకీయస్వాతంత్ర్యంమాత్రమే. ఈ సలహా వింటే, ఆర్థికస్వాతంత్ర్యంకూడా వస్తుంది. దాని ప్రభావం ప్రతిపల్లెటూరివానికి ప్రత్యక్షమౌతుంది. అప్పుడు కల హాలకు సమయం ఉండదు. త్రాగుడు జూదము వగైరా ఎగిరి పోతవి; దైవసహాయం లభిస్తుంది; అన్నివిధాల భారతీయులు లాభం పొందుతారు.

# 30

11–10–47

## చరఖాజయంతి

నేడు భాద్రపద బహుళ ద్వాదశి. దీనికి గుజరాత్‌లో రెన్నియాబరస్ లేక చరఖాజయంతి అని పేరు. వడుకు వగైరా పనులగూర్చి సభలు చేస్తారు, కార్యక్రమాలు వేస్తారు. ఇపుడు ఈ జయంతిఉత్సవములు ఉత్సాహంతో జరుపుటకు తగిన వాతావరణం లేదు. తాను చెప్పిన అర్థాన్నిబట్టి, చరఖా అహింసా చిహ్నము. దానిని ప్రజలు కోల్పోయినట్లు ఉన్నారు. లేకపోతే, ఈ హత్యాకాండ ఈ క్రూరకృత్యాలు ఎలా బయలుదేరేవి? ఈ చరఖాజయంతి ఈ ఏడు పూర్తిగా ఆపితేనో? కాని దీని సందేశం గ్రహించినవారు అక్కడక్కడ కొద్దిమంది ఉండ వచ్చును. వారికోసమైనా ఇది సాగింపబడుచుండవలెను.

## హరిజనులకు బుజబందులు

పాకిస్తాన్‌లోనున్న హరిజనులు అస్పృశ్యులు అని తెల్పుటకుగాను బుజబందులు ధరించవలెనని ఆసర్కారులోని మండల్ సాహేబు మొదలగు ప్రముఖులు ఒక ప్రకటన చేశారు. ఆ పట్టీ మీాద బాలచంద్రుడు, నక్షత్రంగుర్తు యుండవలెనట. ఇతర హిందువులనుండి వీరిని వేరుపఱచుటకు ఉద్దేశించిన, దీని పర్యవసానం ఏమౌతుందనగా, పాకిస్తాన్‌లో నిలువయుండే హరిజనులు చిట్టచివరకు ముస్లింలు కావలసివస్తుంది. ఆధ్యాత్మికఅంతఃస్ఫురణ

వలన హృదయపూర్వకముగా పొందే మతంమార్పిళ్ళకు గాంధీ జీకి ఆక్షేపణ లేదు. బుద్ధిపూర్వకముగా హరిజనుడై హరిజనుల మనస్సు ఆయన కనిపెట్టగలిగినంతవరకు, నిజమైన మతం మార్పును కోరే హరిజనుడు ఒక్కడైనా లేడు. పాపము! వా రెందుకు హరిజనులుగానున్నారో, ముస్లిం మతం అంటే ఏమో వారి కేమి తెలుసు? అన్ని మతాల అనుచరులసంగతి ఇంతే. ఏదో మతములో పుట్టారు. అందులో ఉండి ఆపేరు పెట్టుకున్నారు. మతంమార్పు వచ్చినచో దానికి కారణం నిర్బంధమో, ఫలా పేక్షయో అయి ఉండవలెను. ఇప్పటి పరిస్థితులలో ఐచ్ఛికమని తెల్పే మతముమార్పిడిని సర్కారు ఆమోదించరాదు. ప్రాణంకన్న కూడా మతం ప్రియతరమైనదిగా యుండవలెను. ఆ సత్యం గమ నించినవాళ్లు, వేదవేదాంగములు చదివి పరీక్షాకాలమున నిల్వ లేనివారికంటె ఉత్తములు.

## దసరా-బక్రీదు

ఈ రెండు ఉత్సవాలు రానున్నవి. ముస్లింలు, హిందు వులు ఒండొరులకు బాధకలుగకుండా జాగ్రత్తగా మెలగవలెను. సాంఘికకల్లోలాలకు ఎడ మీయరాదు.

## దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం

ఇదివరకు కొన్నాళ్లు జరిగిన సత్యాగ్రహాముసు ఈమధ్య ఆపారు. రేపు మరల సాగిస్తారట. యు. యన్. ఒ. ఎదుట నున్నది భారతీయుల ఫిర్యాదు. అచ్చటి ముస్లింలు, హిందువులు

ఇచ్చటి రెండుసర్కార్ల సహాయం కోరాలి. సహాయం చేయటం వీరి కర్తవ్యం. ఉద్యమం ధర్మంగానుంటేను, సాధన సంపూర్ణంగా అహింసాయుతమైతేను విజయం తప్పదు. దక్షిణాఫ్రికాలోని భారతీయులు ఈ సూత్రాలు గమనించితే, జయము పొందుదురు.

# 31

12-10-47

## శరణార్థుల కొకమాట

మరికొన్ని గొంగళ్ళు వచ్చినవి. రజాయీలను పంపుతామన్నారు. కొన్నిమరలు రజాయీలను తయారుచేస్తామన్నారు. అవి మంచుకు తడుస్తవి. రాత్రిపూట పాతకాగితాలు వాటిపై కప్పుతే ఆ యిబ్బంది తీరును. రజాయీలమేలు ఏమంటే ఊడ తీసి, గుడ్డను ఉతికి, మరల దూదిని పొదుగవచ్చును.

దైవముమీద ఆధారపడేవారు, కీడులోనుంచి మేలును తీయగలరు. ఈ శరణార్థులలో స్థితిపరుల ఆస్తి అంతా పోయి, బాధలు కలిగి, కోపపడుచున్నారు. మర్యాదగా క్షేమంగా ఇంటికిపోయే అవకాశం కలిగేదాకా, శిబిరాలలో ఉండి, ఏదో యొకపని చేస్తూ యుండవలెను.

పాకిస్థాన్నుండి వచ్చినవారిలో ముప్పాతికమంది వర్తకులట. వారందఱు ఇక్కడ వర్తకం మొదలుపెట్టితే, ఇచ్చటి ఆర్థిక విధానం తారుమారౌతుంది. చేతులతో పనిచేయ నేర్చుకో

వలెను. వైద్యులకు, దాయీలకు తేలికగానే పనిదొరుకుతుంది. పాకిస్థాన్‌నుండి వచ్చినవారు యావద్భారతపౌరులని గ్రహించాలి. ఎక్కడికిపోతే, అక్కడి ప్రజలతో పాలల్లోవేసిన పంచదారవలెను కలిసిపోవలెను. కష్టించి పనిచేయవలె. వ్యవహారాలలో న్యాయంగా యుండవలెను. భారతాన్ని సేవించి, దానికీర్తి పెంచుటకే పుట్టామని గుర్తించవలెను. దానిని అవమానించుటకు పుట్టలేదని తెలుసుకోవలె. త్రాగుడుతో, జూదాలతో, కొట్లాటలతో కాలం వ్యర్థపఱుపరాదు. సహజంగా తప్పుచేస్తున్నా, దిద్దుకోవలెను. మరల చేయరాదు. ఈ సలహా విన్న శరణార్థులు, ఎక్కడైనా ఆదరింపబడుదురు.

# 32

13—10—47

## శరణార్థులకు

నిన్న చెప్పిన కొన్ని సంగతులు ఆంగ్లసంగ్రహంలో విడిచారు. సంతలు, మేళాలు, కాంగ్రెసుసభలు మనకు ఉన్నా, ఖచ్చితమైన శిబిరజీవితానికి మనము అలవాటు పడలేదు. హరిద్వారంలో 1915 లో జరిగిన కుంభమేళాకు పోయి, భారతదేశసేవకుల శిబిరంలో, దక్షిణాఫ్రికానుండి వచ్చిన నేను నాతోడి ప్రచారకులు పని చేశాము. అందరు మామీద దయ చూపారు. శిబిరజీవితం స్పష్టంగా నాకు తట్టలేదు. సమిష్టిపారిశుద్ధ్యవిచక్షణ మనకు తెలియదు. తుక్కు, దుమారము, మురికి పెంట, పెరిగి

అంటురోగాలు కలుగతవి. మన పాయఖానాలుసంగతి చెప్పనేల? ఆ వసతి లేదే అనవచ్చును. మలమూత్రవిసర్జన, పుణ్యనదీతీరాన నైనా, మరెక్కడనైనా చేయుచుందురు. ఎక్కడనైనా, ఉమ్మి వేయుటకు హక్కుందని తలంతురు. వంట ఏర్పాట్లు అంతే. ఎక్కడవాలిన ఈగలైనా అంటురోగక్రిములను తీసుకొనివచ్చి అన్నపానాదులమీద వాలుతవి. గృహవసతి సంగతి చక్కగా ఏర్పాటు చేయరు. మాటలగోలకు మితం లేదు. ఇందులో అతిశయోక్తి లేదు.

సేన అవసరమని నే నెన్నడూ గుర్తించకపోయినా, దాని లోనుంచికూడా కొంత మేలు తీయవచ్చును. వాళ్ళశిబిరం ఆదర్శంగా యుంటుంది. యోజనావిధము, అమలుచేసే ఏర్పాట్లు, పరిపూర్ణపారిశుద్ధ్యం, వీటినుండి క్రమశిక్షణ, సమిష్టిజీవితం, పారిశుద్ధ్యం, కార్యక్రమకాలనిర్ణయం, ఇవన్నీ నేర్చుకోవచ్చును. నిశ్శబ్దముగా ఉంటారు. కొద్దిగంటలలో గుడారాలనగరు నిర్మిస్తారు. శరణార్థులశిబిరాలు ఆమాదిరిని అనుసరించాలి. అపుడు వాన, ఎండలవలన బాధ కలుగదు.

ఈ శిబిరాలవ్యయం తగ్గే వీలుంది. ఊడ్పు, రోడ్లు వేయుట, కాలువలు త్రవ్వుట, బట్టలు ఉతుకుట, వంట చేయుట అన్నిపనులకు ఉచ్చనీచము లెంచక వీళ్లు తయారుకావలెను. అందరి మేలుకొరకు చేసేపనులు అందరికీ ఆదరణీయములే. అలా చేస్తే, ఈ విపత్తుకూడా మారువేషంతో వచ్చిన సంపత్తువలె పరిణమించును. అప్పుడు ఏ శరణార్థీ ఎవరికీ బరువు కాడు. తననుగూర్చి

గాక అందరినిగూర్చి ఆలోచించవలెను. తోడివారికి లేనిదానిని తనకై కోరరాదు.

ఇప్పుడు వచ్చేతీరును బట్టిచూడ, గొంగళ్ళకు, రజాయీలకు కొదువ యుండదు. చలిబాధనుండి తట్టుకోవచ్చును.

# 33

14-10-47

## చక్కని నిదర్శనము

ఆ రోజునకూడా ఎక్కువగా గొంగళ్ళు వచ్చెను. ఆర్య సమాజ బాలికాపాఠశాల విద్యార్థులు, యిద్దరు ఉపాధ్యాయులు కొంతడబ్బు, కొన్ని గొంగళ్ళు ఇచ్చిరి. ఆహారకొఱత తీరుటకుగాను పక్షమున కొకతూరి ఉపవాసం చేయమన్న గాంధీజీ సూచనను అనుసరించి అక్కడిపిల్లలు, పంతుళ్ళు ప్రతిగురువారం ఉపవాసం చేయ తీర్మానించుకొనిరి. తమతోటలో ఆహారం పండించ సమకట్టిరి. అందరు వీరిని అనుసరిస్తే, ఒక్క నిముషములో ఆహారకొఱత తీరును.

పరిషియాదేశపు రాయబారి, ఆయనభార్యా వచ్చి ఇచ్చిన చాలాగొంగళ్ళను ఆయన కృతజ్ఞతతో గైకొనెను.

## సిక్కుస్నేహితులతో సంభాషణ

రెండుముఠాలుగా వచ్చి మాటలాడి పోయిరి. పరస్పర కలహాలవల్ల కష్టాలు తీరవనియు, సర్కారుద్వారానే పరిహారం కలుగవచ్చుననియు సారాంశం తేలెను.

## సర్కారును దుర్బలపఱుపవద్దు

కొందరిని నిర్బంధంలోఉంచినందువ సర్కారుపై ఆందోళన లేవదీశారు. సర్కారుకు అలాంటిహక్కు కలదు. మన సర్కారు నిర్దోషులను నిర్బంధించరు. కాని మానవసంస్థ గనుక, తప్పులు రావచ్చును; కొందఱు అమాయకులుకూడ బాధపడ వచ్చును; ప్రభుత్వదృష్టిని ఆవైపుకు లాగి ప్రజలు ఆ తప్పులను సవరింపచేసుకోవలెను. మంత్రివర్గాన్ని మార్చవచ్చును. కాని వారిపై ఆందోళన లేవదీసి, ఆటంకపఱుపరాదు. విదేశీప్రభుత్వానికి సేనలుండేవి. కాని మనప్రభుత్వానికి ప్రజలే అండగా నుండవలెను.

## మీ లోపాలు గమనించండి

ఢిల్లీలో శాంతి ఏర్పడినట్లు కనుపడి మీరు తృప్తిపడుచున్నారు. నాకు అలా తృప్తికలుగుటలేదు. పూర్వముకూడా అరుదుగా హిందూ ముస్లిం కొట్లాటలు ఉండేవి. కాని కొద్దిరోజులలోనే మరచిపొయ్యేవారు. ఇప్పుడలాగాక పాతవిరోధులుగా భావించి, విముఖులై దూరమైపోవుచున్నారు. ఇది ఒక దుర్బల చిహ్నం. దాన్ని అణగగొట్టినపుడే, ఈ ప్రజ అగ్రరాజ్య మౌతారు. రెండేదోవలు ఉన్నవి. (1) హింసమీద, సేనమీద ఆధారపడి అగ్రరాజ్యంకావటమా? (2)అహింసమీద ఆధారపడి అజేయమైన అగ్రరాజ్యంకావటమా! నామాట వింటే, రెండో మార్గం తొక్కి గొప్పవారౌతారు. భయాన్ని పారద్రోలుటే, దానికవసరమైన మొదటిమెట్టు.

సన్నిహితులు కావలెనంటే, ఇతరుల తప్పులను చిన్నవిగాను, తమ తప్పులను పెద్దవిగాను చూచుకొని పరితపించి, సవరించుకోవాలి. తమతప్పును పూర్తిగా ఒప్పుకుంటే, నిన్నటి శత్రువులు నేటి మిత్రులౌతారు. అది తప్పదు. అన్నిమతాల వాళ్ళకు ఆయన ఇచ్చే సలహా ఇదే. దెబ్బకుదెబ్బ కొట్టతలిస్తే, స్నేహం ఎన్నడూ ఏర్పడదు.

# 34

15-10-47

## సత్కార్యములను సమకూర్చండి

విద్యుత్ శక్తి ఆగి, శబ్దవిస్తృతయంత్రము పనిచేయనందున, ఆయన కోరికమీద, సభికులు ఆయనదగ్గరకు చేరిరి. ఆనాడుకూడా ఎక్కువగా గొంగళ్ళు, డబ్బు వచ్చెను. ఒకసోదరి రు 2000 లు పంపెను. ఇద్దరు ముస్లింలు ఇవ్వదలచిన డబ్బును గొంగళ్ళను వారివద్దనే ఉంచి పంచమని గాంధీజీ సలహాచెప్పినా, వారు వినక, వాటిని ఆయనకే ఇచ్చిరి. ఇదివరకు గాంధీజీయందు దోషమున్నదని వారు తలంచిరి. కాని ఆయన అందరికి మిత్రుడని ఎవరికిని శత్రువు కాదని వారు ఇప్పుడు ధృవముగా నమ్మినందున, అలా తమసహాయం గాంధీజీద్వారా చేయ తలపెట్టిరి.

"సత్కార్యముల సంపుట" మను గ్రంథము ఆంగ్లములో యున్నది. మనకుకూడా అలాటిది యుండుట మంచిది. మేలు చేసినవారికి చెడుతలంపులు ఆరోపింపరాదు. పైనచెప్పిన

ముస్లిందాతలు తమపేర్లుకూడ చెప్పలేదు. వ్యక్తుల దోషాలకై సంఘాలను దూషింపరాదు. హిందువులు, సిక్కులు ఒక వైపున, ముస్లింలు మరొకవైపున శత్రుగణంగా ఉన్నారు అనరాదు. ముస్లింలు కాపాడినందున బ్రతికిన హిందువులు, సిక్కులు గలరు. హిందువులో, సిక్కులో కాపాడినందువలన బ్రతికిన ముస్లింలును కలరు. ప్రతిరాష్ట్రంలో ఇలాటి మంచివారు ఉన్నారు. వార్తాపత్రికలు ఇలాటి మంచివార్తలు ప్రకటించాలి. కోపాన్ని ప్రతీకారాన్ని ప్రోత్సాహపఱచే దుష్టవార్తలను వదలవలెను. మంచివార్తల నిచ్చుటలోకూడా అతిశయోక్తి ఉండరాదు.

## హిందీ—హిందూస్థానీ

దేవనాగరిలిపిలో వ్రాసిన హిందీ ఉత్తరప్రదేశ్‌కు రాజభాషగా ఉండును అన్నవార్త పత్రికలలో చదువగా, ఆయనకు నొప్పి కలిగింది. భారతసమ్మేళనములోని ముస్లింలలో నాలుగవ వంతు ఉత్తరప్రదేశ్‌లో నున్నారు. వారు వాడేది ఉర్దూలిపి. తేజబహద్దూర్‌సప్రూవంటి ఉర్దూపండితులైనహిందువులు అనేకులున్నారు. వీరు ఆ లిపిని మరువవలెనని కోరుటకంటె, రాజ్యాంగ వ్యవహారములలో ఇష్టంవచ్చిన లిపి వాడుకోమని స్వేచ్ఛ ఇచ్చుట మంచిది. అందువల్ల వారికి, వారి భాషకు అభివృద్ధి కలుగును. అప్పుడు ఆ భాష హిందూస్థానీ అవుతుంది. అందరూ రెండులిపులు నేర్చుకుందురు.

ముస్లింలను మీతో సమానమైన పౌరులుగా ఆదరించాలి. సమానత్వం అంటే, వారి లిపియందు గౌరవం చూప

వలెను. ముస్లింలు ఇచ్చట సగౌరవముగా నుండుటకు అసాధ్యమైన షరతులు పెట్టి మేము ముస్లింలను లేచిపొమ్మనలేదు అంటే లాభ మేమి? సమానత్వం యున్నా ముస్లింలు లేచి పోతే, ఆ బాధ్యత వారిదే. మీరుమాత్రం వారిని చెదరగొట్ట రాదు.

# 35

16-10-47

## మైసూరు దృష్టాంతం

మైసూరులోని సత్యాగ్రహం విజయం పొందినందుకు గాంధీజీ సంతోషం పొందెను. మైసూరు భారతసమ్మేళనలో చేరింది. అచ్చటి ప్రజ, బాధ్యతాయుతప్రభుత్వం కోరుచున్నారు. దానికై సత్యాగ్రహము మొదలుపెట్టారు. ఆ నియమాలను ఖచ్చితముగా అనుసరింతుమని, ఆయనకు తంతికూడా ఇచ్చినారు. అక్కడి ముఖ్యమంత్రి రామస్వామి మొదలియార్ చాలా సంచారం చేసినవాడు. స్టేటుకాంగ్రెసుతో సగౌరవమైన సంధి చేసుకొనెను. ఆ మంత్రిని ఆ స్టేటుకాంగ్రెసును అచ్చటి మహారాజును గాంధీజీ అభినందించెను. ఇతరసంస్థానాలుకూడా ఈ మార్గమే త్రొక్కి, ఆంగ్లరాజువలె చట్టబద్ధులైతే, పాలకుడు పాలితులు సంతృప్తి, సంతోషం పొందుతారు.

## మంచి నడవడి

బిర్లాసోదరుల ఔదార్యంవలన వారి ఆవరణలో ఈ సభలు జరుగుచున్నవి. అక్కడికి వచ్చిన కొందరు, తోటమాలి

అనుమతి లేకుండా పండ్లు కోశారట. తోట పాడుచేసినారట. అందుచేత ఆయనకు బాధ కలిగింది. అనుమతి లేనిదే ఒక ఆకు అయినా త్రుంచరాదు. తమబాధలవల్ల మంచినడవడి నీమములు మరువరాదు.

## ప్రభుత్వోద్యోగులమీదఉండే ఆశ

సర్కారునౌకరీలో ఉండే పోలీసు, సేన, ఇతరశాఖల లోని ఉద్యోగస్తులకు, వారికి అర్హత లేకపోయినా, నేను వార లను ప్రశంసించానని ఒక ఫిర్యాదు వచ్చింది. నే నలాచేయలేదు. వాళ్ళమీద నాకున్న ఆశలను తెల్పాను. ఈ ఉద్యోగు లంద ఱును, మిగిలిన ఆంగ్లేయ ఉద్యోగీయులుకూడా ఈ జాతికి సేవ కులే. విదేశీపాలకుల అదుపులోనుండి వారు యజమానులుగా ప్రవర్తించినరోజులు పోయినవి. ఇపు డీ పంచాయతీరాజ్యమందు భక్తి కలిగి ఉండి, మంత్రులనుండి ఉత్తరువుల పొందుచు, అవినీతికి పక్షపాతమునకు వశము గాకుండా వర్తించవలెను. అట్టి వారితో ప్రజలు పూర్తిసహకారం చేయవలెను. అలా ప్రవర్తిం చని ఉద్యోగీయులమీాద, తమకుండే ఫిర్యాదులను తెలుపుకునే హక్కు ప్రజలకు ఉన్నది.

## తూర్పుపాకీస్థాన్‌లో అల్పసంఖ్యాకులు

తూర్పుబెంగాల్‌నుంచి హిందువులు చాలమంది వెళ్ళి పోవుచున్నారని, ఏమిచేయమంటారని, అచ్చటనుండి వచ్చిన స్నేహితులు గాంధీజీని సలహా అడిగారు. ఇతరుల బెదిరింపులకు లొంగి, యిల్లు వాకిల్లు వదలిపోవుట ధైర్యవంతులకు తగనిపని.

అమర్యాదకన్న మృత్యువే మేలు. దేవుని చూచి భీతిల్లుచు, తమ ప్రాణాలు ఫణంగా అర్పించి, తమ మతాన్ని ప్రతిష్ఠను పౌరహక్కులను వారు కాపాడుకోవలెను. అలాటి ధైర్యంలేని వారు దేశం విడిచిపెట్టి పోవుటే మంచిది. దేశం విడిచిపెట్టి పోదలచుకున్నచో, నిమ్నజాతులను నిస్సహాయులను ముందుగా పంపి, వైద్యులు, వకీల్లు, వర్తకులు మొదలగు ఘరానా మనుష్యులు తరువాత వెళ్ళవలెను. వీరు మొదటివారుగాగాక ఆఖరువారుగా నుండవలెను. తమ మతముకై మర్యాదకై తమ ప్రాణాలర్పించేటట్లు నిమ్నజాతులకు డాక్టరు అంబేద్కరుగారి ద్వారా ప్రబోధము చేయించమని గాంధీజీ కోరబడెను. అట్టి సలహా ఇమ్మని ఈ సభాముఖమున ఆ డాక్టరుగారిని గాంధీజీ కోరుచున్నారు. సుహార్‌వర్దీసాహెబు బెంగాలుకు పోయి, ఖ్వాజాసాహేబుకు తోడ్పడవలసినదిగా ఆయనకు సూచించ మన్నారు. ఆ సుహార్‌వర్దీ ఇప్పుడు ఢిల్లీలోలేరు. ఆయన ఎక్కడ నున్నా త్వరగా బెంగాలు వెళ్ళుదురుగాక యని గాంధీజీ ఆశిం చెను. తూర్పుబెంగాల్ ముస్లింనాయకులు, అచ్చటి అల్పసంఖ్యాకు లకు విశ్వాసం కలుగునట్లు వర్తించవలెను. అలాకాక, అటు పాకి స్థాన్‌లో ఇటు భారతసమ్మేళనములో, వరుసగా ముస్లింలు హిందువులు మాత్రమే ఉండి, అల్పసంఖ్యాకులకు రక్షణలేకుంటే ఇపుడా రెండురాజ్యాలు నాశనమౌతవి. తప్పదు. దేశమును ఈ యాపదనుండి తప్పించగల వివేకాన్ని వారికి దయచేయుమని గాంధీజీ దైవమును ప్రార్థించెను.

17—10—47

## అమోఘమైన ఔషధం

తన దగ్గు తగ్గలేదని ఆదుర్దా చూపెడు ఉత్తరాలు, కబుర్లు వచ్చుచున్నవి. సంభాషణలోని మాటలవలెనే దగ్గుకూడా మాట్లాడేయంత్రంద్వారా వ్యాపించుచున్నది. సాయంత్రం ఆరు బైట మాట్లాడుటవలన దగ్గుపెరుగుచున్నది. అయినను నాలుగు రోజులుగా తగ్గుముఖము పట్టినది. ఆదిలోనే పెన్సిలిన్ వాడినచో మూడురోజులలో నయము అయ్యేదనిన్ని లేకపోతే మూడు వారాలు పట్టుతుందనిన్ని డాక్టరు సుశీల చెప్పింది. పెన్సిలిన్ మంచిదే కావచ్చును. కాని అన్నిరోగాలకు అమోఘమైన ఔషధము రామనామము. ఇతరమందులకన్న అది దివ్యౌషధం. ఈ అగ్నిజ్వాలలమధ్య పనిచేయుటకు, ఈ జ్వాలలను చల్లార్చుటకు దైవమందు అకుంఠితవిశ్వాసంయొక్క అవసరం ఎంతైనాఉన్నది. తనవల్లకావలసిన పనియుంటే, తనను బ్రతికించును, లేదా తీసికొని వెళ్లును.

ఇపుడు పాడిన భజనకీర్తనలో రామనామమువిడువవద్దని కవి ప్రబోధించినాడు. రాముడే మానవునికి సర్వదా శరణ్యం. ఒంటికివచ్చిన జబ్బుకు మందువేయక, పూర్తిగా దేవుని సేవించుటే, గాంధీజీ గాఢమైన అభిలాష.

## గొంగళ్ళు

గొంగళ్ళు, రజాయిలు చాలా వస్తున్నవి. అక్కరగల వారికి వెంటనే పంచెదరు.

## కంట్రోళ్ళు తొలగించవలెను

రాజేంద్రప్రసాద్ వేసినఉపసంఘం తన విచారణ పూర్తి చేసింది. అన్నవస్త్రాలమీద కంట్రోళ్ళను తక్షణమే తొలగించవలెనని గాంధీజీ ఇదివరకే చెప్పెను. యుద్ధంముగిసినా ధరలు పెరుగుచున్నవి. దేశంలో అన్నం బట్ట ఉన్నా ప్రజలకు అందుటలేదు. అది శోచనీయం. ప్రజలకు పోతపాలు పోయుటకై సర్కారు కృషిచేస్తున్నది. సర్కారు ఉద్యోగీయులు ప్రజలను ఎరుగరు. ప్రజలలో వచ్చిన మార్పు గుర్తించలేరు. రికార్డుమీద రికార్డుతో, కాలయాపనతో, వారిపని కుంటుపడుచున్నది. ప్రజలశక్తిని వీరు నశింపచేయరాదు. ప్రజాప్రభుత్వంవల్ల ప్రజలు నిస్సహాయులు కారాదు. కంట్రోళ్లు తొలగించినందువల్ల విపత్తు పెరిగితే, మరల వాటిని పెట్టరాదా ? కంట్రోళ్ళు పోతే పరిస్థితులు బాగుపడునని ఆయన నమ్మకం. ప్రజలు వాళ్ళకాళ్ళమీద వాళ్లు నిలువ యత్నించునపుడు తగవులకు అవకాశ ముండదు.

## దక్షిణ ఆఫ్రికాలో సత్యాగ్రహం

దక్షిణాఫ్రికా సత్యాగ్రహాన్నిగూర్చి తాను సత్యమని నమ్మినదానిని ఆయన ప్రకటించెను. దానికి వందనము లర్పించు తంతి అక్కడనుంచి వచ్చింది. సత్యాగ్రహంలో వెనుకకు మరలుట, లేక అపజయము, అనేది లేదు. "అపజయము పొందేదానికన్న మేము మరణించెద" మని పండిట్ రాంభోజదత్తు పంజాబు సైనికశాసనకాలములో వ్రాసిన ఆ పద్యం ఎల్లకాలమునకు

వర్తించే సత్యమే. సత్యమైన, ధర్మసమ్మతమైన కారణముంటే, వేళ్ళమీద లెక్కపెట్టతగినంత కొద్దిమంది సత్యాగ్రహులైనా భారతదేశప్రతిష్ఠను పరిరక్షింపగలరు.

ధనసహాయానికై విన్నపము చేయమని ఆ తంతిలో కలదు. కాని దక్షిణాఫ్రికాభారతీయులు బీదవారుకారు. అక్కడ ఉండే సత్యాగ్రహులకు ఎక్కువ ఖర్చు కానేరదు. ఇక్కడ మాతృదేశం కోటానకోట్లరూపాయిలు నష్టపడుచున్నది. వీరి నిప్పుడు ప్రోద్బలపఱచేబుద్ధి నాకు కలుగుటలేదు. తూర్పుఆఫ్రికా, మొరీషస్, మరికొన్ని ఇతరప్రదేశాలలోకూడా స్థితివంతులైన భారతీయులు ఉన్నారు. అక్కడ హిందూ ముస్లిం తేడాలులేవు. కాన వారు దక్షిణాఫ్రికాలోనివారికి సహాయముచేతురని ఆశించు చున్నాను. అది వారి కర్తవ్యంకూడా.

## 37

18-10-47

### కురుక్షేత్రానికి గొంగళ్ళు పంపారు

గొంగళ్ళు, డబ్బు వస్తూనేయున్నవి. వాటికై సర్దారు పటేలు ఒక విన్నపము పంపారు. శరణార్థులసాకర్యాలకై పనిచే యుచున్న డాక్టరు సుశీలనయ్యర్, కొందఱుమిత్రులతో కలిసి, కొన్నిబట్టలు, గొంగళ్ళు తీసుకుని కురుక్షేత్రం పోయింది.

### రాష్ట్రభాష

హిందూస్థానీని రాష్ట్రభాషగాగ్రహించమని ఆయనచేసిన సూచనను గూర్చి గాంధీజీవద్దకు ఉత్తరాలు వస్తున్నవి. అదే సరి

మైన రాష్ట్రభాష. ఆయనకు అనుమానములేదు. పార్సీతో నిండిన ఉర్దూనుకాని, సంస్కృతంతో నిండిన హిందీనికాని, సామాన్య జనులు తేలికగా గ్రహింపజాలరు. ఆంగ్లరాజ్యం అంతరించగానే సామాన్య సంభాషణలకుగాని, రాజ్యాంగ వ్యవహారాలకుగాని, వాడుకలోనుంచి దానిని తొలగించవలసినదే. అది అక్రమంగా తనదికానిస్థానాన్ని ఆక్రమించింది. అది భారతదేశానికి రాష్ట్రభాష ఎన్నడు కానేరదు. ఆంగ్లభాషకు వ్యతిరేకముగా గాంధీజీ చెప్పినదానినిబట్టి, ఆ భాష మాటలాడే ఆంగ్లేయులనుకూడ ప్రజలు అసహ్యించుకొను ప్రమాదం కలుగవచ్చునని ఒకస్నేహితుడు గాంధీజీకి హెచ్చరిక చేసినాడు. అలాటిదుస్థితి కలిగితే, గాంధీజీ మిక్కిలి దుఃఖించును. కర్తకు కర్మకు మధ్య తేడాయున్నది. కర్మనుద్వేషించినా, కర్తను దూషించరాదు. సామాన్యజనులు ఈ భేదం గమనించకపోవచ్చును.

ఆంగ్లమే మాతృభాషగాగల ఆంగ్లోహైందవులు, గోవావారు, హిందీ రానందున వెంటనే ఉద్యోగాలలోనుంచి తొలగించబడరు. ఒక నిర్ణీతకాలములో, వారుకూడా ఆ భాషలో సామాన్యజ్ఞానం సంపాదించవలెను. నిర్బంధము స్ఫురించకుండా ఈ విషయంలో సౌమ్యముగా వర్తించవలెను.

రెండు లిపుల మాట ఎత్తుటచేత, ఆ రెండు పోయి, రోమన్ లిపి వచ్చునని దానియం దభిమానముగల ఆ స్నేహితుడనుకొనుచున్నాడు. రోమన్ లిపియందు గాంధీజీకి మోహాము

లేదు. ఆ రెండు లిపులు దీనివలన పోవునని భయమూ లేదు. ఆ రెండు లిపులు నేర్చుకొనుట సంతోషకారణముగా యుండవలెను. అలా చేయక తప్పించుకుంటే, మన జాతీయత బూటకమవుతుంది. కాశ్మీర్ కారాగృహములో నుండగా, షేకుఅబ్దుల్లా హిందీ, దేవనాగరిలిపిని నేర్చుకున్నాడంటే, తక్కిన జాతీయవాదుల కది ఏలా అసాధ్యమగును ?

# 38

19_10_47

పగటికాలము తగ్గుచుండుటచే, ఆరుగంటలనుంచి ప్రార్థనలు జరుపుట కొందరికి ఇబ్బందికరంగా నున్నది. కాన సోమవారంనుంచి సాయంత్రం 5-30 నుండియే ప్రార్థన లని గాంధీజీ ప్రకటించెను.

## ఇది స్వరాజ్యమా ?

ఆనాడు పాడిన భజనకీర్తన జాలిగలిగించు సంగతులను స్ఫురింపజేసెను. భజనావళిలోని ప్రతికీర్తనకు ఒకచరిత్ర యున్నది. సంగీతవిద్వాంసుడు, భక్తుడు, ఆశ్రమవాసిఅయిన కీ. శే. పండిట్ ఖరే, కాకాసాహెబు సాయంతో ఈ భజనలను సమకూర్చెను. నేడు పాడిన కీర్తనను సబర్మతీఆశ్రమ వ్యవహర్తయైన కీ. శే. మగనలాలుగాంధి తఱుచుగా పాడేవాడు. ఆయన గాంధీజీతో దక్షిణఆఫ్రికాలోనుండి, జాతీయసేవ కర్పితమాయెను. గట్టి శరీరం, మంచి గాత్రం కలవాడైనను, భారతానికి తిరిగివచ్చిన పిమ్మట ఆ దారుఢ్యం తగ్గింది. ఒకనికి మిక్కిలి మించినపని ఆయన చేసేది.

ఈ కీర్తనను అధికకారుణ్యరసస్ఫూర్తితో పాడేవాడు. దేవుని ముఖాముఖి చూడలేక వేచియున్నకాలం, చీకటికాలం, ఒక యుగంగా కవికి కనుపడేది. అలాగే స్వరాజ్యం దైవరాజ్యసంపాదన మగనలాల్‌కు దైవంగానుండేది. అది నిర్మాణకార్యక్రమం ద్వారామాత్రమే లభించేది. దానిని జరిపియుంటే, ఈఅఘాయిత్యాలు ఇప్పుడు జరిగేవికావు. గడచిన 15 వ ఆగష్టున స్వరాజ్యము వచ్చినది అంటారు. దానిని స్వరాజ్యమని గాంధీజీ అనడు. స్వరాజ్యంలో సోదరులు ఒండొరులగొంతులు కోసుకోరు. స్వతంత్రభారత మందరితో స్నేహమునుకోరింది. లోకములో ఎవరితోనూ విరోధం కోరలేదు. కాని ఇపుడో, తన బిడ్డలు ఒండొరులరక్తం త్రాగ తహతహపడుచున్నారు.

నిజమైన స్వరాజ్యం కావలెనంటే, మగన్‌లాల్‌వలె నిరంతరం ఆవేదన పొందాలి. నిరాకారుడైన దేవునికి మానవుడు వివిధరూపాలు కల్పించుచున్నాడు. రామరాజ్య రూపములో దేవుని చూడదలిచితే, ఆత్మపరీక్ష మొదటిమెట్టు. తమతప్పులను ఎంచుకుని, ఇతరులతప్పు చూడనొల్లకపోవుటయే, నిజమైన అభివృద్ధికి మార్గము. ఇపుడు వారు పతనమైరి. ఒండొరులమతముల మీద గౌరవం లేక, దేవాలయములను మసీదులుగాను, మసీదులను దేవాలయములుగాను మార్చుచున్నారు.

ఈ ద్వేషానలమును చల్లార్చు ఏకైకమార్గమును గాంధీజీ ఇదివరకే చెప్పియున్నారు. పాకిస్థాన్‌లోని హిందువుల, సిక్కుల బాధలు స్మరిస్తూ కూర్చుంటే, ఆయనకు వెర్రి ఎత్తింది. అట్లైతే

తాను భారతానికి సేవ చేయనేలేడు. భారతంలోని ముస్లీములను సోదరులవలె చూడవలెను. ఢిల్లీలో శాంతి ఏర్పడ్డదన్నారు. కాని ఆ మాటతో తనకు తృప్తి లేదు. అది మిలిటరీ, పోలీసు భయం వల్ల జరిగినది. ఇరుతెగల హృదయాలు విముఖంగానే ఉన్నవి. ఈ సభలో ఉన్న మహమ్మదీయులు కులాసాగా కూర్చున్నారా? ముస్సోరీలోనుండే కిద్వాయిసోదరుని నిష్కారణంగా హత్యచేశారు. నిన్నటి సభలో అతనిభార్య, షేకుఅబ్దుల్లా మరికొందరు ముస్లింస్నేహితులు యుండగా, వారినిగూర్చి ఆయన ఆదుర్దాపడెను. తనసమక్షంలో వారికి శరీరహాని కలుగదని ఆయన నమ్మి తనను తా నభినందించుకొనెను. కాని వారికి అవమానం జరిగితే ఆయన లజ్జతో తలవంచుకోక తప్పదుకదా ? ఇలాటి భీతి వారిని గూర్చి ఏల కలుగవలెను ? వారున్నూ తక్కినవారివలె క్షేమముగా ఉండవలెను. ఆసియాకు, ఆఫ్రికాకు- అది ఏల, యావత్ప్రపంచానికి ఆశాజ్యోతియైన భారతంపై, లోకముయొక్క దృష్టి సారింపబడినది. ఆ ఆశ నెగ్గవలెనంటే, హత్యాకాండ ఆగవలెను. స్నేహితులవలె సోదరులవలె ప్రవర్తించవలెను. పవిత్ర హృదయాలే ఆ పరమానందస్థితికి ప్రథమసోపానము.

# 39

20-10-47

## ఇదేనా ఆఖరునేరం ?

నిన్నటిరోజు సర్కారునౌకరీ చేయుచున్న ఒకముస్లిం ఆరోగ్యశాఖాధికారిని చంపినారని గతరాత్రి రాజకుమారి నాకు

చెప్పింది. ఆయన న్యాయవంతుడు. ఆయనకు భార్యా, పిల్లలు ఉన్నారు. ఇంటియజమానిని, సంరక్షకుని చంపారు గనుక, తనను పిల్లలనుకూడా చంపమని ఆ వితంతువు మతిపోయి, వెర్రిగా వేడుకొనుచున్నది.

పైకి ఢిల్లీ నెమ్మదిగా కనుపడినా, చిక్కుతీరలేదని, సంతృప్తికి కారణంలేదని, నేను నిన్నసాయంత్రమే చెప్పాను. ఈపై పై శాంతి శ్మశానశాంతిరసే.

కొరాన్ ప్రకారం మంత్రములు చెప్పి ఈ శవములను పూడ్చుటకు తగినంతమంది ముస్లింలను సమకూర్చుట చాలా కష్టమయ్యెనని అమృతకౌరు చెప్పెను. ఇది విని నాయొడలు వణికిపోయెను. అధికసంఖ్యాకుల భీరుత్వాని కిది ఒకచిహ్నం. నేరస్థులను వెతికిపట్టి అధికారులు శిక్షింతురుగాక. ఇదే ఆఖరునేరమైతే ఫరవాలేదు. కాని ఇది యొక సూచన మాత్రమే. ఈ కిరాతకము ఢిల్లీ యంతరాత్మను మేల్కొలుపవలసియున్నది.

## హెచ్చుగొంగళ్ళు వచ్చినవి

గొంగళ్ళకొఱకు డబ్బు వచ్చిపడుచున్నది. దాత లందరకు నా కృతజ్ఞత. ఈ విరాళములు ఏ ఒకసంఘానికీ ప్రత్యేకించబడకపోవుట సంతోషప్రదము.

## బహిరంగలేఖ

ఆంగ్లేయ డొకడు "తత్సంబంధులకు" అను శీర్షికతో వ్రాసిన జాబులో సూచించిన ఆపద నాకు ఆవేదన కలిగించింది.

దానిలోని ముఖ్యాంశ మేమనగా, "కల్లోలిత ప్రదేశములో ఒక ఒంటరిచోట అచ్చగా ఆంగ్లేయులైన మేము ఏండ్లతరబడి గొప్ప నష్టములకు లోనై ప్రజాసేవ చేయుచున్నాము. దేశమును వీడక నిల్వయున్న ఆంగ్లేయులను హతమొనర్చుటకు రహస్యపు ఆజ్ఞ బయలుదేరిందట. దేశభక్తిగల పౌరుల ఆస్తి ప్రాణాలను కాపాడుదు మని నెహ్రూజీ హామీ యిచ్చినను, మారుమూలలనుండే మాకు రక్షణ కలుగుట దుస్సాధ్యము".

అనుమానింపదగిన ఈఆపదనుండి మనము తప్పించవలెను. అలాటి రహస్య ఉత్తరువులు లేవేమో? సర్కారు ఎంత రక్షింప దలంచినా, అందుబాటులో లేని గ్రామములలో నుండువారికి రక్షణ కలుగనేరదు. మనసేన, పోలీసులు సమర్థులు కారు. దైవమందుండే అకుంఠిత విశ్వాసంవల్లను, ఇరుగుపొరుగువారి సద్భావమువల్లను రక్షణ కలగాలి. ఈ రెంటిలో ఏదీ లేకపోతే, ఈ దేశం వదలివెళ్ళుట మేలు. ఈ దేశంలో నిలువయున్న ఆంగ్లేయులను విశ్వాసపాత్రులుగా నెంచి, వారిని కాపాడుట మనకర్తవ్యం. వారిని నిర్లక్ష్యం చేయరాదు. అవమానించరాదు. ప్రజాసంస్థలు, పత్రికలుకూడా జాగరూకతతో మెలగాలి. తమను తాము గౌరవించుకొనేవారు పొరుగువారిని అమర్యాద చేయరాదు. స్వాతంత్ర్యమును ప్రేమించువారు అలాటి పనికి దిగరాదు.

# 40

21-10-47

## మరొకనేరం

మరొక విషాదకథ జరిగింది. దానికి సాంఘికతత్వంతో సంబంధంలేదు. తనకిచ్చిన ఆజ్ఞమేరకు పనిచేయని సైనికుడొకడు తన పై ఉద్యోగస్థుడైన హిందువును తుపాకీతో కాల్చి చంపెను. అత్యల్పమైన మిషమీద కూడా తుపాకిని వాడుట దుష్టసూచన. లోకములో క్రూరు లున్నారు. వారు ప్రాణాన్ని లక్ష్యంచేయరు. పశువులను, పక్షులను చంపినట్లు నరులను కాల్చెదరు. స్వతంత్ర భారతము ఆ రకంలో చేరవలసిందేనా ? ప్రాణమును సృజించే శక్తిలేని మానవునకు దానిని అంతమొందించే హక్కు లేదు. కాని హిందువులు, ముస్లింలు, సిక్కులు ఒండొరులను చంపుకొనుచున్నారు. ఈ వేటతో విసుగెత్తగానే ముస్లింలు తమవారిని, అట్లే హిందువులు సిక్కులు తమ మతాలవారినే చంప మొదలిడుదురు. ఈ బీభత్సస్థితి రాకుండుటకు ఈరాజ్యాలు బుద్ధితెచ్చుకుని వ్యవహారాలను సరిదిద్దుకోవలెను.

### చట్టసమ్మతమైన చర్యలతో జోక్యముండరాదు

అల్లరి చేసినారన్న వారిని సర్కారు ఖైదు చేశారు. పూర్వపు పరిపాలనలో దయజూపమని వైస్రాయికి మనవి పంపేవారు. ఇప్పుడో మంత్రులకు పంపుచున్నారు. వారు నీతి నియమాలు లేకుండా తమ ఇష్టానుసారము జోక్యం తీసుకొనరాదు.

న్యాయవిచారణ పూర్తిగా జరిగి చిట్టచివరకు దాక్షిణ్యపు మహాజరు వస్తే కొన్ని పద్ధతులప్రకారం దానినిపరిష్కరించాలి. లేదా ఫిర్యాదీలు తమఫిర్యాదును ఉపసంహరించి ముద్దాయిలను విడుదల చేయించవచ్చును. ఘోరనేరాలలో ఆ విధం పనికిరాదు. ఫిర్యాదీ సాక్ష్యం చెప్పనంత మాత్రంచేత, ముద్దాయిని విడుదల చేయరాదు. ముద్దాయిలు నేరంఒప్పుకొని క్షమాపణ కోరవలెను. ఆప్తులకోరకైనా మంత్రులు న్యాయవిచారణలో అడ్డుపడరాదు. న్యాయవిచారణ చౌకగా త్వరగా పరిశుద్ధంగా జరగవల్సిందే కాని మంత్రులు ఆ విచారణలో అడ్డుతగిలితే, శాసనం లేదు; ప్రజాస్వామ్యం లేదు.

రేడియోమీద మాట్లాడుటచే, ఆయన సంభాషణ 15 నిముషాలకు మించరాదని ఒక మిత్రుని హెచ్చరిక. కాన నేటి భాషణమును తగ్గించెను. ముందుకూడా అంతే.

## 41

22_10_47

గొంగళ్ళు, డబ్బు వచ్చిపడుతున్నవి. ఆ దానాల ఔదార్యానికి ఆయన సంతసించెను.

### ఉర్దూ దైనికపత్రికనుండి ఒకభాగము

ఆయనకు ఉర్దూవచ్చును గాని బాగా చదువలేరు. అప్పుడపుడు స్నేహితులు ఉర్దూ పత్రికలలోని భాగాలు ఆయనకు చదివి వినిపిస్తారు. ఈరోజు వినిపించిన భాగము ఘోరంగాఉంది.

ముస్లింలను భారతం నుండి పారద్రోలుటకు హిందువులు నిశ్చ యించు కున్నారని, వారు వెళ్ళనైనా వెళ్ళవలె లేదా చంపబడు టకు తయారు కావలెనని ఆ సంపాదకుడు వ్రాశాడు. ఆయన భావమేగాక ప్రజలలో ఎక్కువమంది అలా భావించుకుంటే, అది సిగ్గుచేటే గాక, భారతదేశ ఉనికికే ముప్పు కలిగిస్తుంది. గీత, బైబిలు, కురాను స్థానములను వార్తాపత్రికలు ఆక్రమించాయి. అచ్చైనవార్త వేదవాక్కయింది అని ఒక స్నేహితుడు చెప్పాడు. అందువల్ల పత్రికలయొక్కయు, సంపాదకులయొక్కయు బాధ్య తలు పెరిగాయి. తన కానాడు చదివి వినిపించినదానివంటి విష యాలు ప్రచురణ కారాదు.

## అలాటి పత్రికలను నిషేధించ వలసినదే!

## సంస్థానాలు ఎటు బోవుచున్నవి ?

సంస్థానాలలో అరాచక మేర్పడిన దని ఒక స్నేహితుడు చెప్పాడు. ఆంగ్లేయు లుండగా, వీటిని అదుపులో నుంచారు. ఆంగ్లేయుల స్థాన మాక్రమించిన సర్దారుకు ఆ ఆయుధబలంలేదు. వీరు సమ్మేళనలో చేరినను, తమ ఇష్టప్రకారము రయితులను వేధించుటకు, పూర్వముకన్న స్వేచ్ఛ ఉందనుకొంటున్నారు. గాంధీజీ ఒక సంస్థానంలోనివాడే, సంస్థానాధిపతులకు మిత్రుడే. కాని మీ ప్రజకు మీరు నిజమైన ధర్మకర్తలు కండని వారిని హెచ్చరించెను. వారు నిరంకుశులుగా నుండి ప్రజలను నాశనం చేయుజాలరు. తాము సర్వతంత్రుల మైనా మనుకుంటే, అది

భ్రమ అవుతుంది. ప్రజల సద్భావం మీాదనే వారు ఆధారపడి జీవించవలెను. ప్రజలకు పిచ్చి ఎత్తినట్లే, ఆ పాలకులకు గూడ ఎత్తరాదు. నిరంకుశత్వం, వ్యభిచారం, త్రాగుడు మూాల మట్టంగా వీరిని నాశనంచేయును.

## దసరా - బక్రీద్

ఈ రెంటిని గూర్చి ప్రజలలో ఆదుర్దా ఉండి, ఎక్కడ నైనా పోట్లాట వస్తే, హిందువులే దానికి కారకులౌతారు. రావణుని మీాద రాముడు పొందిన విజయం కొరకు దసరా ఏర్పడెను. దుర్గపూజఅనగా సర్వవ్యాప్తమైన శక్తిపూజ. చివరకు భారతమిలాప్ అనే స్నేహప్రదర్శనం జరుగుతుంది. ఈ తొమ్మిది రోజులు ప్రార్థనలతో ఉపవాసాలతో గడుపవలెను. ఆయనతల్లి ఆ తొమ్మిదిరోజులు ఉపవసించేది. పిల్లలకు మితభోజనం నేర్పేది. ఇప్పుడు ఒండొరుల చంపుకుంటూ, ఈ ఉత్సవం చేతామా? మర్నాటిగతి ఏమో భారతంలోని ముస్లింలకు తెలియదు. మతం మార్చమని నిర్బంధిస్తారేమో అని వారి భయం. ఈభయంతో బ్రతుకుటకన్న చావే మేలు. అన్ని మతాలవారికి ఈ సూత్రం సమముగా వర్తించును. గుడ్డలు మార్చినట్లు మతం మార్చే వారితో ప్రయోజన మేమి? పైదెల్పిన మూడు తప్పుడు మార్గాలు వదలి, సోదరులవలె గౌరవజీవితం గడపుటే చక్కని మార్గము. ఇక్కడ శాంతి నెలకొల్పి ఆయన పాకిస్తాన్ పోవును. ప్రతి హిందు, సిక్కు మర్యాదగా క్షేమముగా తన ఇంటికి తాను వచ్చేవరకు ఆయన తృప్తి జెందరు.

# 42

23-10-47

## స్నేహితులవద్ద యుండే శరణార్థులు

రావల్పిండి నుండి వచ్చిన ఇద్దఱు శరణార్థులు ఢిల్లీలో స్నేహితుల ఇంటివద్ద నుండి, తమకు గొంగళ్ళుగాని రజాయీలు గాని ఇత్తురా యని ఒక చీటి వ్రాశారు. శిబిరాలలో నుండే అచ్చు నిస్సహాయులకే అవి ఉద్దేశింపబడినవి. కాని స్నేహితుల సహాయము పొందే శరణార్థులకు వారు అన్నమే కాక బట్టలు కూడా యిచ్చుట కర్తవ్యము. వారి కేదో విధాన సహాయం చేయాలి. ఆయన అందరికి ఉచితంగా ఇవ్వసాగిస్తే, తగినన్ని గొంగళ్ళు లేకపోవచ్చును. తనవద్దకు వచ్చిన వారికి కొందరకు, ఆయన గొంగళ్లు ఇచ్చెను. వారు మోసం చేయలేదని ఆయన ఆశించెను.

బిర్లామందిరము నిండా శరణార్థు లున్నారు. ఆ బిర్లా సోదరులు గోస్వామిజీ, శక్తికొలది సాయం చేయుచున్నారు. కాని ఇది చాలా పెద్ద సమస్య. ఏ ఒక్కరూ తీర్చలేనిది. వచ్చే చలికాలంలో ఏ ఒకరు గొంగళ్లు లేక బాధపడరాదని ఆయన భావము.

## ఇంకొక నేరము

కాస్తశాంతి కలిగింది కదా అనే భావంతో ఒక ముస్లిం బీదవాడు తన కళ్ళజోళ్ళ దుకాణం తెఱచుచుండగా హత్య చేయబడ్డాడు. పట్టపగలు! జనసమ్మర్దంగల నడివీథిలో! అప్పుడు

పోలీసు, సేన ఏమి చేయుచున్నారు? ఆ చుట్టుప్రక్కల వారెందు లకు ఆపలేదు ? అమాయకులైన ముస్లింలపై ఇక్కడ పగతీర్చు కుంటే, అక్కడ పాకిస్తాన్‌లోను హిందువులకు సిక్కులకు కలిగే మేలేమి? ఈ హత్యవలన ఆయనకు దుఃఖంకలిగింది. ఢిల్లీ హిందు వులకు, సిక్కులకు గృహమైనట్లే ముస్లిములకూ అవుతుంది.

## వర్ధాలో కుష్ఠరోగుల మహాసభ

భారతదేశంలో కుష్ఠుతో బాధపడేవారు లక్షలకొలది కలరు. ఆ రోగులను ఆ రోగాలను చూచి ప్రజలు భయపడుచు న్నారు. పాపప్రభావాలు కలవారు కుష్ఠురోగులకంటె అధములు. ఇతర రోగాలకన్న దీనిని గూర్చి ఇంత భయ మేల ?

ఇదివరకు క్రైస్తవమత బోధకులు మాత్రమే, కుష్ఠు రోగుల సేవ చేసేవారు. ఈ మధ్య కొంతమంది భారతీయులు కూడా పూనుకున్నారు. అలాటిసంస్థ, కలకత్తాలో ఒకటియున్నది. వినోబాజీ శిష్యుడు మనోహరదివాన్, వర్ధా సమీపంలో ఈ సేవ చేయుచున్నాడు. ఆతడే నిజమైన మహాత్ముడు. మధ్య ప్రదేశ్‌లో "మహారోగి సేవామండలి" అను సంస్థ ఈ పని చేయుచున్నది. ఈ నెల 30వ తేదీ వర్ధాలో కుష్ఠుప్రచారకుల మహాసభ జరుగనున్నది. కీ. శే. శ్రీనివాసశాస్త్రిగారి శిష్యుడు శ్రీ జగదీశన్, కుష్ఠురోగనివారణ పొందిన తరువాత ఈ మహా సభ విషయము కస్తూరిబానిధి ధర్మకర్తలకు తెల్పాడు. వారుచేయు చున్న ఈ మహాసభకు డా. సుశీలనయ్యర్ వెళ్ళుచున్నది. రాజ

కుమారి అమృతకౌరు, డా. జీవరాజమెహతా ఇక్కడ ఢిల్లీలో సేవచేయుచుండుటచేత అచ్చటికి పోజాలరు. మనం హత్యలు చేసుకుంటూ కూర్చుందామా? ఇలాటి కార్యక్రమం చేతామా? సాంఘిక విద్వేష మనేది ఘోరాతిఘోరమైన కుష్ఠురోగము.

# 43

24–10–47

## ఒకేఒక అభిలాష

17 వ తేది ఢిల్లీలో జరుగనున్న ఆశియాదేశపు కార్మిక మహాసభను గాంధీజీ ప్రారంభింతురని పత్రికలలో పంపినవార్తను ఎవరు పంపారో ఆయనకు తెలియదు. ఆ సభ సంగతి ఆయనకు అసలే తెలియదు. ఇది తప్పని ఆయన పంపిన ఖండన పత్రికలలో పడలేదు. ఆయన మనస్సు ఈ హిందూ ముస్లిం వగైరా శరణార్థులపై కేంద్రీకరింపబడి ఇతరం మీదకు పోవుట లేదు. హిందువులు, ముస్లింలు, పార్సీలు, క్రైస్తవులు తదితరులు భారతదేశానికి సమానమైన బిడ్డలని సమానమైన పౌరసత్వహక్కులు కలవారని, ఆయన బాల్యంనుంచి పెట్టుకున్న ఆదర్శం. స్వాతంత్ర్యం వచ్చిన పిమ్మట, ఆ ఆదర్శం దూరమైపోతున్నది. ఇప్పుడు పాడిన పాటలో ఉన్న భావం గమనించాలి. ఎవరు భూషించినా, ఎవరు దూషించినా ఫర్వాలేదు. అన్నీ దైవానికే అర్పితమై యున్నవి. నేను ఇప్పుడు చేయుచున్న దదే పని. ఎవరికి సమ్మతమైనా, కాకపోయినా, నేను సత్యమని నమ్మిన దానిని ప్రకటిస్తూనే యుంటాను.

మీ విశ్వాసాన్ని దృఢంగా ఉంచుకోండి. నిన్నటి లక్షాధి కారులు నేటి భిక్షాధికారులు! ఇదెంతో శోచనీయము. గట్టి విశ్వాసము ఉంచి మంచి మార్గాన నడిస్తే, దైవం ఈ కష్టాలను త్వరలో అంతరింప జేయును.

చెన్నపురిలో నిరోగిగా ఉండే జగదీశన్ రెండు వారాల క్రింద వర్ధావచ్చి గాంధీజీకి కొన్ని వ్యాసాలు కొన్ని కరపత్రాలు పంపారు. వాటిని ఈ ఉదయంవారు చదివారు. కుష్ఠు కలవాడు అనేపదము వాడకుండా, కుష్ఠురోగులు అనే పదం వాడమని జగదీశన్ కోరాడు. కుష్ఠురోగముకన్న మించిన అంటు జాడ్యాలు చాల ఉన్నాయి. వాటికంటె ఇది చాలా తక్కువ అంటుజాడ్యం. ఈ కుష్ఠురోగాన్ని గూర్చి ఇంత భయ మేల? నిరసన ఏల ఉండాలి? అపవిత్రమైన మనస్సుకలవాడే, నిజమైన కుష్ఠురోగి అని గాంధీజీ భావం. తోడిమానవులను, వారిలో ఏ బృందాన్నిగాని, వర్గాన్ని గాని నీచంగా చూడడం మనోజాడ్యమునకు చిహ్నం. అలాటి వాళ్ళే సంఘంలో కుష్ఠుమనుష్యులు. పేరు మార్చిన మాత్రాన గులాబీ సువాసన పోవునా ?

వెనుక అనుకున్న దానికి భిన్నముగా జీవరాజమెహతా వర్ధా మహాసభకు హాజరు కానున్నాడు. సంతోషం.

శనివారం సాయంత్రం కారాగృహంలో ప్రార్థనలు జరుగును గాన నేను అచ్చటికి వచ్చేవారిని కలియజాలనని ఆయన చెప్పారు.

## 44

25-10-47

### ఢిల్లీ ఖైదీలు

ఢిల్లీఖైదీలనుండి అక్కడ ప్రార్థన జరుపమని పిలుపువచ్చినందుకు గాంధీజీ సంతోషపడెను. అచట చేరిన 3000 ఖైదీల ముందు ప్రార్థనలు జరిపెను. తాను కూడా మాజీఖైదీయే. దక్షిణాఫ్రికాలో మూడురకాల ఖైదీ లుండేవారు. కూలీ లని పిలువబడు భారతీయులు, ఆఫ్రికావాసులగు నీగ్రోలు, వలస వచ్చిన ఐరోపీయులు, ఈ మూడు రకాలను విడివిడిగా ఉంచేవారు. సత్యాగ్రహఖైదీలు ఎక్కువైనపుడు, మొదటి రెండురకాలను ఒకే ఆవరణలో ఉంచారు. సామాన్యఖైదీలు రాజకీయఖైదీలు అనే భేదం వారు చేయలేదు. అది ఒక విధానం. అది మంచిదే.

### తరగతులు వాంఛనీయం కాదు

భారత స్వాతంత్ర్య మహాపోరాటంలో ఉన్నతస్థాయి జనం కూడా పాల్గొన్నారు. సామాన్యఖైదీలు, రాజకీయఖైదీలు అనే భేదం ఉంది. రాజకీయఖైదీలలో ఎ,బి,సి తరగతులు ఉన్నవి. అవి ఆయనకు ఇష్టంలేను. అందరు మానవులు నేరాలుచేసేవారే. పట్టుబడిన కొందరు ఖైదులో నుందురు. పట్టుబడనివారు తప్పించుకుని తిరుగుచుందురు. ఒక ఇండియను జైలరు, తనక్రిందనున్న నేరస్థులకంటె తానే గొప్ప నేరస్థుడనని చెప్పెను. అందరికంటెను గొప్పవాడైన పైజైలరును ఎవరూ మోసం చేయలేరు.

## జైళ్ళు మానసిక ఆస్పత్రులుకావలెను

స్వతంత్రభారతంలో నేరస్థులందరిని రోగులుగా చూడవలెను. జైళ్లు ఆస్పత్రులు కావలెను. ఎవడూ కులాసాకొరకు నేరం చేయడు. అది ఒక రోగచిహ్నం. పెద్దపెద్ద భవనా లక్కరలేదు. ఈ బీద దేశం వాటిని భరించలేదు. జైలు ఉద్యోగస్తులు వైద్యులుగా, దాదులుగా వర్తించవలెను. ఖైదీలను ఇబ్బంది పెట్టుటకు కాక వారి మానసికస్థితి మారుటకు జైలు ఉద్యోగులు తోడ్పడవలెను. స్వరాజ్ సర్కారులు తగిన ఉత్తర్వులు ఇవ్వవలెను.

## ఖైదీల కర్తవ్యం

ఖైదీలు ఆదర్శఖైదీలుగా నుండవలెను. జైలు నిబంధనలు ఉల్లంఘించరాదు. తమకు ఇచ్చే పనిని హృదయపూర్వకముగా చేయవలెను. ఆహారధాన్యాదులను పరిశుభ్రం చేసుకోవలెను. తమకుండే ఫిర్యాదులను సగౌరవముగా అధికార్లకు తెలుపవలెను. ఖైదుకు వచ్చినప్పటి కంటె మంచివారుగా మారి బయటికి పోవలెను.

ఖైదీలలో హిందువులు, సిక్కులు, ముస్లింలు యున్నారట. వారు సాంఘిక దురభిమానానికి ద్వేషానికి లోనుగారాదు. స్నేహితులు సోదరులవలె వర్తించవలెను. ముస్లిం ఖైదీలకు గాంధీజీ శుభాకాంక్షలు తెల్పెను. ఇతర ఖైదీలుకూడా అలాగే తెలుపుదురని ఆయన ఆశించెను.

## 45

26-10-47

### దసరా నేర్పే పాఠము

ఏటేట గాంధీ అనుచరులు దసరారోజున జరిపే ప్రదర్శనంలో, రావణుని బొమ్మను రాముడు తగులబెట్టుచున్నట్లు చూపుదురు. అట్టిస్థితిలో పగదీర్చుకోవద్దు, ప్రతీకారముచెయ్య వద్దు అని గాంధీజీ చెప్పి లాభమేమని అడుగుచూ, శ్రోతలలో ఒకరు చీటి వ్రాసిరి. అందులో రెండు పొరపాట్లున్నవి. తాను తప్పు తన్ననుసరించే ఇతరులుఉన్నారని ఆయనకు తెలియవలెను. వ్యక్తిగతమైన ప్రతీకారం ఆ కథలో లేదు. హిందూమతానికి తెలిసిన దేవుడు రాముడే. అతడు మనుష్యుల మనస్సులను పూర్తిగా గ్రహించగలవాడు. రావణు డెవ్వడో స్పష్టంగా నిశ్చయించగలవాడు ఆయనే. ప్రతివాడు తానేరాముడు అనుకుంటే ఇక రావణు డెవ్వడు ? తప్పులు చేసే మానవులకు ఇతరుల తప్పులపై తీర్పు చెప్పే అధికారం లేదు. హిందువులు ముస్లింలు ఒండొరులపై చెయ్యి చేసుకోరాదు. అలా చేస్తే హిందూ ముస్లింల మతములు రెండూ నశించును. తాను సనాతన హిందువుగాన అన్ని మతాలకు ప్రాతినిధ్యం వహించగల ననెను.

### కాశ్మీర్‌లో సంఘటనలు

కాశ్మీర్ వార్తలను బట్టి పాకిస్థాన్ కాశ్మీర్‌ను నిర్బంధిస్తున్నట్లు అరోపణలు కనుపడును. కాశ్మీరునుగాని, హైదరాబాదును

గాని, చిన్నదగు జునగడ్‌ను గాని, ఏ ఇతర సంస్థానమున్నుగాని, అటు పాకీస్థాన్‌లో లేదా ఇటు భారతంలో చేరమని ఎవరూ నిర్బంధించ లేరు. ఆ సంగతి తేల్చే దెవరు ? తమ సంస్థానాలకు తాము నిజమైన పరిపాలకులు కామని, ఈ రాజాలు, మహా రాజాలు గుర్తించవలెను. ఆంగ్లసామ్రాజ్య తత్వం సృష్టించిన బొమ్మలు ఈ సంస్థానాధిపతులు. ఆంగ్లేయాధికారం అంతరించింది గనుక, అచ్చటి ప్రజలే ఆయా సంస్థానపరిపాలకులు. వారి తీర్మానమే నెగ్గితీరవలెను. ఈ సంస్థానాధిపతులు అచ్చటచ్చటి ప్రజల తరపున ధర్మకర్తలుగానే నిలువగలరు. లోపలినుండి లేక బయట నుండి వచ్చే నిర్బంధం లేక బెదిరింపుతో నిమిత్తం లేకుండా ఏరాజ్యంలో చేరేది కాశ్మీరు ప్రజలే నిర్ణయించుకో వలెను. ఈ సూత్రము మినహాయింపు లేకుండా, అన్ని సంస్థానాలకు వర్తించును.

## కలకత్తా శాంతంగానే ఉంది

దసరా ఈద్ పండుగలు కలకత్తాలో అత్యంతశాంతంగా వెళ్ళిపోయినవి. గాంధీజీ కలకత్తాలోనుండగా, ఏర్పడిచిన శాంతి సేన తీవ్రంగా కృషిచేస్తూ తమదళాన్ని తూర్పుబెంగాల్ కూడా పంపారట. అక్కడ కూడా ఈ పండుగలు శాంతంగానే జరిగాయి. ఢిల్లీగాని ఇతర-చోట్లగాని, కలకత్తాను ఏల అనుసరించరాదు ? తాను అన్ని మతాలకు అన్ని సంఘాలకు స్నేహితుడు కాన అందరు తననద్దకు వస్తూంటారు. ముస్లింలకు తాను

శుభము కోరును. కాని అవిశ్వాసముచే తన హృదయం కలత చెందుచున్న దనెను.

## శబాస్ రట్లాం

రట్లాం హరిజనసేవకసంఘం నుండి తంతి వచ్చింది. అచ్చటి మహారాజు, బాధ్యతాయుతప్రభుత్వం స్థాపింతుననీ, తన ప్రజతరఫున ధర్మకర్తగానుందునని అన్ని దేవాలయములలో ప్రవేశమిత్తునని ప్రకటించెను. సవర్ణఅనర్ణులను దేవాలయము లోనికి తనవెంట తీసుకొనిపోయెను. అస్పృశ్యతయొక్క ఆఖరు జాడకూడా హిందువుల హృదయాలనుండి వైదొలగవలెను. సాంఘిక వైషమ్యాలు కూడా ఒక విధమైన అస్పృశ్యతనే. దేవునిసమక్షాన అందరు సమానులే కాన భేదము ఏమాత్రం చేసినా, అది దైవద్రోహ మగును.

# 46

27—10—47

## బొమ్మని నిర్బంధించారా ?

భారత సమ్మేళనములోని ముస్లింలను బలవంతపెట్టి, ఇళ్ళు ఖాళీ చేయించి, శిబిరములలోకి నెట్టి అక్కడనుంచి కాలి నడకనో, లేక రయిలులోనో పాకిస్థాన్ పంపుచున్నట్లు ఫిర్యాదులు వచ్చుచున్నవి. ఇది మంత్రిమండలి విధానం కాదని నాకు తెలుసును. ఈ సంగతి ఫిర్యాదీలతో చెప్పి నపుడు, వారు నవ్వెదరు. మీకు వచ్చిన సంజాయిషీయైనా అబద్ధం, లేదా సర్కారు

సొకర్లు మంత్రులమాటలను వినరు అని వాదింతురు. కాని అందరు ఈలాటి ఫిర్యాదు చేస్తారు. బాగా సబబుగా కనుపడే ఒక్క కారణ మేమంటే సేనలోను, పోలీసులోను కూడా ఈ సాంఘిక దురభిమానా లుండి వాటివల్ల చిక్కులు కలుగు చున్నవి. వారు వీటికి వశమైతే, సక్రమ పరిపాలన పోయి అల్లరి యేర్పడును. అల్లరులు సాగితే సమాజం విచ్ఛిత్తు అగును. ఆ రెండు శాఖలలోని పెద్ద ఉద్యోగస్థులైనా, ఈ ద్వేషానికి అతీతులై చిన్న ఉద్యోగస్థులలో సద్భావనము నేర్పఱచెదరు గాక.

## శారీరక నైతికబలం

ఇప్పు డేర్పడిన మంత్రివర్గాలు, విదేశీసర్కారు అప్పగించి పోయిన ఉద్యోగబృందమును అదుపులో నుంచే శక్తినంతములు కావని ఒక ఫిర్యాదున్నది. ఇది కొంతవరకు నిజమే. కాని విదేశ ప్రభుత్వానిది భౌతికబలం. దానికి అనేక రెట్లు మించిన నైతిక బలం మంత్రివర్గాల కున్నది. మంత్రివర్గాలు స్వదేశీసర్కారు లోనివి కాన, జనసామాన్యంలో ఉండే నైతికబలం వారి కల వడుతుంది. దానిని కొలిచే వీలు లేదు. కేంద్రమంత్రిమండలి రాజీనామా ఇస్తే, అది తేలుతుంది. ఆ మంత్రిమండలి దుర్బ లంగా ఉండరాదు; ఉన్నాననే భీతి పొందరాదు. బలిష్ఠంగా నుండాలి; ఆ బలమును గుర్తించవలెను. ఏమాత్రం అవిధేయత చూపినా, అట్టి ఉద్యోగులను వెంటనే తొలగించాలి. లేదా ఆ

మంత్రి రాజీనామా ఇవ్వాలి; అవసరమైతే ఆ మంత్రిమండలియే పోవాలి. ఉద్యోగస్థుల అక్రమాలను అణచగల క్రొత్త మంత్రి మండలి ఏర్పడాలి. ఈ ఫిర్యాదులు నిరాధారము లని ఆశింతును. అందులో సత్యముంటే, పై అధికారులు తగిన చర్య తీసుకోవాలి.

## పౌరుల కర్తవ్యం

తన ఇల్లు వీడి పోవలెనని నిర్బంధపఱచగల శాసనం ఇప్పటికి ఈ దేశంలో లేదు. అలాటి అధికారం కావలె నంటే, ప్రత్యేక శాసనం ఏర్పడవలెను. ఇల్లు ఖాళీ చేయ మనే వ్రాత మూలకమైన ఉత్తర్వులు లేవు. నూాజువాణీ ఉత్తర్వులవల్ల బాధపడే వాళ్ళు వేలకొలది జనము ఉన్నారు. ఎవడు ఏ ఉత్తరువు ఇచ్చినా, జనం భయపడుతుంటే, అట్టి భయస్థులను సాయం చేయటం కష్టం. వ్రాతమూలకమైన ఉత్తర్వులు ఇప్పింపమని ప్రతివాడు కోరవలెను. అదే నే నిచ్చే గట్టిసలహా. ఆ ఉత్తర్వులు తప్పిదము లైతే, పై అధికారులవద్ద, అవసరమైతే న్యాయస్థానములవద్ద, వీటిపై సవాలు చేయవచ్చును.

అధికసంఖ్య జనంగల హిందూసమాజము తామే చట్ట అమలుదారులు కారాదు. అలా చేస్తే, లేవ లేనంత లోతుగా పడిపోతారు. వ్యవధి ఉండగానే, వివేకోదయం అగుగాక.

# 47

28-10-47

## న్యాయమైన వ్యవహారం

శ్రోతలలో ఒకరు గాంధీజీ పేర చీటి వ్రాసిరి. తనకు అద్దెకు గుడారాలు, తెట్టలు ఇచ్చిన ముస్లిం వర్తకుడు పాకిస్థాన్ పోయెనట. ఆ వస్తువులు ఎవ్వరికి ఇవ్వవలె నని అడుగగా, సర్దారు పటేల్ కో, మంత్రి నియోగికో చెప్పమని గాంధీజీ జవాబు చెప్పెను.

## ఆలిఘరు విద్యార్థులు

ఆలిఘర్ నుండి పాకిస్థాన్ పోయిన విద్యార్థులు చాలా మంది తిరిగి రాలేదని, కాలేజీలో నిలువ ఉన్నవారు, సాంఘిక సామరస్యం పెంపొందించుటకు నిరాడంబరంగా సేవచేయ తీర్మానించు కొన్నారని, ఒక ఆలిఘర్ విద్యార్థి గాంధీజీకి తెల్పెను. హిందూ సిక్కు శరణార్థు లున్నచోటికి పోయి గొంగళ్ళు వగైరా పంచుతా మని విద్యార్థి సూచించగా, సేవచేసే ఇచ్ఛ మంచిదైనను, అతడు సూచించిన పని అనవసరమని గాంధీజీ తెల్పెను.

ముస్లింవిద్యార్థులు పాకిస్థాన్ పోయి, అచ్చటి హిందువులు సిక్కులు ఏల తమ ఇళ్లు వాకిళ్లు వదలిపోయిరో, అచ్చటి ముస్లింలను అడిగి తెలుసుకోమని, గాంధీజీ సూచించెను. ఆయా శరణార్థులవద్దకు పోయి తమ నెలవులకు తిరిగి రమ్మని వారిని

ప్రతిమాలి ఒప్పించ మని చెప్పెను. అలాగే, ముస్లిం శరణార్థుల విషయంలో హిందువులు సిక్కులు కృషి చేయవలెను. న్యాయమైన బలవత్తరమైన కారణం లేనిదే, ఎవరూ తన ఇల్లు వాకిలి వదలరు. ఇలాటి పునరుద్ధరణ లేకపోతే, రెండు దేశాల మధ్య శాంతి సాధ్యం కాదు.

## టికెట్టులేని ప్రయాణం

ఇది ఈ రోజులలో ఒక సామాన్య జాడ్య మైంది. స్వాతంత్ర్యం వచ్చింది గాన, రయిళ్ళలో బస్సులలో టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేయవచ్చు నని ప్రజలు అనుకుంటున్నారు. ఇందువల్ల సర్కారుకు అప్పుడే 8 కోట్లు నష్టం వచ్చింది. అదీ గాక లక్షలకొలది శరణార్థులకు ఉచితంగా తిండి బట్ట ఇచ్చుటకు మితిలేని ఖర్చు అగుచున్నది. ఇలాగే సాగితే మనదేశం దుంపనాశన మగును. పాకిస్థాన్‌గతి ఇంతకంటె మేలు కాదట.

రయిల్వేపెట్టెలను పరిశుభ్రంగా ఉంచుట అవసర మని గాంధీజీ గట్టిగా తెల్పెను. ఎక్కడబడితె అక్కడ ఉమ్మివేసే దురలవాటును ఖండించెను. తగిన కారణము లేకుండా గొలుసును లాగరాదని మందలించెను.

తానే రయిల్వేశాఖను నడుపుచుంటే, టిక్కెట్టులేని జనం రయిలు ఎక్కినపుడు, ఆ రయిళ్ళను ఆపెద నని చెప్పెను. బాకీ చెల్లించినపుడే, ఆ రయిలు కదులును.

# 48

29-10-47

## దిలీపకుమారరాయి

ఆ సాయంకాలము భజనకీర్తన పాడిన దిలీపకుమార రాయిని, ఆయన సభికులకు ఎరుకపఱచెను. పూనాలోని సాసూను ఆస్పత్రిలో గాంధీజీకి శస్త్రం చేసినపుడు ఈ రాయి అక్కడ పాటలు పాడి వినిపించెను. అప్పటికంటె ఎక్కువగా ఆయనగాత్రం శ్రావ్యంగా సమృద్ధంగా నుండెను. ఆయనవలె సహజమైన మాధుర్యంగల కంఠస్వరం లోకంలో ఏ కొద్ది మందికో యుండవచ్చును. పుదుచ్చేరిలో ఋషి అరవిందుడు పెట్టిన ఆశ్రమములో జాతిమతభేదములు లేవు. ఆ ఆశ్రమానికి చెందినవాడు ఈ రాయి. సర్ అక్బర్ హైదరీ అచ్చటి ఆశ్రమ తీర్థయాత్రకై వెళ్ళినపుడు రాయి సగౌరవంగా వర్తించెను. మధ్యాహ్నం వచ్చినపుడు ఆ రాయి వందేమాతరంను సారేజహాన్‌సే అచ్చా అనేకీర్తనను చక్కగాపాడెను. ధనికులు తమ భవనాలు వాహనాలు వగైరాలను ఆస్తిగా యుంచు కుంటే, మురారి, రామ, హరి మొదలగు పేర్లతో తాను ప్రార్థించు దేవుడే భక్తుని సర్వస్వం, అమూల్యమైన ఆస్తి ఐ ఉన్నాడు.

## కాశ్మీర్ పడే బాధ

కాశ్మీర్ మహారాజు ఆపదలపాలై భారత సమ్మేళనలో చేరుతానని వచ్చినపుడు రాజప్రతినిధి కాదనలేకపోయెను. కాశ్మీ

రుకు వాయువిమానాలలో సేనను పంపిరి. మతంతో నిమిత్తం లేకుండా నిష్పక్షపాతంగా జనవాక్యం నిర్ణయింపజేసి దాని ప్రకారం ఏరాజ్యంలో చేరేది తీర్మానించుకోవచ్చు నని కాశ్మీర్‌కు హామీ నిచ్చిరి. మహారాజా షేక్ అబ్దుల్లాను మంత్రిగా పెట్టుకొనెను. కార్యభారం వహించుటకు అబ్దుల్లా అంగీకరించెను. ఆఫ్రిడీలు మొదలగు అడవిజాతులతో కలిసిన తిరుగుబాటుసేన చక్కని సేనాపతుల క్రింద శ్రీనగర్ మీదికి వచ్చి పడుచుండెను. దోవలో ఊళ్లు దోచి తగులబెట్టి విద్యుత్ శక్తి ఉత్పత్తి భవనమును కూడా ధ్వంసం చేసిరి. శ్రీనగర్‌లో దీపాలు లేవు. పాకిస్థాన్ ప్రభుత్వపు ప్రోత్సాహం లేనిదే ఇలా జరుగగలదా ? ఆ విషయం తేల్చుటకు తగిన సాక్ష్యంలేదు. అవ సరమున్నూ కాదు. భారతప్రభుత్వం సేనలనుపంపుట న్యాయమే. అందువల్ల కాశ్మీర్ సింహమైన అబ్దుల్లాకు ముఖ్యంగాను కాశ్మీరీ లకు గట్టివిశ్వాసము ఏర్పడును. తక్కిన పని దైవం చేయును. ఈ కొద్ది సేన కాశ్మీర్ సంరక్షణ కార్యంలో ప్రాణా లర్పించినా ఆయన దుఃఖించడు. కాశ్మీర్‌జనం స్త్రీలు పురుషులు ఆ దేశ రక్షణలో బలి అయితేనూ వారి పౌరుషదీక్ష భారత మంతకును తేజం కల్పించును. అప్పుడు హిందువులు ముస్లింలు సిక్కులు జనం ఒ లగుదురు. లోకంలో సత్పురుషు లుండ బట్టే ప్రపంచం బాకీ న్నోంది. తిరుగుబాటుసేన కూడా మార్పు పొందు నేమో ?

పూజించినా మన మందరం ఒక్క దేవుని సంతతియే.

# 49

30-10-47

## అహింసాచరణ

ఖురానుతో కలిసిన ప్రార్థనకు ఆక్షేపణ యున్నదా యని అడుగ, ఒకరు గట్టిగా అడ్డుపెట్టిరి. ఏ ఒక్కరు ఆక్షేపించినా ప్రార్థనలు జరుపనని పిమ్మట ఉపన్యాసము చేయనని గాంధీజీ స్పష్టపఱచెను. గాంధీజీ సందర్శనము లేనిదే సభికులు వెళ్ళిపోమని పట్టుబట్టుటచే గాంధీజీ తనగది నుండి వచ్చి వేదికనెక్కి అహింస ఎట్లు సఫల మగునో తెల్పే ప్రార్థనకు ఆక్షేపించుట ఎవరికైనా తగదు. అందులోను స్వాంతస్థలములో జరుపు ప్రార్థనకు అసలే ఆక్షేపింపరాదు. అధికసంఖ్యాకులు ఆ ఆక్షేపకుని మీద తిరుగ బడి వానిని భయపెట్టవచ్చును. అందువల్ల ఆయన ప్రార్థన ఆపెను. కాని సభ వారందరు ఆక్షేపిస్తే, అపుడు తనకు శరీర హాని కలిగినా సరే, నిర్లక్ష్యంచేసి ప్రార్థన జరుపుట తన కర్తవ్య మగునని ఆయన చెప్పెను. ఒక్కనికొఱకు అధికజనులకు నిరాశ కల్పించుట భావ్యమా అను ప్రశ్న కూడ కలదు. దానికి మందున్నది. అధికసంఖ్యాకులు ఆ ఆక్షేపకునిమీద కోపము దుర్భావము పెట్టుకొనక, నిగ్రహం కలిగి యుండే యెడల, అప్పుడు కూడా ప్రార్థన సలుపుట తన కర్తవ్యముగా ఆయన భావించును. వీరి భావముయొక్క ఫలితముగ ఆ ఆక్షేపకుడు కూడా తన్నుతా నిగ్రహించు కోవచ్చును. అహింస అలా పనిచేయును. సత్య అహింసలు కొద్దిమంది నిపుణుల ప్రత్యేక

సొత్తుకాదు. దైవాజ్ఞలు అని చెప్పేవాటిని సులభంగా అర్థం చేసుకోవచ్చు. సుకరముగా ఆచరించ వచ్చును. తగిన కోరిక వుంటే చాలు; మానవుని ఆవరించిన మాంద్యం వలన అవి కష్టంగా కనుపడుతవి. మానవుడు వృద్ధికాముడు. ప్రకృతి చలన రహితం కాదు. పరిణామము పొందుతూనే యుండును. దేవు డొక్కడే నిశ్చలుడు. నిన్న, రేపు, నేడు ఒకేవిధముగా నుండు వాడు. అయినా ఎల్లప్పుడు కదలుచున్నట్లే యుండును. మానవ జాతి బ్రతుకవలెనంటే, నానాటికి సత్య అహింసల మార్గం లోకి రావలెను.

# 50

31-10-47

## మార్గదర్శకమైన ప్రవర్తన

ఆ సాయంత్రం ప్రార్థనపుడు నిన్నటిమనిషి, మరియొకరు కురాను మంత్రాలతో కలిసిన ప్రార్థనకు మిక్కిలి నెమ్మదిగా ఆక్షేపించిరి. అట్టి ఆక్షేపణదార్లు ఈప్రార్థనలకు రాకుండుటయే భావ్యమని గాంధీజీ అనెను. నిన్న చెప్పిన రీతిని నిగ్రహంతో ప్రవర్తించెదరా యని ఆయన వేసిన ప్రశ్నకు, ఒక్కుమ్మడిగా సభికు లందఱు ఆక్షేపకుల జోలికి పోమని జవాబు ఇచ్చిరి. ఆక్షేపకుల వద్దకు పోవద్దని ఆయన పోలీసుతో కూడ చెప్పెను. సక్రమంగా ప్రార్థనలు జరిగెను. ఆక్షేపకులును సభ్యులును వారు చూపిన సౌజన్యమునకు గాంధీజీ అభినందించెను.

## మనస్సొక దేవాలయం

దిలీపకుమారరాయి ఆహ్లాదకరంగాపాడిన భజనకీర్తనలో భక్తుని డెందము దేవుని మందిరముతో పోల్చబడెను. పవిత్ర మైన ప్రేమ, స్థిరముగా అచ్చట నెలకొని భక్తుని హృదయము నకు వెలుగు నిచ్చును. అందుచేత అతనిదృష్టి కళంకరహితము అగును. ఇదే అహింస యొక్క కార్యరూపం.

దేవునిమీద నిలువని మనస్సు చలించును. దేవాలయ లక్షణ మపుడు లోపించును.

## బీద-సాద

శరణార్థులలో బీదసాదలమధ్య యుండే అంతరమును గూర్చి గాంధీజీ ముచ్చటించెను. నౌకాలీలోను ఢిల్లీలోను కూడా భాగ్యవంతులు బీదలను నిస్సహాయస్థితిలో వదలి కల్లో లిత ప్రాంతం నుండి పారిపోయిరి. అది న్యాయం కాదు. బీద వారిమీద వారు జాలి చూపాలి. అందఱు కలిసియే తేలాలి లేక మునగాలి. ఇట్టి విపత్తులో నైనా ఉచ్చ నీచ, బీద సాద భేదాలు పోవాలి. అప్పుడు వీరి శిబిరాలు పారిశుద్ధ్యానికి సహ కారానికి మచ్చు తునకలుగా ఉంటవి.

## నిర్బంధంగా మతాలమార్పు పనికిరాదు

వందలకొలది ముస్లిములను బలవంతంగా హిందూ సిక్కు మతములలో చేర్చినారని కొందరు ముస్లిములు ఫిర్యాదు చేసిరి. ఆయన వాటిని ఖండించెను. ఇష్టంలేని వారిపై క్రొత్త

మతము రుద్దరాదు. అట్టివి చట్టప్రకారము చెల్లవు. అట్టివారు మరల తన పూర్వమతమును అవలంబింపవచ్చును. ముస్లిము మతంలోకి మార్చబడ్డవారికని, ఇదే సూత్రం వర్తించును. లేకుంటే మూడు మతాలు మునిగిపోతవి. తమను చూచి అల్ప సంఖ్యాకులు భయపడకుండునట్లు అధికసంఖ్యాకులు మెలగ వలెను. ఇష్టమున్నవారెక్కడికైనను పోవచ్చును. పోక నిలిచి యున్నవారికి తగిన రక్షణ యుండవలెను. ఏ సందర్భము లోను ఎవరిమీదా ఒత్తిడి ఉండరాదు. తమతమ యిండ్లకు క్షేమంగా గౌరవంగా శరణార్థులు తిరిగివత్తురని గాంధీజీ ఆశించెను.

# 51

1–11–47

## దేవుని నివాసస్థానము

నిన్నటి ఆక్షేపకుడు వచ్చి మర్యాదగా తన ఆక్షేపణను తెలిపెను. సభికులు నిన్నటి వలెనే హామీ నిచ్చిరి. మామూలుగా ప్రార్థన జరిగెను. దిలీపకుమారరాయి పాడిన కీర్తనలో పీడ, దుఃఖము లేని దేశమునకు చెందినవాడు భక్తుడన్న వాక్యమునకు గాంధీజీ రెండు అర్థములను వివరించెను. ఆ రెండూ లేని దేశము భారతదేశము. భారతదేశ చరిత్రలో అట్టి కాల మేదీ కనుపించదు. కాన అది కవియొక్క ఆకాంక్షయే. ఆ కవి పలుకరించినది ఆత్మను; దానికి ఆలయ మగు దేహమును. భగవద్గీత చెప్పినట్లు, క్షణభంగురము లగు ఉద్రేకాదులకు ఉనికిపట్టు గాక,

నిజమైన మతిమునకు ఆవాసమైన దేహములోనే ఆత్మ నివసించును. కామక్రోధాది అరిషడ్వర్గమును జయించిన ప్రతివానికిని ఈ సౌఖ్యస్థాయి లభ్యము కాగలదు. ఇట్టివారి సంఖ్య ఎక్కువైతే, భారతదేశమును గూర్చి కవిచేసిన ఊహ త్వరలో నిజమగును. కురుక్షేత్రశిబిరమునుండి వచ్చిన వైద్యురాలు అక్కడి జాలికొలుపు స్థితిని వర్ణించినది. అది భారతదేశ దుస్థితికి తార్కాణము. వైద్యులు, మందులు, బట్టలు, గొంగళ్లు ఎక్కువగా కావలెను. రెండో పంచ లేనివారు చాలమంది కలరు. మిక్కిలి కష్టపడి, పిల్లలను తల్లులు చలినుండి కాపాడుచున్నారు.

## షేకు అబ్దుల్లా

కాశ్మీరు పోయే విమానాలు చేసేచప్పుడు వింటే, అచ్చటి ముఖ్యమంత్రి అబ్దుల్లావైపు, ఆయన ప్రజలవైపు గాంధీజీ మనసు పోవుచుండెను. అబ్దుల్లా ఎల్లరకు మిత్రుడు; ముస్లింలకు ముస్లిమేతరులకు ప్రతినిధి. ప్రజలు భయపడి కాశ్మీరునుండి పరుగెత్తరాదు. స్త్రీలు, పురుషులు, పెద్దలు, పిన్నలు తమ దేశరక్షణకై నిర్భయంగా ప్రాణము లర్పించవలెను. ప్రజలందరు, సేనయంతయు దేశరక్షణలో చనిపోయినా సరే. కాశ్మీరును వదలివేసే వివేకము కొండజాతులకు, గజదొంగలకు కలుగుగాక !

## కురుక్షేత్రంలోని శరణార్థులు

వీరిబాధలు మిక్కుటమే. పాకిస్థాన్ శరణార్థుల బాధలు కూడా తక్కువగా నుండవు. ఇప్పటి వెర్రికి ఈ దుస్థితి తగిన ఫలి

తమే. దానినుండి బయటపడుట కొకటే మార్గము; వైరభావ మును విసర్జించి అందరిని స్నేహితులుగా ఆదరించవలెను.

## 52

2-11-47

### పూర్తిసహకారము అవసరము

రోజూకంటె సభ పెరిగింది; ఖురాన్ చదువ వద్దనే ఆక్షేప కులసంఖ్య పెరిగింది; బయటికిపోక్క-నీయకుండా ఆక్షేపించేవారు కూడా కొంద రున్నా రట. కాని అందరు మర్యాదతో నిగ్ర హంతో ప్రవర్తించారు. ఈ సంగతులు తెలిసిన గాంధీజీ ప్రార్థ నకు పూర్వం కొన్ని విషయములు తెలిపెను. మోమాటము లేకుండా ఆక్షేపించి నందుకు ఆయన సంతోషించెను. తనకు మహాత్ము డనేపేరు ఉన్నందున, లేదా తాను జాతికి చాలా సేవ చేసినందున వారందరు తనను చూడ, విన, వచ్చారని ఆయన తలంచ పూనుకోలేదు. వారు ప్రార్థనలో పాల్గొనుటకు రాలేదని కొనడం ఆయనకుఇష్టంలేదు. ప్రార్థనలో అన్ని ఇమిడి యున్నవి. దేవున కనేక పేరు లున్నవి; చివరదాకా పరిశోధిస్తే మానవు లెన్నికోట్లో అన్ని పేర్లు దేవున కున్నవి. పశువులు, పక్షులు, పాషాణములుకూడా దేవుని పూజించును. ఉదయం సాయంత్రం పిట్టలు చేయు కిలకిలారావములు దైవ ప్రార్థనయే అని యొక ముస్లిం భక్తుడు వర్ణించెను. కురాను నుండి గాని, ఇతర మత గ్రంథమునుండి గాని గైకొన్న భజనలకు ఆక్షేపించుట బుద్ధ

హీనత. కొందఱు మతావలంబులు చెడ్డవారగుటచే, ఆమతకర్తలు చెడ్డవారని చెప్పరాదు. గాంధీజీ ఖురానంతా చదివి మేలు పొందెను. ఇతర మతగ్రంథాలు చదివి ఉపకారము పొందెను. ఖురానుప్రకారము హిందువులు కాఫీర్లు కాదా యని, కాఫీర్లను గూర్చి మహమ్మదు బోధ ఏమని, బొంబాయి మిత్రు డొకరు ప్రశ్నించెను. కాఫిర్ అర్థాన్ని గూర్చి ముస్లింమత విద్వాంసులను గాంధీజీ అడిగారు. కాఫిర్ అంటే అవిశ్వాసి, నిరీశ్వరవాది అనిన్ని, హిందువులు ఈశ్వరునియందు నమ్మకం కలవారు గాన వారు కాఫిర్లు కానేర రనిన్ని, ఆ విద్వాంసులు జవాబు చెప్పిరి. విరోధుల విమర్శలు నమ్మితే ఖురాన్ను మహమ్మదు ప్రవక్తన్ను ఖండించవలసి వచ్చును. అలాగే కృష్ణుని భారత భాగవతములను ఖండించవలసి యుండును. కాని గాంధీజీ పూజించే కృష్ణుడు నిష్కళంకుడు; వ్యభిచారి ముందు గాంధీజీ ఎన్నడు తలవంచడు. ప్రతిసాయంత్రం గాంధీతో సహా అక్కడ ఉండే ప్రజలు సమిష్టిగా పూజించే దేవుడు అందరిలో నివసించువాడు, సర్వబలోపేతుడు. అందువల్ల వారలకు విరోధి ఉండడు. తమలోను, ప్రతి నిమిషము తమకు అండగాను ఉన్న, దేవునికి తప్ప మరెవ్వరకు వారు భయపడరాదు. ఈ భావాలతో ప్రార్థనలో పాల్గొనలేని వారితో సమిష్టి ప్రార్థన జరుపుటకు గాంధీజీకి ఇష్టము లేదు. అలా ప్రార్థన చేస్తే నానాటికి బలంకలుగుతుంది. తమను చుట్టుకున్న చీకటిని పోద్రోలగలరు. ప్రార్థన కావలయునా లేదా ? అని గాంధీజీ అడుగగా, ఉత్సాహంతో కావలెనని ప్రజలు

జవాబుచెప్పిరి. ఆక్షేపకుల విషయంలో హామీగా ఇచ్చిరి. అంతట మామూలుగా ప్రార్థనజరిగెను.

## కాలవ్యవధి

కాశ్మీర్‌కు తగినసేనాసహాయం పంపబడినది. సర్కారుకు విమానాలులేకపోయినా, వర్తకసంస్థలు సరఫరాచేయుట సంతోషము. కాలము దోపిడీదార్లకు వ్యతిరేకముగ ప్రభుత్వమునకు కలిసివచ్చెను.

## ఆజాద్‌హింద్‌ఫౌజు ఉద్యోగులు

శ్రీ॥ శ్రీ॥ సుభాసుచంద్రబోసు మహానాయకత్వాన పోరాడిన సేనలోని ఉద్యోగు లిద్దరు, ఈ దోపిడీదార్ల నాయకత్వం వహించుట దుఃఖకరము. ఆ సేనలో ఉన్న వివిధ మతాలవారు తమతమ మతాలను నిలుపుకొని, భేదము లేకుండా భారతీయుల మనిభావించి, సోదరత్వం, సఖ్యత నెలకొల్పి, వారు విముక్తులైన పిదప వారిని ఢిల్లీకోటలోను, బయటను గాంధీజీ కలుసుకొనెను. అమాయకులను చంపుతూ, ఊళ్ళను తగులబెట్టుచూ, లూటీ చేస్తూ ఉండే దోపిడీదార్ల నెందుకు వారు నడిపించుచున్నారో, గాంధీజీకి బోధపడలేదు. చెడుపనులను చేయిస్తూ కొండజాతులకు వీరు గొప్ప అపకారం చేస్తున్నారు. వారిని ఆదోవనుండి తప్పించవలెను. తానైతే అలాగే చేసి యుండును. ఇండియాకుగాని ఇస్లాముకుగాని పేరు అబ్దుల్లా నష్టముచేస్తున్నా డనుకుంటే వారు వెళ్ళి ఆయనతో మాట్లాడవచ్చును. తన ఈవిజ్ఞాపన వారి కంది, వారు మంచిమార్గమునకు మరలుదు రని, గాంధీజీ ఆశించెను.

## పాకిస్థాన్ ప్రోత్సాహపఱచుచున్నదా ఏమి !

పాకిస్థాన్‌సర్కార్ ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఈ దాడికి తోడ్పడుతున్నా రనే సంగతి గాంధీజీకి తట్టక తప్పింది కాదు. సరిహద్దు ప్రాంతపు ముఖ్యమంత్రి బహిరంగంగానే చేయూత ఇచ్చాడని ఒక వార్త. ముస్లిములోక సహాయాన్ని కూడ అర్థించాడట. కాశ్మీరుకు నెహ్రూప్రభుత్వము చేయుచున్న తోడ్పాటు బూటకమని దానినికాజేయుటకే చాలకాలమునుండి పన్నాగము పన్నబడెనని పత్రికలలో వ్రాయబడెను. ఇది చాల ఆశ్చర్యకరము. ఇప్పటికీ భారతసమ్మేళనము పాకిస్థాన్‌కు విరోధ యని జిన్నా చెప్పుచునే యున్నాడు. దానికి భిన్నంగా కరాచీ లాహోరులనుండి వచ్చిన స్నేహితులు సద్భావం పెరుగుతున్న దని చెప్పారు. ఒండొరు లాశ్రయ మిచ్చుకొంటు న్నారట. ఒక సిక్కుస్నేహితునకు, అతని గ్రంథసాహేబుకు ముస్లిం ఒకరు తన ఇంట్లో ప్రత్యేక వసతి కల్పించాడట. అలాగే హిందువులు, సిక్కులు ముస్లింలకు తోడ్పడి రని చెప్పవచ్చును. ఈ జనాభా మార్పిళ్ళను గూర్చి దుఃఖపడే ముస్లింలు కలరట. ఈశరణార్థుల మహాప్రవాహాన్ని ఏ సర్కారు అరికట్టలేదు. పరస్పర నిందలు అనుమానాలు పోతే, అప్పుడు ఈ ప్రవాహం ఆగుతుంది. అందుకై అందరూ దైవాన్ని ప్రార్థించవలెను.

# 53

3—11—47

## సాంఘిక దురభిమాన మనే విషము

రెండు మోటాదుల విషం కలిపినప్పుడు, ఏ మోటాదు ముందు వేయబడెనని ప్రశ్నించి గాని తీర్మానించి గాని లాభ మేమి ? పశ్చిమపాకిస్థాన్ అంతా ఈవిషం వ్యాపించింది. భారత సమ్మేళనలో కొద్దిభాగంలో పాకింది. ఇంక వ్యాపింపకుండుగాక!

## కంట్రోళ్లు ఎత్తివేయండి

వీలైనంత త్వరలో, ఆరు నెలలకు మించకుండా, ఈ కంట్రోళ్ళను పూర్తిగా తొలగించాలని మొదటనుంచీ నాకున్న అభిప్రాయమును ఈమధ్య విన్న సంగతులను బట్టి మార్చుకో వలసిన అవసరమే నాకు కనబడలేదు. రెండు కంట్రోళ్లు తొల గించవలెనని రోజూ ఉత్తరాలు, తంతెలు వచ్చి పడుచున్నవి. ఇప్పుడు బట్ట సంగతి ఎత్తుకొనుట లేదు.

## కంట్రోళ్ళవల్ల చెడుగు కలుగును

దీనివల్ల కృత్రిమపు కరువు, దొంగవ్యాపారము, మోసం, సత్యమును అణచుట కలుగుచున్నవి. ప్రజలు నిర్వీర్యు లగుచు న్నారు. కార్యారంభశక్తి పోతున్నది. ఒక తరమునుండి నేర్చు కొనుచున్న స్వయంసహాయపాఠము పాడగుచున్నది. ఇది పెద్ద విషాదవిషయము. ఇపుడు జరుగుచున్న హత్యాకాండకు తుల్య మైంది.

ఈ ఆహారపదార్థ కంట్రోలు గత యుద్ధంనుంచి మిగిలిన దుష్టఫలితం. అప్పుడు ఆహారపదార్థాల ఎగుమతి అవసరమైంది. ఆ అసహజమైన ఎగుమతి వలన కల్పితమైన కరువు ఏర్పడినది. ఇపుడు ఈ ఎగుమతిని ఆపవచ్చును. ఇతరదేశాల నుండి ఆహార సహాయం కోరకుండా ఉంటే, నిజమైన కరువుతో బాధపడే దేశాలకు మనము తోడ్పడుదుము. గత 50 ఏళ్ళలో దైవిక మైన అనేక కరువులు నేనుచూచితిని. అప్పు డీరేషనింగుమాటే ఎవరూ తలపెట్టలేదు. ఈ ఏడు వానలు కురిసినవి. కావలసినన్ని ధాన్యాలు, పప్పుగింజలు, చమురుగింజలు గ్రామాలలో ఉండనే ఉన్నవి. మనకు నిజముగా ఆహారకొరత లేనేలేదు. ఈ ధరల కంట్రోలు రైతులు గ్రహించలేరు. బజారులో గిట్టే ధరకంటే తక్కువ ధరకు అమ్ముటకు వారు నిరాకరించారు. కరువు ఉన్న దని ఋజువుచేయుటకు ఇంతమంది ఉద్యోగస్థులు, ఇన్ని నివేది కలు అక్కరలేదు. మన జనాభా పెరుగుతున్న దని, మనల నెవరు భయపెట్టకుందురుగాక.

## అనుభవజ్ఞుల సలహా

మనమంత్రులు ప్రజలనుండి వచ్చిన ప్రజయే. మంత్రులు కానట్టి అనుభవజ్ఞుల కంటె తమకు ఎక్కువ జ్ఞానము కలదని మంత్రులు అనుకొనకుందురు గాక. ఎంత త్వరలో కంట్రోలు తొలగిస్తే అంత మేలని, వారు గట్టిగా చెప్పే సలహాను వీరు తోసి వేయకుందురు గాక. తినదగిన ఆహారధాన్యాలు ఇపుడు దొర కుట లేదనియు, రేషనింగ్ పేర పంచబడే పాడుసరుకు వలన

అనవసరముగా కలిగే రోగాలచేత ప్రజలు బాధపడుచున్నా రనియు ఒకవైద్యుడు గాంధీజీ పేర వ్రాసెను.

## ప్రజాస్వామ్యం—విశ్వాసం

కంట్రోలు బదులు, సర్కారు బజారులో మంచిసరుకు కొని, తమ దుకాణాల ద్వారా అమ్మించవచ్చును. అప్పుడు ధరలు వాటంతట అవే సర్దుకొనును. ధాన్యం పండించు వారిని, ధాన్యవర్తకులను సర్కారు ఏల నమ్మదు! ప్రజలను నమ్మితేనే ప్రజాస్వామ్యం నెగ్గగలదు. కాయకష్టం చేయనందున ఒంటరులను మోసగించి నందున, కొందరు జనం చస్తే అదియు మేలే. సోమరిగాను, ఘోర స్వార్థిగాను ఉండుట పాపమని తక్కిన వారు నేర్చుకొందురు.

## 54

4–11–47

### కోప ఫలితము

పంజాబీ హిందూశరణార్థి ఒకరు కురానే సూత్రాల పఠనమునకు ఆక్షేపించుచు హృదయవేదనతో మిక్కిలి జాలికరమైన జాబు వ్రాసెను. అందులో వాదం కొంచెం బాగానే ఉన్నది. కాని, కోపం వల్ల పుట్టిన అజ్ఞానంతో నిండియున్నది. అందులోని ప్రతి పంక్తిలో కోపం తలయెత్తుతున్నది. గాంధీజీ సమయమంతా హిందువులో, ముస్లింలో, సిక్కులో చెప్పుకొను విషాదగాథలు వినుటతోడనే సరిపోవుచున్నది. ఆయన గుండె

కరిగినా, ఆయన మనసు గాయపడినా, ఆయన శోకిస్తే, అది అహింసాచిహ్నం కానేరదు. తిండికి, నిద్రకు, ప్రార్థనకు వ్యవధి లేకుండా, రోజల్లా ఆయన ఏడుస్తూ ఉండవలసినదే. తనకు తెలియవచ్చే దుఃఖములను గూర్చి విలపించరాదని చిన్నప్పటి నుండి అహింసామార్గాన అలవాటు చేసుకొన్నారు. ఆ దుఃఖాలను ఎదిరించ కలుగుటకై తన గుండెను రాయి చేసుకున్నారు. అహింసాపూర్ణునకు పుష్పంకంటె కోమలమైనట్టియు, చెకుముకి రాయికంటె కఠినమైనట్టియు హృదయము ఉండవలెనని పూర్వ ఋషులు చెప్పిన సలహా ప్రకారము ఆచరించ ఆయన ప్రయత్నము చేయుచున్నారు. పైనిక సమస్యలు పరిష్కరించుటకు గుండెను పదిలపరచుకొన్నారు. ఆ లేఖ ఉర్దూ లిపిలో ఉండగా శ్రీబిజక్రిషన్ ఆ ముఖ్యాంశములు వ్రాసియిచ్చెను.

## అర్థసత్యము - అసత్యము

ప్రార్థనకు ఒక్కరు ఆక్షేపించినా ఆ ప్రార్థన ఆపుదునని చెప్పి, గాంధీజీ దానిని భంగపరచెను- అని ఆక్షేపకుడు అనెను. పూర్తి అసత్యముకంటె, అర్థసత్యము మరింత అపత్కరమని గాంధీజీఅన్నారు. అప్పటినుండి సభికులు నిగ్రహంనేర్చుకున్నారు. ఆక్షేపకునిమీద మనస్సులలో కూడ దుర్భావము లేక కోప ముంచుకో మని హామీ ఇచ్చారు. ఆక్షేపకులు కూడ మర్యాదగా వర్తిస్తున్నారు. అందుచేతనే ఆయన ప్రార్థనలు జరుపుచున్నారు. అందులో స్వవచన వ్యాఘాతము లేదు. ఆయన

అనుకొన్నట్లు చక్కని ఫలితాలు సమకూరినవి. ఆయన దీర్ఘ జీవితంలో దీని కెన్నడూ భంగం కలుగలేదు.

కురాన్‌నుండి చేసినట్లు జన్‌జీనుండి, బైబిలునుండి కీర్త నలు తీసుకో లేదేమని ఆయన చేసిన ఆక్షేపణ, అజ్ఞానమునే వెలిబుచ్చుచున్నది. తరచుగా బైబిలునుండి, గ్రంథసాహెబు నుండి, భజనలు పాడబడుచున్నవని గాంధీజీ లోగడనే తెల్పెను.

## ధనికులైన శరణార్థులు

పాకిస్థాన్‌నుండి వచ్చిన సుప్రసిద్ధ కాంగ్రెసునాయకులైన ధనాఢ్యశరణార్థులు బీదశరణార్థులను కలవక వారికి తోడ్పడక పూర్వముకంటె మించిన రాజఠీవితో కాలము గడుపుచున్నా రని ఆయన మూడవ ఆక్షేపణ. అది నిజమయితే అవమాన కరమే. ఇట్టి చర్యను ఖండించుటకు గాంధీజీ సంకోచింప లేదు.

## ఢిల్లీలోని కర్తవ్యము

మొదట సంకల్పించినట్లు పాకిస్థాన్‌కు ఏల పోలేదని ఆ ఆక్షేపకుడు గాంధీజీని ఎత్తిపొడిచెను. అక్కడ నుండే హిందూ శిక్కుల తోడ్పాటుకై పోక, ఇక్కడ నుండి ముస్లింలకు ఏల సాయ పడుచున్నావని అడిగెను. ఢిల్లీలోని తనధర్మమును విడచి పాకిస్థానుకు పోతే అతడేమి సాధింపగలడో పాపమీ ఆక్షేపకుడు గ్రహించలేక పోయెను. ఆయన అందరకు సేవకుడు. ఏ ఒక్క రికో చేయు ప్రత్యేక సేవ యందు ఆయనకు నమ్మకం లేదు. భారతంలోను, లోకమంతటిలోను అతడొకవ్యక్తి అనే భావన తోనే గాంధీజీ ఎవరికైనా సేవ చేయును. ఢిల్లీలోని హిందు

వులు తమ స్నేహప్రవర్తనవల్ల గాంధీజీ ఇక నక్కడ ఉండ నవస రము లేదని ఋజువుచేస్తే, తాను వెంటనే పాకిస్థాన్ పరుగె త్తుదు నని గాంధీజీ అనెను.

## ఫిర్యాదులకు జవాబు

శరణార్థులకొరకై కస్తూరిబానిధిని వాడ లేదేమని అతని మరి ఒక ఆక్షేపణ. గాంధీజీ ఖైదులో ఉండగా భారత దేశపు గ్రామాలలోని స్త్రీల, బిడ్డల సేవకై ఆమొత్తం పోగుచేయ బడ్డది. దానికి ధర్మకర్తలు, ధర్మశాసనము, లెక్కలు ఉన్నవి. ఆ విలేఖరి సూచించినట్లు ఆ మొత్తమును ఉపయోగించ వీలు గాదు. శరణార్థులకొరకై గాంధీజీ, పటేలుజీ చేసిన విన్నపాలను అనుసరించి, ఉదారంగా ధనము ఇవ్వబడుతూనే ఉన్నది.

## పందుల వధ

పాకిస్థాన్‌లో పందులవధ నిషేధించినప్పుడు, భారతంలో గోవధ ఏల నిషేధించ లేదని ఆ ఆక్షేపకు డడుగుచున్నాడు. పాకిస్థాన్‌లోని చట్టముసంగతి ఆయనకు తెలియదు. అది నిజమే అయితే, ఆయన విచారపడును. ఖురాన్‌లో పంది మాంసం ముస్లిములకు నిషేధమైనా, ముస్లిమేతరులకు దానిని నిషేధిం చుట సమర్థించజాలరు.

## పాకిస్థాన్ మతాధార రాజ్యమా?

అట్లు కాదని జిన్నా చెప్పియుండలేదా? కాని ఆచర ణలో లోపాలు కలుగుట దురదృష్టము. భారతాన్ని హిందూ

మతాధార రాజ్యంచేసి, దాని సిద్ధాంతాలను అన్యమతస్థులపై రుద్దవచ్చునా? అది భావ్యం కాదని గాంధీజీ భావము. అలా చేస్తే ఆసియా ఆఫ్రికా జాతులు, ప్రపంచంకూడా భారతదేశంపై ఆశాప్రతీక్షలు పెట్టుకో జాలవు. నీచత్వం, పాషండత్వం గాక, గొప్పతనం, మంచితనము లోకం మననుండి కాంక్షించుచున్నది. నేటి యంధకారమునుండి ప్రపంచము బయటపడుట కాతేజము పాఠము, శరణ్యము.

## పశువులయెడల ఆదరణ

గోపూజలో లోకంలో ఎవరికీ గాంధీజీ తీసిపోడు. కాని అలాంటి భక్తిని చట్టంవల్ల కల్పించలేము. హిందువులు కానివారి యెడ స్నేహంతో ప్రవర్తించుటచేతనే వారియందు హృదయ పరివర్తనము వచ్చును. గోవును, గోసంతానమును ఎక్కువగా కష్టపెట్టువారు, ఇతరుల మీద గోనిషేధమును ఎట్లు వర్తింపచేయగలరు? లోకంలోకెల్ల హిందూదేశంలోని పశువులే చాలా తక్కువ పాలిస్తూ భూభార మగుచున్నవి.

మనదేశంలోని పశుపోషణశాలల మీద చాలా డబ్బు ఖర్చుపెట్టుచున్నను, అచ్చటి పశువులను విచక్షణతోనూ, శాస్త్రజ్ఞానంతోను పోషించుట లేదు. పశువులయెడ దయాదాక్షిణ్యములతో ప్రవర్తించినపుడే, పశుజాతి ఉద్ధరణ కలుగును. ముస్లిములతో చేసిన స్నేహము వల్లనే కసాయిదుకాణానికి పోకుండా ఎక్కువ గోవులను గాంధీజీ యొక్కడే కాపాడగలిగెను.

# 55

5-11-47

## హరిజనుకున్న సరిపెట్టుకొను శక్తి

ఆనాడు మామూలు వ్యక్తిగాక మరెవ్వరు ఆక్షేపించ లేదు. ప్రార్థన జరిగెను. హరిజన నివాసం లోని హరిజనుడు చక్కని గొంతుతో భజనకీర్తన పాడగా, గాంధీజీ సంతోషించెను. సమానావకాశము లుంటే హరిజనులు ఏ ఇతరులకు తీసిపోరు. అంతే గాక, యంత్రగాత్రముల మీద పాడే సంగీతములోను, చేతిపనులలోను హరిజనుడు ఎక్కువ సమయస్ఫూర్తిని కనుపఱచును. హరిజనులలోను దోషా లుండవచ్చును. కాని సమానావకాశమున్నపుడు సమానాభివృద్ధి పొందగలరు. ప్రసిద్ధమైన పంఢర్‌పూర్ దేవాలయములో హరిజనుల ప్రవేశము ముదావహం. సేన్‌గురూజీ దానికై ప్రాయోపవేశము చేసి ముఖ్యకారకు డయ్యెను. ఈ అస్పృశ్యత పూర్తిగా తొలగితే, భారతములోను పాకిస్థాన్‌లోను వ్యాపించిన సాంఘికద్వేష మనే విషము చాలవరకు సడలిపోవును.

## శాకాహారసిద్ధాంతమును వ్యాపింపచేయు టెట్లు?

భారతములో ఒకచోట నుండే హిందువులు తమమధ్య నివసించే ముస్లింలు చేపలు, మాంసము తినరాదని నిర్బంధపఱచుచున్నారని ఒక ముస్లింమిత్రు డనెను. అట్టి అసహనమును సంకుచిత దృష్టిని గాంధీజీ ఖండించెను. మతధర్మముగ శాఖాహారము తినువారు భారతములో కొద్దిమందియే. హిందువులలో

ఎక్కువ జనం చేపలను, కోళ్ళను, మాంసమును తినుటకు సంకో చింపరు. అట్టిస్థితిలో వారి నాపుటకు సాహసింపనివారు, ముస్లిం లను ఏల వత్తిడి చేయవలెను ? శాకాహారములోని సౌందర్య మును తమ జీవితములో ప్రదర్శించుటయే, ఆ సిద్ధాంతమును వ్యాపింపజేయు రాచబాట.

## మీ ఇండ్లలో నుండండి

గాంధీజీ, ఆయనవంటివారు మరికొందఱు, ముస్లింలు తమ ఇండ్లువదలవద్దని విసుగు లేకుండా సలహా ఇచ్చుచున్నారు. అలా నిలువయుంటే వాళ్లు జీవనోపాధి సంపాదించుకొనుట యెట్లు ? వారు చేసిన వస్తువులను హిందువులు కొనక బహి ష్కరింప వచ్చును. తోడి ముస్లింలు తమ యెదుటనే వధింప బడుట, కొందరు పాకిస్థాన్ పోవుట, చూచుచు తక్కినవారు యిండ్లలో ఎట్లుండ గలరు ? అని ఒక హిందూవిమర్శకు డనెను. ఈ విమర్శ కొంతవరకు నిజమేయని గాంధీజీ ఒప్పుకొనెను. కాని ఇండ్లు వదలుట వలన మరింత దుఃఖస్థితి గలుగును. వీరులవలె వారు బాధలు పొందుతుంటే, ఘాతకుల హృదయములు కరుగ వలెను. అహింసవలన కలుగు నిరుపమాన ధైర్యమును మన శ్శుద్ధిని ఎక్కువ మంది ముస్లిములు చూపగలిగితే, పాకిస్థాన్ లోను భారతంలోను బాధ పడేవారికి విమోచన గలుగగలదు.

## అహింసను గూర్చి సుస్థిరభావము

సర్వనాశనము కానున్న సమయాన చర్చిల్, హిట్లర్, ముస్సోలినీ గార్లకు జపాన్ప్రజకు అహింసా మార్గమును అవలం

బించ మని సలహా చెప్పినందుకు ఒకరు గాంధీజీని దూషించుచు లేఖ నంపిరి. కాశ్మీర్‌కు సేనను పంపిన కాంగ్రెస్ గవర్నమెంటుకు ఆయన ఈసలహా ఏల ఇవ్వలేదు ? కాశ్మీరీలు అహింసామార్గాన ఎట్లు దోపిడిదార్లను నిరోధించవలెనో తెల్పుమని ఆ లేఖకుడు గాంధీజీని ప్రశ్నించెను. కేంద్రమంత్రివర్గములో నుండే స్నేహితులమీద తనకు పలుకుబడిలేదని గాంధీజీ పలుమార్లు చెప్పియే యుండెను. అహింసను గూర్చి తన భావాలలో మార్పు లేకున్నను, ఆ మంత్రివర్గము మీదను తాను ఒత్తిడి చేయలేననెను. వారివిశ్వాసాలకు వ్యతిరేకంగా ఆచరింతురని తా నాశింపననెను.

## ఇతరుల గుణములను ఆయన నిరసించడు

ఎదుటి మనుష్యుడు హింసాపరుడైనను, ఆయన సద్గుణములను గాంధీజీ చులకన చేయడు. సుభాసుబోసు యొక్క హింసావాదాన్ని తదనుగుణ్యమైన కార్యాన్ని ఆయన ఆమోదించక పోయినా, బోసుయొక్క దేశాభిమానమును, సమయస్ఫూర్తిని, సాహసమును ఆయన పెక్కుసార్లు మెచ్చుకొని యుండెను. అలాగే కేంద్రప్రభుత్వము, షేకుఅబ్దుల్లా హింసాకాండలో దిగటం ఆయనకు ఇష్టం లేకపోయినా, ఆ సైనికులు మరణానికి సంసిద్ధముగా నుండటమును, ఆయన మెచ్చుకొనక తప్పదు. అట్లుగాక వారు చేసే దేశరక్షణ, భావంలోను క్రియలోను అచ్చుగా అహింసాత్మక మైతే, అది భారతాన్నంతా, పాకిస్థాన్‌ను కూడ మార్చగల దని గాంధీజీ నమ్మకము.

అహింసావిధానం దోపిడిదార్లపై సాయుధపోరాటం సాగించదు. భారతయూనియన్ నుండి అహింసాత్మక సహకారము పంపబడగలదు. దేశరక్షకులు ఆక్రమణదార్లపై కోపంతో పిడికిలికూడ యెత్తకుండ తమ స్థానములందుండి చస్తుంటే, అది లోకం కని విని ఎరగని నిజమైన పౌరుషప్రదర్శన మౌతుంది. అప్పుడు కాశ్మీరు లోకాన్ని ఆకర్షించే పవిత్రప్రదేశ మౌతుంది. కాని ఆయన కింకా తగినంత తపశ్శక్తి లేదని చెప్పుచు, తన కా శక్తి కలుగునట్లు సర్వులు తనతోపాటు భగవంతుని ప్రార్థించవలెనని గాంధీజీ కోరెను.

# 56

6-11-47

## అపార్థము నిచ్చు వార్తలు

రెండు వార్తాపత్రికలలో నుంచి ఒక స్నేహితుడు పంపిన రెండు వార్తలు హిందూమతానికి మేలు చేయటానికి ఉద్దేశింపబడినా, బుద్ధిపూర్వకమైన అబద్ధాలతో నిండియున్నవి. నూతన కల్పనలు దొరకనప్పుడు, ఉన్న సంగతులు తలక్రిందు చేయబడతవి. అట్టి పద్ధతివల్ల యీ ఉద్యమం మేలు పొందదు. మతానికి అసలే లాభించదు. విలేఖరులు ఎంత బాగుగ తెలియబడ్డవారైనను, ప్రజ లట్టి వార్తాపత్రికలను సమర్థించరాదని గాంధీజీ అనెను.

## కంట్రోళ్ళను తొలగించండి

ఆహారవిషయమై చర్చించుటకు వివిధప్రదేశముల నుండి మంత్రులో వారి ప్రతినిధులో వచ్చిన సభలో మాట్లాడుటకు తన కవకాశ మిమ్మని రాజేంద్రప్రసాద్‌ను గాంధీజీ అడిగెను. ప్రసాద్ సమ్మతించెను. బెంగాలు గవర్నరు అయిన కే. శీ. తో చాలకాలము క్రిందట గాంధీజీ మాట్లాడినపుడు కూడ గాంధీజీ అన్నవస్త్ర కంట్రోళ్ళను తొలగించ వలెనని నమ్మి యుండెను. అప్పుడు తనకు ప్రజాబల ముందో లేదో తెలియదు. కాని ఇప్పుడు చాలమంది ఆయనను బలపరుస్తున్నారు. ఆయనకువచ్చే కట్టలకొలది ఉత్తరాలలో ఒక్కటి కూడ వ్యతిరేకభావం చూపలేదు. ఘనశ్యామ్‌దాస్ బిర్లా, లాలా శ్రీరాంవంటి ప్రముఖుల భావాలు ఆయనకు తెలియవు. తనఅభిప్రాయాలను సమగ్రంగా ఆమోదిస్తున్నా సని డా. లోహియా చెప్పేవరకు సోషలిష్టుల వైఖరి ఆయనకు తెలియదు. శాశ్వత ఉద్యోగులపై గాక, తన సభ్యులలో ఒకరిద్దరి సలహామీద రాజేంద్రప్రసాద్ ఆధారపడ వలెను.

## ఖాదీ - మరబట్ట

అన్నపు కంట్రోలు కంటె వస్త్రపు కంట్రోలును తొలగించ మనే ఆయన వాదం మరింత స్పష్టమైనా ప్రజానుకూలత తక్కువ ఏమో సని గాంధీజీ భయము. స్వదేశీ లేక విదేశీ మరబట్టకు బదులు అచ్చుగా ఖద్దరే వాడ వలెనని కాంగ్రెస్ అంగీకరించి, జమనలాల్ జీ అధ్వర్యాన మొదట ఖాదీబోర్డు పెట్టెరె.

దరిమిలా అది అఖిలభారత చరఖాసంఘంగా విస్తరించింది. పాకిస్థాన్‌పోయినా, భారతంలో 30 కోట్లకు పైగా జనం ఉన్నారు. కావలసినంత ప్రత్తి పండుచున్నది. దానిని వడకగల జనం, ఆ నూలును నేయగల నేతగాండ్రు ఉన్నారు. ఎక్కువ ధనం లేక కష్టం లేకుండానే కావలసిన రాట్నాలు, మగ్గాలు వగైరా తయారుచేయవచ్చును. కావలసినదల్లా దృఢమైన ఆత్మవిశ్వాసము, ఖాదీతప్ప మరేదీ వాడమనే మనోనిశ్చయము. మరలో తయారయ్యే దానికంటె సన్నని ఖాదీ తయారుచేసుకోవచ్చును. విదేశీయులు లేరు గనుక ఖాదీ విరోధులు లేరు. ఇప్పు డెవరూ ఖాదీమాట ఎత్తడేమి? మరబట్ట తప్ప వేరు మార్గం లేదంటా రేమి? ఖాదీ ఆర్థికమే ఈ దేశానికి తగిన ఆర్థికవిధాన మని గాంధీజీ నమ్మకము.

# 57

7-11-47

## షేహేరుగ్రామం చూచుట

ముస్లింబాధితులను చూచుటకు షేహేరుపోయి, ఆలస్యమైనందున, సరాసరి ప్రార్థనా సభకే గాంధీజీ వెళ్ళెను. అచ్చట ముస్లింలలో చాలమంది భూఖామందులు, ఇతరుల భయంవల్ల భూమి దున్నక పశువులు, నాగళ్ళు వగైరా అమ్ముకొని, మిలిటరీ వల్ల రక్షింపబడుతూ ఉన్నారు. రెండు వేలమంది గాంధీజీ చుట్టుచేరి, ఇక్కడ బ్రతకలేమని, తమ స్నేహితులు బంధువులు

అక్కడకు పోయినారు గనుక తమను కూడా పాకీస్థాన్ పంపమని బ్రతిమాలిరి. తన కా అధికారం లేదని వారితో చెప్పి, యీ సంగతి ప్రధానికి, ఉపప్రధానికి తెలిపెద నని ఆయన వారికి చెప్పెను.

## ఒక నీతి

ఢిల్లీలోనున్న శరణార్థులు తా మనుభవించిన బాధలను బట్టి తమకు ప్రత్యేకహక్కు లున్నవని తలచి, సరుకులను ఖరీదు లేకుండానో, తక్కువ ఖరీదుకో రావలె నని కోరుదురు. బండి కిరాయి విషయం కూడా అలాగే. ఒక్కొక్కడు వందల కొలది రూపాయల బేరం చేస్తాడు. ఈ మాట నిజమే అయితే, తమ ఆపదలు సూచించే గుణపాఠమును వారు నేర్చుకోలేదని అర్థం. అందువల్ల తమకు తమ దేశానికి వారు హాని చేయుచున్నారు. ఢిల్లీ పత్రికల సానుభూతి కోలుపోతారు, అని గాంధీజీ యనెను.

## శరణార్థులకు సలహా

అంతా కోలుపోయిన శరణార్థులు ఇంతింత బేరాలు ఎట్లు చేయుచున్నారో గాంధీజీ కర్థము కావటం లేదు. ఎప్పుడో తప్ప శరణార్థులు బండ్లను ఉపయోగించక నడిచే పోవుచుండవలెను. వారు ఢిల్లీ వచ్చిన పిమ్మట, మద్యంవల్ల ఆదాయం ఎక్కువగా పెరిగిందట. కేంద్ర ప్రాంతీయ ప్రభుత్వాలు కాంగ్రెస్ తీర్మానాలకు కట్టుబడి ఉంటే, కల్లు సారాయి గంజాయి నల్లమందు భంగు భారతంలో ఎవ్వరికీ దొరకరాదు. పాకిస్థాన్‌లో ముస్లిం

మతమే వీటిని నిషేధించుచున్నది. అమితబాధలు బడ్డ యీ శర ణార్థులు ఈమాత్రం నిగ్రహం నేర్చుకోరాదా ? ఈ శరణార్థులు సామాన్య ప్రజలతో పాలలో పంచదార వలె కలిసి పోవాలి. బీదలు సాదలు ఒకే శిబిరంలో నివశించి, సహకరించి అనగ్న పౌరులు కావాలి.

## 58

8_11_47

మామూలు ఆక్షేపకుడు గాక, మరి ఇద్దరు ఆక్షేపించిరి. ఆక్షేపకుల విషయంలో గాంధీజీ పెట్టిన షరతుకు సభవారు అందరు ఆమోదించుటచే, మామూలుగా ప్రార్థన జరిగెను. ఆక్షేపకులును నిశ్శబ్దంగా ఉండిరి.

### శిక్కు మతగ్రంథముల నుండి ప్రార్థన

ప్రార్థనను ప్రేమించుచు, ఎల్లప్పుడు ఈ సభలకు వచ్చు చుండే ఒక శిక్కు స్నేహితుడు గాంధీజీ శిక్కు మతగ్రంథము లందు చూపు గౌరవమునకు ఆయనను చాలా ప్రశంసించుచు ఒక జాబును వ్రాసెను. శిక్కు గ్రంథముల నుండి కొన్ని కీర్తన లను ఏరి గాంధీజీ యెదుట ఒంటరిగా పాడి ఆయన ఒప్పుకుంటే సభలోగూడ పాడెదనని ఆయన సూచించెను. గాంధీజీ సమ్మ తించి అందుకొరకు ఒక సమయము ఏర్పరచు కోమని చెప్పెను.

### దూది బేళ్ళకు విజ్ఞప్తి

శరణార్థులు స్వయముగా తామే రజాయీలను తయారు చేసుకొనుటకు దూది, కాలికో, సూదులు ఉండిన బాగుండునని

గాంధీజీ చేసిన సూచనకు జవాబుగా బొంబాయి దూదివర్తకులు దూది పంపుదుమనిన వార్త కాయన సంతసించెను. స్వయంగా శరణార్థులు రజాయీలు చేసుకొనుట వలన లక్షలకొలది రూపాయిలు మిగులును. వారి ఆత్మగౌరవం పెరుగును. పరస్పరసహాకారం కలుగును. ఢిల్లీలోను దూదిమరలు ఉన్నవి. ఇదివరకే దానము చేయుచున్న వారిపై అనవసరమైన బరువు పెట్టకుండుటకై బొంబాయివారి దానము నాయన అంగీకరించెను. దాతల సంఖ్య పెరిగినకొలది దాతలకును దేశమునకుకూడ మేలే. ధనికులు ఇట్లు సహకరించినచో సర్కారుపై బడు బరువు తగ్గును. ప్రతిపౌరుడు పూర్తిగా తనకర్తవ్యమును జరిపితే దేశ పరిపాలనలో భాగస్వామి అగును.

## ఖాదీ ఉత్పత్తి

దూదిబేళ్ళ మాట ఎత్తగానే బట్టకంట్రోలు సంగతి గాంధీజీకి తట్టినది. దేశంలో తగినపత్తి యుంటే చేపడుకు, చేనేత ద్వారా యావత్తుప్రజలకు సరిపోయే ఖాదీ తయారుచేయనగును. దూదికరువు మన కెన్నడు లేదు. వేలకొలది బేళ్ళు ఎగుమతిచేసినను మన బట్టలమరలకు దూది కొఱవ కలుగలేదు. మన మాంద్యం వల్లనే బట్టల కొఱత ఉన్న దనుకుంటున్నాము. ఆ బట్టల మరలు గాని అందలి కార్మికులు గాని ప్రజలుగాని ఎవరు ఈ బట్టల కంట్రోలు కోరుట లేదు. ఈ కంట్రోళ్ళు దేశాన్ని నాశనం చేయుచున్నవి. నిరుద్యోగుల సంఖ్య పెరుగుచున్నది. ఆపద రానున్నది.

## స్వయంసహాయం - సహకారము

శరణార్థులకు బుద్ధి కుదిరితే మొదట రజాయీలను తయారుచేసుకొని, పిమ్మట మిగిలే ప్రతినిమిషమును ప్రత్తిపత్తులు తీయుటకు, ఏకుటకు, వడుకుటకు, నేయుటకు వినియోగించవచ్చును. లక్షలకొలది శరణార్థులు చేసే ఈ సహకారం వల్ల దేశం ఉత్తేజితమగును. తమ తమ ఇండ్లవద్దనే ఎక్కువ అన్నమును ఎక్కువ ఖాదీని ప్రజలు తయారుచేతురు. దూదిని బేళ్లుగ తయారుచేయుటకన్న పొలమునుండి సరాసరి వడుకువారిఇండ్లకు పంపినచో ఒక పని తగ్గును. దూది చెడదు. ఏకట తేలిక. ప్రత్తి గింజలు పల్లెటూళ్ళలోనే నిలుచును.

## కరుణాస్వరూపిణి యగు సోదరి

మాంటుబాటెన్‌సతి కరుణాస్వరూపిణియై రెండురాజ్యాలలోను ఎల్లపుడు తిరుగుచు శరణార్థులను జూచుచు దుఃఖోపశమనం చేయ యత్నించుచున్నది. కురుక్షేత్రశిబిరమునకు పోయినపుడు గాంధీజీ ఎప్పుడు వత్తురని వారడుగగా ఆయన తప్పక వత్తురని ఆమె వారికి ఆశ కల్పించెను. నేడు ఆమె గాంధీజీని చూచి ఆసంగతి తెలుపగా ఆయన సమ్మతించెను. పానిపట్ వెళ్ళినపుడే ఆయన కురుక్షేత్రం వెళ్ళదలచెను. కాని అది పడలేదు. రాబోయే అ. భా. కాం. సం. సభ అయిన పిమ్మట ఆయన అక్కడికి పోవును. అక్కడ శబ్దవిస్తృత యంత్రము పెట్టుట కష్టం. అచ్చట తగిన యంత్రం పెట్టినచో ఢిల్లీనుండియే

రేడియోద్వారా మంగళవారమో బుధవారమోమాట్లాడి ఆపిమ్మట అటను పోవచ్చునని, ఈలోగా పానిపట్టు పోదు నని గాంధీజీ అనెను.

## 59

9-11-47

రేపు కురుక్షేత్రానికి కాదు, పానిపట్టు పోవుదను. కురు క్షేత్రంకూడ దరిపులా వెళ్ళెదను. రేపు పానిపట్టులోని హిందు ముస్లింలతో మాట్లాడుటకై, నేను పెందలకడ మానంవహించి నాను.

### దీపావళి ఉత్సవం జరగదు

శరణార్థియైన ఒక సోదరి వ్రాసిన జాబులోని ముఖ్యాంశ ములు దీపావళిని చేయవలెనా? వద్దా? అనే సమస్య ఇప్పు డేర్పడినది. నేను గుజరాన్‌వాలా నివాసిని. అచ్చట నుండే నా ఆస్తి అంతా పోయింది. ఇప్పటికైనా స్వాతంత్ర్యం వచ్చిందని సంతోషించుచున్నాము. స్వతంత్రభారతంలో మొదట దీపావళి ఇది గనుక, దుఃఖాలను మరచి దీపావళిని చేసుకొనుట భావ్యం. మీరు అట్లుగాక మా కష్టములను గమనించి, యావద్భారతం ఉత్సవం చెయ్యరాదని మీరందురు. మీ సానుభూతికి కృతజ్ఞు లము. అందరము ఉత్సవము జరపాలని దయయుంచి చెప్పండి. ధనవంతులు బీదలకు సాయము చేయుమని కోరండి.

ఈసోదరియు, అలా తలచువారును పొరబడుచున్నారు. ఒక కుటుంబానికి దుఃఖము వచ్చినప్పుడు, వారెవ్వరు ఏ ఉత్స

వాన్ని చేసుకోరు. కొద్దిలోనైనా, ఏకత్వసిద్ధాంతానికి అది ఒక నిదర్శనం. మన దేశంలో ఉండే అంతరాయాలన్నీ తొలగించండి. భారతం ఒక్క కుటుంబం అవుతుంది. లోకంలోని అంతరాయా లను తొలగించండి. ప్రపంచమంతా ఒక్క కుటుంబం అవుతుంది. అది నిజంగా ఒక్క కుటుంబమే. ఈ ఆటంకాలను తొలగించక పోతే, మానవత్వాన్ని కల్పించే సౌజన్యభావాలను నిర్లక్ష్యం చేసినట్లు. ఇప్పటి సాసలహాకు అనేక కారణాలు ఉన్నవి. హిందు వులు, ముస్లింలు, సిక్కులలో లక్షలకొలది శరణార్థు లున్నారు. మనుష్యకల్పితమైనా, అన్నవస్త్రముల కరువువచ్చింది. లోతుకు దిగిచూస్తే ప్రజానాయకుల అవినీతి, బాధితులు తగిన గుణ పాఠం నేర్చుకోనక పోవుట, ఒక మానవుడు మరియొకనిపై విస్తారంగా క్రౌర్యం వహించుట, యివన్నీ యీ దుఃఖబాహు ళ్యానికి కారణాలు. ఇందులో సంతోష మేదీ ? ఈఉత్సవాలలో పాల్గొనక వివేకమును చూపుట వల్ల, అంతర్వీక్షణ, ఆత్మశుద్ధి కలుగును.

## విదేశీవలసలలో స్వాతంత్ర్యం

ఫ్రెంచిఇండియా నుండి కొందరు వచ్చారు. చంద్ర నాగూరులోని సత్యాగ్రహాన్ని గూర్చి నేను చెప్పిన మాటలకు అపార్థాలు కల్పించి, ఫ్రెంచి ఇండియాలోని భారతీయులు స్వాతంత్ర్యానికై చేసే పోరాటానికి ఆటంకాలు కల్పించారట. ఆంగ్లేయులు పాలించి నప్పుడు ఇక్కడ ఉన్నట్లే అక్కడ కూడ

పంచమాంగపక్షం ఉన్నదట. వారు స్వార్థంకై అధికారులతో చేరి, స్వాతంత్ర్యప్రియులను క్షోభ పెట్టుతున్నారట. ఇదంతా నిజమైతే నాకు ఎక్కువ దుఃఖము కలుగును. నా గట్టి అభిప్రాయము ఏమంటే కోటానుకోట్ల భారతీయులు ఆంగ్లపరిపాలన నుండి విముక్తి పొందినప్పుడు ఈ వలసలలో నుండే కొద్దిమంది తోడిభారతీయులు బానిసలుగా నుండుట పొసగనేరదు. చంద్రనాగూరు విషయంలో నే చేసిన స్నేహకృత్యాని కపార్థం కల్పించుట నాకు వింతగా నున్నది. అక్కడి భారతీయులకు తక్కువ హోదా కలుగుటకు నే నెన్నడు ఆమోదించును. ఇండియాలో గాని, ఎక్కడగాని రంగుజాతుల స్వాతంత్ర్యము నణచుటకు ఫ్రెంచిజాతి ఎన్నడూ ఒప్పుకోదని నే నాశించెదను.

## 60

10-11-47

### దైవసేవకులు కండి

మీరాబాయివలె అందరు దేవునికొక్కనికే భక్తులైతే లోకంలోని కష్టములన్నీ తీరిపోతవి. జునగడ్ నుండి గాంధీజీకి రెండుతంతెలు వచ్చినవి. జునగడ్ ప్రధానమంత్రి బుట్టోసాహేబు, దానిసవాబు సాహేబు ఇద్దరు కరాచీలో నున్నారట. దాని ఉపప్రధాని మేజర్ హార్వేజోన్సు జునగడ్‌లో ఉన్నాడు. జునగడ్ భారతసమ్మేళనములో చేరుటకు వీరందఱు సమ్మతించిన వారే. జిన్నాకూడా దీని కనుకూలు డని ఊహించే హక్కు ఈ సభకు

కలదు. ఆయన అనుకూలు రైతే కాశ్మీర్, హైదరాబాద్ చిక్కులుకూడా త్వరలో తీరుసని తలంచవచ్చును. ఇంకేమంటే ఈ రెండు రాజ్యాలు స్నేహంగా వర్తించు నని చెప్పవచ్చును. అక్కడ రాజప్రతినిధి జిన్నా, ఇక్కడ రాజప్రతినిధి మౌంటు బాటెన్ ప్రభువు. ఈ ఇద్దరు శాసనబద్ధులు. మంత్రిమండలుల సమ్మతి లేకున్న ఏ పనిని వారు చేయలేరు. అయితే ఇప్పటి ముస్లింలీగుకు అధినేత జిన్నా. అతని సమ్మతితోనే పాకిస్థాన్ ఏ పనైనా చేయును. అందుచేత జిన్నా జునగడ్‌కు అనుకూలంగా ఉండటం, శుభశకున మని గాంధీజీ తలంచెను.

## పానిపట్ పోవుట

గాంధీజీ, అబ్దుల్‌కలాంఆజాద్ పానిపట్ పోయిరి. ఆస్పత్రిలోని ముస్లింరోగులను ఆయన చూచెను. వారిలో కొందరికి పెద్దపెద్ద గాయాలున్నవి. కాని తగినంత వైద్యసహాయం చేయబడుచున్నది. రాజకుమారి నలుగురు వైద్యులను, తగినంత మంది దాయీలను, పరికరములను పంపియుంచెను. అచట శరణార్థులు యిరవై వేలట. వారియొక్క ప్రతినిధులను, ముస్లిం నాయకుని, స్థానిక హిందువులను ఆయన కలిసెను. ఇంకా ప్రతి రోజు వచ్చి పడే శరణార్థులను ఎట్లు సర్దవలెనో అచ్చటి ఉద్యోగియులకు తోచుట లేదు. వారు మంచివారేనని అందరుచెప్పిరి. ఆ శరణార్థులు పాకిస్థాన్‌లో భయంకరమైన బాధలు పడినను, పానిపట్‌లో తగిన దుస్తులు లేకుండా ఆరుబయట ఉండవలసి వచ్చినను వారిలో కోపద్రేకములు లేవు. అచ్చటి ఉద్యోగు

లకు ముందుగా తెల్పకుండా, వారినెత్తిన శరణార్థులను పడవే యుట క్రూరకర్మయే. రైలు వచ్చి ఆగేవరకు, ఎందరు వచ్చేదీ తెలియదట. వాళ్ళలో స్త్రీలు, పురుషులు, ముసలివాళ్ళు, పిల్లలు ఉన్నారట. కొందరు రయిల్వేప్లాటుఫారంవద్ద పిల్లలను కన్నారట. ఇదంతా మహాదురదృష్టం అని గాంధీజీ యనెను.

## డాక్టరు గోపీచంద్

గోపీచంద్ ముఖ్యమంత్రి యైన తూర్పుపంజాబులోని సంగతులు ఇవి. ఆ డాక్టరు గాంధీజీకి చిరకాల స్నేహితుడు. పంజాబులో పలుకుబడికలవాడు. హరిజన సేవకసంఘం, అ. భా. చరఖాసంఘం, అ. భా. గ్రామోద్యోగ సంఘం తరఫున పని చేసినవాడు. పానిపట్ స్థితిని పట్టి చూస్తే, ఆయన పరిపాలన సరిగా లేదని అర్థం. గూర్గాం జిల్లాలో ఉన్న మూడు లక్షల ముస్లింలు భయపడి ఇళ్లు, వాకిళ్లు వదలి రోడ్డుప్రక్కన ఆరు బయట నివసించుచున్నారట. ఈ చలికాలంలో పరివారంతో, పశువులతో మూడువందల మైళ్ళు నడచి పోదలంచి నారట. ఈ కథ నిజం కాదేమో నని గాంధీజీ తలంచెను. పానిపట్ చూచిన పిమ్మట ఆయన అపనమ్మకం చలించిపోయింది. గోపీచంద్, ఆయన మంత్రి మండలి వెంటనే మేల్కొని, దూర దృష్టియు, జాగరూకతయు గలిగి ఈ శరణార్థులకు తగిన ఆదరణ కలిగే టంతవరకు, విశ్రమించకుండా ఉందురుగాక.

# 61

11-11-47

## జునగడ్

దీని వ్యవహారము లోగడ అనుకున్నట్లు జరుగలేదు. జిన్నా ఆమోదముద్ర లేకుంటే, మొదటి వార్త వలన కలిగిన సంతోషం నిలువనేరదనేభయం గాంధీజీ వెలిబుచ్చెను. జునగడ్ ప్రజల తరఫున ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వం ఆ సంస్థానము నాక్రమించుటచే పాకిస్థాన్‌కు కోపంకలిగెను. జునగడ్‌పై భారత సమ్మేళనముచేసిన దండయాత్రగా దానిని వారెంచి ఆరాజ్యాన్ని ఖాళీ చేయమని కోరిరి. అది పాకిస్థాన్‌లోని భాగంకనుక అచ్చటి నవాబు గాని అతని దివాన్ గాని భారతసమ్మేళనంతో సంధి చేసుకునే హక్కు లేదని వాదించిరి.

## సమ్మేళనంతో చేరుట

పత్రికాప్రకటనను బట్టి చూస్తే భారతసమ్మేళనము జునగడ్‌ను ఆక్రమింప లేదు. అంతర్జాతీయశాసనములను భగ్న పరుప లేదు. కథియవాడ్‌రాజు కోరినపుడు యావత్ కథియ వాడ్ క్షేమమునిమిత్తం భారతం కొంతసేన పంపింది. అందులో అక్రమం లేదు. జునగడ్ ముఖ్యమంత్రి తన మాటను మార్చు టకు తగిన కారణము కనుపడదు. నూటికె యెనభై ఐదు మంది హిందువులుగా ఉన్న జునగడ్ ప్రజల సమ్మతి లేనిదే ఆ నవా బుకు పాకిస్థాన్‌లో చేరే హక్కు లేదు. గిర్నార్ కొండ, దాని మీద నుండే దేవాలయములు హిందువులకు తీర్థయాత్రాస్థలం.

వేలకొలది రూపాయిలు దానికొరకు వారువెచ్చించిరి. స్వతంత్ర భారతంలో అది అంతా ప్రజల హక్కై ఉన్నది. సంస్థానాధిపతులకు స్వంత హక్కు లేదు. వారి ప్రజలతరఫున ధర్మకర్తలు గానే వారి కేదైనా హక్కు కలుగును. వారు చేసే ప్రతి పనికి ప్రజల సమ్మతి కావలెను. అసలు సిద్ధాంతము ఇది. ప్రజలు తామే హక్కుదార్లని తెలుసుకోకపోయినా సంస్థానాధిపతులు తాము ధర్మకర్తలు మాత్రమే నని గుర్తించకపోయినా పై సిద్ధాంతానికి తిరుగు లేదు. ఏ రాజ్యంలోనైనా చేరే హక్కు అచ్చటి ప్రజలది. జునగఢ్ తాత్కాలిక ప్రభుత్వం అచ్చటి ప్రజలకు ప్రతినిధికాకపోతే వాళ్ళు అక్రమఆక్రమణదార్లే అవుతారు. ఏ రాజ్యమైనా వాళ్ళను వెళ్ళగొట్ట వచ్చును. దౌర్జన్యంగాని దాని ఛాయగాని లేకుండా సక్రమంగా జరుపబడిన జనవాక్య నిర్ధారణ ద్వారా జునగఢ్ ఏరాజ్యంలో చేరేది చిట్టచివరకు నిర్ణయింపవలెను. పాకిస్థాన్ సర్కార్, జునగఢ్ముఖ్యమంత్రి వహించిన వైఖరివలన ఒక చిత్రమైనస్థితి ఏర్పడింది. ఈ వివాదాన్ని పరిష్కరించుటకు ఖడ్గం మాట ఎత్తరాదు. పూర్వంనుంచి వస్తున్న పంచాయతీ పద్ధతియే దీనికి అనువైంది. ఈ దేశంలోనే ఆ తీర్పు చెప్పుటకు తగిన పెద్దలు కలరు. దానికి సమ్మతింపనిచో ఇతర దేశాలనుండి నిష్పక్షపాతియైన పంచాయతీదారుని పిలిపించుకోవచ్చును.

## హైదరాబాద్ - కాశ్మీర్

జునగఢ్కు వర్తించిందే కాశ్మీరుకు, హైదరాబాద్కు వర్తిస్తుంది. అక్కడి మహారాజుకుగాని, ఇక్కడి నవాబుకు గాని,

ప్రత్యక్షంగా పొందిన ప్రజల సమ్మతి లేనిదే, ఏరాజ్యంలో చేసే హక్కు లేదు. కాశ్మీర్ విషయములో ఈసంగతి లోగడనే స్పష్ట పరుపబడింది. ఆమహారాజు ఒక్కడే గాక, కాశ్మీరు-జమ్మూల లోని ప్రజల తరఫున మాట్లాడే షేకుఅబ్దుల్లా కూడా కలిసి వచ్చాడు గనుక, తాత్కాలిక కలయిక కైనా భారతసర్కార్ ఒప్పుకున్నది. ఒక్క మహారాజే కోరితే తాను దీనిని సమర్థించే వాడను గానని గాంధీజీ అనెను.

## కాశ్మీర్ విభజనా ?

కాశ్మీర్‌ను విభజించి జమ్ము హిందువులకు, కాశ్మీర్‌ను ముస్లింలకు ఇవ్వవచ్చు ననే పుకార్లు లేచినవి. భారత సంస్థానా లను గాని, అందలి ప్రజల దేశభక్తిని గాని అలా విభజించు టకు గాంధీజీ సమ్మతింపరు. వివేకంతో అట్టి వికృత స్థితి రాకుండా ఆపాలి. ఇప్పటికుండే లక్షలకొలది శరణార్థులకుతోడు, మరికొన్ని లక్షల శరణార్థులు అప్పుడు ఏర్పడుదురు. అందు కైనా ఈ విభజనలను ఆపవలెను.

# 62

12-11-47

## దీపావళి అభినందనాలు

నేడు మన పంచాంగంలో పర్వదినం. విక్రమశకప్రకారం గురువారము సంవత్సరాది పండుగ. రామరావణ యుద్ధంలో దుష్టశక్తుల గనియగు రావణుని, శిష్టగుణసంపన్నుడగు రాముడు

ఓడించి నందున, ఈదీపాలు పెట్టుచున్నారు. రాముని గెలుపు వల్ల రామరాజ్యం వచ్చింది.

## నిజమైన తేజస్సు

ఇప్పుడు మనదేశంలో రామరాజ్యం లేదు. అందువల్ల దీపావళి ఉత్సవం చేయ వీలు గాదు. రాముడనే దేవుడే తమ ఆత్మలకు వెలుగు నివ్వగలడు. అట్టి వెలుగున్న నాడే రామవిజయోత్సవంజరుపవలెను. జనసమూహాములు బైట దీపాలుచూడబోతారు. నేడు కావలసినది హృదయములలో ప్రేమజ్యోతి. నేడు వేలకొలది జనం కఠినమైన బాధ పడుచున్నారు. గుండె మీద చేయివేసుకుని ప్రతి శరణార్థి నా తోబుట్టువే నని చెప్పగలవారు ఈ సభలో నెవరైన ఉన్నారా? ఇదే మన కందరకు అగ్నిపరీక్ష. రామ రావణ ద్వంద్వయుద్ధ మనగా దుష్ట శిష్ట శక్తుల శాశ్వత సంగ్రామం. నిజమైన వెలుగు లోపలి నుండి రావలెను.

## గాయపడిన కాశ్మీర్

జవహరిలాల్ అచ్చటకు పోయి బారమూలా నుండి గాంధీజీ కొఱకు కొన్ని అందమైన పువ్వులను తెచ్చెను. రక్తపాతమువలన, లూటీవలన కాశ్మీర్ సౌందర్యము పాడై పోయింది. జవహరిలాల్ చూడపోయిన జమ్ము పరిస్థితులు కూడా బాగా లేవు.

జునగడ్ తాత్కాలిక ప్రభుత్వం నడుపుచున్న శ్యామలదాసుగాంధి, ధేబర్ భాయి గార్ల కోరికమీద సర్దార్ పటేల్

జునగడ్ పోయెను. భారతసర్కారే తమను మోసగించె నని జిన్నా, బుట్టోసాహేబు కోపంగా ఉన్నారు.

## అనుమానమును ద్వేషమును తరిమివేయండి

దేశములో శాంతి కావలయు నంటే, ప్రతివాడు ఆ రెంటిని తన గుండెలలో నుండి తొలివేయవలెను. అంతరంగ దైవమును విస్మరించు బాహ్యవిజయములు నిరుపయోగము. భయముచేత పాకిస్థాన్ పారిపోయిన ముస్లింల నందరిని తిరిగి పిలుచుకుని వచ్చే టంతవరకు, మనకు నిజమైన దీపావళి ఉత్సవం లేదు. హిందు, సిక్కు శరణార్థులను అలా ఆదరించక పోతే పాకిస్థాన్‌కు పండుగ లేనేలేదు. రేడియోద్వారా కురుక్షేత్ర శరణార్థులకు గాంధీజీ తన సందేశమును పంపెను. వచ్చే ఏడు అంతరకు మేలు కలుగు నని, హృదయవికాసము కలిగి ఒండొరులకు, భారతానికి, లోకానికి సేవ చేయుదు రని ఆయన ఆశీర్వదించెను.

# 63

13-11-47

## విక్రమశక సంవత్సరాది

ప్రతి సంవత్సరాది పండుగనాడు నిరుటి కంటె మేలుగా వర్తింతు నని ప్రతివాడు పవిత్ర ప్రతిజ్ఞలను చేయుట మన దేశములో రివాజు. అప్పుడే రాబోయే దీపావళి పండుగ చేసుకునే హక్కు వీరికి కలుగును.

## దుష్టశక్తులను గెలువండి

ఎవరేమి చేసినా చేయక పోయినా గాంధీజీ సందేశమును వినేవారు మాత్రం ముస్లింలను మంచి మిత్రులుగా ఉంటా మనే ఒక ఉత్తమ నిశ్చయం చేసుకోవలెను. అంటే ఏడాది పొడుగున తమలోని దుష్టశక్తులను గెలుపు పొందు తుంటా రన్నమాట. ఏటా దీపావళితో పోలిస్తే ఈ ఏటి దీపావళి చాలా స్వల్ప మని ఒక రనిరి. అసలు దీపాలు పెట్టకపోతే అపశకునమనుట మూర్ఖపు విశ్వాస మని గాంధీజీ యనెను. లోపల దీపముంటేనే, బయట దీపాలు పెట్టవలెను. కానిచో, బయట దీపం బజాయి దీపమే.

## వెనుకకు మరలరాదు

కాంగ్రెసు వర్కింగుకమిటీ ఏతీర్మానం చేయక పోయినా, అక్కడ జరిగిన ఆలోచనలనుబట్టి పూర్వపు తీర్మానాలను తొలగించక అనుసరించ వలె ననే ఏకాభిప్రాయం వెల్లడించెను. 60 ఏండ్లనుండి సంపూర్ణ సాంఘిక సామరస్యమును కోరుచున్న కాంగ్రెస్, దానిని విడువ రాదని తేల్చిరి. కొన్నాళ్ళ దాకా కాంగ్రెస్ అల్పసంఖ్యలో ఉన్నను, సంతోషంగా దానికి సమ్మతించ వలెనని వారు తలంచిరి.

## మతంలో నిర్బంధం లేదు

అందరికి సమానత్వం లేనిస్వాతంత్ర్యము కాంగ్రెసు కోరదగ్గదికాదు. అంటే, కాంగ్రెసు కాని, దాని తరఫు ప్రభుత్వాలు కాని అచ్చుగా ప్రజాస్వామిక, ప్రజారంజక సంస్థలుగానే ఉండాలి. సర్కారు జోక్యం లేకుండా తనకు నచ్చిన మతాన్ని తాను అను

సరించే స్వేచ్ఛ కాంగ్రెసు, కాంగ్రెసుసర్కారు కల్పించాలి. ఒకే రాజ్యంలో ఉండి దానియందు ఏకభక్తి కలిగి ఉంటే జనానికి అనేక సంగతులు సమానంగా ఉంటవి. మానవునికి మానవునికి మధ్యకూడ అనేక సమానమైన సంగతులు ఉన్నవి. అట్టిచో మతంపేర ఒకరితో ఒకరు ఎట్లు పోరాడగలరో ఆశ్చర్యంగా ఉన్నది. మూసలో పోసినట్లు, ఒకే మార్గం త్రొక్కమని నిర్బంధించే మతం మతమే కాదు. మతంలో నిర్బంధం ఉండరాదు. నిర్బంధంపై చేసేపని, కొద్దిరోజులే ఉంటుంది. అది చచ్చితీరాలి. మనము పావలా సభ్యులమైనా కాకపోయినా, మతాధార రాజ్యాన్ని నిరసించే నిరుపమానమైన జాతీయసంస్థ మన కున్నందుకు మనం సంతోషించాలి. అన్ని మతాలమధ్య సామరస్యం కల్పించే మతాతీతరాజ్యం మన ఆదర్శం. మన దేశంలోని ముస్లింల జీవితం కష్టతరమైనది. నిరంతరం వాళ్ళు ఇక్కడనుండి వెళ్ళిపోవుచున్నారు. ఇట్టి స్థితికి బాధ్యులైనవారు కాంగ్రెసు గౌరవం నిలబెట్టగలరా ? ఈ నూతన సంవత్సరంలో శ్రేష్ఠులగు హిందూ లేక సిక్కుపౌరులకు ఉన్నంత భద్రత, ముస్లిం బాల బాలికలకు కూడ కలుగునట్లు తక్కినవారు కృషి చేయవలెను.

## అ. భా. కాం. సం. సభ

ఈ సభ వచ్చే శనివారం జరుగుతుంది. బీదా సాదా రాజు ప్రజా, అందరిక్షేమాభివృద్ధికై తీర్మానాలు వారుచేయుదు రని గాంధీజీ ఆసించెను. లోకంలోని పీడితజాతుల హక్కులను

గౌరవములను కాపాడగలదే భారతం అనే మర్యాదను ఆ సభ కాపాడు గాక !

## 64

14-11-47

### అన్నింటిని మించింది రామనామము

ఆరోజు పాడిన భజనకీర్తనను మొట్టమొదట ఆగాఖాన్ రాజభవనంలో ఉపవాసం చేయుచుండగా గాంధీజీ విని ముగ్ధుడై పోయెను. ఆరాజభవనం ఖైదుఖానాగా మార్చబడెను. అచ్చట సరోజినీదేవి, మీరాబెన్, మహదేవభాయి ఆయనతో నుండిరి. ఆయన అప్పుడు ఉపవసించిన 21 రోజులలోను రాము డనే దైవాన్ని తన హృదయసింహాసనంమీద అధిష్ఠింపచేయుటచేతనే ఆయన నిలువ గలిగెను. త్రాగిన నీరువల్లను కొన్నాళ్లు పుచ్చుకొన్న నారింజరసం వల్లను గాదు; వైద్య నిపుణులు చూపిన విశేష జాగ్రత్తవల్లను కాదు; ఆభజనపదములు మరచిపోయి తన స్నేహితులకు తంతి ఇవ్వగా వారు వాటిని తిరుగు తంతిలో పంపిరి. అందులోని పల్లవి ఏమంటే, "రామనామమే సర్వస్వము. దాని యెదుట ఇతర దేవతలు నిల్వలేరు." తన జీవితములోని ప్రబోధకరమైన ఈ అంశము ఆయన తెలిపింది ఎందుకంటే వచ్చే శనివారం జరిపే అ. భా. కాంగ్రెసు సభలో చేసే ప్రతినిధులు దైవాన్ని తమహృదయంలో ప్రతిష్ఠించియే చర్చలు, తీర్మానాలు చెయ్యాలి. సైతాన్నుగాక దైవాన్ని మనస్సులో నిల్పనివారు కాంగ్రెసు వాదులుగా ఉండుటకే తగరు.

# శరణార్థులు తిరిగి వచ్చుట

శరణార్థులను క్షేమంగా గౌరవంగా పశ్చిమ పాకిస్థాన్ పంపుట కనుకూలమైన వాతావరణమును సృష్టించేది ఎలాగా అనే విషయమై వర్కింగ్ కమిటీ చాలాసేపు విచారించెను. ముస్లిం మతేతరులను వెళ్ళగొట్టుపని మొదట పాకిస్థాన్ సాగించిననూ, పిమ్మట తూర్పుపంజాబులోను దాని సమీపములోనున్న భారతసమ్మేళనములోని ప్రదేశములలోను తీసుకోబడిన ఘోర ప్రతీకారచర్యలచే దుర్మార్గమును ఎవ రారంభించి రనే ప్రశ్న యోజించు ఆవశ్యకత లేకపోయెను. ఈవెర్రి ఇక్కడే అంతరించిందని అ. భా. కాం. సం. నిశ్చయముగా చెప్పగలిగినచో, అప్పుడు పాకిస్థానునుండి తోలివేసిన శరణార్థులను ఆ దేశమునకు తిరిగి గౌరవముతో పిలుచుకొని పోవలె నను సద్బుద్ధి పాకిస్థానుకు కలుగు నని చెప్పవచ్చును. రామనామమును హిందువులు సిక్కులు హృదయస్థము చేస్తేనే, ఆ సౌభాగ్యం కలుగ గలదు. బలవంతంమీాద పాకిస్థాన్‌కు బయలుదేరిపోయిన ముస్లిం శరణార్థులు కులాసాగా ఇక్కడికి తిరిగివత్తురు. అట్లే అచటనుండి ఇక్కడికి తరుమబడిన హిందూ, సిక్కు శరణార్థులు గౌరవముతో క్షేమంగా తిరిగి పాకిస్థాన్ చేరగలరు.

ఆయన ఈ ఉపదేశము అచ్చటి సభికులకును శనివారపు సభలో చేరేవారికిని నచ్చుగాక.

## 65

15-11-47

### జాతిపిత

అ. భా. కాం. సం. లో ఆయన చెప్పిన సలహాలు ఇక్కడ తెలుపమని ఈ సభ్యులు కోరవచ్చును. ఆయన ఇన్నాళ్ళనుండి చెప్పుచున్న సారమే వారికిని వినిపించెను. ఆయనను జాతిపిత యని మనస్ఫూర్తిగాపిలిస్తే, అది ఒక అర్థంలోనే నిజం. 1915 లో దక్షిణాఫ్రికానుండి తిరిగివచ్చింది లగాయతు, కాంగ్రెసును మహాసంస్థగా చేయుటకు ఆయన తోడ్పడెనుగనుక ఆయనకు అప్పుడున్న గొప్ప ప్రభావాన్ని బట్టి ఆ పేరు వాడియుండవచ్చును. కాని నేడా ప్రభావం ఆయనకు లేదు. ఆ లేమిడివల్ల ఆయన కేమీ చింత లేదు. ప్రతివాడు తనపని చేసి ఫలితాన్ని పరమేశ్వరునికి వదలవలెను. దైవేచ్ఛ లేనిదే ఏదియు జరుగదు. తనకు సత్యం అని తోచిన దానిని అ. భా. కాం. సం. లో చెప్పుట తన కర్తవ్య మని ఆయన తలంచి అక్కడికి పోయెను.

### కంట్రోళ్ళు హానికరము

వీటినిగూర్చి ఆయన కాంగ్రెసు సభలో పలుకరించెను. కంట్రోళ్ళు పెట్టుట దుర్నయము. యుద్ధకాలమున అవి మంచివే కావచ్చును. సైనికజాతికి సహాయకారి కావచ్చును. కాని భారతాని కవి హానికరములు. నిజానికి ఈ దేశంలో అన్నవస్త్రముల కరువు లేదు. పెట్రోలు, పంచదార వగైరాల మీద పెట్టిన కంట్రోళ్ళకును తగిన కారణము లేదు. కంట్రోళ్ళవల్ల

ప్రజలు సోమరులు, పరావలంబులు అగుదురు. ఎప్పుడైనా సోమరితనము, పరావలంబన దేశానికి హానికరమే.

కంట్రోళ్ళను గూర్చి రోజూ ఫిర్యాదులు వస్తున్నవి. వీటిని తొలగించ మని అ. భా. కాం. సం. సభ్యులకు ఉచిత మైన సలహా నిత్తురు గాక.

# 66

16-11-47

## దేవుని కనుగొనుట

దేవుని కనుగొనుటే మానవుని ఉత్తమధర్మము. దేవాలయాలలో, విగ్రహాలలో, మానవుడు కట్టిన పూజామందిరములలో దేవుని కనుగొనజాలము. ఉపవాసములవల్లను కాదు. ఐహికము కానట్టి పారలౌకికమైనట్టి ప్రేమద్వారా ఆయనను చూడనగును. అన్నిటిలో దేవుని చూచిన మీరాబాయి ఆ ప్రేమజీవితం గడిపింది. ఆమెకు ఆయనయే సర్వస్వము.

## రాంపూర్ సంస్థానం - అప్పుడు, ఇప్పుడు

దాని పాలకుడు ముస్లిం. అందుచేత అది ముస్లింరాజ్యం అనే అర్థంగాదు. కొన్ని ఏండ్ల క్రిందట, ఆలీసోదరులతో కలసి రాంపూరు పోయి, ఆ సోదరుల ఇంట గాంధీజీ బస చేసెను. అప్పటి నవాబు అజ్మాలుఖాను, అన్సారీలవంటి సుప్రసిద్ధ ముస్లిం నాయకుల స్నేహితుడు. కాన ఆయనను గాంధీజీ చూచెను. అప్పుడు అచ్చట హిందువులు, ముస్లింలు శాంతి సఖ్యతలతో

నివసించు చుండిరి. ఇప్పు డాకథ మారిం దని అక్కడ నుంచి వచ్చిన హిందువులు చెప్పారు. ఆ సంస్థానము భారత సమ్మేళనములో చేరినా, ముస్లింలీగుయొక్క దుష్ట ప్రభావం పనిచేస్తున్నది. దానికితోడు హిందూమహాసభ, రాష్ట్రీయ సేవకసంఘం భారతంలో ముస్లింలే యుండరా దను పట్టుదల పట్టి యున్నందున చిక్కు కలుగుచున్నది.

## సత్యాగ్రహం బలిష్ఠమైన ఆయుధం

కాంగ్రెసు ఉద్దేశ్యమును నమ్మిన కాంగ్రెసు వాదులు తమ విశ్వాసము నిలువబెట్టుటకు సత్యాగ్రహం చేయవచ్చునా? అ. భా. కాం. సం. మతాధారరాజ్యం పనికి రాదని తీర్మానించింది. దేశంలో కెల్ల అతిప్రాచీనమైన రాజకీయసంస్థ కాంగ్రెసు. సర్వజనులసేవ దానిఆదర్శం. సంకుచిత సాంఘిక దురభిమానానికి అందులో తావులేదు. రాంపూర్ హిందువులు సత్యాగ్రహానికి అనుమతింప మని కోరగా, అచ్చటిపరిస్థితులు తమకు తెలియవని, అందువలన సలహా ఇవ్వజాల నని గాంధీజీ వారికి తెల్పెను. లోకంలో ఉండే శక్తు లన్నిటిలోకె అత్యంత బలిష్ఠమైన శక్తి సత్యాగ్రహ మని ఆయన వారికి తెల్పెను. ఎట్టి వ్యతిరేకశక్తులు కూడా దానిముందు నిలువజాలవు.

## దాని అంతరార్థములు

సాయుధ, నిరాయుధ నిరోధమున కంతకును ఇప్పుడు ఈ సత్యాగ్రహ పదము వాడబడుచున్నది. అందుచేత దానికి అవమానము కలుగుచున్నది. సత్యప్రేమరాశి యైన దేవుడు,

సత్యాగ్రహికి అండ అని గ్రహిస్తే సత్యాగ్రహం అజేయ మని ఎల్లరు గుర్తించగలరు. హిందూమహాసభను, రాష్ట్రీయ సేవక సంఘసభను గూర్చి వచ్చిన వార్తలు తప్పు అయితే, తాను సంతసింతు ననెను. రెండవవారి సభకు ఆయన ఒకసారి పోయి నందుకు అనేకులు నిందించిరి.

## దక్షిణాఫ్రికానుగూర్చి హిందూ ముస్లిం పట్టుదల

యు. యన్. ఓ. ఎదుట శ్రీమతి విజయలక్ష్మి పండిట్ తన సహచరులతో కలిసి ఐక్యకంఠంతో, సాహసంతో భారతీయ వాదమును నిలబెట్టుచున్నది. నెహ్రూజీ సోదరి యగుటచే గాక, శక్తిసామర్థ్యములవల్ల ఆమె కాపని ఒప్పగించబడింది. నాటిపత్రిక లలో ప్రకటించబడిన దానినిబట్టి ఇస్ఫహాని, జఫరుల్లాలు కూడ దక్షిణాఫ్రికాలోని భారతీయులకు కలుగుచున్న అవమానములను గట్టిగా ఖండించినట్లు కాన్పించును. దక్షిణాఫ్రికాలోని భారతీ యులు బీదలు గారు. ఆకలిబాధ వారికి లేదు. కాని దక్షిణ ఆఫ్రికా రాజ్యం పౌరసత్వ హక్కులను నిరాకరించడం వల్ల ఈ ఆహార ధనములు వారిని సంతృప్తి పఱుచుటలేదు. అన్య దేశా లలో నుండే భారతీయులను గూర్చి ఈ దేశంలోని హిందూ ముస్లింలమధ్య భిన్నాభిప్రాయము లేదు. రెండు జాతుల సిద్ధాం తము తప్పని ఇదే చక్కని ఋజువు. ప్రేమయే అతిశ్రేష్ఠ మని గాంధీజీ నేర్చుకున్నారు, ఇతరులకు బోధించుచున్నారు. అన్య దేశపు భారతీయుల గూర్చి చూపిన ఐకమత్యమే స్వదేశంలో వారిపట్ల గూడ చూపవలెను. తప్పు చేయుట సహజమే. దిద్దు

కోవటం సహజమే. మరచిపోవుట, క్షమించుట అవసరమే. అది ఎల్లపుడు సాధ్యమే. హిందూ-ముస్లింలు చూపే ఐకమత్య భావంచేత దక్షిణాఫ్రికా తెల్లవారు గుణపాఠము నేర్చుకొందురు గాక !

## 67

17-11-47

### ఇండియా - దక్షిణాఫ్రికా

గాంధీజీ 1893 మొదలు 1914 వరకు, మధ్య ఒక ఏడాది మినహా, 20 ఏండ్లు దక్షిణాఫ్రికాలో నుండిరి. మన దేశముతో సమానమైన విస్తీర్ణం గల ఆ భూభాగంలో నివసించు తెల్ల వారితోను, పలురకములగు భారతీయులతోను ఆయనకు సన్నిహిత పరిచయము కలిగింది. ఈకాలములో దక్షిణఆఫ్రికా ఉన్నతి పొందింది. భారతం అద్భుతముగా వృద్ధి పొందింది. నిన్నటిదాకా అసాధ్య మనుకున్నది నేడు జరిగింది. ఆంగ్లేయ కామన్‌వెల్తులో దక్షిణాఫ్రికాతో సమానమైన హోదా భారతము కలిగి యున్నది. ఒకే కామన్‌వెల్తులో ఒక భాగములో నుండు వారు, రెండో భాగంలో బానిసలుగా ఉండవలెనా? కామన్‌వెల్తు చరిత్రలో మొదటిసారి సభ్యు లందరి సమ్మతితో ఆసియాలోని ఒకదేశం భాగస్వామిగా ప్రవేశించింది.

### కామన్‌వెల్తులో ఇండియా

ఆరింజియా పరిపాలకుడు డాక్టర్ యస్. పి. బరనార్డు ఇండియా స్వాతంత్ర్యం లభించిన అయిదవనాడు నేటాల్ భార

తీయ కాంగ్రెస్‌కు పంపిన సందేశములోని ముఖ్యాంశాలు. ఇపుడు దక్షిణ ఆఫ్రికాలో నుండే భారతీయులు బుద్ధిపూర్వకముగా భారతసమ్మేళనానికి పోయి దక్షిణాఫ్రికాలో వారు నేర్చుకున్న సందేశమును అక్కడి ప్రజలకు తెల్పవలెను. వందలకొలది ప్రాణాలు పోయే సాంఘికసంఘర్షణలలో దిగక, అన్ని సంఘాలు సక్రమంగా శాంతంగా నడుచుకోవలెను.

## రంగు భేదము

ఇండియా బ్రిటిష్‌కామన్‌వెల్తులో చేరుటకూడ ఒకగొప్ప విషయమా యని ఆ డాక్టరు సంకోచించుచున్నారు. ఆయన పంపిన సందేశము అక్కడి తెల్లవారి అందరి మనోవైఖరిని తెలుపుచున్నది. ఆసియావాసు లైన నేరానికి అసాకర్యాల పరంపరలకు మనవారు లోనగుచున్నారు. అక్కడ ఉండే శ్రేష్టులగు తెల్లపౌరులకు గాంధీజీ విన్నపమేమంటే, అనేకరెట్లు సంఖ్యగల ఆఫ్రికావాసుల మధ్య ఈ తెల్లవారు ఉన్నారు. ఆసియావాసుల కంటెను వీరిని హీనముగా వారు చూచుచున్నారు. లోకము మారుచున్నది. వారిపై చూపబడే దుర్మార్గమైనా తప్పు కావలెను. లేదా ఆసియా దేశస్థులను ఆంగ్ల కామన్‌వెల్తులో చేర్చుకొనుటైనా తప్పు కావలెను. భారతం, పాకిస్థాన్ ఇదివరకే చేరినవి. బర్మా, సిలోన్ చేరబోతున్నవి. ఈ కామన్‌వెల్తు సభ్యత్వం సంపూర్ణస్వాతంత్ర్యం కంటె మిన్న కాకపోయినను దానితో సమానం అంటారు గదా! విమాచర్యలనుగూర్చి ఆ దేశంలోని ప్రజలు ఏమనుకుంటారో ఊహించండి. ఈ

స్వతంత్ర దేశాల సంఖ్య పెంచడం విశ్వసోదరత్వానికా ? లేక అతి ఘోరమగు మూడవ యుద్ధానికా ?

## భావాలబట్టే పరిణామము

తాను యోజించి నట్లే మానవుడు వికసించుచున్నాడు. 'యద్భావనం తద్భవతి' ఇది జ్ఞానసంభరితమైన ఉపనిషన్మంత్రం. జ్ఞానుల భావాలను బట్టి ప్రపంచం మారుచుండును. వ్యర్థపు యోచన, యోజనే కాదు. ఆలోచన లేని సామాన్య జనము లోకాన్ని మార్చుదు రనుకొనుట పొరపాటు. స్వాతంత్ర్యము అంటే, ప్రజాస్వామ్యం అంటే ప్రతిపౌరునకు కేవలం విషయ పరిచయము గాక, జ్ఞానభాగ్యం కలుగవలెను. దక్షిణాఫ్రికాలో జ్ఞాను లున్నారు; చక్కని రయితులైన మిక్కిలి నేర్పుఋలైన సైనికు లున్నారు. అక్కడి శ్వేతజాతుల ఆధిక్యత అనే అంశం యింకను పూర్తిగా ముగిసిపోలేదా ?

## ప్రజాభిప్రాయం

కంట్రోళ్ళవలన కలుగు మేళ్ళన్నియు తమకే తెలియునని కులికే పండితుల రొదలో ప్రజాభిప్రాయం మునిగిపోవలెనా ? ప్రజలచే నెన్నుకొనబడి ప్రజలనుండి వచ్చిన మన మంత్రులు నిర్జీవమైన ఈ గుమాస్తాపాలనకు పాల్పడకుందురు గాక. వెనుక మన స్వాతంత్ర్య పోరాటములో మనకు వీరు అపకారం చేసిన వారే. వీరు మనపై కసి తీర్చుకున్నారు. ఇంకను వారు అట్లు చేయుచుండ వలసినదేనా ? మన ప్రజలకు తప్పు చేసుకునే వీలు, దిద్దుకొనే వీలు ఉండరాదా ? కంట్రోళ్ళ రద్దు వలన ఆపద వస్తే,

తిరిగి వాటిని పెట్టుకొను అధికారము మనకుకలదు. ఈకంట్రోళ్లు ఒక శాస్త్రమే అయితే, అది మంత్రులకు తెలియదా? లోతుగా దిగి ఆ విషయం కూలంకషముగ తెలుసుకొని, ప్రజలకు బోధించి పిమ్మట పెట్టరాదా? ఈ కంట్రోళ్ళ జాబితాలు కొన్నిటిని చూడండి. కాయధాన్యాలు, పప్పుధాన్యాలు, చక్కెర, బెల్లం, చెరుకుగడ, పానకం, వనస్పతి, బట్టలు, ఉన్ని, దుస్తులు, కాగితం, సిమెంటు, ఉక్కు, బొంకులు వగైరా మారకం, భీమా పెట్టు బడులు, యంత్రములు, ఫ్యాక్టరీలు, రాష్ట్రములలో కారుల పంపకము, తేయాకు పంపకము ఇదంతా నా సరళ హృదయ మును కలవరపరచుచున్నది.

# 68

18-11-47

## అ. భా. కాం. సం. తీర్మానాలు

చాలవరకు అనుకున్నట్లే, తీర్మానాలు జరిగినవి. కొంత పని ప్రజలు చేయవలెను. కొంత కేంద్ర ప్రదేశ సర్కారులు చేయవలసి యున్నది.

## హిందూ ముస్లిం సంబంధాలు

ప్రధాన తీర్మానములో ముస్లిమేతర పౌరులు, ముస్లింల ఎడల న్యాయంగా వర్తించమని కోరబడిరి. తమ ఆస్తికి, ప్రాణా లకు భద్రతకలిగిందని ముస్లింలకు నమ్మకం తోచవలెను. సర్కా ర్లున్నూ తగిన రక్షణ కలిగించవలెను. నిర్బంధంమీాద దేశంవిడిచి

పోయినవారు తిరిగివచ్చి మామూలు పనులలో ప్రవేశించునట్లు ప్రజలు ప్రభుత్వాలు ప్రవర్తించ వలెను. పాకిస్థాన్‌కు అప్పుడు నడిచిపోవుచున్న ప్రజలు తిరుగుముఖం పట్టేటంతగా వాతావరణము మారితే శీర్మానం సఫలీకృత మైనట్లు. గూర్గాం జిల్లా ముస్లింలు కొందరు వెనుకకు మరలినారట. మంచిదే. ఇక్కడి ప్రజలు మర్యాదగా వర్తిస్తే మిగతావారుకూడా తిరిగిరాగలరు.

## పానిపట్ ముస్లింల విషయం

వీరి సంగతి గూర్గాంవారి స్థితి వలెనే ఉంది. రయిల్వే సౌకర్యం ఉంటే ముస్లింలు బలవంతంమీద పాకిస్థాన్ పోనున్నారట. ఈమధ్య గాంధీజీ పానిపట్ పోయినపుడు అచ్చటి హిందువులు ముస్లింలను వెళ్ళిపోరాదని కోరిరి. అక్కడి ముస్లింలు చక్కని పనివాళ్ళు. హిందువులు వర్తకులు. ఒకరిమీద నొకరు ఆధారపడుచున్నారు. శరణార్థులు ఎక్కువగా వచ్చిన పిమ్మట, ఈ సౌమ్యత తగ్గిపోయింది. గాంధీజీ పానిపట్ వెళ్ళి వచ్చిన పిమ్మట, అక్కడ కొంత మార్పు వచ్చినట్లుంది. మరల అక్కడికి పోయి స్వయంగా తెలుసుకోవలె నని ఆయన కోరుకున్నారు.

## కంట్రోళ్ళు రద్దు వలన కలిగే ఫలితాలు

అన్నం కఱువు ఉన్నన్నాళ్లు బీదగాని సాదగాని అవసరమైన దానికన్న హెచ్చు వాడుకొనరాదు. కంట్రోళ్ళు పోతే ఉత్పత్తిదార్లు సరుకు దాచక బయటపెడుతారని వర్తకులు కొద్ది లాభముతో అమ్ముతారని అనుకొనవచ్చును. సర్కారు కంట్రో

ళ్ళను సడలించి, సాధ్యమైనంత త్వరలో రద్దు చేయుదు రని ఆశించవచ్చును.

ఇదేసూత్రం బట్టునవర్తించును. అ. భా. కాం. సం. లో తీర్మానానుకూలంగా సభ్యులు నిచ్చిన మాట ప్రతికరణశుద్ధిగా వర్తించుట లేదని వాపోయెను. అది నిరాధారమని తానాశించు చున్నానని, అట్లైననాడు ఇంతనుంచి ప్రజా ప్రతినిధుల ప్రవర్తన ప్రజలలోకూడా మంచిమార్పు తెచ్చిపెట్టి యుండునని దీనివలన 15 ఆగష్టున, తరువాత కొద్దిరోజులు మనకు గల గౌరవము వికసించును గాక యని గాంధీజీ అనెను.

## ౬౯

19_11_47

## అవమానకరమైన దృశ్యం

అ. భా. కాం. సం. ముఖ్య తీర్మానమును భంగపఱచు టకు ఏవిధముగా ప్రయత్నములు జరుగుచున్నవో బుధవారము సాయంత్రము గాంధీజీ సూచించెను. ఆ సాయంత్రమే పాతఢిల్లీ నగరంలో నడిమధ్య గల ఛాందినీచౌకువద్ద ఒకగల్లంతు జరిగెను. అక్కడ ఒకముస్లిం దుకాణము ఉన్నది. అతను ఊరికివెళ్ళుతూ, తాను తిరిగివచ్చినప్పుడు వాపసుచేసే షరతుమీద ఒకశరణార్థికి దాన్ని ఇచ్చెను. దైవకృపచే అతను తిరిగి వచ్చి వాపసు ఇవ్వ మని కోరెను. అచ్చట ఉండే ఉద్యోగి ప్రస్తుత భుక్తదారును ఖాళీ చేయ మనికోరెను. సాయంత్రంవస్తే ఇస్తానని చెప్పి ఉద్యో

గని అతను పంపెను. సాయంత్రం వచ్చి ఉద్యోగి అడిగినప్పుడు, భర్తగారు స్వాధీనపరుచలేదు. షుమారు 2000 మంది గుంపుగ చేరి ఖాళీచేయనివ్వని పట్టుబట్టిరి. అప్పుడు నుండే పోలీసు, ఇతర పోలీసు, సేన వచ్చి ఆకాశంలో తుపాకులు కాల్చి, ఆగుంపును చెదరగొట్టిరి. గుంపు చెదిరిపోతూ ఒక బాటసారిని కత్తితో పొడిచిరి. దేవుని దయవలన ఆబాటసారి చావలేదు. ఇంత జరిగినా, ఆ దుకాణం ఖాళీచేసి ఖామందుకు ఇవ్వలేదు. ఇప్పటికైనా, ఇచ్చారో లేదో. తన అధికారము ఇలా తిరస్కరింపబడుటకు సర్కారు ఒప్పుకోరాదు. ఇందులో అతిశయోక్తి లేదు.

## సిక్కుల లోపాలు

ఇంకొకచోట హిందూ, సిక్కు శరణార్థులకు చోటు కావలయునని ముస్లింలుండే ఇళ్ళను సిక్కులు వెళ్ళి బలవంతంగా ఖాళీచేయించుచున్నారట. నదిలోనుండి కత్తులుతీయుట, వాటితో సాముచేయుట, త్రాగి తందనాలు ఆడి, పదును గల కత్తులు పట్టి నాట్యము చేయుట, ఇది సిక్కులు అవలంబించే విధానమట. ఇండ్లు ఖాళీచేయనిచో ముప్పు కలుగునని ముస్లింలను బెదరించుచున్నారు. ఖాందనీచౌకలో నిషేధ మాంసాహారమును అమ్మే అలవాటు ముస్లింలకు లేదు. కాని ఈ శరణార్థులు విచ్చలవిడిగా అమ్మి అక్కడ ఉండే హిందువులకు బాధ కలిగించుచున్నారు. ఆ త్రోవను, ఆ గుంపులగుండా పోవటమే బాటసారులకు కష్టముగా ఉంది. తమ యొక్క తమ దేశము

యొక్క క్షేమంకోసం ఇట్టి పనులు చేయవద్దని గాంధీజీ వారిని హెచ్చరించెను.

## కృపాణముల ధరించుట

కొన్నాళ్ళు కొంతపరిమితి మించిన కృపాణములను తమ వెంట తీసుకుపోరాదని ఒకనిషేధం ఉండెను. కృపాణముల పరిమితిని గూర్చిన ఆ నిషేధము తొలగించు నట్లు శిఫార్సు చేయవలసినదిగ సిక్కులు గాంధీజీని కోరిరి. ఏ పరిమితి గలదైనా కృపాణమును ధరించవచ్చునని ప్రీవీకౌన్సిలు తీర్పుఇచ్చియున్నట్లు పంజాబుసర్కార్ దానికి ఒప్పుకున్నట్లు వారనిరి.

ఈ కృపాణము, అన్యులకు ఆపదచేయుటకై లేదా అడ్డదిడ్డముగా వాడుటకై ఉద్దేశింప బడలేదనే గాంధీజీ భావమును బలపరుచుటకు గ్రంథసాహెబు నుంచి ఏరిన వాక్యములను కొందరు సిక్కులు ఆయనకు చూపిరి. బలవత్ విరోధులనుండి అమాయకులు, నిస్సహాయులు అగువారిని కాపాడుటకై గ్రంథసాహెబులోని సూత్రముల ననుసరించినవాడే ఈ కృపాణమును అరుదుగా వాడవచ్చును. కనుకనే నిజమైన ఒక సిక్కు, లక్షంబాతిక జనానికి సమాన మని చెప్పబడినది. త్రాగుడుకు, ఇతర వ్యసనాలకు లోబడిన సిక్కుకు ఈ కృపాణము వాడే హక్కు లేదు. పాతతీర్పులను బట్టి ఇప్పటి స్వేచ్ఛాచారములను సమర్థించరాదు. స్వాతంత్ర్యం వచ్చినది గదా యని సమాజ వృద్ధికి అవసరమయ్యే నియమాలు భంగపరుపరాదు. అక్రమమైన విధమున కృపాణమును వాడి, సిక్కు పంథాకు - చేటు

చేయరాదు. లోకమును మెప్పించిన సాహసోపేతులగు ఆత్మబలి నిచ్చిన సిక్కు వీరుల త్యాగమును వ్యర్థపఱుపరాదు.

## సేన - పోలీసు

ఇంకొక శిబిరములో సేన మోటుగా వర్తించిరట. శిబిర జీవితం అనగా అంతర్శుద్ధికి బాహ్యశుద్ధికి ఆదర్శంగా ఉండవలెను. వాటిని వీరు శ్రద్ధతో కాపాడవలెను. స్వాతంత్ర్య ఉత్తేజము ముందు వీరికే కలగవలెను. అధికారవత్తిడి వలననే వారు సత్ప్రవర్తనులై రని గాక ప్రపంచములో నితరులవలె తాము కూడ ఆదర్శ భారతపౌరు లనిపించుకొందురు గాక. వీళ్ళే చట్ట భంగం చేసినచో, ప్రభుత్వమే సాగదు.

## షర్వాణీ బలిదానం

షర్వాణీ 30 ఏండ్లు వయస్సు గల బారమూలా జాతీయ సభానాయకుడు. దాడి నాయకు లతనిని రెండు స్తంభాల కంట గట్టి కొట్టి జాతీయసభమీద, కాశ్మీర్ సింహముమీద తనకుండే భక్తిశ్రద్ధల విడువ మనిన్ని, అజాద్ కాశ్మీర్ సర్కారుకు భక్తి ప్రమాణము గైకొన మనిన్ని హింసించిరి. దాని నతడు నిరాకరించెను. "భారతసైన్యం వచ్చింది; కొద్దిరోజులలో మిమ్ముల వెళ్ళగొట్టు" నని అతడు చెప్పేసరికి, వాళ్ళు ఉగ్రులై 14 గుళ్ళతో ఆయనను పేల్చిరి. ముక్కు కోసి ముఖము వికారపము చేసి, అతని శరీరంపై ఒక అట్ట కట్టిరి. "వీడు ద్రోహి. వీడి పేరు షర్వాణీ. ద్రోహుల కందరకు ఇదే గతి" అనే మాటలు

దానిపై వ్రాసిరి. కాని ఆపిమ్మట 48 గంటలలోనే భారత సైన్యం రావటం, దారిదోపిడిగాళ్లు పారిపోవటం సంభవించింది. ఏ జాతి మతస్థుడైనాసరే ఈలాటి వీరుని గర్వంతో సంస్మరించక తప్పదు.

## గర్వము - స్నేహము

నారాయణసింగ్ అను సతడు ఏండ్లకొలదిగా సర్కారు నౌకరీ చేసిన సిక్కు ఆస్తిపరుడు. పశ్చిమ పంజాబులోని ఆస్తి యంతయుపోయి, ఢిల్లీకి వచ్చినాడు. ఆ బీదరికమునకు లొంగుట గాని, బిచ్చమెత్తుటకుగాని ఆయన నిరాకరించెను. ఆలీసాయను చిరకాల స్నేహితు డీయనను కలిసికొని ఔదార్య్ము పూనుకొనగా ఆయన నివారించెను. ఆ సిక్కు ఉద్యోగి, ఈ ముస్లిం ఉద్యోగి ఒండొరులును కలిసినందుకు చాలా సంతోషపడిరి. ఇతర కార ణాల వల్ల ఆ ముస్లిముని ఆస్తియు పోయినది. 25 ఏండ్ల వియోగం పిమ్మట కలిసినందువలన వారిరువురు సంతోషములో తమ దుఃఖములను మరచిపోయిరి.

# 70

20-11-47

## ఇపుడు అసహాయయోగము కాదు

ఆ సభలో ఒకరు తాను నౌకరీ వదలి గాంధీజీవద్ద సేవ చేయుటకు తయారుగా నున్నా ననియు, ప్రార్థన సమయంలో కీర్తన పాడ కోరుదు ననియు గాంధీజీకి చీటీలు వ్రాసెను. ఆంగ్లేయరాజ్య ముండగా ఉద్యోగవిషయంలో తానుబోధించిన

సహాయనిరాకరణము ఇప్పుడు అవసరములేదని గాంధీజీ తెల్పెను. ఏ ఉద్యోగము చేసినైనా సరే, న్యాయముగా వర్తించి, హింస చేయకుండా జీవనోపాధి సంపాదించుకొంటూ, దేశ సేవ చేయవచ్చు ననెను. గాంధీజీ వద్ద ఇపుడు ఉద్యోగాలు లేవని, కాని గోశాలలోనికి ఆయన పోవచ్చునని గాంధీజీ తెల్పెను. ఇక కీర్తనలు పాడువిషయమున దైవసేవకు లని తెలిసినవారికే అట్టి అనుమతి ఇవ్వబడు ననెను.

## ఓక్లాకు పోవుట

సుచేతాదేవితోను, ఆమెతోడి ప్రచారకులతోను గాంధీజీ అక్కడకు పోయెను. అక్కడ శిబిరం శుభ్రముగా ఉండెను. మేళాయాత్రికులకై కట్టబడిన ధర్మశాలలు శరణార్థులకివ్వబడెను. తగినంత నీరు ఉంటే, మరికొందఱిని కూడా అక్కడ చేర్చుకోవచ్చును. దానికై అచ్చటి వ్యవహర్తలు యత్నించుచున్నారు.

## ఉద్యోగస్థుల గూర్చి

ఈఉభయులలో ఉండే లోపాలు తెలుసుకొనుటమంచిది. శరణార్థులు తమలో తాము దొంగవ్యాపారము చేయుచున్నారట. వీరిని కాపాడే ఉద్యోగులు చేతులు చాచుచున్నారట. లంచ మిచ్చినగాని నిలువనీడ దొరకుట లేదట. ఇంకా ఇతర దోషాలు కూడా ఉద్యోగులలో నున్నవట. అనేక మందిలో ఒక్కరు చెడ్డవా రుండినా, అందరికి చెడ్డపేరు వస్తుందని గాంధీజీ యనెను.

## శరణార్థులలోని లోపాలు

చిన్న చిన్న దొంగతనాలు ఉన్నవట. వారికి ఇచ్చిన రజాయీలు చించి, దూది పారవేసి, కాలికోతో చొక్కాలు కుట్టించుకుంటున్నారట. ఇదేరకము ఫిర్యాదులు చాలా ఉన్నవి.

## ఇండియా, పశుధనము

ఢిల్లీలోని కిషన్‌గంజి వద్ద ఆచార్యకృపలానీ అధ్యక్షతను గోశాల వార్షికోత్సవము జరుగనున్నది. 10 నిమిషాలైనా ఉండి వెళ్ళమని గాంధీజీని పిలచిరి. లాంఛనంగా తాను ఎక్కడికి ఎప్పుడు పోననెను. ఇప్పుడు ఈ సాంఘిక సమస్యలో మునిగి యుండుటచే, ఇతరసంగతులకు వ్యవధిలేదు. ఆయన నిస్సహాయ స్థితిగతులు చూచి ప్రార్థనాసభలో గోశాలలనుగూర్చి ముచ్చటించమని కోరిరి. గాంధీజీ సమ్మతించెను. భారతదేశంలోని పశుసంపదను కాపాడి పెంపొందించుట, గోవును గోసంతానమును సరిగా ఆదరించుట, రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించుట కన్న ఎక్కువ కష్టమైన పనులు. ఈఉద్యమంలో ఆయనకు అధిక ప్రవేశము కలదు. అయినా ఈ సమస్యను సరిగా యోజించే ఆవశ్యకతను గూర్చి ఆయన సామాన్య జనానికి నచ్చచెప్పలేక పోయెను. గోశాలలు నడిపేవారు, డబ్బు ఇవ్వగలరే కాని పశు శాస్త్రము వారికి తెలియదు. ఆవుల పాలిచ్చుశక్తి పెంచుట గాని, ఎద్దులజాతి వృద్ధిచేయుటగాని వారికి తెలియదు.

## గోశాలల పరిపాలన

ఇప్పటి గోశాలలు పైన తెల్పిన మంచిపనులు చేయక ఏదో విధముగా గొడ్లను నిలువబెట్టే పశువులశాలలు అయినవి. మంచిపశువుల తయారుచేయుచు శుభ్రమైనపాలు అమితముగా ఇచ్చే చౌకగా లభింపజేసే గోవులను పోషించే దేశ మగుటకు బదులు భారతం ప్రపంచంలో అట్టడుగున ఉన్నది. పశువుల ఉచ్చ, పేడ, చచ్చిన గొడ్ల తోలు, ఎలా ఉపయోగించాలో వారికి తెలియదు. ఈ అజ్ఞానమువలన ఏటేట కోట్లకొలది రూపాయిలు నష్ట మగుచున్నవి. ఈ పశువులు భూభార మని, వీటిని చంపుతే మంచిపని చెప్పే నిపుణులు బయలుదేరినారు. వారితో గాంధీజీ ఏకీభవించరు. కాని ఇప్పటి దుస్థితి సాగితే, ఆ గతి పట్టవచ్చును. ఈ గోశాలపాలకులు దానిని ఆదర్శసంస్థగా చేతురు గాక.

# 71

21-11-47

## భారతంలో పాలశాలలు

నిన్నటిరోజు గాంధీజీ చెప్పని ఒకసంగతిని నేడు చెప్పదల చెను. సర్కారు సైనికుల తరఫున కొన్ని పాలశాలలు నడుప బడుచున్నవి. అవి ఇప్పటికీ ఉన్నవని రాజేంద్రప్రసాద్ చెప్పెను. కొన్ని ఏండ్లక్రిందట బెంగుళూరులో అట్టి పాలశాల నొకదానిని గాంధీజీ చూచెను. ఆశియాలో కెల్ల శ్రేష్ఠమైన దని చెప్పబడే ఆవు, అక్కడ కనబడెను. అది పూటకో రోజుకో, డెబ్బది

ద్రైము పౌనులు లేక 30 శేర్లు పాలు ఇచ్చునట. దానికి అక్కడక్కడ సంచరింపనిత్తురు. అది స్వేచ్ఛగా దాని యిష్టము వచ్చినట్లు తిరుగనిస్తారు. అది చాలా మంచి పద్ధతి.

## దూడల హత్య

కోడెదూడలను సన్మితిని వ్యవసాయానికి, రవాణాకు ఉపయోగించజాలక వాటిని చంపివేస్తున్నారట. కబేళాల క్రింద, వందల కొలది ఎకరాల భూములు ఉన్నవట. వీటికై కోట్లకొలది రూపాయలు ఖర్చు అట. ఇంతా పాశ్చాత్య సైనికులకోరకు. ఇప్పుడా తెల్ల సైనికులు లేరు గనుక, వాటిని ఎత్తివేయ వచ్చును. సామాన్యపౌరులు కోరని ప్రత్యేక అవసరాలను భారతసైనికుడు కోరడు, కోరరాదు.

## గోవునుగూర్చి సతీష్‌బాబు

ఖాదీప్రతిష్ఠాన్ స్థాపకులైన సతీష్‌బాబు ఆవును, బర్రెను గూర్చి వ్రాసిన పుస్తకము సంపూర్ణమైన ప్రమాణ గ్రంథము. ఇతరగ్రంథములజోలికి పోక, తన అనుభవములమీద ఆధారపడి ఖైదులో నుండగా ఆయన దానిని వ్రాసెను. దానిని బెంగాలీ లోకి, హిందూస్థానీలోకి అనువదించిరి. పశుపోషణకు, పాల వృద్ధికి అది బాగుగా తోడ్పడగలదు. ఆవుకు, బర్రెకు ఉండే భేదాన్నికూడ ఆయన అందు నిరూపించెను.

## హిందూ - హిందూమతము

హిందు అంటే ఎవరు ? దాని వ్యుత్పత్తి ఏమి ? హిందూ మనేది ఉన్నదా ? అనే ప్రశ్నలు రాగా వాటికి గాంధీజీ

జవాబు చెప్పెను. తాను చరిత్ర తెలిసిన విద్వాంసుడు కానని. హిందు అనే పదం వేదములలో లేదు. అలెగ్జాండరు ఇండియా మీద దాడి వెడలినప్పుడు, సింధునదికి తూర్పున నుండు ప్రజలను హిందువు లని పిలచిరి. గ్రీకు భాషలో సవర్ణం హవర్ణంగా మారుతుంది. కాన ఆ ప్రజలు హిందువులు. వారి మతము హిందూమతము. అన్యుల నాదరించుటలో ఈ మతము తన మహిమను వెల్లడించింది. నిర్బంధాలనుండి తప్పించుకొనుటకై ఆరంభదశలో వచ్చిన క్రైస్తవులకు, "బెని ఇస్రియల్" అనే యూదులకు, పార్శీలకు తల దాచుకొనుటకు చోటు ఇచ్చింది. ఆర్యసంస్కృతి పరిశోధకులు మతాన్ని వైదిక మని, దేశాన్ని ఆర్యావర్త మని పిలిచెదరు. ఆయన ఊహించిన హిందూస్థాన్ ఆయనకు పూర్ణ సంతృప్తి కలిగించుచున్నది. అందులో వేదాలు ఉన్నవి. ఇంకా ఇతర పుణ్యగ్రంథా లున్నవి. ముస్లిం, క్రైస్తవ పార్శీ, యూదు మతాలను తనతోటి సనాతన హిందువు ఆదరించుటలో అసందర్భం ఏమియు లేదు. హిందూమతగౌరవం తగ్గ లేదు, సరిగదా సూర్యచంద్రాదు లున్నంతవరకు అది నిలచి యుండును. తులసీదాసు ఒక్క దోహాంలో అంతా వివరించాడు. "నిర్హేతుక కారుణ్యమే మతానికి కూకటివేరు. శరీర లాలసే అహంకారమునకు మూలకందం. శరీరం పతించినను సరే దాక్షిణ్యమును వదలరాదు."

## మొత్తము శిబిరాలు

నిన్న గాంధీజీ చేసిన విమర్శ ఓక్లా శిబిరమును గురించియే అని ఒక సోదరి బాధపడెను. కాని తాను చెప్పినది అచ్చు ఓక్లా శిబిరానికి వర్తించదు. అన్ని శిబిరాలలో నుండే దురాచారాలను గూర్చి తాను మాట్లాడితి నని ఆయన చెప్పెను.

## దైవవిరోధ చర్య

ఢిల్లీలో ఈమధ్య జరిగిన గల్లంతులలో 137 మసీదులకు కొంచెమో గొప్పో నష్టము కలిగినది. కొన్నిటిని దేవుని గుళ్ళగా మార్చినారు. కన్నాటుప్రదేశములో ఉండే మసీదులో విగ్రహప్రతిష్ఠ చేశారు. త్రివర్ణపతాకం ఎత్తారు. ఇటు దానిని మైలపఱుచుట, హిందు సిక్కు మతాలకు రెంటికి కళంకమే. పాకిస్థాన్‌లోని ముస్లింలు అట్టి దుష్టచేష్టలు చేసి నందువల్ల వీటి నిక్కడ సమర్థించ వీలుగాదు. ఇది అచ్చుగా దైవవిరోధచర్య. మూడుమతాలనూ నాశనం చేసే వికృత చర్య.

## రోమన్ కాథలిక్కులను బాధించుట

కొంచెము ఆలస్యమైనా సరే, గూర్గాంవద్దనుండే రోమన్ కాథలిక్కు క్రైస్తవులు పడే బాధలను పలుకరించక తప్పదు. వాళ్ళగ్రామం "కాన్‌హై" ఢిల్లీకి 25 మైళ్ళు. అక్కడ వారు పడే బాధలనుగూర్చి గాంధీజీకి ఒక జాబు తెచ్చిరి. దానిభాష హిందూస్థానీ; దానిలిపి ఉర్దూ. ఆనైపువారు, ఏ మతస్థులైనా సరే, ఉర్దూలిపిని హిందూస్థానీభాషనే వాడుదురు.

ఆ ఊరు ఖాళీ చేయకపోతే, వారికి ఆపద కలుగు నని బెదిరించిరట. ఇది పట్టిబూకరింపు మాత్రమే కావలెనని గాంధీజీ ఆశించెను. ఆ క్రైస్తవులు నిరాటంకముగా తమ వృత్తిని, తమ మతమును అనుసరించ నగును. ఆంగ్లేయులక్రింద వారి కుండిన స్వాతంత్ర్యం ఇప్పు డేమాత్రం తగ్గరాదు. ముస్లింలమీద ఉద్రేకము తగ్గి ఇతరులమీదికి వ్యాపింపవచ్చు నని లోగడ గాంధీజీ చెప్పిన దానికి ఇదియే నిదర్శనము. ఈ క్రైస్తవులు పూర్తిగా నిరపరాధులు. వీరు ఎద్దుమాంసము, పందిమాంసము తిన్నందువలన వీరిపై ఆవేశం పెరిగిం దన్నారు. కాని నిజ మేమంటే ఈక్రైస్తవులు బుద్ధిపూర్వకంగా ఏళ్ళక్రింద ఈ రెండు మాంసాలు వదలివేశారు. ఈక్రైస్తవశిష్యాదుదారులలో నొకరు 'శేవారీ' వద్ద నుండగా, అతని బైసికిలు ఎత్తుకపోయిరి. ఆయన కష్టం మీద చావు తప్పించుకుని బయట పడినాడు. హిందువులు, సిక్కులు కానివారందరూ అస్తమించిన పిమ్మటనే, ఈ దుస్థితి తగ్గునా ? ఈలాటివి చూచుటకు జీవించ వలెననే కోరిక తనకు లేదని గాంధీజీ యనెను.

## 72

22-11-47

### సోనీపట్ క్రైస్తవులు

నిన్న వర్ణించినట్టిబాధలే సోనిపట్‌లోని క్రైస్తవులకును కలిగినవట. అచ్చటి మతబోధకుల ఇండ్లలో కొన్నాళ్ళు శరణార్థుల ఉండ నిమ్మని కోరగా, ఆ బోధకులు ఒప్పుకొనిరి. వారికి

వందనములుకూడా అర్పించిరి. పిమ్మట ఆ బోధకుల ఇతర ఇళ్లు ఇమ్మని కోరిరి. చివరకు ఈ ఊరు వదలి పొమ్మని కోరిరి. ఈ కథ నిజమగుచో, ఈ మహామారి జాడ్యం ఇంకను వ్యాపిస్తున్న దన్న మాట. దానిపర్యవసానంగా ఇండియా ఏమైపోనున్నదో!

## తిట్టుకు మొట్టు

పాకిస్థాన్‌లో ఈగోల తగ్గితే తప్ప, భారతంలో ఎక్కువ మార్పు కాన్పించ దని కొందరు స్నేహితులు గాంధీజీకి తెల్పిరి. లాహోరుగూర్చిన కథను చెప్పిరి. ఈపత్రికా సమాచారములపై గాంధీజీ ఎన్నడుఆధారపడరు. శ్రేష్ఠమైన పత్రికలుకూడా, అతిశ యోక్తులకు, అలంకారాలకు అలవాటు పడుతవి. కాని పత్రి కలు చెప్పేవి నిజమైనా, ఆ దుష్టమార్గమును ఇతరులు అనుస రించరాదు.

## సవ్యమైనప్రవర్తన కావలెను

మధ్యను పలకరాయి కొయ్య చట్రముకు ఏమాత్రం వత్తిడి తగిలినా, దాని కోణాలు మారిపోవుచుండును. కాని ఒక కోణము సరిజేసినచో మిగత మూడు కోణములు మరల సరిపడును. అలాగే భారతప్రజలు, ప్రభుత్వము, సక్రమంగా వర్తిస్తే, పాకిస్థాన్ తగిన జవాబు ఇస్తుంది. యావద్భారతానికి వివేకము కలుగుతుంది. కాన్ పైా, సోనీపట్ రైల్వే స్టేషనులమీద ఏ ఫిర్యాదూ లేదు; కాని అచట దుండగములు విచ్చలవిడిగా సాగుచున్నవి. ప్రపంచమున ఇండియా తలయెత్తి తిరగవలెనంటే ఇక్కడ స్థితిగతులు మారవలెను.

## శరణార్థులమధ్య సహకారం

ఈ శరణార్థులలో వైద్యులు, వకీళ్ళు, విద్యార్థులు, పంతుళ్ళు వగైరా కలరు. వారు బీదశరణార్థులనుండి వేరు కారాదు. అలా చేసినచో, ఈ మహోపద్రవమునుండి ఏ గుణ పాఠము వారు నేర్చుకోలేదన్నమాట. ఈశరణార్థులందరు కలిసి పని చేసి మంచి పట్టణాలు నిర్మిస్తే, నగరాలకు వత్తిడి తగ్గును. అందఱి ఆరోగ్య ఆయుర్దాయాలు పెరుగుతవి. వీరిలోని బీద సాద సమానమైన జీవితము గడపినచో, వారప్పుడు సర్కారు మీద బరువు తగ్గింతురు. ఇతరుల మెప్పును పొందుదురు. ఊడ్పుపని, పాకీపని మొదలగు సేవలన్ని వారే జరుపుకొనుచు ప్రయోజనకారిగా పగటికాలం అంతా వినియోగిస్తే, ఇప్పు డున్న వైషమ్యాలు, అసూయలు నిమిషములో తగ్గుతవి. లక్షలకొలది శరణార్థులు ఇలా ప్రవర్తించినచో, లోకం వారిని ప్రశంసించక తప్పదు.

## సర్కారుకు క్లిష్టస్థితి

అన్న వస్త్రాల కంట్రోళ్ళు తొలగించుటకు సర్కారు సంకోచించుచున్నారు. సరుకు తక్కువగానుందని వారినమ్మకం. కంట్రోళ్ళవల్ల బీదలు బ్రతుకుచున్నారని, కంట్రోల్లుపోతే ధరలు పెరిగి బీదలు బాధపడుదు రని వారి వాదము. ఉత్పత్తిదారు లను, వర్తకులను వారు నమ్మరు. కంట్రోల్లు తొలగగానే, డేగలవలె వీరు బీదలమీదపడి మ్రింగివేయుదురని వారి భయం.

ఈ రెండింటిలో కంట్రోళ్ళే తక్కువ అపాయకర మని వారు ఎంచుచున్నారు.

## వర్తకవర్గానికి విన్నపము

సర్కారు అనుమానాలు పోగొట్టండి. కంట్రోలు రద్దు వలన ద్రవ్యోల్బణము కలుగ దని, దొంగబజార్లు, అవినీతి పూర్తిగా కాకపోయినా, చాలాభాగము తగ్గి, బీదలు బాగు పడుదు రని, ఈ వర్తకులు, ఉత్పత్తిదారులు సర్కారుకు హామీగా ఇయ్యవలెను.

# 73

23-11-47

## ప్రార్థనకాలంలో నిశ్శబ్దత

ప్రార్థనాసమయమందు మౌనంవహించుట మామూలు అయినను, నేను ఎక్కువగా వచ్చిన స్త్రీలలో కొంత గుసగుస సాగిన దని గాంధీజీ చెప్పగానే, అందఱు నిశ్శబ్దముగా నుండిరి.

## కాలపరిమితిని మించినందుకు

20 నిమిషాలకు మించవద్దని, సాధ్యమైనంత వరకు, 15 నిముషాలలో ముగించమని రేడియోవారు చెప్పిన నియమాన్ని గాంధీజీ పాటించజాల రైరి. తన ఎదుట నున్న శ్రోతల హృదయాల్లోకి ఆయన చొచ్చుకుని పోవలెను. కాన కొంత అదనంగా మాట్లాడవలసి వచ్చుచున్నది. రేడియోమాట తరువాత విచారించవగును. నిష్ప్రయోజనంగా గాని, కంఠశోషకొఱకు గాని, మాట్లాడే అలవాటు తనకు లేదని గాంధీజీ యనెను.

## దౌర్జన్యం సమర్థనీయంకాదు

తన హక్కుకు భంగం కలిగేటప్పుడు, దౌర్జన్యం ఉప యోగించి దానిని కాపాడుకోరాదా యని సభలో ఒకరు ఒక ప్రశ్నను పంపిరి. నిజానికి దౌర్జన్యం ఏ హక్కును ఏ ఒక్కరిని కాపాడదు అని ఆయన జవాబు చెప్పిరి. సక్రమంగా పరిపాలించిన కర్తవ్యము నుండియే ప్రతి హక్కు ఏర్పడితే, అప్పు డది అభేద్య మగును. నా కిచ్చిన పనిని పూర్తిచేసి నపుడే, ఆ కూలి డబ్బుపై నాకు హక్కు ఏర్పడును. పని చేయకుండా డబ్బు తీసు కున్నచో, అది దొంగతన మగును. కర్తవ్యనిర్వహణతో నిమిత్తము లేకుండా ఎల్లపుడు హక్కులగూర్చి గోలచేయు వారితో తాను కలియజాల నని గాంధీజీ అనెను.

## హరిజనులపై నిర్బంధము

రోటక్కులోను, ఇతర చోట్లను, హరిజనుల స్వాతం త్ర్యాన్ని అణగద్రొక్కుచున్నా రట. ఇందులో క్రొత్త ఏమీ లేదు. ఆంగ్ల పరిపాలనలోనూ ఇలాగే జరుగుతుండేది. కాని ఇపుడు ఈ స్వాతంత్ర్య వాతావరణములో అది తగ్గక పెరుగు చున్నది. భారతానికి వచ్చిన స్వాతంత్ర్యం ప్రతి భారతీయునికి చెందదా? హరిజనులు ఇంకా బానిస లేనా? ఒకతప్పు ఇంకొక తప్పుకు దోవతీస్తుంది. ముస్లిములయెడ దుష్ప్రవర్తన కైస్త్రవుల మీదికి హరిజనుల మీదికి కూడ తిరిగింది. హరిజనులకు చేసిన అపచారాన్ని తొలగించుటకు హరిజన సేవక సంఘము ఏర్పాటుప బడింది. 15 వ ఆగష్టును కలిగిన మార్పును మనం

సరిగా గ్రహిస్తే, ఈ దుష్ట సంఘటనలు వచ్చేవి కావు. నీచాతి నీచునకును స్వాతంత్ర్య ఉత్తేజం కలిగేది. ప్రతివాడు తన మేలే చూచుకొను చున్నట్లును, ఎవరూ భారతంమాట తలపెట్టనట్లును కనుబడుచున్నది.

## 74

24-11-47

### నిర్మాణ కార్యక్రమావశ్యకత

నేను వచ్చేటప్పుడు నాకు, నా పరివారమునకు ఎలా చోటు వదిలినారో, అట్లే వెళ్ళేటప్పుడు కూడా వదలండి. మీ ప్రేమ, దాని విలువ నాకు తెలుసును. నన్ను తాకుటకై నా మీద పడవద్దు. ప్రేమోత్సాహాలను నిర్మాణ కార్యాలకు మార్చండి. ఎన్నాళ్ళనుంచో చెప్పుచున్నాను అలా చేయమని. ఇప్పుడు అత్యవసర మైనది సాంఘిక సామరస్యము. పూర్వము ఉండే విభేదాలు ఇపుడు వికృతరూపము దాల్చినవి. ఇద్దఱు ఒక వైపున మరి ఒకరు రెండవవైపున చేరి పోరాడుకొని, మూడు మతాలు నాశనముచేస్తున్నారు.

ప్రార్థనకు వచ్చేవాళ్ళు కోపరహితంగా ఉంటేనేచాలదు. సాంఘిక సఖ్యతకు చురుకుగా పనిచేయవలెను. ఈసఖ్యత సంపాదించుటలో అత్యంత సఫలత పొందిన ఆ ఖిలాఫత్ రోజులు మరల ఎన్నడూ రావా ?

## తాజా విషాదకథ

నిన్న ఈ రాజధానిలో కొందరు హిందు సిక్కు శరణార్థులు ఖాళీగాఉన్న ఒక ముస్లిం ఇంటికిపోయి, అక్రమంగా ఆక్రమింప జూచిరి. కలహం వచ్చింది. కొందరికి గాయాలు తగిలినవి కాని ఎవరు చావలేదు. దీనినుంచి నలుగురు సిక్కులు హత్యగావింపబడినట్లు పుకారు బయలుదేరింది. దాని ఫలితంగా మరి కొంత కలత, కత్తిపోట్లు జరిగాయి. ఇదంతా నిజమే అయితే, అది మహా క్రూరకృత్యము. దానినిగూర్చి ప్రజలు ప్రభుత్వాలు అత్యవసరముగా శ్రద్ధ తీసుకోవలెను. ప్రజల వత్తాసి లేనిచో, ప్రభుత్వము నిర్వీర్య మౌతుంది.

కార్తిక పౌర్ణమి రానున్నది. దానిని గూర్చి పుకార్లు ప్రబలుచున్నవి. ఈ పుకార్ల వల్ల మనం దినదిన గండములలో జీవితము గడపుచున్నట్లు అర్థము. ఏ జాతికీ లేక రాజ్యానికీ అది భావ్యమైన స్థితిగాదు. ప్రతి జాతీయ సేవకుడు దీనిని అణుచుటకు కృషి చేయవలెను.

## కృపాణధారణ - దాని అంతరార్థము

మాజీ కేంద్ర శాసనసభ్యుడు లయల్‌పూర్ వాసి సర్దార్ సంతసింగ్, క్రిందటి బుధవారము నేనీ విషయమై చెప్పిన మాటలకు నేనెన్నడు ఉద్దేశింపని అపార్థంకల్పించారు. 1915లో నేను ఇండియాకు వచ్చినప్పటి నుండి, నా మాట సిక్కులకు, హిందువులకు, మహమ్మదీయులకు, కూడా శాసనముగాఉండేది.

ఇప్పుడా మర్యాదలు మారినవి. నేను మాత్రము మారలేదు. సిక్కుల ప్రస్తుత వైఖరిని నేను గమనించినట్లు ఆయన గమనించ లేదు. నామాటలు విన్నప్పుడు అనేకసార్లు ఈసిక్కుల చిక్కులు తీరుతుండేవి. నేను సిక్కుల విషయమై జాగ్రత్తగా మాటలాడ వలెనని ఎవరూ నన్ను మందలించ నక్కరలేదు. ఈ వైరిభావం, ఈ త్రాగుడు, ఈ దుర్వ్యసనాలనుండి, సిక్కులను కాపాడువారే నిజమైనస్నేహితులు. వారు ఘూర్ణిపిస్తున్న కత్తిని వబలో పెట్టాలి. కృపాణాన్నిగూర్చి ప్రీవీకౌన్సిల్ తీర్పువలన వీళ్ళకేమీ వరిగేది లేదు. కృపాణం పవిత్రమైనా, పవిత్రంగా వాడినపుడే ఆ పవిత్రత నిలుచును. అది బలచిహ్నమే- కాని నిగ్రహంతో అరుదుగా వాడినపుడే. నాకు తెలిసిన సిక్కు మత సూత్రాలను బట్టి, ఇపు డీసిక్కులు చేసేపని ఏమాత్రం సమర్థనీయంకాదు. సిక్కులచరిత్ర నాకు తెలుసునని, గ్రంథసాహేబ్ సారముచు గ్రోలినవాడ నని అనుచున్నందుకు ఈ సిక్కు సరదారు నన్ను క్షమించగలరు. ఆ ధర్మాన్నిబట్టి చూస్తే సిక్కులు చేస్తున్న పని అసమర్థనీయం. ఆత్మవినాశకరం. సిక్కుజాతి ధైర్య గౌరవాలు ఇట్లా వృథా కారాదు. భారతానికి గర్వకారణం కావలసిన ధైర్యసాహసాలు లోకకంటకం కాకూడదు.

సిక్కులు ఇస్లాం శత్రువులు కారు. నన్ను కొన్నాళ్ళ అలా అనలేదా? ఇప్పుడు ఆ గౌరవాన్ని మా ఇద్దరి మధ్య పంచుతారా? నేనాగౌరవము కోరలేదు. నామీద వారుపెట్టే

ఫిర్యాదుకు, నా జీవితమంతా వ్యతిరేకంగా ఋజువు ఇస్తుంది. కాశ్మీర్ సింహానికి అనుకూలంగా ఉన్న సిక్కులనుంచి ఈ శరణార్థులు గుణపాఠము నేర్చుకోవాలి. ఇదివరకు చేసిన పాపాలను గూర్చి పరితాపము చెందవలెను.

## ఒక దుష్టసలహా

పాకిస్థాన్‌లోని సిక్కులను హిందువులు ఆహూతిచేస్తే, హిందూ ముస్లింలకు సఖ్యత కుదురుతుందని చేయబడిన భ్రాతృఘాతుకమైన సూచనకు నేనెన్నడూ అంగీకరింపను.

శరణార్థులందరు స్వస్థానాలకు సగౌరవంగా తిరిగివస్తే తప్ప, భారతానికి శాంతి ఉండదు. ఈ జనాభా మార్పిడి అనే పాపం శమించవలెను.

## దాని దుష్టకార్యాలు

పాకిస్థాన్ క్రూరకృత్యాలు ఏకరువు పెట్టుటచేత ఎవరికీ ఏమియు మేలు కలుగదు. ఆ భయంకర పాపాల బాధ్యత పాకిస్థానే భరించవలెను. 15-8-1947 కు పూర్వమే పాకిస్థాను ఈ క్రూరత్వాన్ని ఆరంభించిందని నా భావం. ఆగష్టు 15 నైనా వారి నడవడిలో మార్పు కనబడలేదు. ఆ పాపాలనే ఇచ్చటివారనుసరించారు. ఆ విధముగా ఉభయులు సమానులైనారు. ఈ మాయనిద్రనుండి బయటపడి పరితపించి మారవలెను. లేదా నశింపవలెను.

## 75

25-11-47

### శరణార్థులా, లేక బాధితులా ?

కొంతమంది శరణార్థులనే పేరుకు ఆక్షేపించారు. యావద్భారతములో నివసించుటకు ప్రతి భారతీయునికి హక్కు కలదు. కాన తాము శరణార్థులు గాక, బాధితుల మని వారు తెల్పిరి. బాధితులనే పదముకన్న దుఃఖిలనే పదము బాగుండునని గాంధీజీ సూచించగా, వారామోదించిరి.

### ముస్లిం ఇండ్లను ఆక్రమింపరాదు

ఆనాడు మూడురకాల ప్రజలు ఆయనను కలిసిరి. మొదటిది లాహోరునుంచి వచ్చిన కుటుంబము. 17 మంది స్వజనాన్నీ, ఆస్తి సంతయును, వారు పాకిస్థాన్‌లో కోల్పోయిరి. ఢిల్లీలో ఇల్లు ఇప్పింపమనికోరగా, అది తనకు చేతగాదని గాంధీజీ తెల్పెను. ఢిల్లీలో ఖాళీ ఇళ్ళు లేవు. ఇతరులవలె శిబిరాలలో వీరు కూడా నివశించవలెను. తాము దానధర్మములపై ఆధారపడు బీదవారము కామని వారు తెల్పిరి. గాంధీజీకూడా వారు బిచ్చమెత్తుట కిష్టపడడు. శిబిరాలలో ఇవ్వబడు అన్నవస్త్ర గృహవసతికిగాను వారు కాయకష్టము చేసినచో, అపుడు భిక్షమనేదేలేదని ఆయన తెల్పెను. మాకు పిల్లలు ఉన్నారు. పనిచేయ వీలు కలుగదు, అని జవాబు చెప్పిరి. ఇతరులకును పిల్లలు ఉన్నారని గాంధీజీ యనెను. వారిలో శక్తివంతులు శిబిరములలోని ప్రజలను చక్కని కట్టుబాట్లలోనికి తెచ్చి తమ అనుభవమును జ్ఞానమును వారికి

అందజేయ వచ్చును. ఢిల్లీలో ఇళ్ళుగల ముస్లింలు చాలామంది కలరని వారు తెల్పగా, అది వినేసరికే గాంధీజీకి సిగ్గును, ఆవేదనయు కలిగెను. అనేక వేలమంది బలవంతముగ ఆస్తులు విడిచి వెళ్ళిపోయిరి. కాని ఈ దుఃఖితులు ఈ అనుభవములవలన మేలు పొందలేదు. గాంధీజీ చేసే విన్నపము చెవిటివాని ముందు శంఖ మూది నట్లుండెను. అమితబాధకు లోనైన ముస్లింలను మీ ఇండ్లు ఖాళీచేయుమని కోరుటకంటె తనబసను ఖాళీచేయమంటే గాంధీజీకి నచ్చేది. ఆ మాటతో వారు మరల మాటాడలేదు.

## చక్కని కోరిక

పశ్చిమోత్తర ప్రాంతంలోని హజారానుండి 8000 దుఃఖితులు వచ్చిరి. వారు కృపాణముల ధరించలేదు. జిరాయితీచేసుకొనుటకు భూమి, అప్పుగా పరికరములు వగైగా, ఇప్పింపమని కోరిరి. వారిఅన్నం వారు సంపాదించుకోగలమనిరి. ముస్లింలను పొలాలనుండిగాని ఇండ్లనుండిగాని వెళ్ళగొట్ట పనిలేదనిరి. తూర్పు పంజాబులో వీరికి చోటుచూపించలేదట. పశ్చిమపంజాబునుండి వచ్చినవారినే తూర్పుపంజాబ్ ఆదరించునట. వారికోరిక సహేతుకమనియు, తగినంత త్వరలో కేంద్రప్రభుత్వం వారికి సరిపోయే పొలము ఇప్పింపవలెననియు, గాంధీజీ సలహాచెప్పెను.

## తిరిగి వెళ్ళగలుగుటకు షరతు

తాము తిరిగి స్వస్థలముల కెపుడు పోగలుగుదురని సభలో నొకరు గాంధీజీ నడిగిరి. ఇక్కడ ఇంకను, ఉన్న ముస్లింలను ఇక్కడివారు పాకిస్తాన్‌కు తరిమికొట్టకపోతేను, వత్తిడిమీద

వెళ్ళినవారిని తిరిగిరమ్మని పిలిచి ఆదరించితేను, అప్పుడు వారు సుఖముగ మరల ఇండ్లకు చేరవచ్చును. అట్టివేళ గాంధీజీ ధైర్యంతో పశ్చిమపంజాబు పోయి, అటనుంటి వెళ్ళగొట్టబడిన హిందువులను, సిక్కులను తిరిగిరప్పించి ఆదరించమని, అచ్చటి వారికి ఉపదేశింపగలడు. భారతసమ్మేళనంలోనున్న 3½ కోట్ల ముస్లింలను వెళ్ళకొట్టుదుమనుకొనుట, అచ్చగా మూర్ఖపు యోజన, దానిని గాంధీజీ సహించలేడు. అలాంటి విపత్తు చూచుటకై ఆయన బ్రతుకజాలడు. ఆయన లోకానికి వట్టిబరువు అయినట్లుగా తోస్తున్నది. ఆయన ఉన్నా, ఊడినా, ఏదోనాడు దుఃఖితులు తమతమ ఇండ్లకు పోదురు.

# 76

26-11-47

## నిరాధారమైన ఫిర్యాదు

బొంబాయి వార్తాపత్రికలలో పేరుచెప్ప సాహసములేని ఒకవిలేఖరి, గాంధీజీమీద అభాండములు వేసెను. "అఖిలభారత రేడియోవారు గాంధీజీ ఉపన్యాసములద్వారా కాంగ్రెసు ప్రచారమునకు తోడ్పడుచున్నారు, అది ఫాసిస్టుపద్ధతి; అహింస అనేది వట్టిమునుకు; గాంధీజీ సంభాషణలు వినలేక ప్రజలు విసికి పోవుచున్నారు" అనెను. కొందరకు అలాతట్టినా, అనేకమంది తన ఉపదేశాలవల్ల మేలుపొందుచున్నట్లు అనేక ఉత్తరములు వచ్చుచున్నవని గాంధీజీ యనెను. ఆత్మస్తుతికోసము రేడియో నుపయోగించుకొను ప్రభుత్వం నిరుపయోగం. ప్రభుత్వం చేయుగల

సత్కార్యాలే నిజమైన ప్రచారం. వినదలంచకపోతే, అట్టి వారిని నిర్బంధపఱుచుటలేదు. రేడియోవారికొరకు మాట్లాడ వలెనని తాను కోరుటలేదు. ప్రార్థనకు, మతమునకు సంబంధించిన విషయాలు మాట్లాడటమే గాంధీజీ ఆశయం. గాంధీజీ ఉద్దేశ్యము ఒక్కటే. మానవజాతిసేవ వినుటకు ప్రజలు రాకున్నచో ఆయన ఉపన్యాసములు ఆగిపోతవి. వస్తే సాగుతవి.

## అపహరింపబడిన స్త్రీలు

పాకిస్తాన్‌లో స్త్రీలు చెఱపట్టబడ్డారని కొన్నిజాబులు వచ్చినవి. వాళ్ళు లజ్జతోచస్తున్నారు. అట్టివాళ్ళను సమాజము నిరసించటం క్రూరకృత్యము. నిర్బంధంగా చెఱచబడిన స్త్రీకి, పాతివ్రత్యభంగంలేదు. వ్యభిచారదోష మంటదు. సంఘములో నున్న అవినీతిపరులగు స్త్రీలను, పురుషులను దండించుటయే లేదు.

కొందఱు చేసేతప్పులు బయటికికూడా రావు. బల ప్రయోగమువలన భంగపడినవారిని బహిష్కరించుట భావ్యం కాదు. తనభార్యకో, కూతురకో, ఆలాటి ఆపదకలిగి వారు తిరిగి వచ్చుచో, గాంధీజీ వారి నాదరించును, ప్రేమించును. అనేకమంది హిందూ, ముస్లిం స్త్రీలకు ఆయన ఈలాటి సలహాచెప్పెను.

## వ్యవసాయములో పొత్తు

ఒకప్రదేశ కాంగ్రెసు కార్యదర్శి, జిరాయితీదారు, గాంధిజీని కలిసెను. సేద్యంలో ఇదివరకు పరస్పరసహాయం ఉండేది.

ఇపుడు కూలీలకు డబ్బు ఇవ్వవలసివస్తున్నది. అందువలన ధాన్యాల ధరలు పెరుగుచున్నవి అని గాంధీజీకి ఆయన తెల్పెను. ఈ సదాచారము తనకు తెలుసుననియు, అందరు ఇలా ఆచరించవలె ననియు, గాంధిజీ నొక్కిచెప్పెను.

## రైతురాజ్యము

అందరుగాకపోయినా, కనీసం ఆహారమంత్రి ఐనా కిసాన్‌గా ఉండవలెనని ఆకార్యదర్శి తెల్పెను. ఇప్పటి మంత్రులు ఎవరును కిసాన్లుకాకుండుట దురదృష్టమని గాంధీజీ అన్నాడు. మనసర్దార్ కిసాన్‌కుటుంబములో పుట్టినను, బారిష్టరైనాడు. ప్రధానమంత్రి విద్వాంసుడు, చరిత్రకారుడు, గ్రంథకర్త, కాని జిరాయితీనిగూర్చి బొత్తిగా ఆయనకు తెలియదు. మంత్రులెవరూ పొలంలో పనిచేసినవారుకారు. భూసారమును ఉత్పత్తిని పెంచుట విశేష లాభాలను తగ్గించుట, కిసాన్‌కే తెలుసును. ప్రజాస్వామ్య ప్రభుత్వంలో కిసానే పాలకుడుగా నుండవలెను. న్యాయవంతుడు, సమర్థుడు అయిన కిసాన్‌దొరికితే, ఆయనను పాలకునిగా చేసి, జవహర్‌లాలును ఆయనకు కార్యదర్శిగా నుండమని గాంధీజీ చెప్పెను. ఆ కిసాన్ మంత్రికి ఇంగ్లీషు రానక్కరలేదు. అత నుండుటకు రాజభవనము అడుగడు. మట్టిగుడిసెలో నుండి, ఆరుబైట పరుండి అవకాశమున్నపుడెల్ల పొలముపని చేయును. పంచాయతీరాజ్యంలో ప్రముఖుడుకావలసినవాడు కిసానే. అది ఎలాగా అనేదే ప్రశ్న.

# 77

27-11-47

## అసాధ్య మేదియులేదు

ఆనాడు రాజప్రతినిధిని, అచ్చటనే విడిదిచేసిన పాకిస్థాన్ ప్రధాన మంత్రిని, గాంధీజీ చూచెను. రాజప్రతినిధి, రెండు రాజ్యాల ప్రధాన మంత్రులు, సర్దార్ పటేలు, ఖజానా మంత్రి అందరూ సంప్రదించి రెండుదేశాలకు శాంతినిగూర్చే కొన్ని తీర్మానాలకు వచ్చారట. సదయహృదయులకు కలతలనుండి సఖ్యతను కలిగించుట అసాధ్యము కాదు.

## కాశ్మీర్ సింహము

షేక్ అబ్దుల్లా గాంధీజీని చూడ వచ్చెను. కాశ్మీర్‌లోని హిందువులు, సిక్కులు చాలాకొద్దిమంది అయినను, వారినికూడ సమాధానపఱుచుటకు ఆయన కృషి చేయుచున్నాడు. ఈమధ్య ఈ రెండు మతాలవారు జమ్మూలో చేసినచర్యలు చాలా అవమానకరములు. అయినా, అబ్దుల్లా అక్కడికి వెళ్ళెను. కొంత మేలు కూడా కలిగెను. ఆ మతసామరస్యం స్థిరపడితే, హిందూ దేశము అంతా గుణపాఠము నేర్చుకోవచ్చును.

కాశ్మీర్ కొండప్రదేశము. చలికాలంలో అచట నివసించుట చాలా కష్టం. ఏ కొద్ది భాగమో తూర్పుపంజాబును ఆనుకొని యున్నది. మిగతా త్రోవలన్నీ పాకిస్తాన్‌గుండా పోవును. కాని ముస్లింలు తూర్పుపంజాబు గుండా వచ్చుటకు, లేదా

అచ్చట నివసించుటకు, అసాధ్యం అగుచున్నది. ఈ తూర్పు పంజాబులోని పిచ్చి తగ్గకపోతే, కాశ్మీర్ భారత సమ్మేళనతో చేరుట వృథా యగును. కాశ్మీర్‌కు భారతానికి మధ్య క్షేమకర మైన భూమార్గం ఏర్పఱచుట కేంద్రప్రభుత్వ కర్తవ్యం అయి ఉన్నది. అప్పుడే ఈ రెండు దేశాల మధ్య పూర్వంవలె వర్తకం సాగును.

## నిజమైతే భయంకరం

గాంధీజీ అప్పుడప్పుడు డాన్ పత్రికను, పాకిస్థాన్ టైమ్సు పత్రికను చూచును. అవి పలుకుబడి గల పత్రిక లగుటచే, వాటి వ్రాతలను త్రోసిపుచ్చరాదు. కథియావాడలోని ముస్లింలను ఇబ్బందిపెట్టుచున్నా రట. దోపిళ్లు, గృహదహనాలు, హత్యలు, స్త్రీల అపహరణాలు జరుగుచున్న వని గాంధీజీకి కొన్ని తంతెలు కూడా వచ్చెను. కొన్ని దహనాలు, లూటీలు జరిగినవని హిందువులు ఒప్పుకొనిరి. ఇతర అత్యాచారాల సంగతి వారికి తెలియదట. ఈ పత్రికలను నమ్మవచ్చునా యని పాకిస్థాన్ ప్రధానిని గాంధీజీ అడుగగా, అసలు సంగతులు నిజమై ఉంట వనిన్ని, కాని వాటి బాహుళ్యాన్నిగూర్చి తాను హామీపడనని ఆయన చెప్పెను. కథియవాడ్ గాంధీజీ జన్మస్థానము. దాని తాత్కాలిక పాలకుడు ఆయన బంధువు. భారతసమ్మేళనమునందు భక్తి గల ముస్లింలకు ఆపద, హాని కలుగ దని తాత్కాలిక పాలకుడును, పటేలును చెప్పియుండిరి. జునగడ్‌లోని హిందువులు ముస్లింలు అచటనే ఉండుటకు స్వేచ్ఛగా తీర్మానించుకొని రని

విని గాంధీజీకి సంతోషముకలిగించి. కాని ఇప్పటి సమాచారము నిజం అయితే, భారతస్వాతంత్ర్యం వలెనే, జునగడ్ స్వాతంత్ర్యం కూడా నష్టమై పోవునేగాని నిల్చునది గాదు. దీనినిగూర్చి దాప రికం లేకుండా అధికారరీత్యా ఒక ప్రకటన జరుగవలెను. భారత దేశ మంతా ఈ విషం వ్యాపిస్తే, మర్యాదగా జీవించుటయే అసంభవ మవుతుంది.

## 78

28-11-47

### గురునానక్ పుట్టిన దినము

నేడు గురునానక్ పుట్టిన రోజు. సిక్కుల సభకు గాంధీ జీని ఆహ్వానించిరి. తాను నిజమైన ప్రేమతోను, హృదయ పూర్వకముగాను చెప్పినసలహా వాళ్ళకు రుచించనందున, ఇప్పుడు చెప్పే మాటలుకూడా వాళ్ళకు విసుగు, కోపం కలిగించునేమో నని ఆయన ఆ సభకు వెళ్లుట కిష్టపడ లేదు. కాని బాబా బచ్చిత్తర్‌సింగ్ పాకిస్తాన్‌లో పలుబాములు పడిన వేలకొలది స్త్రీలు, పురుషులు, బిడ్డలు ఆయనను వినుటకు కుతూహలురై యున్నారని చెప్పగా గాంధీజీ సమ్మతించెను. ఈ సంగతి సభకు తెల్పుటకు వెళ్ళి బాబాసాహేబు తిరిగి వచ్చునపుడు, అబ్దుల్లా సాహేబును తనవెంట పిలుచుకొనివచ్చెను. బద్ధ విరోధము కల ఈ రోజులలో బాబా, అబ్దుల్లాలు కలియుట గాంధీజీకి ఆశ్చ ర్యముకలిగించెను. అబ్దుల్లా ధైర్యంచేసి సిక్కులసభకు వచ్చునా? కాని అబ్దుల్లా కాశ్మీర్‌లోని హిందువులను, సిక్కులను, ముస్లిం

లను సమాధానపఱచినాడుగాన, సిక్కులు ఆయనను విసదలచి రని బాబాసాహేబ్ అనెను.

అంతట గాంధీజీ, అబ్దుల్లా సభలో ఉపన్యసించిరి. వేల కొలది సిక్కులు వారుభయులను విని ఏమాత్రము వ్యతిరేకతను చూపలేదు. అందుకు గాంధీజీ సంతోషించెను. ఆనాడు సిక్కులకు ఉగాది యని గాంధీజీ అనెను. వారు క్రొత్త ప్రతిజ్ఞలు తీసుకొన వలెను. పాకిస్తాన్‌లోని పాపము లను గమనించక, ఈ సిక్కులు పవిత్రులుగా నుండవలెను. రెండు తప్పులు కలిసి ఒక ఒప్పు కాజాలవు. గురునానక్ ముఖ్యమైన బోధ మత సహనం, హిందూ ముస్లింల ఐక్యత. గురుగోవిందసింగ్‌కు ముస్లిం శిష్యులుండిరి. ఆయన వారిని కాపాడెను. 10 వ గురువు యుద్ధమునకు దిగినను, దుష్టులను శిక్షించుటకు, శిష్టుల కాపాడుట కేకదా ఆయన కత్తి పట్టినది ? ఛాందీసీచౌకు గుండా వచ్చుచుండగా, ఒక ముస్లిం కూడా గాంధీజీకి కనపడలేదు. ఢిల్లీలోని ముస్లింలకు అట్టి భయోత్పాతం కలుగుట, హిందువులకు సిక్కులకు లజ్జాకరం కాదా !

## వర్తకములో సాంఘికదురభిమానా లుండరాదు

కలకత్తా ముస్లిం వర్తకసంఘం వారు తమ వర్తక సంఘమునకు ఇచ్చిన ధృవపత్రమును ఉపసంహరించుటకు కేంద్రప్రభుత్వము తీర్మానించిం దని గాంధీజీకి ఫిర్యాదు చేసిరి.

అన్ని వర్తక సంఘాలకు అలాగే ధృవత్వ నిరాకరణ జరిగితే, అప్పుడు దీనినికూడ సమర్థించవచ్చు నని గాంధీజీచెప్పెను.

ఒక మతాతీత లౌకిక రాజ్యాంగములో ప్రత్యేక సాంఘిక సంస్థలకు ఆంతరంగిక సంస్కారము నకు తప్ప అవకాశం లేదు. ఐరోపీయుల వర్తకసంఘమునకు పూర్వపు విదేశీప్రభుత్వము ఎక్కువ అవకాశం ఇచ్చేవారు. దాని వార్షికోత్సవము ఒక గొప్ప పండుగగా యుండేది. రాజప్రతినిధులు వచ్చి గొప్ప ప్రకటనలు చేసేవారు. ఇప్పుడా సంఘమునకు అలాంటి ప్రాముఖ్యత ఇవ్వరాదు. ఐరోపీయవర్తకులు దేశీయులతో కలిసి, యావద్భారతాభివృద్ధితో పాటే తమ అభివృద్ధికూడా పొందుతుండవలెను. తమసంఘమును రద్దు పరచి మార్గదర్శకులు కమ్మని గాంధీజీ సలహా చెప్పెను. ఆదిలోను అంత్యంలోను ఎల్లపుడుకూడా అందరూ భారతీయుల మనుకోవలెను. మతం వ్యక్తిగత విషయం. రాజకీయాలతో గాని జాతీయ వ్యవహారాలతో గాని, దీనిని సమ్మిళితం చేయరాదు.

## సోమనాధదేవాలయ ఉద్ధరణ

సోమనాధదేవాలయ పునరుద్ధరణకు జునగడ్ రాజబొక్కసమునుండి ఏమాత్రము పైకం ఖర్చుచేయరాదని ఒక క్రైస్తవుడు గాంధీజీకేర వ్రాసెను. ఆ ఆక్షేపణదారు అభిప్రాయంతో గాంధీజీ ఏకీభవించెను. అచ్చట నున్న సర్దార్‌కు ఆ జాబు చూపగా, జునగడ్ రాజద్రవ్యం గాని, కేంద్రసర్కార్ ద్రవ్యం గాని దానిక్రింద ఉపయోగపడ దని సర్దార్ స్పష్టపఱచెను. ఆ పునరుద్ధరణ యందు శ్రద్ధగలవా రిచ్చే డబ్బుతోనే ఆపని జరుపవలెను. శ్యామలదాసుగాంధీ తాను వసూలు చేసిన ప్రజానిధి నుండి రు 50 వేలు, జాంసాహేబు ఒక లక్ష ఇచ్చెదమనిరి.

## చెడుగుకు పారితోషికమిచ్చుట తగదు

ముస్లిం గుండాలు హిందూ, సిక్కు బాలికలను అపహరించిరి. వారిని వాపసు చేయుటకు డబ్బు అడుగుతున్నారట. ఆడపిల్లల నపహరించడమే పాపం. ఆ పాపము వలన ధనలాభం కూడ పొందటాన్ని గాంధీజీ సహించ జాలరు. దురాకర్షణకు లొంగవద్దని తండ్రులకు భర్తలకు గాంధీజీ సలహా చెప్పెను. ఎత్తుకుపోబడిన బాలికలను కాపాడి, స్వస్థలానికి పంపే బాధ్యత ఈ రెండు దేశాల సర్కారుల కర్తవ్యమై యున్నది.

## కతియవాడ్ నెమ్మదిగానున్నది

లూటీలు, గృహదహనాలు, హత్యలు, బాలికాపహరణలు జరిగెనాయని గాంధీజీ సర్దారునడిగెను. ఆయన కథియవాడ్ పోక పూర్వము, కొంత లూటీ, గృహదహనాలు జరిగెనట. వాటిని వెంటనే అణచివేసినారు. హత్యలు అపహరణలు జరిగినట్లు ఆయన వినలేదు. ముస్లింల ఆస్తి ప్రాణాలు కాపాడుటలో కాంగ్రెసు వాదులు తమ ప్రాణాలను కూడా లక్ష్యపెట్టలే దని సర్దారు అనెను. స్థిరపడని వార్తలను పత్రికలు ప్రకటించరాదు. తీవ్రమైన ఫిర్యాదులు చేసినవారు వాటిని బహిరంగముగ ఉపసంహరించుకొన వలెను. ఒకవేళ సర్దారుకు తెలియని విషయము లున్నచో, అవి జరిగినట్లు నమ్మకమైన ఋజువు కావలెను.

# 79

29-11-47

## ఢిల్లీలో సారాయి

ఢిల్లీలో సారాయివాడుక ఘోరంగా పెరిగిందట. దాని వెంట పాపపరంపరలు బయలుదేరుతాయి. నిన్న జరిపిన నానక్ జయంతినుంచి సిక్కులజీవితములో నూతనాధ్యాయం మొదలిడి నచో ఈత్రాగుడు పూర్వంకన్న తగ్గాలి.

## మసీదులకు నష్టం

ఈ అల్లరులలో అనేకమసీదులు పాడుచేశారు. కొన్నింటిని గుళ్ళుగా మార్చారు. నిజమైనపరితాప ముంటే, అధికారుల జోక్యంలేకుండానే, ఈవిగ్రహాలను తొలగించవలె. సిక్కులే ఈవిగ్రహాలను పెట్టి ఉండకపోవచ్చును. కానివారూ హిందువులు కలిసి పనిచేశారు. కాన సిక్కులలో సంస్కారమువస్తే అదే అప్రయత్నంగా హిందువులను మారుస్తుంది.

## అపహరించబడిన బాలికలు

పాకిస్తాన్‌లో అపహరించబడిన అనేకమంది హిందు, సిక్కుబాలికలు, ఏఘోరబాధలు పొందుచున్నారో, దైవానికే ఎరుక. ఇచ్చటి హిందూ సిక్కుల ప్రవర్తన అంతకన్న మెరుగు కాదు. ఇక్కడ కామాతురులు, అపహరించుకపోయిన ముస్లిం బాలికలకు చెప్పరానిబాధలు కలిగించారట. తూర్పుపంజాబు సర్కారు ఇట్టి అవమానకరమగు బంధనమునుండి ఆబిడ్డలను

విడుదలచేయించవలెను, ఇట్టి అపహరణలు అక్రమములని రెండు ప్రభుత్వాలు ప్రకటించవలెను. అపహృతమైన ప్రతిస్త్రీ విడిపింపబడే వరకు ప్రభుత్వాలు విశ్రమింపరాదు. ఐచ్ఛికమైన మతంమార్పు గాని, సాంగత్యముగాని ఈబాలికల విషయంలో తటస్థించనేరదు.

## కంట్రోళ్ళు

చక్కెరమీద కంట్రోలు తీసివేయడం బాగున్నది. అందుచే ఉత్పత్తిదారులు, వర్తకులు దానిధర పెంచరాదు. చెరుకుగడ ధర పెరిగితే, చక్కెరధర సహజముగా పెరుగవచ్చును. మిల్లుదారుల, వర్తకుల దురాశచే, ధర పెరుగకూడదు. చక్కెర విషయంలో సరిగా ప్రవర్తిస్తే, అన్నవస్త్రాలకంట్రోళ్ళు పోవుటకు తోడ్పడును. పల్లెలలో తయారుకాబడే బెల్లం, చక్కెరకన్న శ్రేష్ఠం. దానికన్న చౌక, ఎల్లెడ దొరుకుతుంది.

## విలాసవస్తువులపై పన్ను

3 వ తరగతి రయిల్వేటిక్కెట్ల డబ్బు పెంచినారు. దానికి బదులు పొగాకు, సిగరెట్లు వగైరా విలాసవస్తువులపై ఎక్కువ పన్ను వేయుట మేలని ఒకస్నేహితుడు చేసినసూచన గాంధీజీకి మంచిదిగా కన్పించెను. కాని ఆవిషయ మాయన పరిశీలించలేదు గనుక నిశ్చితాభిప్రాయము చెప్పజాలననెను. కాని అధికారులు ఈవిషయము యోజించవలెను. న్యాయమైనకారణంలేనిదే ఒకపైసా అయినా మంత్రులు ఖర్చుచేయరాదు. దీనికి తగిన గీటురాయి ఏమనగా గ్రామాలు సర్కారుకు ఇచ్చే ధనము వగైరా వారికవసరమగు వివిధసేవలద్వారా అనేకరెట్లుగా వారికి

తీరిగి ముదరా అగుచున్నదా? లేదా? ఖర్చుచేసినదంతా వారి కొఱకే వినియోగమైనదని ఋజువుకావలెను.

### ఐచ్ఛిక రక్షకులు

స్వతంత్రభారతం పెద్దసేనను ఉంచుకోరాదు. ఐచ్ఛిక గృహరక్షకులు తమగృహాలను కాపాడుకొని, దేశరక్షణకు తోడ్పడాలి.

## 80

30-11-47

### ఆసనం తెచ్చుకోండి

ఈ చలికాలములో చల్లనిరాళ్ళమీదగాని, తేమగల భూమిమీదగాని కూర్చుండుట అనవసరము. స్త్రీలకు అసలే మంచిదికాదు. అందువల్ల ప్రతివాడు పాతపత్రికనో మరియొక ఆసనమునో, తెచ్చుకొనుట మంచిదని గాంధిజీ సలహా యిచ్చెను. అలా పూర్వము చేసేవారు, ఇప్పుడు వదలివేశారు.

### కథియవాడ్‌నుంచి తంతె

అనేకతంతెలు వచ్చుచున్నవి. పాకిస్తాన్ పత్రికలలో వ్రాసే సంగతులను నిరాకరించ వీలుకాదు. అనేకమంది వాటిని చదివి నమ్ముచున్నారు. ఆవార్తలు అబద్ధమైతే పత్రికలకున్ను, నిజమగుచో కథియవాడ్ ప్రజకున్ను అవమానకరము. మొదట్లో కొందరు హిందువులకు తలతిరిగి కొన్ని ముస్లిం కొంపలను పాడుచేసిరి. కొన్ని తగులపెట్టిరి. అచ్చటి రాజ్యాంగం

వారు, కాంగ్రెసువాదులు కలిసి తమ ప్రాణహానినికూడ సరుకు సేయక పరిస్థితులను అదుపులోనికి తెచ్చిరి. ఢేబర్ భాయి రాజ కోటలో పెద్దవకీలు, నాయకులు. మూకలు ఆయన చుట్టూచేరి అల్లరులు చేసినారు. కొందరు కాంగ్రెసువాదులకు హాని కలిగింది. ఈరీతిగా ప్రజలకోపము కాంగ్రెసువాదులమీదికి మరలినా ముస్లింలకు రక్షణకలిగింది. రాజకోటసమాచారాలవల్ల గాంధీజీకి దుఃఖం కలిగిందని విని, మామూలుపరిస్థితులు ఏర్పడినవని వారు గాంధీజీకి హామీ ఇచ్చిరి. రాష్ట్రీయస్వయంసేవక సంఘం, హిందూమహాసభ, ఈ అల్లరులకు కారకులని ఒకవార్త. కాంగ్రెసు వాదులు చేసినసేవకు కృతజ్ఞతను తెలుపుచూ ముస్లింలు గాంధీజీకి తంతె పంపిరి. నిజమును బయటపెట్టినందుకు గాంధీజీని అభినందిస్తూ బొంబాయిముస్లింలు మరొకతంతె పంపిరి. హత్యలు, స్త్రీల అపహరణములు గాక లూటీచేయుట, భయపెట్టుటనే ఆ తంతె పలుకరించింది. ఇప్పుడిచ్చిన హామీలు నిజమైతే వలసబోయిన ముస్లింలు తిరిగిరావలెను. ఋజువుకానట్టి, అతిశ యోక్తులు కలట్టి ప్రకటనలను పత్రికలు గాని, వ్యక్తులు గాని చేయరాదు. స్నేహితుల మోసగించి లాభమేమి? భావనగర్ మహారాజా అంతా సరిగానున్నదని తంతె పంపెను.

రాజకోటలోని అయిదుగురు ముస్లింలు తంతె పంపిరి. 13 ముస్లిం దుకాణాలు లూటీచేసి లక్షరూపాయీలు నష్టం కలిగించారని, కాని ప్రభుత్వమున్ను, కాంగ్రెసువాదులున్ను, పరిస్థితులను చక్కబరిచారని ఆతంతె పేర్కొన్నది. జునగడ్ నుంచి

ఇప్పుడే తంత్రి వచ్చింది. శుక్రవారమునాడు గాంధీజీ చెప్పిన భయంకరపరిస్థితులను స్థిరపఱచుచూ, విచారణ జరుపమని కోరెను. అది ఆయన చేతులో లేదు. ఉద్యోగులు చేసే విచారణ కన్న పూర్తిగా నమ్మకమిచ్చే ఋజువులే తనకు తృప్తినిచ్చేవని గాంధిజీ చెప్పెను.

## హిందూమహాసభకు, ఆర్. యస్. యస్. కు విన్నపము.

ఈరెండూ హిందూసంస్థలు. అనేకమంది విద్యావంతులు అందు సభ్యులుగా నున్నారు. వారిపై ఆరోపింపబడిన పనులను వారు మానుకొనవలెను. అక్రమ విధానము వలన మతమును కాపాడజాలరు. సర్కారే తప్పులు దిద్దవలెను. దుష్టులను శిక్షించవలెను. ఈ సంస్థలు అట్టి అవకాశమును ప్రభుత్వమునకు ఇయ్యవలెనని గాంధీజీ హెచ్చరించెను.

## మసీదులలో విగ్రహాలు

7 రోజుల లోపల మశీదులలోని విగ్రహాలను ప్రజలు తీసివేయనిచో, సర్కారు పోలీసు ఆ పని చేస్తారని సర్కారు ప్రకటించింది. సర్కార్ పూనుకొని చెడగొట్టబడిన మసీదులను మరమ్మతు చేస్తారట. ప్రజలే ఆ విగ్రహాలను తొలగించవలెను. యోగ్యులైన భక్తులు సక్రమముగా ప్రతిష్టిస్తేనే విగ్రహాలకు విలువ. బలవంతముగా మసీదును స్వాధీనము చేసుకొనుట, హిందూ సిక్కు మతమునకు అవమానము. ఏ మసీదును

గురుద్వారంగా మార్చినట్లు కనపడదు. గ్రంథసాహేబ్ ను మసీదులో నుంచితే, దానికే అవమానకరము.

సగం తగులపెట్టిన కురాను ఒక గుడ్డలో చుట్టి తెచ్చి, ఒక ముస్లిం గాంధీజీకి చూపి కన్నీరు కార్చి మాట్లాడకుండా వెళ్ళిపోయెను. ఇట్లు కురాన్ను అవమానపఱచిన వాడు, తన మతాన్ని, దేశాన్ని అవమానపఱచి నట్లే.

# 81

1-12-47

## "అయితే" యొక్క ఉపయోగ మేమి ?

అయితే అనే పదమును నా ప్రకటనలలోను, ఉపన్యాసాలలోను ఎక్కువగా వాడుతానని నన్ను కొందరు నిందింతురు. కాని ఈ చిన్న సముచ్చయమును వాడుటవలన నా ఉద్యమాలకు ఎక్కువ మేలే కలిగింది. కథియవాడ్ విషయములో నిరాధారమైన వార్తలకు అనవసర ప్రకటన కలుగుతోం దని మన స్నేహితులకు కష్టం కలిగింది. కాని నేను నాకువచ్చిన సమాచారాన్ని ఈ షరతుపెట్టి ప్రకటించుటచే సత్యానికే మేలే కలిగింది. కథియవాడ్ అధికారులు సత్యానికి నిలువబడినంతమట్టుకు వారికీని మేలే కలుగుతుంది. కాని వారిఆక్షేపణ ఏమంటే, ఒకవార్త అసత్య మని ఋజువు అగులోపల దుర్బుద్ధికలవారు ఈ అయితే అనే పదాన్ని వదలివేసి, నా మాటలకు అపార్థాన్ని కల్పించి ప్రచారంచేసే ఆపద వున్నదని. ఇట్టి ఆపదకు అవకాశము ఉంది.

కాని అలాటి ప్రయత్నము చేసినపు డెల్ల అది ఓడిపోయింది. కాన నేను ఈ అయితే వాడుటవలన నా స్నేహితులు అలజడి పొందనక్కర లేదు. నిందింపబడిన పక్షముయొక్క గౌరవ మర్యాద గట్టిగా నిలిచి యుంటే వారి కేమీ భయములేదు.

ఇదిగాక, పాకిస్థాన్ పత్రికలలో ప్రకటించిన ఫిర్యాదులకు అచ్చటి ప్రధాని వత్తాసిగా నున్నపుడు ఆ పత్రికా వార్తలు నిజమే నని ముస్లింలోకం నమ్ముతుందికదా! కనుకనే నా వార్త లను ("అయితే" అను మాటతో) అసలే పేర్కొనక పోతే, ముస్లిము లందరికి ఆ వార్తలే వేదవాక్యా లవుతవి. కాని ఇపుడో ఈ సమాచారాలలో నున్న సత్యమునుగూర్చి ప్రాజ్ఞు లైన ముస్లింలు ఇప్పటికే సంకోచింప సాగారు.

## నిజాయితీగా నుండుడి

ఈలాటి సందర్భాలలో కథియవాడ స్నేహితులకు తదితరులకు నా సలహా ఏమంటే, మీ ఇంటిని చక్కదిద్దుకొనండి. కఠినమైనా సరే విమర్శను ఆదరించండి. మరింత నిష్కర్షగా ఉండి, తప్పులను దిద్దుకోండి. మనము ఎన్నడు తప్పుచేయ మనే తప్పు త్రోవలో పడకండి. మన విమర్శకుడు తెలిసియో, తెలి యకనో కక్ష సాధించాలని చూస్తాడు. అందువల్ల కఠినవిమర్శకు దిగుతాడు. మన ఓర్పువలన మంచి మార్గానికి రాగలడు. వీలై నపుడు అతని తప్పు అతనికి నిరూపింపుడు. ఇలా చేసినచో తప్పు లెన్నడు జరుగవు. మనముకూడ తప్పులు చేయకుందము. విచక్షణ ఎల్లపుడు అవసరమే. బుద్ధిపూర్వకముగా చెప్పే అబద్ధా

లను నిరాకరింపుడు. నిరంతర సాధనచే కొంత విచక్షణ నైపుణ్యాన్ని నేను సంపాదించితిని.

మనం తప్పుచేయ మనే భ్రమలో నుండరాదు. ఈదుర్మార్గాన్ని శ్రద్ధతో కనుగొని తొలగించవలెను. మన లోపాలు కనుగొనుటకు మన కళ్ళను చెవులను జాగృతిలో నుంచాలి. మన వీపులను మనం చూడజాలము. ఇతరులు చూడగలరు. అది ప్రకృతి నియమం. ఇతరులు చూచి చెప్పినదానివలన మనం మేలు పొందవలెను.

## సత్యాన్వేషణము

జునగడ్ నుంచి వచ్చిన పెద్ద తంతెను నేను జాగ్రత్తగా చదివినాను. పాత ఆరోపణలను ఏకరువు పెట్టినారు. అవి నిజమైతే కథియవాడ్ హిందువులకు నష్టం. అబద్ధమైతే పాకిస్థాన్‌కు నష్టము. నన్నక్కడికి రమ్మంటూరు. అది అసాధ్య మని వారికి తెలిసి ఉండవలెను. విచారణసంఘం వేయుమని కోరినారు. దానికి ముందు అనుకూలమైన సాక్ష్యం కొంత అయినను ఉండవలెను. వారియుద్దేశం కథియవాడ్ హిందువులను అవమానపఱుచుటకు గాక న్యాయంగా ముస్లిం ఆస్తి ప్రాణాలను కాపాడుటకే యని అనుకుంటున్నాను. సత్యమును నిష్కర్షగా అవలంబించుటచేతను, తామెరిగిన హిందూమిత్రుల వద్దకు ఫిర్యాదీలు సద్భావంతో వెళ్ళుట వల్లను, గౌరవం, ప్రాణం, ఆస్తి కాపాడబడుతవి. నేను కథియవాడ్‌కు దూరాన ఉన్నా, నేను సోమరిగా కూర్చుండలే దని నారు తెలుసుకోవలెను. సాధ్యమైనంత

సమాచారమును సేకరించుచునే యున్నాను. సాంఘిక కలహాలు నివారిస్తామని, దుష్ప్రవర్తనను దండిస్తామని సర్దార్ చెప్పు చున్నాడు. సాంఘిక దురభిమానం లేని ప్రచారకులు సత్యాన్వేషణం చేస్తూ, ముస్లింలకు కలిగే ప్రతి ఆపదకు పరిహారము చేయించవలె నని శక్తివంచన లేక పని చేస్తూనే ఉన్నారు.

# 82

2-12-47

## పానిపట్‌కు పోవుట

గాంధీజీ పానిపట్టునుండి తిరిగి వచ్చేసరికి రామధున్ పాడుచుండిరి. ఆలస్యంగా వచ్చినందుకు ఆయన క్షమాపణ తెల్పెను. పానిపట్ లోని ముస్లింలు పాకిస్థాన్‌కు బయలుదేరి పోకుండుట వారికిని పాకిస్థాన్‌కును భారతానికి కూడా మేలని వారికి నచ్చచెప్పుటకు పోయెను. ధైర్యంచేసి స్వస్థలాల్లో ఉండి నదో అన్నీ చక్కబడును. ఆయన కలిసిన హిందూ, సిక్కు శరణార్థులు బాధపడుచున్నారు. తాము దుఃఖితు లనుకొనడం కంటె, శరణార్థు లనుకొనడమే వారికి ఇష్టమట. స్వంత ఇండ్లకు పోగలిగే వరకూ శరణార్థు లందరకు ఆ దుఃఖం తప్పదు. పరిస్థితుల ప్రాబల్యంచే భారతం వదిలి పాకిస్థాన్ పోయిన చాల మంది ముస్లింలుకూడా అలాటి దుస్థితిలోనేఉంటారు. పానిపట్ ముస్లింలు ఇక్కడ ఉండజాల మని ఆయనతో చెప్పిరి.

# ఇద్దరు మంత్రులు

మంత్రి గోపీచంద్, మంత్రి స్వరన్‌సింగ్ అచ్చటనుండిరి. ఢిల్లీ మహాలానాలు పానిపట్ వాస్తవ్యుడు దేశబంధు గుప్త గాంధీజీని కలిసిరి. క్రిందటి దఫా పాకిస్థాన్‌కు వెళ్ళబోమని చెప్పిన ముస్లింలు తమ మనస్సు మార్చుకొనిరి. పరిస్థితులు దుర్భర మైనవట. ఆస్తి, ప్రాణాలు, మానాలు దక్కనపుడు ఎట్లు ఇక్కడ ఉండగల మని ముస్లింలు ప్రశ్నించిరి. ఎవరికి దైవం శరణ్యమో ఎవరి హృదయములలో మానవాళియెడ ప్రేమయే కలదో వారు దేనికిని భయపడ రని గాంధీజీ వారికి చెప్పెను. ఆస్తి, ప్రాణాల నష్టము కలిగినను మానమును మాత్రము వారు కాపాడుకోగలరు. ఉదయము పానిపట్ చేరిన 11 గం. నుంచి సాయంత్రము 3 గం. వరకు ఆయన ముస్లింలతో మాటలాడెను. అంతట హిందు సిక్కు శరణార్థులు కలిసిన పిమ్మట 20 వేల జనం గల సభలో గాంధీజీ, గోపీచంద్ మాటలాడిరి. స్వరన్‌సింగ్ లేచే టప్పటికి మాకు ఈ ఉపన్యాసాలు అక్కరలేదు. మా గోడు తెలుపనియ్యం డని సభలో గోల బయలుదేరింది. ముస్లింలు వెళ్ళవలసిందే అని కేకలు వేసిరి. వారి నాయకుడొకరు పంజాబీ కీర్తన పాడగా సభలో శాంతి ఏర్పడ్డది. అల్లరి చేసినందుకు ఆనాయకుడు వారిని పంజాబీలో మందలించెను. అంతట స్వరన్ సింగ్ మాట్లాడుచు, మొట్టమొదట ఎత్తుకు పోబడిన ముస్లిం బాలికలను, వారి కుటుంబాలకు ఒప్పచెప్పవలె నని, బలవంతపు మతం మార్పులను రద్దుపఱుపవలె నని, పూర్వం వలెనే భారత

ములో ఎవరి మతమును వారు అనుసరింపవచ్చునని, మసీదులు కాపాడబడు నని, గుడులుగా మార్చబడినవి తిరిగి ఒప్పచెప్ప బడు నని ఆ మంత్రు లిద్దఱూ ప్రజలకు వాగ్దత్తం చేసిరి. గాంధీజీ సంతసించెను.

## శరణార్థుల ఇక్కట్లు

అన్నం మంచిదికా దని, చాలదని శరణార్థుల ఫిర్యాదు. తమకై పంపబడిన దుస్తులలో మంచివి ఎటో మాయమైపోయి చిరిగినవే వారి కివ్వబడినవట. వీటిని గూర్చి విచారించవలె నని వారు చెప్పిరి. ఒక పిల్లవాడు గాంధీజీ ఎదుటికి వచ్చి తనదుస్తు లను తీసి ఆయన ముందుంచి, "చంపబడిన మా నాయనను ఇప్పించం" డని ఆయనను అడిగెను. అది అసాధ్యమే ఐనను వాని దుఃఖ తీవ్రతను గాంధీజీ గ్రహించి ఓదార్చెను.

తిరిగి వచ్చునపుడు గాంధీజీ కార్లో వచ్చిన శరణార్థుల ప్రతినిధి స్థానిక హిందువులకుగాక శరణార్థుల ప్రతినిధులకే శిబిర పాలన ఇప్పింపవలయు నని సూచించెను. పానిపట్‌లోని ముస్లిం లకు భయం ఇబ్బందిలేకుండా చేయదలిస్తే అచ్చటి శరణార్థులు ఆ ముస్లింలకు హామీ ఇచ్చి ఇళ్ళు వదలకుండా చేయవలె నని, అనేక యుద్ధాలకు పేరుపడిన పానిపట్‌లో ఇది నిజమైన విజ యము అగు నని గాంధీజీ అనెను.

ఇప్పుడు తమ స్వంత ప్రభుత్వము ఉన్నను ప్రజలు దాని యందు విధేయత చూపుటలేదు. భారత ప్రధానమంత్రిగా గాకుండా భారతజాతి ప్రథమ సేవకుడుగా నుండు నని జవహర్

లాల్ అనెను. సర్కారు నౌకరులు నిజముగా జాతీయ సేవకులే అయితే వారు భోగవిలాసాల పొంతకు పోరు. ఎల్లపుడు ప్రజల అక్కరలనే యోజింతురు. అదే రామరాజ్యం. నిజమైన సంపూర్ణ స్వాతంత్ర్యం అదే. ఇప్పటిది అస్థిరమైన మాయ స్వాతంత్ర్యం. ఊపి రాడకుండా అది తన కంఠమును నొక్కుచున్న దన్నాడు గాంధీజీ.

## 83

3-12-47

### వాగ్దానముల ప్రాముఖ్యత

15 వ ఆగష్టు తేదీ అధికారంలో ప్రవేసించి నపుడు నాయకులు చేసిన వాగ్దత్తాలను ఇపుడు భగ్నపఱుచుచున్నా రని కొందఱు ఫిర్యాదు చేసిరి. ఆ ఆరోపణలను గూర్చి కొంత గట్టి ఋజువు చూపే ఎడల గాంధీజీ ఆయా నాయకులతో మాట్లా డుదు ననెను. అసలు సంగతేమనగా ఆ వాగ్దత్తాలు విన్నవాని మనసులో ఏదో అపోహ కలిగి యుంటుంది. ఇలాటి చిక్కు గాంధీజీకే చాలాసార్లు కలిగింది. ఆయన ఎన్నడు ఎవరిని బుద్ధి పూర్వకముగా మోసం చేయకపోయినా, ఆయన మాటలు ఆయన అనుకున్న దానికి భిన్నంగా కొందరు అర్థం చేసుకొనడం జరిగింది. అందువల్ల చిక్కులు కలిగినాయి. బాగా ఆలోచించి ఆచి తూచి మాట్లాడవలెను. వ్యర్థపదం ఒకటిన్నీ యుండరాదు. సంభాషణ సంకల్పాల ప్రతిబింబంగా ఉండవలెను. పనులు భాషణకు ప్రతిబింబం కావలెను.

ప్రభుత్వం నాయకులకు హస్తగత మైనది. కోట్లకొలది రూపాయిలు ఖర్చు వారి చేతికి వచ్చినవి. కాన వారు వినమ్రు లుగా మిక్కిలి జాగ్రత్తగా ఉండవలెను. నాయకులు జరుపలేని వాగ్దానాలు చేయరాదు. చెప్పిన మాటను నెరవేర్చి తీరవలె. సర్కారుకు ప్రజలకు అందరికి ఇదే సూత్రము.

## సింధులోని హరిజనులు

అచ్చటి హరిజనులదుస్థితిని గూర్చి ఒకవైద్యుడు గాంధీజీ పేర వ్రాసెను. సవర్ణులు పోయి హరిజనులే అచ్చట ఉంటే వారి గతి పూర్తి బానిసత్వం, చివరకు ఇస్లాం మతస్వీకరణము. పాకిస్తాన్ సర్కార్ చెప్పిన విషయాలను అక్కడి ఉద్యోగస్థులు అమలు జరుపలేదు. ఇక్కడ నెహ్రూ, పటేలు ముస్లింల కిచ్చిన హామీ లను ఉద్యోగస్థులు పూర్తిగా నెరవేర్చలేదు. సింధులోని హరిజనులు సింధు వదలతలచుకుంటే పోనివ్వలేదట. పాకీపని చేయ మని నిర్బంధించారట. అది నిజమైతే అది పూర్తిగా తప్పు. హిందూ, సిక్కులమనస్సుకు భయం, బాధ కలిగించే పనిని పాకిస్తాన్ చేయరాదు. పోదలంచుకొన్న హరిజనులను సింధు విడిచిపోనియ్యవలెను. నేడు హరిజన్ ఏవృత్తినైనా చేసికోవచ్చు. కాన ఫలానా పనిచేయుమని హరిజనులనుకూడా నిర్బంధించ రాదు. ఐచ్ఛికం అని చెప్పి అన్నిమతం మార్పులను రెండు దేశాలలోను ఆపవలసిన దే.

# మరల కథియవాడ్

ఒకరి నొకరు ఖండించే తంతెలు పంపుచున్నారు. ఈ అల్లర్లలో కాంగ్రెసువాదుల కేమీ జోక్యంలేదని, దోపిళ్లు, దహనాలు, హిందూమహాసభ, రా. స్వ. సే. సంఘంచేసినవే నంటారు కొందరు. కాని మా కేమీ సంబంధములేదని ఆసంఘం వారు తంతెలు ఇచ్చారు. ఇందులో ఎవరో ఒకరు ముప్పుతెచ్చి పెట్టియుండవలెను. హిందువులకు నెక్కెక్కు ముస్లింలను తంటాలు పెట్టియుంటే వారది దాచరాదు. మొదట్లో ముస్లింలు అతి శయోక్తి చెప్పియున్నచో వారు దానిని ఒప్పుకొనవలెను. హిం. మ. సభ, రా. స్వ. సం. లకు ఇందులో లాలూచీ లేనిచో వారిని గాంధీజీ అభినందించును. ఆయన కేమి వ్యక్తిగత అధికా రములేకున్నా, నిజము బయటికి లాగుటకే ఆయన ప్రయత్నం.

## దక్షిణాఫ్రికాలోని భారతీయులు

యు. యన్. ఓలో భారతీయతీర్మానం నెగ్గుటకు అవసరమయ్యేకి వోట్లు రాకున్నను హెచ్చుమంది దానికి అనుకూలమే గాన అది ఓటమిగాదు. ద. ఆ. లోని భారతీయులు దిగులు పొందనక్కరలేదు అని శ్రీమతి విజయలక్ష్మి పండిత్ వారిని హెచ్చరించెను. సత్యాగ్రహ మను అమోఘాయుధ ములో నమ్మకము ఉన్నవారికి అపజయమే లేదని గాంధిజీ హెచ్చరిక. ఆ ఆయుధాన్ని దక్షిణాఫ్రికాలో గాంధీజీ కనిపెట్టెను. ఒక్కసంగతి యోచించవచ్చును. యు. యన్. ఓలో భారతం గెలుపొందిందని, భారతీయుల కోర్కెలకు స్మట్సుసేనాని ఒప్పు

కున్నాడని అనుకోండము. కాని దక్షిణ ఆఫ్రికా తెల్లజనాభా ఒప్పుకోలేదనుకోండి అప్పుడు భారతసమ్మేళనం ఏమిచేయగలదు? అలాంటి పనులు ఇక్కడకూడా జరుగుటలేదా! పాకిస్తానునుండి హిందువులు, భారతయూనియన్‌నుండి ముస్లింలు బయటకు తరిమివేయబడుతున్నారు. అల్పసంఖ్యాకుల కాపాడలేని అశక్తతను ఈ రెండుప్రభుత్వాలు ప్రకటించుటలేదా? బర్మాలో నుండే హిందువులబాధ చూడండి. బయటికి వస్తే ప్రాణహాని, ఇంట్లోయుంటే ఆకలిచావు. వాళ్ళు అప్పుడు ఏమిచేయాలి? తలుపులు తెఱచి బయటికిరాము. ఇంట్లోనే యుండి మాడి పోతాము అని స్పష్టంగా చెప్పి మర్యాదగా మరణించాలి. ఇదే నాసలహా వారికి.

దక్షిణాఫ్రికా నీగ్రోలదేశము. పరదేశీయులగు భారతీయులకు, బోయర్లకు అక్కడ హక్కులు ఉండనేరవు. భారతీయుల కంటే బోయర్లకు ఎక్కువ హక్కులు ఎట్లుండును? కాని తెల్ల వారు నీగ్రోలను అణగగొట్టారు. భారతీయుల హక్కులను లాగివేశారు. కాన యు. యన్. ఓవద్ద ఫిర్యాదీ చేయుట సబబే అయినను అక్కడ న్యాయం జరుగకపోతే భారతీయులు తమ హక్కులగూర్చి పోరాడవలసినదే. కత్తులతో కాదు. ఆత్మాస్త్రం ప్రయోగించవలెను. శరీరం నశ్వరం; ఆత్మ అవినాశి. ద. ఆఫ్రికా భారతీయులకు ధైర్యముంటే తమ ప్రాథమికహక్కులకు సత్యాగ్రహం చేయవలసిందే.

# 84

4-12-47

## విదేశాలలో ప్రచారమేల?

శ్యామలదాసుగాంధీ నుండి నేడు దేవర్‌భాయి నుండి నిన్నరాత్రి తంతెలు వచ్చాయి. శ్యామలదాసు బొంబాయినుండి కథియవాడ్ పోయి విచారించాడు. ముస్లింల హత్యగాని, స్త్రీల అపహరణలుగాని ఏమీ జరుగలేదు. వాటిని గూర్చిన వార్తలు శుద్ధ అబద్ధాలు. పటేల్ వచ్చిపోయిన తరువాత అల్లరు లేమీ లేవు. లోగడ జరిగిన వాటిని గురించి శ్యామలదాసు విచారణ జరుపుచున్నాడు. ఈమధ్య ఇరాన్, అమెరికా, లండన్ నుంచి కథియవాడ్ ముస్లింలమీద ఘోరఅత్యాచారాలు జరుగున్నవని వచ్చిన తంతెలవల్ల గాంధీజీకి చాలా నొప్పి కలిగింది. ముస్లింల మిత్రముగా ఆయన చెప్పేదేమనగా, సత్యాన్ని సంహారించవద్దు. భారత సమ్మేళనమును అపకీర్తిపాలు చేయుటకు భీతావహము కల్పించే తంతెలు విదేశాలకు పంపరాదు. అతిశయోక్తుల మీద ఆధారపడి విదేశాలలో ఆందోళన జరుపుట తప్పని గాంధీజీ మందలించెను.

## మంచి వార్త

హోషంగాబాదునుంచి మంచిజాబును ముస్లింలు పంపిరి. నానక్ జయంతి రోజున ముస్లింలను పిలిచి మనం స్నేహితులం సోదరులం అని సిక్కులు హామీ ఇచ్చిరి. ఈ మంచి మార్గము అందరు హిందువులు, సిక్కులు అవలంబిస్తే ఎంత బాగుండును! ఇప్పటి పాపపంకిలం కడిగివేయగలరు.

## వర్తకానికి ప్రత్యేక కుల, మత సంస్థలు

మార్వాడీ వర్తకసంస్థ నుంచి వచ్చిన ఉత్తరములో దానిలో ఇతరులుకూడా సభ్యులుగా చేరవచ్చు నని తెల్పారు. ఆ ఇతరులు ఎంతమందో తెల్పుమని గాంధీజీ అడిగారు. ఐరోపీయనుల, ముస్లింల వర్తకసంఘాల్లో కూడా ఇతరులను కొద్ది మందిని వారు చేర్చుకోవచ్చును. అలాంటి లాంఛనంవల్ల లాభము లేదు. ఆ సాంఘిక దురభిమానం లేకుంటే, విడిసంస్థలు ఎందుకు పెట్టుకోవలెను ? తెల్లవారు తెలివిగల వర్తకులు. శోషణకారులుగా గాక, సేవాభావముతో వారు ఇక్కడ ఉంటే, వారినుండి చాలా నేర్చుకోవచ్చును.

మార్వాడీ వర్తకసంఘం వారి లేఖ ఇంగ్లీషులో ఉంది. దానివలన గాంధీజీకి నొప్పి కలిగింది. మాతృభాష కంటె తనకు ఇంగ్లీషే హెచ్చుగా తెలుసు నని అనే భారతీయుని చూస్తే, గాంధీజీ సిగ్గుపడును. ఆ జాబు వ్రాసిన వానికి హిందూస్తానీ బాగా వచ్చును. అట్టివాడు గాంధీజీకి ఏల ఇంగ్లీషులో జాబు వ్రాయవలెను ? ఆ వర్తకసంఘంలో సభ్యులు అత్యధిక సంఖ్య ఆంగ్లేయులై తేను, లేక ఆంగ్లభాషావిదులై తేను, అప్పుడే ఇంగ్లీషులో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపనగును. ఈ సంఘంలో అత్యధికులు అలాంటివారు కారని గాంధీజీ ఆశించెను. సర్వత్రవర్తించే సత్యాన్ని నిరూపించుటకై గాంధీజీ ఈ జాబును ఉపయోగించెను.

## బర్మా ప్రధాని

బర్మా ప్రధానమంత్రి నన్ను చూడవచ్చెను. ఆయన చాలా వినయవంతుడు. ఇపుడు భారతంనుండి బర్మా నేర్చుకొనతగినది ఏమియు లేదు. గురునానకు అందరియెడ ప్రేమను, సహిష్ణుతను బోధించెను. సిక్కులు అందరితో స్నేహితులుగా నుండవలె ననెను. హిందూ సిక్కులను గోటితోను గోటి చిగురుతోను తారాసింగ్ పోల్చెను. ఎవరూ వీరిమధ్య ఎడబాటు కలిగించలే రని చెప్పెను. నానకు హిందువుకాడా? గ్రంథసాహెబు నిండా వేద ఉపదేశములు ఉన్నవి. సముద్రంవలె హిందూమతం అన్ని మతములను తనలో కలుపుకొని జీర్ణించుకొన్నది. ఇప్పుడు స్వీయమైన హక్కును హిందువులు మరచినట్లు ఉన్నారు. భారతము నుండి బర్మా కలహకాంక్షను నేర్చుకొనరాదు. భారతం ధైర్యవంతుల అహింసను ఆచరణలో నుంచకపోయినా, నెత్తురుబొట్టు కార్చకుండా, స్వాతంత్ర్యం సంపాదించింది. భారతస్వాతంత్ర్యమే బర్మాకు, సిలోన్‌కు స్వాతంత్ర్యం తెచ్చింది. ఈ స్వాతంత్ర్యాన్ని, అహింసద్వారా వచ్చిన స్వాతంత్ర్యాన్ని అహింసతో కాపాడుకొనవలెను. తన అహింసా బలాన్ని పెంచకపోతే, భారతానికిగాని లోకానికిగాని మేలు కలుగదు. భారతం సైనిక పంథాలో పడితే, స్వనాశనం, లోకనాశనం జరుగుతవి. బర్మా బౌద్ధమతాన్ని భారతాన్నుంచి నేర్చుకొన్నది. బర్మా బౌద్ధ సన్యాసులతో గాంధీజీకి పరిచయముండెను. బర్మా బౌద్ధమతములోని ఉత్తమ పాఠములను ఇండియానుండి నేర్చుకొనును గాక!

బర్మా సిలోనులు ఇంకను మహోన్నత శిఖరములను అధిష్ఠించును గాక! ఇండియాలోని మంచిని గ్రహించి, దోషాలను విసర్జించుట వలననే ఈ పని నెరవేరును.

# 85

5-12-47

## ముస్లిం ఉపసంహారణ

ప్రార్థనకు వచ్చుచుండగా కొన్ని ఉత్తరములు గాంధిజీకి యియ్యబడెను. వానికి అప్పుడే జవాబు చెప్ప వీలులేదు. అవసరమైతే మరునాడు ఇత్తునని గాంధీజీ తెల్పెను. పాకిస్తాన్ ప్రధాని గాంధీజీ తెల్పిన సంగతులు అసత్యములని ఋజువు అయినట్లు జాబు వ్రాసిన స్నేహితుడు దరిమిలాసంగతులను గమనించలేదు. తమ మొదటి తంతెలో ఎక్కువగా అతిశయోక్తులు కలవని, పాకిస్తాన్ పత్రికలలో కథియవాడ్ విషయంలో పడ్డసంగతులు సరిగావని, జునగడ్ ముస్లింలనుండి ఆనాడే గాంధీజీకి తంతె వచ్చెను. అతిశయోక్తుల, అబద్ధాలవల్ల తమవాదము చెడునని ఆయన వారిని మందలించెను. విదేశీప్రచారంచే ఇక్కడి భాధితులను కాపాడలేరు. అసత్యాన్ని సత్యం జయించునని నమ్మియుండుట మంచిది.

డిశంబరు 6 మొదలు 11 వరకు నిర్మాణకార్యక్రమ సంస్థల సభలు ఢిల్లీలో జరుగును. ఆయన అక్కడికి పోవలెను గాన, ఇతరపనులు పెట్టుకొనలేదు.

కంట్రోళ్ళు

త్వరలోనే అన్నవస్త్రాదుల కంట్రోళ్ళు పోవునని ఆయన ఆశ. అంతట కిసాన్లు తమ నిలువధాన్యాలను బజారులోనికి తేవలెను. వర్తకులు అమితలాభాలు కోరకుండా వర్తించవలెను. అప్పుడు అందరి ఆదుర్దా తీరును. ఇప్పుడు వారిని వేధించుచున్న భయములు అపుడు తొలగిపోవును. కొద్దిగా ఆహారకొఱత యున్నచో ప్రజలు నిగ్రహంతో ఆకలిచావులు లేకుండా చేయవచ్చును. అతిలాభాలు కోరే వర్తకులను ప్రజాప్రభుత్వం పంపజాలదు. ప్రజలు పతితులై న్యాయమైన పని చేయనిచో మంత్రివర్గము రాజీనామా ఇచ్చుటే మేలు. సర్కారే ప్రతిపని చేస్తేను, ప్రజలు చేతులు ముడుచుకుని కూర్చుంటేను లేదా సర్కారుకు అడ్డుతగిలితేను, అది ప్రజాస్వామికం కానేరదు. తద్భిన్నమే యగును. సరియైన ప్రోత్సాహముంటే కిసానులు హెచ్చు ఎందుకు పండించలేరు?

బట్టలుకంట్రోళ్ళను గూర్చి గాంధీజీకి ఆదుర్దా లేనేలేదు. కోట్లకొలది జనము వడికితేను, నేతగాళ్ళు వడుకుదారం నేస్తేను, అన్నిబట్టల మరలు మూతపడినాకూడా బట్టలకరువు ఉండనే ఉండదు.

# 86

6_12_47

## ఇరుగు పొరుగువారి కుండవలసిన లక్షణము

ఈరోజు భజన, రామధున్, దక్షిణాది సుప్రసిద్ధ గాయకురాలు శ్రీమతి సుబ్బలక్ష్మమ్మ పాడింది. ఆమె కంఠమాధుర్యంను

గాంధీజీ పొగడెను. ప్రార్థనాకాలంలో రామునిలో మగ్నం కావలెను.

మొట్టమొదట పాకిస్థానే యీపాడుపని మొదలుపెట్టినదని హిందూ సిక్కులు అంతట ప్రతీకారమునకుదిగినారని ఒకస్నేహితుడు జాబు వ్రాసెను. వీళ్లు ఆపినా పాకిస్తాన్ పంథా మారదనెను. హిందూ సిక్కులు పాకిస్థాన్‌లో వదలి వచ్చిన ఆస్తి పూర్తిగా పోయినట్లేనని ఆ స్నేహితుడు సూచించెను. గాంధీజీ అతనితో ఏకీభవించలేదు. ప్రతిశరణార్థి మర్యాదతో క్షేమంగా స్వస్థలమునకు చేరుదాక గాంధీజీ విశ్రమింపబోరు. ముస్లింలు ఇక్కడకు హిందూ-సిక్కులు అక్కడకు పోవునట్లు ఆయన కృషి చేయును. చచ్చిన మనుష్యులను, కాల్చిన ఇండ్లను మరల బ్రతికింపలేరు. నాశనమైపోగా మిగిలిన దైనను ఖామందుకు ఇచ్చినచో అంతవరకైనా సంతసింపవచ్చును. లాహోరు, లయాల్‌పూరు మొదలగుచోట్ల హిందూ సిక్కులచే ఖాళీ చేయబడిన కొంపలు, పొలాలు ముస్లిం శరణార్థులు ఆక్రమించుచున్నారట. వాటిని త్వరగా ఖాళీ చేయవలసి యుండును. దైవ స్వరూపుడుగ మానవుడు సృజింపబడినా అతను తప్పులుచేస్తూ ఉంటాడు. వాటిని సవరించినపుడే అతనిలోని దివ్యత్వం బయటపడును. అధిక సంఖ్యాకులు అల్ప సంఖ్యాకుల క్షమాపణను కోరవలెను. అప్పుడే వారు విరోధులు గాక, చక్కని ఇరుగు పొరుగువారగుదురు. లోకాన్ని మెప్పించి భారతీయులు స్వాతంత్ర్యంపొందారు. మంచితనానికి స్వస్తి చెప్పితే, తమ స్వాతంత్ర్యం నిలువదు.

అ. భా. కాంగ్రెసు సంఘం శరణార్థులగూర్చి చేసిన తీర్మానము వట్టి మాయమాటలు అంటారు. గాంధీజీకి ఆ అపనమ్మకము లేదు. ఢిల్లీలో ఆ సమస్య ఆయన తేల్చలేకపోతే, ఇతర చోట్ల జయం పొందే ఆశయమే ఆయనకు లేదు.

## 87

7-12-47

### అపహరింపబడిన స్త్రీలు

లాహోరులో జరిగిన సభకు హిందూ ముస్లిం స్త్రీలు హాజరైరి. 25 వేల మంది హిందూ సిక్కు స్త్రీలను పాకిస్తాన్‌లో హరించినారట. 12 వేలమంది ముస్లిం స్త్రీలను తూర్పు పంజాబులో ఎత్తుకుపోయినారట. ఒక స్త్రీని ఎత్తుకుపోయినా అది తప్పిదమే. పురుషుడు అంత బుద్ధిహీనతకు ఏల పూనుకో వలెను? ఇలాటి స్త్రీల నందరిని కాపాడి వారి వారి కుటుంబాలకు ఒప్పగింపవలెనని స్త్రీలసభలో ఏకగ్రీవంగా తీర్మానించారు. ఇట్టి సంఘటన రెండు రాజ్యాలకూ అవమానకరమే నని రాజా గజనఫరాలీ ఒప్పుకొనెను.

ఆ సభకు పోయి వచ్చిన శ్రీమతి రామేశ్వరి నెహ్రూ, మృదులాబెన్ శారాభాయి అక్కడి విషయాలను క్లుప్తముగా గాంధీజీకి తెల్పిరి. కొందరు స్త్రీలు పాకిస్థాన్‌కు, మరి కొందరు తూర్పుపంజాబుకు పోయి, పోలీసు, సేన సహాయంతో ఈ అపహృత స్త్రీలను బయటికి తీయవలెనని వారు సలహా చెప్పగా, అది గాంధీజీకి నచ్చలేదు. కొందరుస్త్రీలు మా మతం మారింది,

మాకు పెండ్లిం డ్లయినవి, మేము తిరిగి రాము అన్నారట. గాంధీజీ ఆ విషయం నమ్మలేదు. అలాటి మార్పిళ్ళు వివాహాలు చెల్లనేరవు. ఎత్తుకుపోబడిన ప్రతి స్త్రీని కాపాడి ఆమె కుటుంబంలో చేర్చుట సర్కారు కర్తవ్యము. దుర్మార్గుల చేతిలో పడి నందుకు ఈ స్త్రీలను వెలి వేయుచో, అది క్షమించరాని క్రూరత్వము అవుతుంది.

25 వేలమంది స్త్రీలను ఎత్తుకునిపోవుటకు కనీసం అన్ని వేల మొగవాళ్ళయినను ఉండవలె కదా ? వీళ్ళంతా గూండా లేనా ? ఐఉండరు. మంచివాళ్లుగా కనుపడేవాళ్ళు కూడా, వివేకహీనులై ఈలాటి పనులకు దిగి ఉండవలెను. ఈ స్త్రీలను కాపాడుట బ్రహ్మాండమైన పని. వ్యక్తులు సంస్థలు నిర్వహింపజాలవు. కాన రెండురాజ్యాలు ఇందుకు పూనుకోవలెను.

# 88

8-12-47

## ముస్లిం సంఘపు మందలింపు

ముస్లిములుగాని ముస్లిమేతరులుగాని పంపే ప్రకటనలను ఋజువుపఱుచుకొని పనిలోనికి దిగుట మంచిదిగాని అట్టి ఋజువు కాకమునుపే చర్చకు దిగవద్దనిన్నీ, నేనే స్వయంగా కథియవాడ్ పోయి చూడవలె ననిన్నీ ఒక ముస్లిం సంఘం హెచ్చరించింది. అటకు పోవ వీలుగాదని ఇదివరకే చెప్పాను. నేనిచటి పనిని మున్ముందు చూడవలెను. నే ననుసరించిన స్నేహమార్గము వలన షిర్యాదులు చేసినవాళ్ళే అతిశయోక్తులను ఉపసంహరించారు.

సత్యంకొరకే సత్యాన్వేషణ చేస్తే, దాని ఫలితము ఎల్లప్పుడు సంతోషప్రదముగా ఉంటుంది, అనే గుణపాఠం దీనివలన మనం నేర్చుకోవచ్చు. అట్టి అన్వేషణలో ఓర్పు దీక్ష అవసరము.

## సింధునుండి జాలికరమైన జాబు

జాబులు అనేకం వస్తున్నవి. ఇపు డక్కడ కరాచీలో హిందువుల హత్యలు లేవట కాని, ఆత్మగౌరవముతో కూడిన జీవితానికి అవకాశము లేదట. ఇక్కడనుండి అక్కడికి పోయిన ముస్లింలు ఇష్టము వచ్చినపుడు మీా ఇంటిలో ప్రవేశించి 'మేము ఆక్రమింపవచ్చునా' మని నెమ్మదిగా తెల్పెదరు. వారికా హక్కు లేదు. కాని వద్దని చెప్పుటకు మీాకూ హక్కు లేదు. పూర్వపు కరాచీ కలలోనివార్త అయింది. ఇది నమ్మకమైన ఉత్తరంలోని సారము. అచ్చట అరాచకము ఏర్పడ్డ దన్న మాట. ఈ రకపు అఘాయిత్యం అంటే, అంగుళం అంగుళం చొప్పున దేహాన్ని నర కటం, ఆత్మను కూడా వధించడమన్న మాట. ఈ చట్టరహిత చర్యను, ఎంత త్వరలో అణిస్తే అంత మంచిది. దీనిని అరికట్టండని పాకిస్థాన్ అధికారులను బ్రతిమాలెదను.

## కంట్రోళ్లు

చక్కెరపై కంట్రోలు పోయింది. ఆహారంపై వస్త్రముపై పోనున్నది. వెంటనే ధరలు తగ్గుతవని గాదు. మామూలు జీవితం జరుగవలెననే దాని భావం. పరాయివాళ్లు పైనుంచి పెట్టే కంట్రోళ్ళు ఎప్పుడైనా చెడుగే. 1900 మైళ్లు పొడుగు 1500 మైళ్ళు వెడల్పు గలిగి కోట్లకొలది జనము ఉండే

ఈవిశాలదేశములో కంట్రోళ్ళు మరింత చెడుగు. మనది సైనిక జాతి కాదు. అన్న వస్త్రములు మనం ఉత్పత్తి చేయగలము. కంట్రోళ్ళు పోతే, స్వేచ్ఛగా జాతి బ్రతుకవచ్చును. తప్పులుచేసే హక్కు దానికి కలుగుతుంది. తప్పులుచేయుట, సవరించుకొనుట ఇదే సనాతనమైన అభివృద్ధి మార్గము. దుప్పట్లో ముసుగుపెట్టి పుంచబడిన బిడ్డ మరుగుజ్జయినా అవుతుంది, లేదా చస్తుంది. ముసుగు దీసి ఋతుభేదాలను ధిక్కరించి సాగేవిధంగా పెంచి నచో అపుడాబిడ్డ బలిష్టమగును. ఆలాగే, నిజమైన ప్రభుత్వము ఏదోరక మైన జీవితం అప్రయత్నముగా గడుపునట్లు ప్రజకు నేర్పక, జీవితంలో యుండే కష్టనష్టాలను, లోటుపాట్లను, శీతోష్ణ ములను ఎదుర్కొనునట్లు చేయవలెను.

## కంట్రోలు రద్దుయొక్క అర్థము

దూరదృష్టితో వ్యవహరించు శక్తిని సర్కార్ ఉద్యోగస్థుల చేతినుండి తప్పించి కోటానకోట్ల ప్రజకు ఒప్పగించుటన్న మాట. రవాణా విధానాలు అధికాహార ఉత్పత్తి విధానాలు, మొదలగు కొత్తపనులను సర్కారు యోచించవలెను. సర్కారు వ్యవసాయశాఖ ధనికులగు పెద్ద రయితులకు గాక, బీద లగు చిన్నరయితులకు తోడ్పడాలి. సర్కారు కూడా ఇన్నాళ్ళనుంచి నిర్లక్ష్యం చేయబడ్డ చిన్నరయితునే కాపాడవలెను. ఈదేశంలో వాళ్ళే అత్యధిక జనము. అతడు తన పంటను తాను ఉపయోగించుకొనును. అసలే పంట లేనివానికి కొంత అమ్మును. నడి బజారులో గిట్టే ధరకన్న కంట్రోళ్ళవల్ల ఉత్పత్తిదారుకు తక్కువ

ధర గిట్టుచున్నది. కొంచెంధర పెరిగినా వినియోగదార్లు గొణుగ రాదు. ధరలో పెరిగిన దంతా, ఉత్పత్తిదారునికే చెందవలెను. డబ్బుగల మిల్లుయజమానులు వర్తకులు ఈవిషయమున సర్కారుకును, కిసానులకును తోడ్పడవలెను. ఇన్నాళ్ళనుంచి స్వార్థమునకై బీదలను శోషింపచేసినవారు, తమలో తాము అక్రమపోటీలకు దిగినవారు, ఇపుడు సర్దుకోవలెను. అన్నవస్త్రముల వ్యాపారంలో లాభదృష్టి ఏమాత్రం యుండరాదు. ధనికులు తగిన త్యాగము చేతురు గాక.

## 89

9-12-47

### వారి మార్పు

సర్దార్ పటేల్‌యున్నూ, గాంధీజీయున్నూ, స్థలం మార్పు కొరకు పిలాని అనే ఊరు పోతున్నా రని పత్రికలలో పడింది. వారిద్దఱికి అలాంటి వ్యవధే లేదు. రాత్రిళ్ళు కొంత విశ్రాంతి మాత్రమే వారికి కలిగే మార్పు. ఉద్యోగంలో నున్న సర్దార్ కొంతసేపు ఆ బాధతప్పటకు ఎక్కడికైనా పోవునేమో? గాంధీజీకి ఉద్యోగ భాధ్యతలు లేవు. చావో బ్రతుకో ఇక్కడ ఢిల్లీలోనో, పరిసరాలలోనో తేల్చుకోవలె నని ఆయన ప్రమాణము చేసియున్నారు. వారి పిలానీ మకాముకు భారీయెత్తున ఏర్పాట్లు జరుగుచున్న వని ప్రకటించారు. అది శుద్ధ విపరీతమైన అబద్ధం. తననో సర్దారునో అడిగి తెలుసుకొని నిజమైతే ప్రకటించరాదా?

## హత్యకన్నకూడా ఘోరము

ఈమధ్య సింధులోని హరిజనుల ఇక్కట్టులను వర్ణిస్తూ గాంధీజీపేర జాబు వ్రాసిన డాక్టరును, ఆ సర్కారు నిర్బంధించారట. మరికొందఱి ప్రచారకులను ఖైదు చేసినారట. హరిజనుల తరఫున మాట్లాడేవారు బయట ఉండరాదని వారి యుద్దేశ్యం. ఆ సర్కార్ చేసిన చర్యవలన కార్యకర్త లందఱను వెళ్ళగొట్టినట్లే అర్థము అవుతుంది. ప్రత్యక్ష హత్యకన్న ఇది మరింతఘోరం.

## కస్తూరిబా ప్రచారకులకు ఒకమాట

భారతదేశంలోని గ్రామాలలో నుండే స్త్రీల, బిడ్డల సేవ కొఱకై కస్తూరిబా ధర్మ సంస్థ ఏర్పడింది. ఈ కార్యకర్తలు ఎక్కువమంది నగరవాసులు. ఈ నగరాలు ఇంతవరకు గ్రామాలను శోషింప చేసినవి. ఇపుడు గ్రామాలకొఱకు నగరాలు ఉపయోగపడవలెను. ఈ కార్యకర్తలు నగరమనస్కులు కాకుండా హృదయ పూర్వకముగా గ్రామస్థులు కావలెను. నగరాలలో ఉండే పారిశుద్ధ్యంవగైరా గ్రామరూపంలో గ్రామాలలో ప్రవేశ పెట్టవలెను. అపుడే అచటి స్త్రీలకు బిడ్డలకు నిజమైన సేవ చేయ గలుగుదురు.

# 90

10-12-47

## చర్ఖా అంతరార్థము

ఢిల్లీలో ఆ వారములో జరుగుచుండిన నిర్మాణ కార్యక్రమ సంస్థల సభలకు గాంధీజీ పోతుండేవారు. చర్ఖావ్యాప్తికన్న

దానివలన సూచింపబడే అహింసా వ్యాప్తికన్ని చర్ఖా సంఘము ఇప్పుడు కృషి చేయుచున్నది. ఎవరి గుడ్డ వారు ఉత్పత్తి చేయవలయునని బోధిస్తూ, దాని కవసరమగు విధానాలు పత్తివిత్తులు తీయుట మొదలు, నేతవరకు ఉండే అన్ని పనులను నేర్పుచున్నది. దీని వలన ప్రజలకు రెండు లాభాలు. ఇతర బట్టకొఱకై ఖర్చుపెట్టే డబ్బు మిగులును. వృథా పోయే కాలాన్ని ఉత్తమమైన కళక్రింద ఉపయోగించుకొనవచ్చును. ఈ దేశంలో గుడ్డకు కఱువు అనేది వెర్రిమాట. కూలి మజూరీల క్రింద కొన్ని కోట్ల రూపాయిలు బీదలకు పంచిపెట్టినా, ఏడు లక్షల గ్రామాలలో దానికి స్థాయి కుదురలేదు. అలా చర్ఖా మధుర గానం అన్ని గ్రామాలలోను వినవస్తే, ఈ విచారకరమైన దుర్ఘటనలు జరిగేవి కావు. కాని కొద్దిమందికే పని చూపించగల బట్టల మరలను గూర్చి నేడు ప్రజలు యోచిస్తున్నారు. జన సామాన్య ప్రయోజనాల కంటె ధనికుల ప్రయోజనాలకు ఎక్కువ ప్రాముఖ్యము ఇవ్వబడుచున్నది. గాంధీజీ ఒక ధనికుని ఇంట ఉన్నా, తన మార్గంవేఱు ధనాధిపతి మార్గం వేఱు. సోషలిష్టులు కోరే విప్లవమున్నా, భారీ పరిశ్రమలను జాతీయము చేయడమున్నా, వచ్చేకాలానికి రానిండు. ఈలోపల వారుకూడా చర్ఖానుగూర్చి కృషి చేయవలెను.

## చర్ఖా సాంఘిక సమన్వయం

చర్ఖాకై 30 ఏండ్లపై చిలుకునుండి గాంధీజీ కృషి చేయుచున్నారు. అహింసకు ప్రతీకం చర్ఖా. ఆ సందేశం వ్యాపిస్తే

ముస్లింలను వెళ్ళగొట్టే ప్రసక్తే రాదు. ముస్లింలను వెళ్ళగొట్టి ఆమశీదులలో మీరు కాపురముచేయుదురా ఏమి ? అదే హిందూ మతానికి సర్వనాశనకరం.

## బ్రతుకండి—బ్రతుకనీయండి

అజ్మీర్ నుండి కొందరు ముస్లింలను వెళ్ళగొట్టారట. మిగిలిన వారిలో కొందఱిని చంపారట. ఈవిషం గ్రామాలకు ప్రాకుచున్నది.

అజ్మీర్‌లో నున్న పెద్ద దర్గాలో హిందువులు ముస్లింలు కలసి పూజించేవారు. అందరకు సన్మతి ఇవ్వమని దేవుని స్తుతించండి. ముస్లింలను చంపుటకు లేక వెళ్ళగొట్టుటకు చేసే ప్రయత్నమే హిందూ మతాన్ని నశింపజేస్తుంది. అలాగే ముస్లింలు తమ మతాన్ని చంపుకుంటారు. ఇతరులను బ్రతుకనిచ్చుచే తాము బ్రతుకుటకు మార్గం.

# 91

11-12-47

## కురాన్ నుంచి పద్యం

ప్రార్థనలలో గానము చేసే కురాన్‌లోని ఒక సూరాకు అర్థము చెప్పమని ఆనాటి ప్రార్థనకు ముందే ఒకరు లేచి అడిగిరి. ప్రార్థనానంతరం గాంధీజీ ఇట్లు చెప్పెను. "శాపదగ్ధుడైన సైతాన్ బంధనములనుండి తనను కాపాడమని సర్వదయామయుడగు అల్లాను భక్తుడు వేడుకొనుచున్నాడు. అల్లాయే తీర్పు

రోజుకు అధిపతి. అల్లా ఒక్కడే ఉన్నాడు. ఆయనకు కొడుకులు లేరు. ఆయన ఎవరికీ పుత్రుడు కాడు. అల్లా అనుగ్రహమును పొంది ధన్యులైనవారు నడిచిన మార్గముననే తనను నడుపమని భక్తుడు చివరకు అల్లాను ప్రార్థించెను".

అయితే ముస్లింలు ఈబోధకు వ్యతిరేకంగా ఏల నడుచుచున్నారు, అనే ప్రశ్నకు ఆయన జవాబు ఏమంటే, క్రయిస్తవులు బైబిలు ప్రకారము, హిందువులు ఉపనిషత్తుల ప్రకారం నడుచుచున్నారా? ముస్లిము లందరూ చెడ్డవారు కారు. హిందువు లందరూ మంచివారు కారు.

## ముస్లిం శాంతిరాయబారముయొక్క హామీ

ఉత్తరప్రదేశంలోని నలుగురు ముస్లింలు పశ్చిమపంజాబు పోయి తిరిగి వచ్చి గాంధీజీని కలిసి, హిందువులు లాహోరు పోయి క్షేమంగా అచ్చట కాపురం చేయవచ్చు నని చెప్పిరి. తాము కూడా ఆ హిందువులతో పోయి, వారి సిగపై పూవు లాగకుండా తమ ప్రాణాలు సహితము అర్పించుటకు తయారుగా నున్నామని తెల్పిరి. గాంధీజీ కోరగా వారు వ్రాసిఇచ్చిన జాబు లోని ముఖ్యాంశము లేవి యన, "ఈ రాయబారము రెండు సార్లు, మొదట ఒక నెల, రెండవసారి ఒక వారను పశ్చిమ పంజాబులో సంచారము చేసెను. పరిస్థితులు చాలా బాగా మారినవి. ప్రజలు, ప్రభుత్వము శాంతి స్థాపనకై ప్రయత్నిస్తున్నారు. 1. ఇపుడు అక్కడ ఉన్న ముస్లిమేతరులు అక్కడనే

ఉండవలెను. వెళ్ళిపోయినవారు తిరిగి రావలెను. 2. తిరిగివచ్చిన ముస్లిమేతరుల ఆస్తి వారికి వాపసు కావలెను. 3. తిరిగి వచ్చిన ముస్లిమేతరులకు పూర్తిరక్షణ వర్తక సౌకర్యాలు కల్పించవలెను. 4. ఇంత ప్రయత్నించినా ముస్లిమేతరులు రాదలచకపోతే, తన ఆస్తి అమ్ముకోవచ్చును, మారకము వేసుకోవచ్చును. 5. అల్లరి మూకలకు కఠినంగా శిక్ష వేస్తున్నారు. మళ్ళీ అల్లరి జరుగకుండా తగిన ఏర్పాట్లు చేయుచున్నారు. ఈ రాయబారముకూడా తగిన ప్రచారంచేసి వచ్చింది. తిరిగి పోయేవారి వెంట ఈ రాయబారులు వచ్చి, వారు నిర్భయంగాఉండేవరకు తోడుగాఉంటారు."

లాహోరులో కాఫీహోటల్ పెట్టిన హిందువు ఒకడు రోజూ వేయిమందికి ఫలహారాలు పంచుతున్నాడు. లాహోరు వదిలి వెళ్లిన ముస్లిమేతరులు తిరిగి రావచ్చునని ఆయునకూడ కోరెను.

ఇదినిజమైతే తనకు చాల సంతోషమని గాంధీజీయనెను. ఆచరణలో ఆ సంగతి ఋజువు కావలెను.

# 92

12-12-47

## శరణార్థుల కష్టాలు

గాంధీజీ సలహా ప్రకారము వీలైనంత త్వరలో తాను పాకిస్థాన్ వెళ్ళదలంచినా ననిన్నీ, ఇక్కడ ఎవరును శరణార్థులకు తోడ్పడుట లేదనిన్నీ, చాలా కష్టాలకు వారు లోనగుచున్నా రనిన్నీ ఒకశరణార్థి గాంధీజీకి వ్రాసెను. సర్కారు ఎంత సాయం చేయుచున్నను, శరణార్థులు అనుభవించు కష్టాలు చాలా

ఎక్కువే నని గాంధీజీ అంగీకరించెను. ఇది బ్రహ్మాండమైన సమస్య. ఎట్టి శ్రేష్ఠమైన ప్రభుత్వం కూడా ఎల్లరకు తృప్తికలుగునట్లు, ఈ సమస్యను పరిష్కరించలేదు. శాంతి రాయబారులు చెప్పినసంగతులు ఋజువు అయ్యేవరకు, ఇపుడే పాకిస్తాన్‌పొమ్మని ఆయన సలహా చెప్పదలచుకోలేదు.

ఒకటి బొంబాయినుంచి, ఇంకొకటి బర్మానుంచి, కోపముతో ముస్లింలు వ్రాసిన రెండు జాబులు వచ్చినవి. కథియవాడ్‌లోని అత్యాచారాలు నిజమేనని వారంటారు. ఆ ముస్లింలు తమ పేర్లు తెలుపలేదు. పేర్లే లేని ఉత్తరముల గూర్చి గాంధీజీ జోక్యం పుచ్చుకోరు. తమ ఆరోపణలనుగూర్చి ఏ కొంతయైనా సాక్ష్యం చూపిస్తే ఆయన విచారణ చేయించును.

అజ్మీరులోని అల్లరులు ఇతరులు వర్ణించినంత గొప్పవి కావనిన్నీ, హిందువులు వాటిని ఆరంభించలేదనిన్నీ, అజ్మీర్ నుంచితంతి వచ్చింది. ఎలాంటి భేద అభిప్రాయము లుంటాయో దీనినిబట్టి తెలుసుకోవచ్చును.

సోమనాధ దేవాలయ పునరుద్ధరణకయ్యే ఖర్చు అచ్చటి రాజ్యాంగం ఏల భరించరాదని ఒకరు ప్రశ్నించారు. ఒక మతానికి ఆ అవకాశము కల్పించినచో, ఇంకొకదానికి అలాగే చేయవలసి వచ్చును. అది తప్పిదము అని గాంధీజీ బదులు చెప్పెను.

## కలకత్తాలో దుండగాలు

దౌర్జన్యం చేసి ఏదైనా సంపాదించవచ్చునని ప్రజలు నమ్ముచున్నట్లున్నారు. అది పూర్తిగా పొరపాటు. విదేశీప్రభు

త్వము మీద ప్రయోగించిన మార్గాన్ని ఖండించుటకుగూడ ఆయన ఉపవాసం చేస్తూ ఉండేవారు. ఇప్పుడు స్వంత ప్రభుత్వం ఉన్నది గనుక, చట్టవిరుద్ధ చర్యలను సహించవలెనా? అక్రమ చర్యలను అణచే ప్రభుత్వంమీద ప్రజలు ఫిర్యాదు చేయరాదు. స్వాతంత్ర్యం అంటే నేరాలుచేసి వాటికి తగిలే శిక్షలనుండి తప్పించుకొనుట గాదు. ఎక్కడైనా అన్యాయం జరిగితే, సక్రమముగా దానినిగూర్చి ఆందోళన చేయవచ్చును. శాంతిమార్గాలన్నీ ప్రయోగించి విఫలులైనారా? పైన చెప్పినట్లు సర్కారుకు అడ్డంవస్తే, సామాన్య కర్తవ్యాలను కూడా ఆ సర్కార్ నిర్వహించ లేరు. భారతీయులు విధ్వంసకారులే గాని నిర్మాణ కార్యాలకు అనర్హులని అర్థమా? ఆంగ్ల ప్రభుత్వమునీద జరిపింది సాత్విక నిరోధమే; హింసాకాండ కాదు. విదేశీ ప్రభుత్వం మీద నిషేధింపబడిన పద్ధతులు, స్వదేశీప్రభుత్వం మీద వాడనే రాదు.

# 93

13-12-47

## చర్ఖా సందేశము

చర్ఖాను గురించి తాను ఎందుకు నొక్కి వక్కాణించుచున్నానని గాంధీజీ అడిగెను. ఆదిలో చర్ఖానుగూర్చి మాట్లాడినపుడు పంజాబులోను, గుజరాత్, కథియవాడలలోను ఆ పరిశ్రమ ఇంకా బ్రతికియున్న దని ఆయనకు తెలియదు. బీదలకు అల్పమైన ఆదాయమును పెంచుటకు మొదట్లో దీనిని సంకల్పిం

చిరి. పిమ్మట దానిలో నుంచు అత్యద్భుతశక్తి కనఁగొనబడెను. ఆ శక్తే అహింసాశక్తి. బలిష్టమైన సైన్యశక్తి దానిని గెలువ లేదు. ఈ అనుభవం కలుగబట్టే, రాట్నం అహింసాచిహ్నమని గాంధీజీ యనెను.

రాట్నము యొక్కయు, ఢక్కా మస్లింల యొక్కయు, చరిత్ర అందరికి తెలుసును. అప్పు డది మన బానిసత్వానికి చిహ్నమై యుండెను. అపుడు యజమాని నిర్ణయించిన కూలికి కార్మికుడు పని చేయవలసి వచ్చెను. చేయనని చెప్పలేకపోయెను. దాని అంతర్గత అవకాశాలు గుర్తించినపిమ్మట, అది స్వాతంత్ర్య చిహ్నం అయింది. అందరు వడికితే అందరకు తగినంత ఖాదీ వస్తుంది. కోట్లకొలది రూపాయిలు మిగులుతవి. ఈ విషయం అంత ముఖ్యంకాదు. 40 కోట్లజనం సహకరించి చేసేప్రయత్నం వల్ల అద్భుతమైన శక్తి ఉద్భవిస్తుంది. ఎవరిని శోషింపచేయ కుండా, ఇంతమంది జనానికి పని కల్పించ గల మరియొక వృత్తి లేదు. బట్టల మరలు ఏ కొన్ని లక్షలకో పని ఇచ్చును. మిగతా కోటానకోట్లకు పూర్తి నిరుద్యోగమో, అల్ప ఉద్యోగమో, కల్పించును. పూర్వకాలమున దాని పూర్తిప్రాముఖ్యత తెలుసు కోకుండా రాట్నం వాడారు. అందువల్లనే పిమ్మట అది పడిపో యింది. ఇప్పుడు పూర్తిగా అర్థంచేసుకోనండి. పరులు ప్రయో గించే శోషణను బాపి, స్వాతంత్ర్యంను ఇచ్చును. అది అహింసకు చిహ్నం. నైతిక జీవితానికి చిహ్నం. దానిని సరిగా వాడినచో కలహాలు ఉండవు. మీరు లోకాని కంతకు శాంతిదూతలౌతారు.

# 94

14-12-47

## స్నేహకృత్యం

ఒకముస్లిం పాకిస్థాన్‌పోవుచు, తన కష్టార్జితమైనసొమ్మును ఒక స్నేహితుని వద్ద దాచెను. ఆ సొమ్ముతో కొని యున్న వెండి బంగారును గాంధీజీకి ఒప్పగింతు ననియు, ఆ ముస్లిం ఖామందుకు పంపే ఏర్పాటు చేయవలెననియు, ఆ డబ్బు దాచిన మనిషి కోరెను. ఆ ఖామందు పేరు, చిరునామా తెల్పినచో, అధికారుల ద్వారా ఆ పని జరుపుటకు గాంధీజీ సమ్మతించెను.

## నయీ తాలీమ్

నయీ తాలీమ్ ఎనిమిది ఏండ్ల ఈడుగల సంస్థ. నూతన పంథాపై జాతికంతకును విద్య చెప్ప బూనుకున్నచో భారతీయ సంస్థకు ఇది దీర్ఘకాలము కాదు. చేతిపనులద్వారా విద్య క్రియాత్మక విద్యయని దీనిని వర్ణింతురు. ఇది సత్యములో ఒకఅంశమే. దీని వేళ్ళు ఇంకను లోతుగా నున్నవి. వ్యష్టి లేక సమిష్టి జీవితములో ఇమిడియున్న వివిధ మానవ చర్యలలో సత్య ప్రేమలను సర్వత్ర ప్రయోగించుటయే దీని ఆశయము. నిజమైన విద్య అందరకు తేలికగా అందుబాటులో నుండవలయు ననియు, నిత్య జీవితంలో ప్రతి గ్రామీణునకు ఉపయోగపడవలెననియు, ప్రేమ శాసించుచున్నది. దానికి పుస్తకాధారములేదు. దానికి పాక్షిక మతముతో సంబంధము లేదు. విశ్వమతము నుండి అది ఉద్భవించింది. ఖనీమలేనిది, లోకంలోనున్న ఏ బలంచేతను హరింప

బడనిది, అయిన జీవితగ్రంథమునుండే అది నేర్చుకొనబడుచున్నది. ఇట్టి చదువు చెప్పుటకు అర్హులైన ఉపాధ్యాయు లున్నారా? ఈ అవిశ్వాసయుగములో ఇట్టి సత్యప్రేమలను లక్ష్యపెట్టేవిద్యార్థులు కలరా? అను ప్రశ్నలు ఉదయించ వచ్చును. ఆ సంఘాని కధ్యక్షులైన డాక్టర్ జకీర్ హూస్సేన్, కార్యదర్శులైన శ్రీ ఆర్యనాయగం, ఆశాదేవిగారలు వీటికి జవాబుచెప్పవలెను. ఆ రెంటి యందు, కార్యవిధానముగ గాక, జీవిత సిద్ధాంతముగ నమ్మకం ఉన్నవారు, అత్యంత కఠినమైన హృదయమును కూడా ఇనుప ముక్కను సూదంటురాయి ఆకర్షించి నట్లు, తమవైపుకు లాగు కొన గలరు. రోజూ సాయంత్రం ప్రార్థనలో చదివే స్థితప్రజ్ఞుని లక్షణాలు వారికి ఉండవలెను. వారికవి లేకున్నా చేపట్టిన కార్యమును వదలివేసినా, ఈ ఎనిమిదేండ్ల బిడ్డ చావవలసిందే.

## 95

15-12-47

### అవమానకరమగు ధిక్కారము

ఆరు పురపాలక సంఘ పాఠశాలల ఇండ్లను శరణార్థులు ఆక్రమించారట. ఆ సంఘము ఎంత చెప్పినా వారు ఖాళీచేయ లేదట. పోలీసు సహాయముతో ఖాళీ చేయించ యత్నించు చున్నారు. ఇది సిగ్గుమాలిన పని. నింద్యమైన చట్టవిరుద్ధ చర్య. సమ్మేళన రాజధానిలో ఇట్టి ధిక్కారము జరుగుట, ఎవరికిని మర్యాదకరం గాదు. ఈ దురాక్రమణదారులు పశ్చాత్తాపపడి

ఖాళీ చేయవలెను. వాళ్ళస్నేహితులు వాళ్ళకు బుద్ధిచెప్పవలెను. పోలీసులను పిలువవలసిన అక్కర లేకుండా చేయవలెను.

యమయాతనలు అనుభవించుచున్నా ఈ శరణార్థులకు బుద్ధి రాలేదు. యోచనాపరులు శ్రమజీవులు కాలేదు.

## అల్లరులు, దుష్ప్రవర్తన

శనివారము కలకత్తా గందరగోళమును గూర్చి మాటలాడినాను. అది శరణార్థులు కాని వారు చేసిన పని. గందరగోళాలు దుష్ప్రవర్తన వ్యాపిస్తే, దేశమర్యాద నాశన మౌతుంది. పార్టీతో నిమిత్తం లేకుండా అందరు నాయకులు దేశ గౌరవము కాపాడవలెను. రోజు రోజూ పెరుగుతూన్న లంచగొండితనం కూడా ఈ జాతిలోనిదే. కనుక దానిని కూడ ఈ సందర్భంలో చెప్పవలసి వస్తూన్నది. ప్రతివాడూ తనకోసమేనా బ్రతికేది? మొత్తం ఇండియాకోసం ఒక్కడూ లేడా?

## ఒక కపటఉపాయము

"11 వ డిశంబరు మీరు యు. పి. ముస్లింల శాంతి రాయబారాన్ని గూర్చి మాటలాడినారు. సిక్కులను వదలి హిందువులను మాత్రమే పిలుచుట వారిద్దరి మధ్య కలతలుపెట్టుటకు కపటపు ఎత్తు" అని ఒక విలేఖరి గాంధీజీ పేర వ్రాసెను. 11-12-47 తేదీ గల హిందూస్థాన్ టైమ్సు లోని ఒక కత్తిరింపు ముక్కను ఆయన గాంధీజీకి పంపి, పాకిస్థాన్ సర్కారును నమ్మవద్దని గాంధీజీని హెచ్చరించెను. "20-11-47వ తేదీన బ్యాంకుల లోని వస్తువులను తీసుకొనుటకు హిందువులు, సిక్కులు లాహోరు

పోయినపుడు, ముస్లిం మూకలు వీళ్ళమీద తిరుగబడ్డారు. పాకిస్థాన్ ఉద్యోగస్థులు ఆ మూకల నణచుటకు ప్రయత్నం చేయ లేదు."

## ఆపత్రికా కత్తిరింపులోనున్న ముఖ్యాంశాలు

"అల్లరులకాలంలో దేశం విడిచిపోయిన ముస్లిమేతర వర్తకులు, దుకాణాదార్లు తిరిగివచ్చి తమ వృత్తులు సాగింప దలచినపుడు పాకిస్థాన్ పెట్టిన అసాధ్యపు షరతులకు సమ్మతించక, వారు తిరిగి పోయారు. ఆషరతు లేవనగా 1. విక్రయాలను గూర్చి సరియైన లెక్కలుంచవలెను. 2. పునరుద్ధారణ సహాయక కమిషనర్ వ్రాతమూలకమైన అనుమతిలేనిది, తమ దుకాణములో మరెవరికిని హక్కు కల్పింపరాదు. 3. తన దుకాణాన్ని తన యాజమాన్యమునే నడిపిస్తూ ఉండవలెను. 4. అమ్మకపు డబ్బంతా రోజూ షెడ్యూల్డు బాంకులో నిలువ ఉంచవలెను. పై చెల్పిన ఉద్యోగి అనుమతిలేనిదే ఆడబ్బు తీసుకోరాదు. 5. ఆదుకాణదారు ఖాయముగా లాహోరులో నివసించవలెను. చాలమంది ఈషరతులకు ఒప్పుకోనలేదు. అల్పసంఖ్యాకుల ఎడ ఔదార్యం చూపిస్తామని వాగ్దత్తంచేసిన పాకిస్థాన్ ప్రభుత్వం ముస్లింవర్తకులపైన, దుకాణదార్లపైన ఇలాంటి షరతులు పెట్టలేదు."

## నమ్మకమువలన నమ్మకము కల్గుతుంది.

ఈసమాచారము అంతా సత్యమే అయినను, శాంతి రాయబారుల ప్రయత్నానికి అడ్డంకాదు. వారికి హామీ ఇచ్చిన

పాకిస్థాన్ ప్రభుత్వపు మర్యాద, వాళ్ళు కాపాడుకోవలెను గదా! వారు తమ దౌత్యాన్ని జరుపుచునే యున్నారు. ఈవిలేఖరి కూడా ఇంత అనుమానము, ఉద్రేకము పెట్టుకోనక్కరలేదు. అపనమ్మకము అనేది ద్రోహచింతగల స్నేహితుడు. నేను జాగరూకుడ నయ్యే, ఎల్లప్పుడు అందరిని నమ్ముతూంటాను. ఈ రాయబారులను నమ్ముతాను. వాళ్ళ ద్రోహం బయలుపడే వరకు నమ్ముతాను. నమ్మకముచేతనే నమ్మకము కలుగుతుంది. అది మీకు ద్రోహాన్ని ఎదుర్కోగల శక్తినిస్తుంది. రెండురాజ్యాల వారు తిరిగి తమ స్వగృహాలకు పోదలిస్తే నేను నమ్మేసిద్ధాంతాన్ని, అనుసరిస్తున్నమార్గాన్ని నమ్ముకునే వారు పోవలసియుంటుంది.

## అయోగ్యమైన భయము

హిందూ, సిక్కులమధ్య కలతలుపెట్టే కపటపు ఎత్తు ఇది యని సంకోచించుట యోగ్యమైన పనిగాదు. అలాటి అపార్థము కలుగవచ్చునని నేను రాయబారులతో చెప్పినపుడు, అట్టి అవకాశములేదని గట్టిగా జవాబు చెప్పారు. సిక్కులమీద పాకిస్థాన్‌లోనే ఎక్కువ వ్యతిరేకత ఉన్నమాట నిజమే. మునిగినా తేలినా, హిందువులు సిక్కులు కలిసియే ఉండాలి. కుట్రదారుల మధ్య న్యాయమైన భాగస్వామ్యము ఉండనేరదు.

## అఖండ భారతపౌరులు

భారతం రెండుగా విభజింపబడినపుడు, ఒకదానిలో పౌరులుగాయుంటే రెండవదానికి వెళ్ళే వీలులేనపుడు, నేను అవిభక్తభారతపౌరుడ నని ఎలా చెప్పుకోగలను అని తూర్పుపాకిస్థాన్

నుండి ఒకరు గాంధీజీని అడిగిరి. న్యాయశాస్త్రపండితులు ఏమి చెప్పినా, మానవుని మనస్సుపై వారి కధికారంలేదు. చట్ట ప్రకారము వీలులేకపోయినా, చట్టములననుసరించి కొన్ని దేశాలలో నీకు ప్రవేశమే నిషేధింపబడినా ప్రపంచపౌరుడనని నీవేల ప్రకటించుకోరాదు? తానొక నిర్జీవయంత్రమై పోతేతప్ప చట్టాలు కల్పించే హోదాలను చూచి ఎవడూ ఆదుర్దాపడనక్కరలేదు. లోపల నైతికబలముంటే దేనికీ భయపడనక్కరలేదు. ఒక రాజ్యాన్నిగూర్చి గాని, దాని ప్రజలనుగూర్చి గాని దుర్భావము నీమనసున లేకున్న చాలును. పాకిస్థాన్ ప్రజలమీద ప్రభుత్వము మీద ద్వేషము వహిస్తూ దానిపౌరుడనూ ఇండియాపౌరుడనూ కూడ అని చెప్పుకోరాదు. అట్టివానిని రాజ్యద్రోహి అంటారు. అట్టివారి సంఖ్య పెరిగితే యుద్ధం తప్పదు. రాజ్యభక్తి విభజింప పడనేరదు.

## 96

16-12-47

### కంట్రోలు రద్దువలని ఫలితాలు

కంట్రోలు రద్దువలన వస్తువుల ధరలు తగ్గినవి. బెల్లం శేరు రు. 1-0-0 నుంచి 0-8-0 లవరకు, చక్కెర రు. 34-0-0 నుంచి 24-0-0 లవరకు, కందిపప్పు మణుగు రు. 24-0-0 నుంచి 18-0-0 లవరకు గోధుమ మణుగు రు. 34-0-0 నుంచి 24-0-0 లవరకు, తగ్గినవి. గాంధీజీకి ఇప్పుడు అమలులోనున్న ఆర్థికశాస్త్రం తెలియదనడం సత్యమే. ఫలితాలనుబట్టి చూస్తే

ఉద్యోగబృందం పడిన భయానికి కారణములేదని తేలింది. ఈ కంట్రోలు రద్దు అయినప్పటినుండి, బీదలు కొంచెము బాగుపడు న్నట్లు కన్పడును. కంట్రోలు రద్దు చేయించినందుకు అనేక అభినందన లేఖలు వచ్చినవి. కాని వాటిని గాంధీజీసరకు గొనడు. అనేకమంది అనేకవిధాల చేసినకృషివలన ఈకంట్రోళ్ళు రద్దయినవి. వర్తకుడు, ఉత్పత్తిదారు తమ స్వంతలాభముకన్న దేశలాభాన్ని గురించి ఆలోచిస్తే కంట్రోలు రద్దు కల్తీలేనట్టి వరప్రసాద మాతుంది. వర్తకబృందము సరిగా ప్రవర్తించరని సర్కార్ వారిభయానికి కారణం. ప్రజలలో అత్యధికులు, స్వార్థులు అవిశ్వాసపాత్రులు అయితే ప్రజాస్వామికం, లేక పంచాయతీ రాజ్యం ఎలా పనిచేస్తుంది? సర్కారు, ఉద్యోగులకుతోడు అనుద్యోగుల సహాయంకూడా పొందవలెను. జీతం పుచ్చుకుని ఉద్యోగులు, జీతంలేకుండా అనుద్యోగులు పనిచేస్తారు. వారికుండు తేడా అంతే. తప్పు చేస్తే ఉభయులు శిక్షకు పాత్రులే.

## జీతాలు నౌకరీషాహీ

నౌకరీషాహీ కిచ్చే జీతాలు చాలా ఎక్కువని కొందరి ఫిర్యాదు. తటాలున అందరిని తరిమివేయలేము గదా! ఇదివరకే వారిసంఖ్య కొంత తగ్గించబడ్డది. ఉన్నవారు ఎక్కువగా పని చేయవలసివచ్చింది. సర్దారు వారిని అభినందించారు. స్వాతంత్ర్య సంపాదనకు పూర్వం, కాంగ్రెసు ఏ హెచ్చుజీతాలను ఖండించి నదో, వాటిని ఇప్పటికిని ఉద్యోగస్థులు తీసుకుంటున్నారని అనక తప్పదు. నిజమైన ప్రభుత్వఉద్యోగస్థులంటే ప్రజలే. కాంగ్రెసు

వాదు లంతా ఇదివరకు జీతాలు పుచ్చుకొనకుండ పని చేయ లేదా? ఇప్పుడు పార్లమెంటరీకార్యదర్శి అయినంతమాత్రంచేత అతనికి హెచ్చుజీతం ఎందుకు ఇయ్యవలెను? అసలీకార్యదర్శులు అవసరంలేదుకూడా. కాంగ్రెసువారు జీతాలుగల కార్యదర్శుల సంఖ్య పెంచరాదు. కాంగ్రెసు చూపిన ఆదర్శాన్ని తగ్గింపరాదు. ఇప్పుడు కోట్లకొలదిరూపాయలు తమ అజమాయిషీలోనున్నవి గాన, జాగ్రత్తగానుండవలెను. ఆదాయం పెరుగనపుడు ఖర్చు పెంచరాదు. ప్రతివర్తకసంఘం, ఖర్చుకంటె జమ హెచ్చుండు నట్లు చూస్తుంది. ఈ ప్రధానాంశమును నిర్లక్ష్యంచేసి స్వతంత్ర రాజ్యాన్ని నడిపింపగలమా? వివేకంతో వర్తించకపోతే ఈడబ్బు చాలదు. ఈరాజ్యం ఉండదు.

## 97

17-12-47

### బలవంతపు ఆక్రమణ

తూర్పుపంజాబులోనుండే పంజాబీ స్నేహితుడు గాంధీజీ పేర జాబు వ్రాసెను. అతనికి తూర్పుపంజాబులో ఇల్లు ఉన్నది. పశ్చిమపంజాబులో వర్తకం యున్నది. అక్కడనుంచి వెళ్ళగొట్టబడి, ఇక్కడికి వచ్చేసరికి ఇక్కడ సర్కారునౌకరు ఒకడు అతని ఇల్లు ఆక్రమించి ఎన్నిప్రయత్నములు చేసినా ఖాళీచేయడయ్యె. చిట్టచివరకు రెండుగదులు మాత్రం ఇచ్చెను. తూర్పుపంజాబ్ సర్కార్ తన ఇల్లు తనకు స్వాధీనము చేస్తారా, లేక దావాకు

దిగవలసిందేనా అని గాంధీజీని నిర్ణయించమని అతను కోరెను. దావాలేకుండా తమ నౌకరును తాము వెడలగొట్టి తూర్పు పంజాబు సర్కార్ ఆయింటిని ఖామమందుకు ఇవ్వవలసిందేనని గాంధీజీ అభిప్రాయపడెను. శరణార్థుల ఇళ్ళు ఖాళీగా యుంచవలసిందే. శరణార్థులుకూడా, ఇతరుల ఇండ్లను బలవంతంగా ఆక్రమింపరాదు. తాళాలు పగులకొట్టికూడా ముస్లిం ఇండ్లలో ప్రవేశిస్తున్నారట. ఇట్టి అక్రమచర్య వ్యక్తికి గాని, దేశానికి గాని మంచిదిగాదు. గృహదహనాలు, లూటీలు ఎన్నడైనా ఎప్పటికైనా మేలుచేయగలవా ?

## తియ్యని మాటలు

పాకిస్థాన్ నాయకులు ఎంతతీయగా మాటలాడినా, ఆత్మగౌరవంగల హిందూ, సిక్కు లెవరూ క్షేమముగా అక్కడ యుండలేరు అని ఒకరు వ్రాయుచున్నారు. కాంగ్రెసువాదులు తమది మతాతీతరాజ్యమని చెప్పినా, అనేకులు అలా ఆచరించుట లేదు. పట్టాలు తొలిగితే రెండురాజ్యాలు నాశనమౌతవి.

## తిరిగిపోవుటకు షరతులు

ఒకస్నేహితుడు తెల్పిన సంగ్రహకథ : అమూల్యమైన ప్రాణాలు దక్కించుకొనుటకు 17వ ఆగష్టు లాహోరు వదలి ఢిల్లీలో ఒకబంధువు ఇంట తలదాచుకొంటిమి. మాఇళ్ళు దోచిరి. మాదుకాణము ముస్లింలకు ఇచ్చిరి. 9వ సెప్టెంబరున మా వస్తువులు నాశనంకాకముందు ఆ ఆస్తిని ఇక్కడకు తెచ్చుకో ప్రయత్నముచేసి ఇచ్చటి ఉద్యోగీయులకు వ్రాస్తిని. జవాబు

రాలేదు. పిమ్మట లూఠీ వగైరా జరిగెను. ఆలోపలనే రెండు సర్కారులమధ్య కుదిరిన ఒడంబడికప్రకారము ఇష్టమున్నవారు పూర్వపుచోటుకు పోవచ్చునని, వర్తకం వగైరా జరుపుకొనుటకు అన్నిసౌకర్యాలు, రక్షణలు ఇస్తారని తెలిసి 1వ డిశంబరు మా నాయన అచటికి పోయి మా ఆస్తిని వాపసుచేయమని కోరెను. అక్కడ పరిశ్రమల డైరెక్టరు మాకోరికను నిరాకరించెను. మా యంత్రశాలలను 10 మంది శరణార్థులకు విలియావేశారట. యంత్రశాలలను వారికి స్వాధీనంచేయకపోయినా, ఆతీర్పు మార్ప వీలుగాదట. ముందే హామీలు పొందకుండా తగిన యేర్పాట్లు జరుగకుండా, ఎవరూ పాకిస్థాన్ పోరాదని గాంధీజీ సలహాచెప్పెను. హిందూ, సిక్కులు తిరిగివెళ్ళుటకుగాను కొందరు ముస్లిములు కృషిచేయుచున్నను, ఇంకా ఆ శుభసమయము రాలేదు. వచ్చినపుడు గాంధిజీయే తెలియజేయును. మొదటిముఠాతో ఆముస్లిం మిత్రులు, తానుగూడ బయలుదేరగలరని గాంధిజీ అనెను.

## తూర్పు ఆఫ్రికాలో భారతీయులు

ఐరోపాదేశీయులు తూర్పు ఆఫ్రికాకు పోక పూర్వమే, హిందువులు ముస్లింలు అగు భారతీయులు కత్తితో గాక, వర్తకమునకై పోయి అచ్చటి దేశస్థులతో స్నేహంచేసుకుని, కష్టపడి దేశమును వృద్ధిపఱచిరి. అట్టివారు ఆదేశములో అడుగిడ రాదని ఆసర్కార్ నిషేధశాసనం చేయనున్నారు. తూర్పు ఆఫ్రికాలోని భారతీయులను హక్కులేని ఆక్రమణదారులుగా

చూచుట మహాఘోరము. స్వతంత్రభారతదేశము అలాటి నిషేధాజ్ఞలను సహించదు. అచ్చట అధికారులు భారతదేశ స్నేహమును పోగొట్టు కొనరాదు.

## 98

18-12-47

### విచక్షణలేని వాదము

గాంధీజీ ఇంగ్లీషులో జాబు వ్రాస్తే, ఆయనకు నొప్పి కలిగిందట. ఆమాటలు విని ఆశ్చర్యం పొందిన ఒకస్నేహితుడు గాంధీజీపేర ఒకజాబు వ్రాసెను. ఆంగ్లేయులు ఎడ ముస్లింల ఎడ ఆయనకు స్నేహభావమే యుంటే, ఇంగ్లీషుభాష ఎందుకు త్రోసి వెయ్యాలి ? ఉర్దూభాషను ఎందుకు ప్రోత్సహించవలెను ? ఈ ప్రశ్నను జూచి గాంధీజీ ఆశ్చర్యము జెందెను. అందులో అజ్ఞానము చాలా ఉంది. ఆంగ్లం అంతర్జాతీయభాష అయినా, ఎన్నటికిన్ని భారతదేశజాతీయభాష కానేరదు. ఇంగ్లీషు విదేశీ భాష. ఉర్దూ స్వదేశీభాష. ఉర్దూ ఈదేశంలో జన్మించి, ఇక్కడనే వృద్ధి అయింది. మొదట్లో సైన్యశిబిరాలలో వాడేవారు. తర్వాత ముస్లిం ప్రభువులు ఇక్కడ స్థాయిపడినారు. భాషకూడా స్థాయి పడింది. తన చిన్నతనంలో బారిష్టరై 2 ఏండ్లు ఈదేశములో నుండి, పిమ్మట దక్షిణ ఆఫ్రికా పోయి 20 ఏండ్లు గడిపి, తిరిగి స్వదేశమునకు వచ్చిన పిమ్మటనుండి, ఉత్తరహిందూస్థానంలో హిందూ ముస్లింలు మాట్లాడే భాష దేవనాగరి లేక ఉర్దూలిపిలో

వ్రాయబడుచున్నదే మనజాతీయభాష అవుతుందని గాంధీజీ దుందుభిమ్రోగిస్తునే యున్నారు. తులసిదాస్ వాడిన భాష అది. ఆమహాకవి అరబ్బీ, పారశీ మాటలుకూడా వాడినారు. ఆభాషే వికాసము పొందింది. మనజాతీయభాష అయింది. ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందవలసిందే. ప్రాంతీయభాషల అభివృద్ధికి అడ్డంతగిలిన ఆంగ్లభాషను, ఈజాతీయభాష వెళ్లగొట్టవలసిందే. ఆంగ్లపరిపాలన పోయింది కనుక ఆంగ్లభాష పోవలెను. హిందీ, ఉర్దూల సమంజసమైన సమ్మేళనం హిందూస్థానీ. అదే మనజాతీయ భాష.

## అచ్చు అజ్ఞానం

తేజబహదూర్ సప్రు, ఉర్దూ మరువలేకపోతే, దక్షిణ ఇండియావారు ఆంగ్లభాష మరువగలరా ? అని ప్రశ్న ఆవిలేఖరి వేశాడు. ఇందులోను పొరపాటు కలదు. గాంధీజీ పూర్వము చెన్నపురి పోయినపుడు, జట్కావాలాతో ఇంగ్లీషు మాటలాడితే, వానికి అర్థం కాలేదు. హిందూస్థానీ మాటలాడితే అర్థమైంది. ఆంగ్లం అరవల మాతృభాష కాదు. ఉర్దూ సప్రూ మాతృభాష. లాలా లజపతిరాయి మాతృభాష ఉర్దూ. ఆయనకు హిందీ రానేరాదు. హిందీ సాహిత్యసమ్మేళనమునకు గాంధీజీ రెండు పర్యాయములు అధ్యక్షులుగానుండిరి. దక్షిణాది వారు గాంధీజీ తెలిపిన జాతీయభాషాసిద్ధాంతమును ఆమోదించిరి. ఇపు డేల తిరస్కరించుచున్నారు ?

## మతమును నిరాకరించుట

అజ్మీర్‌లో జరిగిన అల్లరినిగూర్చి గాంధీజీ ఆవేదనపడెను. ముస్లింలను చంపి లేక వెడలగొట్టి హిందూమతం కాపాడగలరా ఉర్దూ లిపిని భాషను తొలగించి జాతీయభాషను వృద్ధి చేయగలరా ? గాంధీజీ చిరంజీవికాడుగదా ! ఆయన పోయినపిమ్మట ఆయనమాటలను స్మరింతురు. అసహనమునగా మతనిరాకరణమే. మంచిగా, శాంతముగా నుండమని అన్ని మతాలు బోధిస్తవి.

# 99

19-12-47

## గోరుగాం గ్రామం పోవుట

అల్వార్, భరతపూరు రాజ్యాల నుండి వెళ్ళగొట్టబడిన మీయోలు కొందరు పాకిస్థాన్ పోగా, మిగిలినవారు ఇళ్ళు లేక ఇక్కట్లు పడుచుండగా గాంధీజీ వారిని చూడ బోయెను. ఆయనతో వచ్చిన తూర్పుపంజాబు ముఖ్యమంత్రి "మీఓలు తూర్పు పంజాబులో హాయిగా ఉండుటకు హక్కు కలిగి ఉన్నారనిన్నీ, వారి ఆస్తి ప్రాణాలను తన ప్రభుత్వం కాపాడు" ననిన్నీ వారికి హామీ ఇచ్చెను. జనాభా మార్పిళ్ళకు గాంధీజీ ఎన్నడు సమ్మతించరు. లక్షలకొలది జనాన్ని వాళ్ళ స్వస్థలాలనుండి ఊడబెరికి తొలివేయుట ఘోర రాక్షసకృత్యం. వెళ్ళిపొం డని ఎవరును మీఓలను నిర్బంధింపజాలరు. పాకిస్థాన్ పోదలంచిన వారిని ఆపజాలరు. ఈ మీఓలు నేరపుజాతి వంటివారట. అయితే వారిని సంస్కరించి యోగ్యమైన పౌరులుగా చేయాలి.

## ధరలు కంట్రోలు రద్దు

కంట్రోలు రద్దయిన పిమ్మట అన్ని చోట్ల ధరలు పడిపో యినను, ఒక చోట చక్కెరధర పెరిగెనని ఒక మిత్రునిఫిర్యాదు. దానికి కారణము స్థానికమై యుండునని గాంధీజీ జవాబు.

## పెట్రోలుమీద కంట్రోలు

వస్తువులు సరిగా పంచుటకు రవాణా చిక్కులు అడ్డము వచ్చుచున్నవి. నేలబొగ్గు, రైలుబండ్లు కొఱవగానున్నవి. రైళ్లు ఏర్పడక పూర్వం కూడ ఇండియా వ్యాపారం చేస్తూ యుండేది. రైళ్ళు వచ్చిన తరువాతకూడ రవాణాఅడ్డులు నిజంగా కష్టమే. ఇప్పుడు వచ్చిన రవాణా చిక్కు తీర్చుటకు మోటారు రవాణా ఉపయోగపడవచ్చును. కాని పెట్రోలుమీద నున్న కంట్రోలు పోవాలి. సగం సగంగా చేస్తే ఏ పని నెగ్గదు. పెట్రోలు ప్రతి వానికి అక్కరలేదు. సర్కారుకు కావలసింది ఉంచుకొని మిగ తాది విడుదల చేయవచ్చును. ఇపుడు పట్టపగలు చీకటి బజా రులో కావలసినంత దొరకుటలేదా ? ఉప్పుకు సరియైన రవాణా ఉంటే అది చౌక అగును. ఉత్పత్తికి లోటులేదు.

## "కంపోస్టు" ఎరువు

ఆహారోత్పత్తి పెరుగవలె నన్నచో, తగిన ఎరువులు ఉండాలి. కృత్రిమ ఎరువులు భూమికి అపకారం. కిసాన్‌గా మారిన మీరాబెన్, ఢిల్లీలో కంపోస్టు మహాసభ ఏర్పటిచింది. రాజేంద్రప్రసాద్, దాతర్‌సింగ్, ఇతర ప్రముఖులు అందులో పాల్గొన్నారు. ఆవుల పేడ, మానవుల మలమూత్రం, ఇతర

తుక్కు కలిపి, కంపోస్టుచేసే విధానము వారు నిర్ధారణచేసినారు. ఆ ఎరువుకు చెడువాసన లేదు. భూ సారమును చెఱచకుండా, పెంచుతుంది. అందువలన ఉత్పత్తి పెరుగును. ఈ కంపోస్టు ఎరువును దేశమంతటా తయారుచేయ వచ్చును. ప్రజల సహకారముతో ఈ యుద్యమము ఫలించును.

# 100

20–12–47

## పిరికితనం వదలండి

కొద్దిగా నైనను ఢిల్లీలో తగాదాలు మరల తల యెత్తినవి. ఢిల్లీలో నుండే హిందూ, సిక్కులు గాని, పాకిస్థాను నుండి ఢిల్లీ వచ్చిన శరణార్థులు గాని, ఇక్కడ ముస్లింలు ఉండరా దని తీర్మానించుకొంటే, బాహాటంగా, ధైర్యంగా ఆ సంగతి తెల్పవలెను. ముస్లింలకు రక్షణ ఇవ్వలేమని ప్రభుత్వం ప్రకటించవలెను. అంటే ప్రభుత్వం దివాలా తీసినట్లే. ఆ రోగం ప్రబలితే హిందు, సిక్కు మతాలు నశించినట్లే. అలాగే పాకిస్థాన్‌లో హిందువులు సిక్కులు సురక్షితముగా గౌరవముగా ఉండలేక పోతే, అప్పుడు భారతదేశంలో ఇస్లాము చచ్చిపోయినట్లే. పిరికితనాన్ని నెట్టివేయండి. ఎవరినైనా అక్రమంగా నెట్టివేయుటం పిరికితన మనే గాంధీజీభావము. ఏ ఒకరు చెడ్డవారైనచో, రెండవవారి మంచితనము చేత మొదటివారు కూడా మారిపోవుదురు. భక్తుని చూచిన సంతసం, లౌకికుని చూచిన దుఃఖం, తనకు కలిగే నని

మీఁరా చెప్పుచుండేది. చెడ్డవాళ్ళను సంస్కరించవలెను గాని, వెళ్ళగొట్టరాదు. చంపరాదు.

## గ్రామ పరిశ్రమలు

గ్రామ పరిశ్రమ లనే తేజో మండలములో రాట్నం సూర్యుడు; తక్కిన పరిశ్రమలు ఉపగ్రహాలు. సూర్యుడు లేకుండ ఉపగ్రహా లుండవు. ఉపగ్రహాలు లేకుండా సూర్యు డుండడు. ఢిల్లీయున్నూ, చుట్టుప్రక్కల గ్రామాలున్నూ, గ్రామ గృహ పరిశ్రమలను వృద్ధి చేస్తే, ఒండొరుల ఐశ్వర్యాన్ని పెంచుతవి. సాంఘిక కల్లోలాలను గూర్చి యోజించుటకు కాలం దొరకదు. ఈ చుట్టుప్రక్కల నుండే చేతిపనులు చేయువారు ముస్లిం లట. పానిపట్టులో గొంగళ్ళు నేయువారు ముస్లింలట. ఇట్టివారు వెళ్ళిపోవుటచే, ఆ యా పరిశ్రమలకు దెబ్బ తగిలింది. చాలచోట్ల హిందువులకు, ముస్లింలకు వేరువేరు పరిశ్రమ లున్నవి. కాని ఈ తబ్బిబ్బుళ్ళవల్ల రెండు రాజ్యాలు బాధ చెందుతూనే యున్నవి.

## మూలధనము, కాయకష్టము

జంతువుల, మనుజుల మలమూత్రాలను తుక్కుతో కలిపి కంపోస్టు చేస్తే బంగారం వంటి ఎరు వగును. అదే ఒక గృహ పరిశ్రమ. కోట్లకొలది జనం కలసి చేస్తే, స్పష్టమైన ఫలితాలు కనుబడుతవి. కొద్దిమంది కార్మికుల బలాన్ని ఉపయోగించి, తాను వృద్ధిచెందవలెనని మూలధనం యోచిస్తుంది. కోట్లకొలది కార్మికుల కాయకష్టాన్ని సరిగా వినియోగిస్తే, అపుడు వీరి ఐశ్వర్యం పెరుగుతుంది. అదే నిజమైన ప్రజాస్వామ్యం. అదే

పంచాయతీ రాజ్యం. దానిమీద సర్వ శక్తులను కేంద్రీకరించ వలెను. ప్రజలు సాంఘిక కలతలలో మగ్గుచుంటే త్రాగుడు, వ్యభిచారము, జూదములతో మాడిపోయిన యాదవుల వలె చచ్చిపోయెదరు.

## 101

22-12-47

### మైలపడుపరాదు

అజిమీర్‌లో ఉన్న దర్గా తరువాత పవిత్రతలో పేరు గాంచినది కుతుబుద్దీన్ భక్తియార్ కాకీచిష్టీ సాహెబు దర్గా. ఇక్కడికి ఎనిమిది మైళ్ళు. వేలకొలది ముస్లింలు, ముస్లిమేతరులు అచ్చటికి తీర్థయాత్ర వెళ్ళుచుందురు. 400 ఏండ్లుగా ఇచ్చట నుండెడు ముస్లింలు సెప్టెంబరులో హిందువులుచేసిన అత్యాచారములను బట్టి దీనిని వదలిపెట్టి పోయిరి. దానిని బాగుచేయుట హిందువులకు, సిక్కులకు, ఉద్యోగులకు, అందరకు ధర్మమై యున్నది. ఢిల్లీలో గాని చుట్టుప్రక్కల గాని పాడుచేయబడిన ముస్లింల పవిత్ర స్థానాలను బాగుచేసి ఆ మతస్తులకు ఒప్పగించ వలెను. పెద్దవాటిని చిన్నవాటిని వెంటనే మరమ్మతు చేయ వలెను.

### భారతంలోని ముస్లింల కర్తవ్యం

కరాచీలో ఈ మధ్య ముస్లింలీగు ఒక తీర్మానం చేసింది. లక్నోలో అబ్దుల్ కలాం అజాద్ పిలిచిన సభ ఉంది. చెన్నపట్టణంలో ముస్లింలీగుసభ కాబోవుచున్నది. ఈలాటి సభలయొకల

భారతీయ ముస్లింల కర్తవ్య మేమి? బహిరంగంగా లేక ప్రత్యే కంగా పిలుపువస్తే, వెళ్ళి నిర్భయంగా నిర్మొగమోటంగా తమ భావాలు ప్రకటించ మని గాంధీజీ హెచ్చరించెను. పాకిస్థాన్‌లో చేరిన అధిక సంఖ్యాక ముస్లింల సహాయం లేకపోబట్టి, ఇక్కడ యుండే ముస్లింలు నిస్సహాయు లైనారని చింతపడ నక్కరలేదు. 30 ఏండ్లనుండి జరుగుచున్న అహింసా విధానమును వా రర్థము చేసుకుని యుంటె, వారికే చిక్కు రానే రాదు. అహింసలో విశ్వాసం లేకున్నాకూడా, భయపడ నక్కరలేదు. తమ మర్యా దను మానప్రాణములను ప్రియతమములైన వస్తువులను, వారు కాపాడుకోగలరు. తన సృష్టికర్తను, ఆయనకు ప్రతిరూప మైన తన్ను తాను ఏమాత్రమైనా గ్రహించగలిగితే ఆత్మ గౌరవం తన చేతిలోనే ఉన్నదని స్పష్ట మవుతుంది. జోహెనెస్‌బర్గులో నున్న ఆంగ్లమిత్రు డొకడు, తా నెల్లపుడు అల్ప సంఖ్యాకుల పక్షాన ఉండేవాడ నని, నేను ట్రాన్సువాల్ ప్రభుత్వముతో పోరాడు నపుడు, నాతో చెప్పి యుండెను. అల్ప సంఖ్యాకులు తప్పు చేయరు. చేసినా, తేలికగా వారిని దాని నుండి మరల్చ వచ్చును. అధిక సంఖ్యాకులు, అధికార గర్వంచేత, అట్లు అను కూలముగా ఉండరు అని ఆయన అనెను. అందులో ఒకమహా సత్యం ఉంది. ఆయుధబలం చేత అధికారం చేజిక్కించు కొన్నవారు కొద్దిమం దైనా, అధిక సంఖ్యాకుల బలం కలిగి ఉంటారు. మన దేశములో కోటానకోట్లకు ఆయుధాలు లేవు;

ఉన్నా ఉపయోగించ నేరరు. అట్టి ఆయుధాల వాడుకవలన, కొద్దిమంది ఆంగ్లేయులు, మన దేశా న్నంతా అణచిపెట్టారు. ఆంగ్లేయులు ఇక్కడ ఉండగా, హిందువులుగాని, ముస్లింలుగాని ఏమియు చేయలేకపోయిరి. తూర్పు, పడమర పాకిస్థానులలో తాము అధిక సంఖ్యాకుల మని ముస్లింలు గర్వించిరి. అల్ప సంఖ్యాకులుగా ఉండే గుణవిశేషమును ముస్లింలు తెలుసుకుంటే ఇస్లాములోని శ్రేష్ఠత్వమును వారు ప్రదర్శించ గలరు. ప్రవక్త మక్కాలో ఉన్నపుడే ఇస్లాము శ్రేష్ఠమైన సేవ చేసె నని మీరు గుర్తించరాదా ? కాంస్టెంటైన్ చక్రవర్తి రాకతో, క్రైస్తవ మతం వెలవెలబారెను. ఇంకను చర్చలేల ? నాకు ఈసలహాలో సహజముగా గాఢవిశ్వాసం ఉంది. విశ్వాసం లేనివారు నా సలహాను త్రోసివేయ వచ్చును.

## కాంగ్రెసువారు కండి

కాంగ్రెసులో చేరుటకు తయారుగా ఉండి, కాంగ్రెసు మీకు సంపూర్ణ సమానత్వహోదాలో హృదయపూర్వక స్వాగత మిచ్చినపుడే అందులో చేర దరఖాస్తు పెట్టుడు. ఈలోపల పెట్టవద్దు. సిద్ధాంతరీత్యానైనను కాంగ్రెసులో అల్ప, అధిక సంఖ్యాకుల సంఘాలులేవు. మానవమతముగాక వేరే మతము లేదు. ప్రతిపురుషుడు, ప్రతిస్త్రీ ఇతరవ్యక్తులతో సమానమే. అది అచ్చంగా లౌకికరాజకీయజాతీయసంస్థ. అందు హిందూ, ముస్లిం, శిక్కు, క్రైస్తవ, పార్సీ, యూదులందరును సమానులు.

సిద్ధాంతాల ప్రకారం అప్పుడప్పుడు ఆచరణలేక పోవుటచే, అది ముఖ్యంగా హిందూ సంస్థగా చాలమంది ముస్లిములకు కనబడి నది. నే నైనట్లే ముస్లింలును కాంగ్రెసువారు కావచ్చును. నేను నాలుగు అణాల సభ్యుడనుగాను. 1915 లో దక్షిణాఫ్రికానుంచి తిరిగి వచ్చినప్పటినుండి విశ్వాసపాత్రుడుగా సేవచేసినాను. కనుకనే నాకు కొంతపలుకుబడి యున్నది.

నేడు ప్రతిముస్లిం 'లీగు'మనిషి. అనిన్నీ, కాన కాంగ్రెసుకు శత్రువనిన్నీ ఊహిస్తున్నారు. దురదృష్టంవల్ల లీగు బోధకూడా అలాగే యుంది. ఇపుడు విరోధానికి రవంత కారణంలేదు. సాంఘిక దురభిమానమనే విషాన్ని అమృతమని భ్రమపడ్డారు హిందువులు, సిక్కులు. అల్పసంఖ్యాకులైన ముస్లింలు ఈ విషానికి అతీతులై, మానసికమైన మినహాయింపులు లేకుండా, భారతంలో పూర్తిపౌరులై మర్యాదగా బ్రతుకవచ్చును. లీగు, హిందూమహాసభ, సిక్కుసంఘం, పార్శీసంఘం రాజకీయసంస్థలు కారాదు. అవి మతసంస్థలై, అవి మతసాంఘికసంస్కరణమునకు ఉపయోగపడును. ఆవిషయాలలో ఒండొంటితో స్నేహపూర్వకంగా పోటీపడి పనిచేయవచ్చును. అన్నిటి రాజకీయవాంఛలు కాంగ్రెసుద్వారానే నెరవేరవలెను. యావద్భారతానికి ప్రాతినిధ్యం వహించ పూనుకున్నది. కాబట్టే, నిరుపమానమైన హోదా, కాంగ్రెసుకు వచ్చింది. "కడపటివానికి సైతము" అది సేవ చేయ ఉద్దేశించింది.

# 102

23-12-47

## ప్రార్థన సమయం

సాయంత్రం ప్రార్థనను గం 5½ నుంచి గం 5 లకు మార్చమని ఒకస్నేహితుడు గాంధీజీపేర వ్రాసెను. చలి పెరుగుచుండుటచే, ఆస్నేహితుడు ఇలా కోరెను. సభలో ఆయనతో ఎక్కువమంది ఏకీభవించిరి. వ్యతిరేకి లేకుండెను. అందుచే గాంధీజీ వారి కోర్కెలను మన్నించి, గం 5 లకే ప్రార్థన సమయం మార్చెను.

## బాహవల్పూరులో ముస్లిమేతరులు

"బాహావల్పూరులోని 70 వేల హిందు సిక్కులను కాపాడండి" అని వ్రాసిన అట్టలు పట్టుకుని కొందరు జనం ప్రార్థన ప్రదేశానికి వచ్చిరి. ఆనాడు గాంధిజీకి మౌనదినం. నేడావిషయమును గాంధీజీ పలుకరించెను. ఆ సంస్థానంనుండి వీరిని రప్పించే ఏర్పాట్లు పూర్తి అగువరకు రాజప్రతినిధి ఇంటి ముందు ఉపవసించెదమని ఆజనులు గాంధీజీకి తెల్పిరి. ఆరాజ ప్రతినిధికి ఇప్పు డేమియు అధికారంలేదని, ఈ ఉపవాసం నిష్ప్రయోజనమని, గాంధీజీ వారికి తెల్పెను. పాకిస్థాన్ విడిచి వెళ్ళ దలచినవారికి తగిన ఏర్పాట్లుచేసే బాధ్యత ఆ నవాబుసాహేబుదే నని గాంధీజీ స్పష్టపఱచెను. ఆపట్టణ ఐశ్వర్యకారకులు సిక్కులే అయినను, వారికి ఇప్పుడు అక్కడ నిలువనీడలేదు. హిందువుల, సిక్కుల తలపై ఈగవాలకుండా వీరిని కాపాడుతాననియు, వారి

ప్రయాణమునకు తగిన ఏర్పాట్లు చేతుననియు, ఈలోగా వారి పోషణకు తగు ఏర్పాట్లు చేతుననియు, ఆ నవాబుసాహేబు ప్రకటించవలెను.

## పాకిస్థానులోని శరణార్థులు

నేటి స్టేట్సుమన్ పత్రికలో ఇలా వ్రాసి ఉంది. "మూడు రోజులు లాహోరులో అమితచలి, పిమ్మట శని, ఆది, సోమ వాన. పరుండుటకు పక్క లేదు. పైకప్పు లేదు. తగిన గుడ్డలు లేవు, కడుపునిండా తిండిలేదు. ఇట్టి దుస్థితిలో వేలకొలది శరణార్థులకు ఆవాన, ఆచలి మృత్యుదేవత లైనవి. రాత్రిపూట ఆవైపున నడచువాడు వీరి ఏడ్పులు, మూలుగులు వినగలడు. సెప్టెంబరు 6 నుంచి నేటివరకు 2500 మందికి కలరా తగిలినది. అందులో నాలుగవవంతు చనిపోయిరి. ఇప్పుడు మశూచికము తీవ్రంగా ఉంది. రోజూ 20 మంది చస్తున్నారు. గడచిన మూడురోజులలో 125 మందికి ఇది తగిలినట్లు ఆరోగ్యశాఖకు తెలుపబడెను. అచ్చటి పారిశుద్ధ్యం అంత అధ్వాన్నముగా నున్నపుడు, ఈరోగాలు రావడంలో ఆశ్చర్యంలేదు. ముర్రీనుండి ఇతర స్థలాలనుండి పాకీ వాళ్ళను పిలిపించారు. కాని వాళ్ళచేత పూర్తిగా పనిచేయించ లేకపోయినారు. దుర్వాసనను సహించలేకున్నారు. పారిశుద్ధ్యం పెరుగకపోతే చావులు హెచ్చుకాక తప్పవు."

శరణార్థుల సేవకు సౌకర్యపెట్టుట తప్పని గాంధీజీ అభిప్రాయము. ఈ ఊడ్పుపనిని శరణార్థులే చేసుకోవలెను. ఇంకా ఇతర పనికూడ చేయవలెను. ఈ ఆపదను సంపదగా మార్చుకోవలెను.

అన్నం, బట్ట, ఇల్లు ఇప్పించడం రెండు ప్రభుత్వాల కర్తవ్యం. నౌకర్లను కుదుర్చవలసిన బాధ్యత వారికి లేదు. పాకీదొడ్డి మొద లగునవి బాగుచేసుకొను పనిని, వారే జరుపుకోవలెను. సోమరులు కారాదు. పాకిస్థాన్‌లోనున్న శరణార్థులను గూర్చి గాంధీజీ అంత శ్రద్ధ వహించినందుకు సభికులు మన్నించవలెను. అమానుషమైన విభేదాలు ఆయన చేయనోపడు.

## నౌకాలీ వార్తలు

గాంధీజీ కార్యదర్శి ప్యారీలాల్‌జీ నౌకలీనుండి వచ్చి అచ్చటి పనిని గాంధీజీకి వర్ణించెను. ప్యారీలాల్‌యున్ను అతని సహచరులున్ను, తన కోరికననుసరించి తమ ప్రాణములకు ముప్పు వచ్చినను లక్ష్యముచేయక అచ్చట శ్రేష్ఠమైన సేవచేసి మెప్పును పొందిరని గాంధీజీ తెల్పెను. వీరి ఉనికి, చర్యలవల్ల అచ్చటి హిందువులకు ధైర్యము, శాంతి కలిగెను. ఈ స్వచ్ఛందసేవక బృందము ఎల్లరకు స్నేహితులనియు శాంతిసద్భావ స్థాపనను కోరి రనియు, ముస్లింలుకూడా గ్రహించగలిగిరి. అచ్చట జరిగిన ఒక విశేషాంశమును ప్యారీలాల్‌జీ ఇట్లు వర్ణించెను.

పునరుద్ధరణ లేక పరిహారప్రదానము అని చెప్పగల మొదటి సంఘటన, ఈమధ్య షహాపూరులో జరిగింది. అసలు అల్లరులకు మూలస్థానం అదియే. "విజయమో, వీరస్వర్గమో" అనే గాంధీజీ ఆదేశప్రకారం గత 13 నెలలు నే నచట పనిచేసితిని. ఒకహిందూ వర్తకుని కొంప పడగొట్టి ఆయింటి సామానుతో హిందువుల కందరికి హక్కుగల ఒకస్థలములో ముస్లింలు కట్టిన మసీదును,

వానే స్వయంగా తొలగించిరి. ఆస్థలమును, ఆవస్తువులను, హక్కుదార్లకు ఒప్పగించిరి. హిందూ సోదరుల ఎడ ఇదొక సద్భావ చిహ్నమనియు వారి పునరావాసమునకు ఇదియొక మెట్టనియు స్థానిక ముస్లింలు తమ సంతకాలతో ఒకప్రకటనను చేసిరి. అంతకు పూర్వము చాలా మథనపడిరి. రాజీమార్గం యోజించుటకు సభ చేయవలెనని యోచించిరి. కాని అట్టిదాని కవకాశంలేదనియు, అల్పసంఖ్యాకులు కోరినా కోరకపోయినా, తప్పుచేసిన అధికసంఖ్యాకులు పూర్తి పరిహారము ఇవ్వవలెననియు, హృదయపూర్వకముగా పరిహారము ఇవ్వ పూనుకుంటేనే వారామసీదును ఉపడతీయవలయు ననియు, నేనక్కడ నున్నంత వరకు అధికారులు నిర్బంధంచేయకుండా ఆపుదుననియు, నేను ఆముస్లింలకు స్పష్టపరచితిని. అప్పుడు 'బిస్మిల్లా' ఉచ్చరించుచూ, ఆమసీదును తీసివేసిరి. అచ్చటనుండే అధికారులుకూడా శాంతి సద్భావములు పెంపొందించుటకు తోడ్పడిరి. "చేసిన ఈకొద్ది పని" వలన "చేయవలసిన ఎక్కువ పనికూడా నిర్వహింపబడునని ఆశకలుగుచున్నది."

ఈ రెండురాజ్యాలలో ప్రజలు ఈసత్కార్యమును ఆచరించే ఎడల పరిస్థితులు నిమిషములో మారిపోవును. అన్ని సమస్యల పరిష్కారానికి ఒకటే మార్గము ఉంది. తన మతము లోని ఉత్తమ ఉపదేశముననుసరించుట, ఇతరమతముల గౌర వించుట యగును.

# 103

24_12_47

## అది అహింసయేనా ?

కొందరు సిక్కు స్నేహితులతో గాంధీజీ మాట్లాడెను. కొన్నిపత్రికల కత్తిరింపు ముక్కలు చూచెను. గాంధీజీ సిక్కులకు విరోధి అయినాడని ఒక ఆపోహ కలిగినట్లున్నది. భారతానికి బయటనున్న ప్రపంచంలో గాంధీజీ మాటకు ఇంకా విలువ ఉన్నట్లు తోచుటచే, సిక్కులు బాధపడుచున్నారు. భారతం అహింసద్వారా స్వాతంత్ర్యంసంపాదించిందని ఒకఖ్యాతి ఏర్పడింది. నిజమైతే అది నిరుపమానమే. కాని అది నిజంకాదు. పిరికివాళ్ళు, దుర్బలులు, వికలహృదయులు అహింసను ఎన్నడును ఆచరించ లేరు. శరీరవికలాంగులు దైవానుగ్రహముంటే అహింసను ఆచరించగలరు. భారతీయ పోరాటము అహింసాయుతమని గుడ్డిగా గాంధీజీ నమ్మెను. కాని ఈమధ్య జరిగిన చర్యలవలన ఆయనకు కనువిప్పు కలిగింది. అది దుర్బలుల సాత్వికనిరోధమని ఆయన కనిపెట్టెను. ధైర్యవంతుల అహింసను వారవలంబించి యుంటే, ఈమధ్య జరిగిన పాపిష్టిపనులు జరిగేవి కావు. 12 ఏండ్ల పసిపాపడు, ప్రహ్లాదుడు, తండ్రియైన హిరణ్యాకశిపుని ఎదిరించలేదా ? దైవము ఒక్కనిపైననే కదా ఆపిల్లడు ఆధార పడింది.

## గురితప్పిన కోపము

సిక్కుల కోపం చూస్తే గాంధీజీకి నవ్వు వస్తున్నది. లా నెన్నడును చెప్పని సంగతులను తనకు అంటగట్టుచున్నారు. త్రాగుబోతు తనాన్ని, చేసిన ఘోరకృత్యాలను బట్టి, ఆయన సిక్కులను విమర్శించెను. అందరి సిక్కులు చెడ్డవారని గాని, అందరి హిందువులను క్షమింపవలెనని గాని, దీని యర్ధముగాదు. వారు పౌరుషవంతమైన జాతి గాన వారినుండి ఉత్తమమైన ప్రవర్తనను గాంధీజీ ఆశించెను. వారి క్రూరకృత్యాలను తగ్గించే వారు లేక చూడనొల్లనివారు, సిక్కులకు నిజమైన శత్రువులు. అవిరోధియైన ఆయన వారికి శత్రువుగాదు. గాఢమైన మిత్రుడే. తాను చెప్పినదానిని బట్టి, లోకము సిక్కులపై దురభిప్రాయ పడునని వారు భయపడనక్కరలేదు.

## క్రిస్టమసు అభినందనము

రేపు క్రిస్టమస్ రోజు క్రైస్తవులకు పండుగ. హిందువులకు దీపావళి ఎట్టిదో ఇది వారి కట్టిది.

ఇందు ఏ యుత్సవముగాని త్రాగుడుకు, తందనాలకు ఉద్దేశింపబడలేదు. ఇవి పవిత్రమైన రోజులు. అంతరపరీక్షకు, ఇతోధిక సేవాప్రతిజ్ఞకు వీనిని ఉపయోగించుకోవలెను. భారతంలో గాని, బాహ్యప్రపంచలో గాని ఉండే క్రైస్తవులందఱకు గాంధీజీ అభినందనాలు అర్పించెను. క్రైస్తు బోధనలను వారు తమ జీవితములలో ఋజువు పఱచెదరుగాక యని ఆయన ఆశ. క్రైస్తవులు అల్పసంఖ్యాకులు. హిందూ, ముస్లిం, సిక్కులకు

వారియెడల విరోధము తగదు. ఇతరమతానికి మార్చుదామని కూడా ఆలోచన చేయరాదు. ఈలాంటి మతం మార్పులు గాంధీజీకి ఇష్టములేదు. ఏమతస్థుడు ఆమతములో శ్రేష్ఠుడుగా ఉండుటే నిజమైన మతంమార్పిడి.

ఇప్పుడు క్రైస్తవమతానికి గాని ఏ ఇతరమతానికి గాని భారతరాజ్యాదరణ ఉండదు. కాన క్రైస్తవుల చర్చీలు మునుపటిక వంతు ఘూయబడునని వార్తాపత్రికల ఊహ. కాని డబ్బుద్వారా మతమును ఉద్ధరించలేము. ఆ కృత్రిమమైన తోడ్పాటు పోయినందుకు క్రైస్తవులు సంతోషించవలెను. మన దేహములే నిజమైన దేవాలయములు. సమష్టిప్రార్థనకు ఆరుబయటే మంచిస్థలము. భూమి సింహాసనం, నభంబు గొడుగు. ప్రతివ్యక్తి తన మతాన్ని తానే కాపాడుకొనవలెను.

## 104

25-12-47

### కాశ్మీర్ సమస్య

కాశ్మీర్ సమస్యమీద పంచాయతీ జరుగుతుందని పత్రికలలో ఒక వార్త పడింది. ఈ తగువుల ఫైసలాకు ఈ రెండు రాజ్యాలు మూడోవారిమీద ఆధారపడవలసిందేనా? ఇంకెన్నాళ్ల దాకా ఈ పోరాటం ?

కాశ్మీర్ పంపిణీనిగూర్చి కొన్ని వదంతులు ఉన్నవి. అది యొక వైపరీత్యము. ఒక పంపిణీ జరిగింది చాలదా ? దైవము ఏకదేశంగా ఉద్దేశించిన దానిని మనుష్యులు పంచటం అసాధ్య

మనుకున్నాము. కాని ఎవరి కారణాలచోప్పున వారు కాంగ్రెసు, లీగు పంపిణీకి ఒప్పుకున్నారు. కాశ్మీర్‌ను పంచితే, ఇతర సంస్థానాలు పంచవద్దా ? దీనికి అంత మెక్కడ ?

కొండజాతులు వచ్చి కాశ్మీర్‌ను ముట్టడించారని ఆదిలో అన్నారు. కాని కాలక్రమాన అది పాకిస్థాన్ పన్నాగమే నని స్పష్టమైంది. ఇపుడు భారతంమీాద మత యుద్ధానికి దిగవలసిందని, "జమీాందా" రనే పత్రికలోనున్నది. ఖిలాపత్ రోజులలో మౌలానా జఫరాలీఖాన్‌ను గాంధీజీ ఎరిగియుండెను. ఆ రోజులలో కూడ అతని నోటిమీాద అతనికే స్వాధీనత లేకుండెను. ఇపుడతని కలానికిగాని, నాలుకకుగాని హద్దూ పద్దూ కనపడదు. హిందువులు, ముస్లిములు, సిక్కులు కలకాలం శత్రువులై యుండవలెనని అతని యుద్దేశమా ? కోపకారణం ఏదైనా, ఎంతైనా హిందువులు, సిక్కులు ప్రతీకారానికి దిగరాదని గాంధీజీసలహా.

కాశ్మీర్ ప్రజలు, కాశ్మీర్ మహారాజు, కాశ్మీర్ నిజమైన అధిపతి యగు అబ్దుల్లా, ముగ్గురి పిలుపుమీాద భారత సేనలు అక్కడికి పోయినవి. ఈ రోజులలో ఇండియా సంస్థానాధిపతులు ఆంగ్లరాజు వలె నామమాత్రపు రాజులే.

## జమ్మూ సంఘటన

జమ్మూలో లెక్కలేనంతమంది ముస్లిములను చంపారట. ముస్లింస్త్రీల నపహరించారట. డోగ్రాసేనను తనక్రింద పెట్టుకొనిన మహారాజు వీటికి బాధ్యత వహించవలెను. షేకు అబ్దుల్లా జమ్మూ పోయి శాంతి నిలుప ప్రయత్నించాడట. అబ్దుల్లాకు

పూర్ణావకాశ మిచ్చివేసి మంత్రిసమేతంగా మహారాజు వైదొల గవలెను. అది ఆయన గౌరవాన్ని పెంచుతుంది.

## పాకిస్థాన్ గర్వం

ప్రపంచ ముస్లిం రాజ్యాలలో కెల్ల తానే పెద్దదాన నని పాకిస్థాన్ గర్వం. అచ్చట ప్రజలలో ప్రతి ఒక్కరికి న్యాయము కలిగించలేకపోతే, వారి గర్వభంగ మౌతుంది.

పాకిస్థాన్ యోగ్యమైన రాజ్యం కావాలంటే, ఈ రెండు రాజ్యాల ప్రతినిధులు ఒకచోట కూర్చొని, కాశ్మీర్ సమస్యను పరిష్కరించుకో వలెను. వారిలోనే మంచి పంచాయతీదార్లు లేరా ? చేసిన దురాగతాలను ఒప్పుకొని, పశ్చాత్తాపం చూపితే పాపపరిహార మగును. పరస్పర గౌరవం, నమ్మకం కలుగును. కాంగ్రెసు ప్రభుత్వము, ప్రజలకు వ్యతిరేకము గాను, సంస్థానాధి పతులకు అనుకూలంగాను, ఎన్నడు నుండజనదు. ప్రజల భాగ్య మునకు ధర్మకర్తలు గనే సంస్థానాధిపతులు గణింపబడుదురు.

## గజనవీని మరల పిలిపించుట

భారతంలోని ఒక ఉర్దూ పత్రిక జునగడ్ ముస్లింల దుఃఖాలు పోగొట్టే గజనవీరావలె నని సూచించింది. గాంధీజీకి ఆ సలహా చాల నొప్పి కలిగించింది. భారత యూనియన్‌లో ముస్లిం అనుకోదగిన వ్యక్తి అలాటిభావాలు మనసులో పెట్టుకో గలడా ? సోమనాథ దేవాలయమును పునరుద్ధరించుట కతడు సగర్వముగ పూనుకోదగును. గజనవీ చేసిన పనులను నిజమగు ముస్లిం లెవరూ సమర్థించరు. భారతంలోని ముస్లిముల క్షేమ

మును కాపాడుటకు ప్రాణమునిత్తునని గాంధీజీ ప్రతిజ్ఞచేసినాడు. ఈ ప్రతిజ్ఞకు తిరుగులేదు. చెడుగుకు మంచి చేయుటే గాంధీజీ మతం. హిందువులు, సిక్కులు ఉద్రేకమునకు లొంగరాదు. సంధి ప్రయత్నములను మరింత కష్టతరము చేయవద్దని గాంధీజీ ముస్లింమిత్రు లను కోరెను.

## 105

26-12-47

### వేరొకచోట ప్రార్థన

ఢిల్లీనుండి 11 మైళ్ళ దూరానయుండే ఒక గ్రామములో పంచాయతీ ఏర్పడినది కనుక, మరునాటి ప్రార్థనలు అక్కడ జరుగు నని గాంధీజీ ప్రకటించెను.

### టిబియా కళాశాల

కీ॥ శే॥ హకీం అజ్మల్ ఖాన్ టిబియా కళాశాలను స్థాపించెను. రాజులు, నవాబులు, ప్రజలెల్లరు చందాలనిచ్చిరి. అచ్చట ఆయుర్వేదం, యునాని, పాశ్చాత్యవైద్యములలో అన్నిమతాల విద్యార్థులు తయా రగుచున్నారు. నే డచ్చట ఒక్క విద్యార్థి లేడు. అది యున్న కరోల్ బాగ్ లోనికి ప్రాణభయం లేకుండా ఏ ముస్లిం వెళ్ళజాలడు. ఈ స్థితి గాంధీజీకి సిగ్గును, దుఃఖమును కలిగించెను. పరాయివాళ్ళ నాశనానికి ప్రయత్నించు వానికి, స్వనాశనం తప్పదు. ప్రకృతి శాసన మదియె. స్వనాశనమునకై ప్రయత్నం చేయవద్దని హిందూ—సిక్కులను ఆయన మందలించెను.

## అపహరింపబడ్డ స్త్రీలు

వేలకొలది హిందూ, సిక్కు బాలికలను ముస్లింలు తీసికొని పోయిరి. అందులో కొద్దిమంది చిరునామాలే తెలుసును. తక్కినవారి సంగతి తెలియదు. తిరిగి రాదలచుకోలేదని కొందఱు స్త్రీలు చెప్పినారట. తమ తమ సంఘాలు ఆదరించరని వారి భయం కావచ్చును. భర్తలు, తండ్రులు, స్నేహితులు, అవమానింతురని వారికి భీతికలుగును. వారి సంఘములు వారికి ప్రేమ పూర్వకముగా స్వాగత మివ్వాలని గాంధీజీ గట్టిగా బోధించెను. వారిలో కొందరు గర్భవతులట. పుట్టే బిడ్డలనుకూడా ఆదరించ వలసినదే. తల్లుల మతములనే వారు అనుసరింతురు. పెద్దయైన తరువాత వారియిష్టము వారిది. ఘోరరక్కసుల కామోద్రేకానికి గురియైన ఈకన్యలను ఖండించుట పైశాచికకృత్య మగును.

కాశ్మీర్, పాటియాల, తదితరచోట్లను, కొందఱు ముస్లిం కన్యలను హిందువులు, సిక్కులు ఎత్తుకుపోయారట. అందులో కొందరు బాలికలు ప్రఖ్యాతవంశీయులట. అట్టివారిని వెంటనే విడుదలచేయవలెననియు, విడుదల అయినవారిని సంఘం ఆదరించ వలెననియు, గాంధీజీ ఎన్నోసార్లు గట్టిసలహా ఇచ్చెను.

## బేరంలేదు

ఒక ముస్లిం పీరువద్ద హిందూ, సిక్కుస్త్రీలు ఉన్నారట. ఎత్తుకుపోబడ్డ ముస్లిం స్త్రీలను విడుదలచేసిన తరువాతనే తమ వద్దనున్న వారిని వదలునని ఆపీరు చెప్పాడట. ఈలాటి విషయా

లలో బేరంచేయుట తగునా? ఉభయకక్షులు శక్తికొలది కృషిచేసి ఇలాంటి స్త్రీలను విడిపించవలెను. ఎదుటిపక్షం చేసేపనిని వీరు లెక్కచేయరాదు. లేనిచో మనది నలభై కోట్ల గుండాలజాతి యగును. గుండాల శాసన ప్రకారమే ఈసమాజయోగ్యత నిర్ణయించబడుతుంది.

# 106

27-12-47

## త్రికరణ శుద్ధి

పంచాయతీ గృహంకట్టిన సమ్మల్కా గ్రామములో శనివారము ప్రార్థనలు జరిగెను. అచ్చట గాంధీజీకి దండలు వేసిరి. సన్మానపత్రము నిచ్చిరి. ప్రార్థనలకై చేయబడిన ఇలాంటి సమావేశాలలో దండలకు, సన్మానపత్రాలకు కేకలకు చోటులేదు. అవి లేకున్న బాగుండేది. సన్మానపత్రములో పలుకరించిన సత్యాహింసలను వారాచరణములో పెట్టనిచో, వాటినిగూర్చి మాట్లాడరాదు. ఊరక ఉదహరించుటచే, ఉపద్రవముకూడా కలుగును. దక్షిణాఫ్రికానుండి ఈదేశము వచ్చినపిమ్మట గాంధీజీ వేలకొలది గ్రామాలను చూచెను. ఎవరో ఒకరు సన్మానపత్రం వ్రాసేవారు, ఇంకెవరో చిలుకపలుకువలె చదివేవారు. అంతటితో సరి. మనోవాక్కాయకర్మలయందు సంశుద్ధియుండవలెను. అల్పసంఖ్యాకులను వెళ్ళగొట్టడం, లేక నిరాదరణచేయడం, అహింసకు సరిపడదు. స్వాతంత్ర్యం అంటె, చెడుపనులు చేయుటకు స్వేచ్ఛగాదు. హత్యలు చేయుటకు, అబద్ధాలాడుటకు స్వేచ్ఛకావలెనని భగ

వంతుని వేడుకొనవచ్చునా ? వాటికై కృషిచేయవచ్చునా? అలా చేస్తే, దేవునిగాక సైతాను శరణుజొచ్చిన ట్లగును.

## పంచాయత్ కర్తవ్యం

ఈగృహ నిర్మాణమునకు వారిని గాంధీజీ అభినందించెను. పంచాయతీ పనిచేయకపోతే, దీని నిర్మాణంక్రింద వ్యయపడిన కాలం, కష్టం, కనకం వృథా అయినట్లే. పూర్వకాలము చైనా మొదలగు దేశాలనుండి ఇండియాకు వచ్చిన యాత్రికులు ప్రయాణపు కష్టాలు సరకుగొనక జ్ఞానసముపార్జనకై వచ్చిరి. "దొంగతనాలు లేవు. తలుపులకు తాళాలు లేవు. ప్రజ, న్యాయ శీలురు, కాయకష్ట నిష్ఠాపరులు" అని ఆప్రయాణీకులు తెల్పిరి. ఈపంచాయతీ కూడా న్యాయశీలమును, కాయకష్టనిష్ఠను పున రుద్ధరించవలెను. ఈ పంచాయతీయే ఇపుడున్న దావాలు పరిష్క రించవలెను. క్రొత్త తగవులు రాకుండా బోధించవలెను. దమ్మిడీ ఖర్చులేకుండా తక్షణం న్యాయం పొందేమార్గం అది. అపుడ సేన, పోలీసు అక్కరలేదు.

## పశువృద్ధి

పశుపోషణ వృద్ధిచేయుటగూడ పంచాయతీ పనియే. పాల వృద్ధికావలెను. గోహత్యకు ముస్లింల నిందించుట వట్టి మూర్ఖత వాటిని సరిగా పోషింపని హిందువులే, క్రమేపి వాటిని చంప చున్నారు. ఒకేదఫా చంపుటకన్న వేధించి వేధించి చంపు మహాపాపము.

## భూసారమును పెంపొందించవలెను

అధికాహారోత్పత్తి కూడ పంచాయతీ పనే. మంచి ఎరువు వేసిన-చో పంట పెరుగుతుంది. ఈమధ్య ఢిల్లీలో మీరాబెన్ పెట్టించిన కంపోస్టు మహాసభ మనుజుల, పశువుల, మలమూత్రములను తుక్కు-తో కలిపి ఎరువు చేయుపంథా ఋజువుచేసింది. ఆగ్రామము, ఆప్రజ, దేహంలో, మనస్సులో పరిశుభ్రంగా ఆరోగ్యంతో ఉండవలెను.

## ఆదర్శగ్రామం చెయ్యండి

మీకు సినిమా ఉండరాదు. ఇప్పుడు అది ప్రబోధకారి గాక, హానిచేయుచున్నది. దేశవాళీ ఆట పాటలు ఉన్నవి. మత్తుకలిగించే పదార్థములను వదలవలెను. అస్పృశ్యతను పూర్తిగ నివారించవలెను. అన్ని మతములవారు సోదర సోదరీలవలె వర్తించవలెను. అప్పుడే మీది ఆదర్శగ్రామం అవుతుంది. దానిని చూచుటకు అన్ని-చోట్లనుండి జనంవత్తురు. దైవం మీకు విజయము కూర్చుగాక.

# 107

28_12_47

## ఆరుబైట సభలు

హార్డింజీ గ్రంథాలయంలో ఢిల్లీ వ్యాపారస్తుల సభకు గాంధీజీవెళ్ళెను. భవనముబయట పెద్ద జనసమూహాము చేరింది. ఆ చిన్నభవనం చాలలేదు. ప్రముఖుడెవడైన ఉపన్యసించినపుడు

పెద్దమైదానములో ఆరుబైట సభలుచేస్తే అందరు రావచ్చును. సుఖముగా కూర్చుండవచ్చును. గందరగోళము లేకుండా విడిపోవచ్చును. అలా అలవాటైతే, ఇళ్ళు లేని కొఱత తీరుతుంది. ఎక్కువకాలం బయట తిరుగవచ్చు, లేదా పూరిగుడిసెలు వేసుకోవచ్చును.

## కంట్రోళ్ళ రద్దు

ప్రతిరోజు అభినందించుచూ తంతెలు, జాబులు వస్తున్నవి. అద్భుతమైన ఫలితము కలిగింది. ధరలు తగ్గినవి. బట్టల కంట్రోలు రద్దుకాకపోయినా, తువాళ్ళధర తగ్గినది. కంట్రోళ్లు వద్దో యని మొరపెట్టే లక్షలకొలది జనము యొక్క భావాన్నే గాంధీజీ ప్రకటించారు. ఈ రద్దువలన ప్రజలకు ఎంతో మేలు కలిగినది. వీటి తొలగించిన మర్యాద తనది గాదు. ప్రజా కోరికనే తాను వ్యక్తపరచెను కనుక జనసామాన్యానికే అది చెందవలెను. నా స్వంత మాటకు పలుకుబడి యుంటే, సాంఘిక కలతలు ఎప్పుడో పోవలసింది. ఆ విషయంలో నన్నొక పిచ్చివాని క్రింద కట్టారు. అయినా వారి-భావం తప్పు. నాది ఒప్పు. అనేక సార్లు నా భావము ఒప్పై యుంటే, ఇప్పుడీ చావు బ్రతుకుల సమస్యపై అది ఎట్లు తప్పగును ? దయ, దాక్షిణ్యాము, క్షమా గుణము మతసార మని శ్రీ తులసీదాసు చెప్పినదే. ఆచరణలో పెట్టుడనియే ఇప్పుడు గాంధీజీ చెప్పుచున్న మాట.

బట్టమీాద, కట్టెలమీాద, పెట్రోలు మీాద ఉండే కంట్రోలు వెంటనే పోవలెను. కావలసిన దానికంటె కట్టెలను

ఎన్నడూ ఎవరూ ఎక్కువగా వాడరు. పెట్రోలు మీద కంట్రోలు వలన చిక్కు కలుగుచున్నది. రవాణా సౌకర్యానికి ఆటంకం కలుగుచున్నది. రైల్వే ఈసౌకర్యం కలిగించలేకున్నది. క్రొత్త రైళ్ళు వేస్తే చాలాకాలం పట్టుతుంది. క్రొత్త రైళ్ళు అక్కరలేదుకూడా. ఉప్పు పన్ను పోయినా, ఉప్పు ప్రియమైంది. రవాణా చిక్కులవల్లను కంట్రాక్టులలో ఉండే అన్యాయం వల్లను అలా జరిగింది. కొద్దిమంది కంట్రాక్టర్లు జనసామాన్యాన్ని అణచి వేసి బలిసిపోవుచున్నారు. ఈ చెడుగును తొలగించ వలెను. వీలైనన్నిచోట్ల ఉప్పు చేసుకొను విధానము ప్రజకు బోధించవల యును. ఇప్పుడు ఉప్పు ఉత్పత్తికి స్వేచ్ఛ యున్నది కనుక అదే మంచి పద్ధతి.

# 108

29-12-47

## హకీం సాహేబు స్మారకచిహ్నం

నిన్న అజ్మాల్ ఖాన్ వర్ధంతి. భారతంలోని అన్ని మతావలంబులకు ప్రియుడతడు. నిష్ఠాపరుడైన ముస్లిం. అందరికి సమానముగా సేవ చేసెను. టిబియా కళాశాల, ఆస్పత్రి, ఆయ నకు శ్రేష్ఠమైన స్మారకచిహ్నాలు. ఇప్పుడుండే సాంఘిక ఉన్మత్తత కు ఈసార్వజనిక సేవకూడా ఆపబడినది. దీని స్థాపకుడు ముస్లిం గాంధీజీయే కారణమా? ఆయనను గూర్చిన మధుర స్మృతి ఆ చిన్నభ హిందూ ముస్లిం హత్యలను మాన్పలేక పోయినను,

కళాశాల కార్యమైనను నిర్విఘ్నముగా జరుగుటకు తోడ్పడును గాక !

## ఆరుబయట సభలు

ఆరుబయటి సభలు మామూలు కావలయు నంటే, చక్కగా యోచించి పంథా వేయవలెను. పెద్ద చిన్న నగరాలలో అందుకై బహిరంగ చతుశ్శాలలు ఉండవలెను. అల్లరి కేకలు, గందరగోళం పోవలెను. తప్పనిసరి అయినప్పుడే, హీన స్వరమున తమలో తాము మాటలాడుకొనవచ్చును. ఇతరుల హక్కుల నపహరింపకుండా, పొరుగువారి హక్కు బాధ్యతల గమనించి, మన ప్రవర్తనను సరిదిద్దుకోవలెను. ఇప్పుడు ఢిల్లీలో వ్యాపార సమ్మర్దముగల ప్రదేశములో నుండే అవమానకరమైన చప్పుళ్ళు, దుమ్ము అప్పుడు ఉండనేరదు. ఒండొరులను నెట్టుకోకుండా, ముఠాలు ముఠాలుగ బయలుదేరిపోవుటకు వీలుండును. ఇది అసాధ్యము గాదు. ఈ నియమముక్రింద ఎంతో కాలము, శక్తి, డబ్బు వృథా గాక మిగులును.

## మరల కాశ్మీరు

కాశ్మీరును గూర్చి నే చెప్పిన సంగతులను కొందరు విమర్శించుచున్నారు. కాని నేను సలహా మాత్రమే ఇచ్చాను. ఎంత తక్కువ వాడైనా అలా సలహా ఇవ్వరాదా ? ఆ సలహా కర్తవ్యంగా తోచి ఇవ్వబడ్డది. ఆ మహారాజు దానిని అంగీకరిస్తే ఆయన గౌరవము పెరుగుతుంది. ఆయన హిందువు. ఆయన ప్రజ అధికసంఖ్యాకులు ముస్లింలు. ఆయన దుష్పరిపాలన నుండి

ముస్లింలను కాపాడుటకు "మత యుద్ధం" పేర ఈ దాడి సలుప బడుచున్నది. హిందూముస్లింలకు సమాధానము కుదుర్చుటకై షేకు అబ్దుల్లా చేసే ప్రయత్నం నెగ్గనిచో, కాశ్మీరు శత్రువుల స్వాధీన మౌతుంది. అట్టి స్థితిలో మహారాజాక్రింద యుండేసేనను అధికారమును, ఇంగ్లండు రాజువలె, మంత్రివర్గ సలహాకులోబడి ఉపయోగించవలె నని నేనంటిని. లోగడ వ్రాసుకున్న ఖరారు లకు దీని వలన ఏమీ భంగం రాదు. నేను సామాన్య వ్యక్తిగా ఆ హిందూ మహారాజుకు సలహా చెప్పేను. హిందూ మతాన్ని గూర్చి, హిందూ రాజులనుగూర్చి, నా భావాలలో పొరపాటు ఉంటే వాటిని త్రోసివేయవచ్చును. అలాగే ఎవరు తప్పు చేస్తే వారు పోవలసిందే. కాశ్మీర్‌లోని హిందూ ముస్లిం మతములకు అగ్నిపరీక్ష వచ్చినది. అది సరిగా బయట పడితే ఉభయులకు కీర్తి వస్తుంది. మింటపెట్టిన దీపంవలె కాశ్మీర్ యావద్భారతానికి వెలుగు నిస్తుందని నా ఆశ. నిష్పక్షపాతులగు భారతీయుల సహా యముతో, ఈ రెండురాజ్యాలు తమ తగువులను పరిష్కరించు కోరాదా? నిష్పక్షపాతమైన బుద్ధి భారతదేశం నుంచి వెడలిపో యిందా ఏమి?

## ఒక రశీదు

శరణార్థుల గొంగళ్ళకై మధురనుంచి ఒక సోదరి 50 రూపాయిలు పంపింది. పేరు తెల్పలేదు. ఆ మొత్తం ముట్టినట్లు ఈ ప్రార్థనసభలో ప్రకటిస్తే చాలునన్నది. కృతజ్ఞతతో అలాగే చేస్తున్నాను.

## వింతయైన ఖండన

భారత సమ్మేళనంలో చేర దలచుకొన్న సంస్థానాధిపతుల చర్యలను ఖండిస్తూ అచటి రైతులు నాకు తంతెలు పంపుచున్నారు. ఇది వింతగానున్నది. ఆ సంస్థానాధిపతి ఒంటరిగా నుండ లేనంటే, వానిని అలాగే చేయమని ఎవరు నిర్బంధించగలరు? టెలిగ్రాములకై డబ్బు పాడుచేయువారిని అలా చేయవద్దని నా సలహా. ఈ తంతెలు పంపే వారిలో ఏదో ధోష మున్నది. దేశ వ్యవహారమంత్రినుండి వారు సలహా తీసికొందురు గాక!

## భారతసమ్మేళన ముస్లిములకు సలహా

అనేకమంది ముస్లింలు, ముఖ్యంగా తంతె రయిల్వేశాఖలలో నుండువారు ప్రచారము నిమిత్తము పాకిస్థాన్ పోతామని మొదట్లో చెప్పిరి. ఇప్పుడు మనస్సు మార్చుకుని ఇక్కడే ఉంటామంటున్నారు. ఇందులో కొందరిని బర్తరఫ్ చేశారు. దానికి తగిన కారణాలు ఉండవచ్చు. వారందరు తిరిగి ఉద్యోగాలు కోరుచున్నారు. సర్కారు వివిధ శాఖలలో కొద్దిమందికే తావు ఉంటుంది. సర్కారు నౌకరీ సంపాదించుటే, జీవిత పరమోద్దేశ్యము కారాదు. న్యాయమైన జీవితమే యోగ్యమైన ఆదర్శం. ఇప్పుడు పెచ్చుపెరిగి యున్న సాంఘిక దురభిమానాలు అణిగే వరకు ముస్లింలు సర్కారు నౌకరీలు కోరకుండుట అవసరము, భావ్యము. విశుద్ధ సేవవల్లనే అధికారం ప్రాప్తమౌతుంది. అధికారపీఠం ఆ అధికారిని తఱచుగా పతనం చేస్తుంది. నిరుద్యోగు

లైన ప్రతి స్త్రీకి, ప్రతి పురుషునకు తిండికోసం కాయకష్టము చూపుట సర్కారు విధియైయున్నది. నిశ్చయము. ఉద్యోగము కోరే వాళ్ళు శరీరార్హత గలిగి, వంచకులు గాక, మంచికార్య కర్తలే యైతే, అలాటి ఏర్పాటు చేయుటవలన రాజ్యాంగానికి లాభమే, నష్టము గాదు.

# 109

30-12-47

## సమిష్టి క్రమశిక్షణ

ప్రార్థనానంతరం తనచుట్టు గుమిగూడి తన సాయంత్రపు నడక శాంతముగా జరుగకుండా, ఇబ్బంది కలిగించుచున్నా రని గాంధీజీ వారిని మందలించెను. గొప్పజాతి కాగోరువారు సమిష్టి క్రమశిక్షణ నేర్చుకోవలెను. అందరు సైనిక క్రమశిక్షణ లోని ప్రాశస్త్యమును నేర్చుకొనుట అవసరము.

## బహవల్‌పూర్‌లో హిందువులు-సిక్కులు

గాంధీజీ ఇదివరకు చెప్పిన సంగతిని మరల ధృవపఱచమని కోరుచు ఒకరు అడిగిరి. ఆ సంస్థానము నుండి వెళ్ళిపో దలచిన హిందూ, సిక్కు, ముస్లిమేతరులు ఎవరికైనా స్వేచ్ఛగా అనుమతి ఇవ్వవలసిందే. ముస్లిం, ముస్లిమేతర పౌరులమధ్య భేదము చూపకుండా, అందరిని సమానముగా గౌరవిస్తున్నా నని ఆ నవాబుసాహేబు చేసిన ప్రకటన గాంధీజీకి తృప్తికొల్పింది. వారలకు సురక్షితమైన ప్రయాణ సౌకర్యము, ఆ నవాబు కలిగించ

వలెను. జరిగిం దేమో జరిగిపోయింది. ఇప్పుడు ఈ నవాబు సాహెబు ఇంతమాత్రము చేస్తే, అందరి అభినందనాలు ఆయన పొందుతారు.

## సింధులో ముస్లిమేతరులు

బహావల్‌పూరుకు చెప్పబడిన నియమాలే, సింధుకుకూడ వర్తించును. ఇపుడు హిందువుగాని, మరి ముస్లిమేతరుడు ఎవడు గాని, సింధులో సురక్షితముగా నుండజాలడు. విద్యాసంస్థలను కూడా శరణార్థులకై ఖాళీచేయిస్తున్నారు. ఘరానా మనుష్యుల ఇండ్లనుకూడా ఖాళీ చేయమంటున్నారు. నిమ్నజాతులను సింధు వదలి పోనిచ్చుట లేదు. జిన్నా, సింధు ప్రధానమంత్రి, ఆయన మంత్రివర్గము, ఈ స్థితిగతులను సవరించవలెను. సింధు వదలి వెళ్ళదలంచినవారి నందరిని హాయిగా వదలివేయ వలెను. అలా చేస్తే, అల్పసంఖ్యాకులకు ఆ సర్కార్ యందు విశ్వాసము ఏర్పడుతుంది. నిర్బంధము వలన వ్యతిరేక ఫలితము కలుగుతుంది. ముస్లిమేతరులు స్వతంత్ర పౌరులుగా గాక, బానిసలు గానే పాకిస్థాన్‌లో ఉండవచ్చు నంటే, అది దానికి గౌరవము కాదు.

## విఠోబా దేవాలయము

మహారాష్ట్ర దేశంలో పంఢర్‌పూర్‌లో నుండే విఠోబా దేవాలయము లోనికి హరిజన ప్రవేశం ఇచ్చుటకు ధర్మకర్తలు తీర్మానించారట. కాని అచటి పూజారులు దానికి వ్యతిరేకించి, నిరసనదీక్ష మొదలుపెట్టారట. ఇది సవ్యమైన వైఖరి కాదనియు

హిందువులకు తగని పని యనియు, గాంధీజీ ఖండించెను. ఇది అత్యంత పవిత్రమైన దేవాలయము. ధర్మకర్తలు దీర్ఘముగా యోజించి, ఈ తీర్మానము చేసినపుడు, ఎవరూ వ్యతిరేకముగా లేరు. ఇపుడు పూజారులు చేసేపని హిందూమతమునకు అపచారము. సర్వవ్యాపి ఆయిన విష్ణుని మందిరములో పవిత్రులకు, అపవిత్రులకు కూడా తావుంది. హరిజనులు అపవిత్రు లనుట దైవద్రోహము. ఒక హిందువునైనా సరే, ఆ దేవళములోనికి రానీయకపోతే, అది ప్రాణం లేని ప్రతిష్ఠ. నిజమైన ప్రాణప్రతిష్ఠ అందరు అందులో ప్రవేశించినపుడే జరుగుతుంది. ఇప్పటి నిరసన వ్రతము పాపకార్యం. తమ తప్పును తెలుసుకొని ఆపూజారులు దాన్ని వదలివేయవలెను.

## బొంబాయిలో రేషనింగ్

అక్కడ అమలులోనున్న ఒక్క ఉత్తరవునుబట్టి ఒక్కొక్కరికి వారానికి ఒక పౌను బియ్యమే వస్తుందట. దీని వలన అచ్చట నుండే మద్రాసీలకు, మహారాష్ట్రులకు చాలా ఇబ్బంది కలుగుచున్నది. బైటనుంచి తెప్పించుకొంటే, జరిమానాలు శిక్షలు వేస్తున్నారట. నగరాలలోని రేషనింగ్, ఆహారకంట్రోల్ వెంటనే రద్దుచేయవలెనని గాంధీజీ అభిప్రాయము. అలా చేస్తే సరుకు దొరకుతుంది; ధరలు తగ్గుతవి; అపుడు చీకటి బజారులు అదృశ్య మౌతవి.

## 110

31-12-47

### హృదయపరివర్తన లేనిదే తిరిగి పోవుట ఉండదు

కొంతమంది ముస్లిం స్నేహితులు సూచించి నప్పటికిన్నీ, శరణార్థులు ఇప్పుడిప్పుడే పశ్చిమపంజాబుకు తిరిగి పోవచ్చునని గాంధీజీ సలహా ఇవ్వజాలకున్నారు. సింధులో వేలకొలది జనం బయటికి రాదలచి వేచిఉన్నారు. చిత్రాలలోను ఆ చుట్టుప్రక్కలను 251 మంది అలాగే వేచి ఉన్నారు. రాదలచుకొన్న వారికి తగు సౌకర్యాలు కల్పించే వరకు భారత ప్రభుత్వం విశ్రమింపజాలదు. హృదయపరివర్తన లేనిదే శరణార్థులు స్వస్థలమునకు తిరిగి పోవుట అసంభవం. ఈ రెండు రాజ్యాలలో క్రొత్తగా మార్పు వస్తేనే తప్ప, రెండింటికి పతనం తప్పదు.

### శరణార్థులు స్వస్థలాలకు చేరితేనే నిజమైన శాంతి

శరణార్థులు తిరిగి రాకుంటే, నిజమైన శాంతి లేదు. ఖాయంగా జనాభా మార్పిళ్ళు చేయుటకు గాంధీజీ ఇష్టపడరు. క్రొత్తచోట్ల సుఖంగా కాలం గడుస్తున్నా, పాతచోట్ల మీద మక్కువపోదు. స్వస్థానాలకు శరణార్థులు పోనంతవరకు, శాశ్వత శాంతి సాధ్యమని గాంధీజీ ఎంచరు.

### శరణార్థులు - న్యాయమైన కాయకష్టము

బిచ్చగాళ్ళుగా మారకుండా ఉండాలంటే, తగిన పని శరణార్థులకు చూపాలని ఒకరు చేసిన సూచనతో గాంధీజీ ఏకీభవిం

చారు. శరణార్థులందరు అలాకోరితే, ఆయన సంతోషించెదరు. సర్కారుకూడా అదే కోరుతారు. ఇప్పుడు శరణార్థులకు అన్న వస్త్రములు ఇచ్చుటలో ఖర్చు అయ్యే కోట్లకొలది ద్రవ్యము మిగులుతుంది. శరణార్థులు న్యాయమైన కాయకష్టమునకు పూనుకుంటే, ఇప్పటి గందరగోళ పరిస్థితులలో మంచి మార్పు వస్తుంది. పట్టపగలు తాళం పగులగొట్టి ఒక సోదరి ఇల్లును సిక్కులు ఆక్రమించారట. అట్టి నేరస్థులలో ఒకడు తప్ప తక్కిన వారు ఖైదు చేయబడ్డారు. నుదుట చెమటపట్టే కాయకష్టము చేసి, బ్రతుకం డని శరణార్థులకు గాంధీజీ సలహాచెప్పెను. కొద్ది పాటి అసౌకర్యం ఉన్నా, దానివలన మేలు మర్యాద కలుగుతవి.

## యావత్తు ప్రార్థనను రేడియోద్వారా వినిపించుట

ప్రార్థనానంతర ఉపన్యాసమే గాక, భజనలు కీర్తనలు అన్నీ కూడా రేడియో ద్వారా ప్రచారమగుట ప్రజలకు మేలని ఒకరు సూచించారు. అది సాధ్యమైతే గాంధీజీ సంతోషిస్తారు. సినీమా పాటలవలె బాగుండకపోయినా, ప్రార్థనా భావము కల వారు పాడుతారు గాన, ఇవి కూడా మనోరంజకంగానే ఉంటవి. ఆయనచేసే సంభాషణను ప్రార్థనలో ఒక భాగంగా భావించవలె నని గాంధీజీ కోరును.

## అతిశయోక్తివల్ల అసలు ఉద్దేశ్యం అణగారుతుంది

అజిమీరు, జునగడ్‌ల నుంచి వచ్చిన అతిశయోక్తులను గూర్చి గాంధీజీ మాట్లాడెను. అజ్మీర్‌లోకూడా హత్యలు వగై

రాలు ఉన్నవి కాని, ఆ దర్గా షరీఫ్ క్షేమముగా ఉంది. దానికి హాని కలుగలేదు. అతిశయోక్తివల్ల అసలు ఉద్దేశ్యము చెడిపోతుంది. ఉద్యమానికి నష్టం, ముందు ఏర్పడబోయే సఖ్యతకు ఆటంకం కలుగుతవి.

# 111

1-1-48

## ఆధ్యాత్మిక ఆహారము

ఆనాడు ఆంగ్లసంవత్సరాది. సభ చాలాపెద్దది. స్త్రీలకు తగిన ఏర్పాట్లు చేయుటలో ఏడు నిముషాలు వృధా అయినవి. ఒక్క సభలో ఒక్క నిముషం పోతే, జాతి కంతకు అనేక నిముషాలు నష్టమైపోతుంది. స్త్రీలకు చోటుంచి, పురుషులు కూర్చోవాలి. స్త్రీలను గౌరవింపని దేశం లేక సంఘం, నాగరిక మనే పేరు పొందజాలదు. మనము స్వతంత్రదేశ పౌరులుగా వర్తించవలెను. ప్రార్థనభావం కల జనం ఎక్కువగా రావలెనని గాంధీజీ ఆశించెను. ఆత్మకు ఆహారం ప్రార్థనయే. ఇక్కడ నిశ్శబ్దంగా ఉండడమే కాక, ఇంటికికూడా శాంతిని తీసుకుపోవలెను.

## హరిజనులు - మద్యం

యు. పి. లో జరిగిన హరిజన సభలో మురికి గుడ్డలును, మద్యమును హరిజనులు వదలిపెట్టవలె నని ఒక మంత్రి సలహా చెప్పెనట. సర్కారు తాటి, ఈతచెట్లను కొట్టివేసి కల్లు, సారా దుకాణాలు మూస్తే ఆ సర్కారే మురికిగుడ్డలను కాల్చవచ్చు నని ఒక హరిజనుడు ధైర్యంతో జవాబుచెప్పెనట. ఆ హరిజన

సోదరుని ధైర్యమును గాంధీజీ మెచ్చుకొనెను. దీనికి తగిన మందు ప్రజల చేతిలోనే ఉన్నదని ఆయన చెప్పెను. మద్యము అమ్ముతున్నా, విషంవలె చూచి ఆ మద్యం కొనరాదు. విషం కంటె హీనమైనది ఈ మద్యం. విషం దేహాన్ని చంపుతుంది; మద్యం ఆత్మజ్ఞానాన్ని నశింప జేస్తుంది; ఇంద్రియ నిగ్రహ మనే సద్గుణ రత్నాన్ని చంపివేస్తుంది. మద్యం దుకాణాలను పరిశుభ్రమైన ఫలహారదుకాణాలుగా మార్చవచ్చును. ఆటలు, పాటలు పురాణాలు పెట్టవచ్చును. అన్ని దేశాల అనుభవమూ గాంధీజీ స్వంత అనుభవం ఏమనగా, ఈ మత్తు పదార్థాలు వదిలితే, శారీరక నైతిక బలం చాలా పెరుగుతుంది. సంపాదన అధిక మౌతుంది. అందుకనే మద్యనిషేధాన్ని 1920 నుండి కాంగ్రెసు కార్యక్రమములో చేర్చారు. సర్కారు ఆప్రతిజ్ఞను నిర్వహించి పాపపు ఆదాయమును వదలుకోవలెను. నిజానికి రెవెన్యూలో నష్టము ఉండదు. వ్యక్తుల కది చాల లాభదాయకం. జాత్యభివృద్ధికి కూడ అదే మార్గం.

## 112

2-1-48

### నౌకాలీ టోపి

ఆరోజు సాయంత్రము వాన కురియుచుండుటచే నౌకాలీ గడ్డిటోపి పెట్టుకుని గాంధీజీ సభకు వచ్చెను. కిసాన్లు ఎండకు, వానకు ఈ టోపీలనే వాడుతారు. ఈ టోపీని ఒకముస్లింకిసాన్,

గాంధీజీకి బహుమతిగా ఇచ్చారు. అందుచేతను, స్థానికంగా తయారుచేయబడి, గొడుగువలె పనిచేయుటచేతను గాంధీకి దానిని అభిమానించును.

## భజన

ఆసాయంత్రం పాడినపాట చాలా మధురంగా ఉంది. అది ఉదయ ప్రార్థనకు సరిపోతుంది. సాయంత్రం వేళకు అంత అనువు గాదు. దేవుడు నిద్రపోడు. నిద్రలేచి దర్శనమిమ్మన్న కోరిక భక్తుని భావమే.

## అవిశ్వాసం పిరికితనాన్ని సూచించును

ఆనాడు అలహాబాద్‌నుంచి వచ్చిన ఉత్తరములో ఏకొద్దిమందో మినహా, ముస్లింలు ఎవ్వరూకూడా భారతమందు భక్తి చూపుతారని నమ్మడానికి వీలులేదని, ఈ రెండురాజ్యాల మధ్య యుద్ధమే వస్తే చాలా మంది ముస్లిములను తరిమివేయవలసిందే అని ఆజాబులో నుండెను. వ్యతిరేకమైన కారణం కనుపడనంత వరకు, తోడిమానవుని మాట నమ్మవలెను. క్రిందటివారమే గదా లక్షమంది ముస్లింలు లక్నోలో సమావేశమై తమ జాతీయ భావాన్ని గూర్చి అసందిగ్ధమైన ప్రకటన చేశారు. దేశభక్తి హీనుడు, అన్యాయశీలుడు అయిన వానిని తుపాకితో పేల్చ వచ్చునుకూడ. కాని గాంధీజీ మార్గం అదికాదు. అనవసరమైన అపనమ్మకము అజ్ఞానానికి, పిరికితనానికి చిహ్నం. దానివల్లనే సాంఘికవిద్వేషం, నెత్తురు వరదలు, పెద్ద ఎత్తున వలసప్రయాణాలు సంభవించినవి. ఇదే సాగితే, రెండురాజ్యాలను చంపుతుంది. ఈ

రెంటిమధ్య యుద్ధం వచ్చేటంతదాకా, జీవించాలనే కోరిక గాంధీజీకి లేదు. అహింసయందు ఆయనకుండే విశ్వాసం ప్రజలలో ప్రబలితే యుద్ధం రానేరాదు.

# 113

3-1-48

## నిజమైన శాంతిహృదయం లోపల ఉంది

నేవెల్ కాంటీన్ వద్ద, పూర్వపు వాగ్దత్తమునుబట్టి, శని వారము సాయంత్రము ఒక పెద్ద సభలో గాంధీజీ ఉపన్యసించెను. స్త్రీలు, పురుషులు సమానంగా చేరినందుకు సంతోషించెను. శాంతిసఖ్యతలు మనదేశానికిన్ని, లోకానికిన్ని ప్రసాదించమని చేసే ప్రార్థనలో అందరూ కలియవలెనని ఆయన కోరెను. ధనము, మేడలువంటి బయటి ఆస్తులవల్ల శాంతిసమకూరదు. అంతరంగము నుండి అది లభించును. అన్నిమతాలు ఈసత్యాన్నే ప్రకటించినవి. అట్టి శాంతిని బొందిన మనుజుని కండ్లు, పలుకులు, చేష్టలు దాని నిదర్శనముగా నుండును. అట్టివాడు గుడిసెలో కాపురము ఉండి రేపెట్లు బ్రతుకుదునా యని యోచించడు, అది దైవానికే వదలును. గద్దె ఎక్కే సమయాన, కాలినడకన కాఱు అడవులకు పోవలసివచ్చునని శ్రీరామునకు తెలియదు. కాని ఆవనవాసము చేయమన్న ఆజ్ఞవలన, ఆయనకు రవంతయు కించ కలుగలేదు. లోపలి శాంతి చెడలేదు. హిందువులకు, సిక్కులకు, ఈసత్యం తెలిసియుంటే, ఇప్పుడు వచ్చిన వైరివరద దేశాన్ని ముంచివేసేది

కాదు. వారు సరిగా ప్రవర్తించియుంటే, ముస్లింలు అప్రయత్న ముగా తోడ్పడేవారు.

## శిబిరజీవిత ఆదర్శం

ఈశిబిరం బాగా జరుగుతున్న దన్నారు. ఢిల్లీ వీథులలో కంటె పారిశుద్ధ్యం, నెమ్మది, ఇక్కడ హెచ్చుగా ఉండేటట్లు శరణార్థులు తోడ్పడితే అపుడు ఈశిబిరంవారి వాదమును గాంధీజీ అంగీకరించును. ఇచ్చటనున్న వారిలో కొందఱు ఉన్నత తఱగతికి చెందినవారు. పూర్వపు సౌకర్యాలు ఇక్కడ కలుగుతవి అనుకొనుట పొరపాటు. క్రొత్త పరిస్థితులకు తగినట్లు మెలగవలెను. 1899లో బోయర్ యుద్ధం వచ్చినపుడు, ట్రాన్సువాలులో నున్న ఆంగ్లేయులు నేటాలుకు వలసపోయిరి. అక్కడ అందరు సమముగా జీవించిరి. అచ్చట ఒక ఇంజనీయరు తన తాబేదారైన వడ్రంగితో సమముగా కష్టించి పనిచేసి జీవించెను. శతాబ్దాల నుండి వచ్చిన పరదాస్యంవలన మన కా తరిఫీయతు లేదు. మన మిపుడు స్వతంత్రులము కదా? ఎంత అమూల్యమైన వరప్రసాదం. ఆ స్వాతంత్ర్యం! ఆ చెడుగులోనుంచి మంచిని సేకరించి, ఈశిబిరాన్ని ఆదర్శశిబిరం చేయవలెను. మనము ప్రార్థనలో పఠించిన మంత్రం, మనకున్నదంతా దైవానికి అంకితం చేయమని, అత్యావసరమైనదే తీసి వాడుకోమని ఉపదేశించింది. ఈమంత్రాన్ని ఆచరణలో పెట్టితే, ఈశిబిరమే గాక, ఈమధ్య చెడ్డపేరు సంపాదించిన ఢిల్లీకూడా, నూతన తేజస్సుతో విరాజిల్లును. మన జీవితము అంతస్సుఖముతో నిండిపోవును.

# 114

4-1-48

## యుద్ధంలోని చిక్కులు

వాన కురియుచున్నా, చాలామంది వచ్చినందుకు గాంధీజీ సంతసించెను. పట్టివేడుకకు గాక, ప్రార్థనయందలి ప్రేమతో వచ్చినారని ఆయన ఆశించెను. ప్రతిచోట, ఈ రెండురాజ్యాల మధ్య యుద్ధం రావచ్చునని ఊహిస్తున్నారు. కాశ్మీరుపై జరిగిన దాడిలో పాకిస్థాన్‌కు ప్రమేయము లేదనియు యు. యన్. ఓ. ఎదుట భారతదేశము చేసిన ఆరోపణలో సత్యం లేదనియు పాకిస్థాన్ ప్రభుత్వం అన్నందుకు గాంధీజీ ఆశ్చర్యపడెను. అచ్చ నిరాకరణవలన పని జరుగదు. కాశ్మీరు కోరితే దోపిడిగాండ్రను తరిమివేయుటకు సహాయపడుట భారతదేశపు కర్తవ్యము. భారతముతో సహకరించుట పాకిస్థాన్ కర్తవ్యం. అలా సహకరించుటకు ఒప్పుకొనికూడ పాకిస్థాన్ తగినచర్య తీసుకొనలేదు. మత, సాంఘికహేతువులవల్ల కోరిన పంపిణీ జరిగిపోయింది. ఇప్పుడు ఇంకా విరోధానికి కారణమేలేదు. పాకిస్థాన్ పేరులో ఉన్న పవిత్రత, దానిచర్య లన్నిటిలో కనబడవలెను. హిందువులు ముస్లింలు మొదట్లో చెడుపనులు చేసినా, ఆ వైరితనమే బలసి బలసి యుద్ధంగా మారనక్కరలేదు. యుద్ధంవలన ఈ రెండు దేశాలు మూడోదేశానికి లోబడుతవి. శాంతి, సద్భావాలు ఏర్పడితే, యు. యన్. ఓ. వద్ద ఫిర్యాదును సగౌరవముగా ఉప

సంహరించుకోనవచ్చును. మనస్సులో ద్వేషాన్ని కప్పిపెట్టి, పైకి బాసలు చేసినయెడల యుద్ధంకన్న హీనమే యగును.

## పిరికితనంకన్న హీనం

గతరాత్రి కొందరు శరణార్థులు ముస్లింల ఖాళీ ఇండ్లలో అక్రమంగా ప్రవేశించగా, పోలీసు వచ్చి బాష్పవాయు ప్రయోగముచేసి, గుంపులను చెదరగొట్టినారట. ప్రజలు చట్టవిరుద్ధముగా ప్రవర్తిస్తే సర్కారు ఎలా తృప్తికరంగా పనిచేస్తారు? పోలీసువారు చర్యతీసుకోకుండుటకై, స్త్రీలను, బిడ్డలను ముందు వరసలో నిలబెట్టినారట. ఇది స్త్రీలయెడ అగౌరవానికి, పురుషుల పిరికితనానికి తార్కాణం. పూర్వం హిందువులతో పోరాడునపుడు ముస్లిములు గోవులను ముందు వరుసలలో నిలబెట్టేవారట. అంతకంటెను ఇది నీచము.

## కంట్రోలు రద్దువల్ల ఫలితాలు

ఇంతవరకు తీసివేసిన కంట్రోళ్ళనుగూర్చి అభినందించుచు మరికొన్ని తీసివేయమని అడుగుతూ; చాలమంది వ్రాసే ఉత్తరాల, తంతెలనుండి ఒక సుప్రసిద్ధ వ్యాపారస్తుడు తెలిపిన అంశములు ఆయన అభిప్రాయములు ఈ క్రింద నమోదు చేయబడుచున్నవి. "తమరు కోరిన ప్రకారము వస్తువుల పూర్వ ప్రస్తుత ధరలను ఈ క్రింద తెలుపుచున్నాను.

| వస్తువు పేరు | ఇప్పటి ధర | రద్దుకు పూర్వం ధర. |
| --- | --- | --- |
| చక్కెర | మ 1కి రు 37-50 లు | రు 80-85 లు |
| బెల్లం | ,, 13-96 | 30-32 |
| షక్కర్ | ,, 14-18 | 37-45 |
| కలకండ పొట్లం | 0-69 | 1-8, 1-12 |
| దేశీ చక్కెర | మ 1కి 30/- 35/- | 75/- 80/- |

100కి 50 వంతున ధరలు తగ్గినవి.

కాయధాన్యాలు.

| | | |
| --- | --- | --- |
| గోధుమ | మ 1కి 18/- 20/- | 40/- 50/- |
| బియ్యం | ,, 25/- | 40/- 45/- |
| మొక్కజొన్న | ,, 15/-17/- | 30/- 32/- |

పప్పుధాన్యాలు

| | | |
| --- | --- | --- |
| పప్పులు | మ 1కి 16/- 18/- | 38/- 40/- |
| పెసలు | ,, 23/- | 35/- 38/- |
| మినుములు | ,, 23/- | 34/- 37/- |
| కందులు | ,, 18/- 19/- | 30/- 32/- |
| పప్పులు | మ 1కి 20/- | 30/- 32/- |
| పెసరపప్పు | ,, 26/- | 39/- |
| మినప్పప్పు | ,, 26/- | 37/- |
| కందిపప్పు | ,, 22/- | 34/- |

నూనెలు

| | | |
| --- | --- | --- |
| ఆవనూనె | మ 1కి 65/- | 75/- |

ఉన్ని, పట్టు ధరలు 100కి 50-66 వరకు తగ్గినవి.

## దూదిబట్ట, నూలు

నూలు, దూదిబట్ట కంట్రోలుకూడా రద్దగునని ఆశతో ధరలు క్రమంగా పడిపోవుచున్నవి. వీటి కంట్రోలు కూడ ఎత్తి వేస్తే ధరలు నూటికి రు 60 చొప్పున పడిపోవును. బట్టనాణ్యం పెరుగుతుంది. మిల్లు యజమానులు ఒండొరులతో పోటీ పడి మంచి బట్ట చౌకగా అమ్ముదురు. ఆ రద్దుతోపాటు మూడేండ్ల దాకా విదేశాలకు ఎగుమతి నిషేధించవలెను. అప్పుడు బట్ట కంట్రోలు రద్దు పూర్తిగా విజయ మొందును.

సర్కారు కార్యాలయాలలో తయారు చేయబడే మాయ లెక్కల గారడీ ఈ కంట్రోళ్ళరద్దుకు అడ్డం రాకూడదు.

## పెట్రోలు రేషన్

"ఇది ఇపుడు అనవసరం. కొద్దిమంది రవాణావర్తకులకు అమితంగా లాభం కలుగుచున్నది. ఒకబస్సును ఒకరూటులో నడిపేవారు నెలకు 10-15 వేలు సంపాదించుచున్నారు. ఈరేష నింగ్ లేకపోతే 300 కంటె మించి సంపాదించలేరు. కనుక పెట్రోలు పర్మిట్లు సంపాదించడమే ఒకవ్యాపారం అయిపోయింది. ఒక్కొకపెట్రోలు పరిమిట్‌ను రవాణాదారుకు ఊరక అమ్ము కుంటేనే పదివేలువస్తున్నవి. పెట్రోలు రేషన్‌చేయటమూ, రవాణా లైసెన్సులు కొద్దిమందికే ఇవ్వటంవలనా, కొద్దిమంది వర్తకులు ధనాఢ్యులగుచున్నారు. జనసామాన్యంయొక్క జీవితము తారు మారు అగుచున్నది. దయయుంచి బాధపడే ప్రజలకు సాయం చేయండి. కంట్రోళ్ళు తొలగింపజేయండి. అపు డీదేశము,

అధికారప్రాపకమున్న కొద్దిమందికే గాక, ఆ ప్రాపకంలేని కోట్ల కొలది జనమునకును నివాసయోగ్యము అగును. స్వతంత్రభారతములో కంట్రోళ్ళకు చోటుండరాదు." అని ఆవ్యాపారస్థుడు వ్రాసి యిచ్చినాడు.

ఈ అంకెలు అప్రతిహతముగా కన్పించుచున్నవి. అజ్ఞానమువలన నేనీ అంకెలను నమ్ముచున్నానని అందురేమో. అలా అయితే తెలిసినవారు బయటికి వచ్చి ఎదురు ఋజువు ఇవ్వవచ్చును.

నిశ్చయంగా, ప్రజారాజ్యంలో పిరికితనానికి చోటులేదు. జనసామాన్యం ఒకవిధముగా నమ్మి ఒకవస్తువు కావలెననికోరితే, వారి ప్రతినిధులు వారి కోరిక కొకరూపాన్నిచ్చి దానిని తీర్చవలెను. జనసమూహముయొక్క అనుకూలమనోవైఖరి యుద్ధ విజయమునకు ఎంతో తోడ్పడినట్లు నిదర్శనము లున్నవి.

ప్రపంచంలో ఉండే పెట్రోలులో ఒకశతాంశమే మన దేశమునకు వచ్చుచున్నదట. కాని అధైర్యం, నిరాశ పొందబని లేదు. ఏమైనా మనమోటార్లు నడుస్తూనే వున్నవి. యుద్ధాలు చేసే దేశంకాదు కనుక ఇండియాకు ఎక్కువ పెట్రోలు అక్కర లేదనియా దాని అర్థం? లేక మన కెంతను దాని అవసరముండీ, ఉత్పత్తి పెరుగకపోతే, పెట్రోలులేక ప్రజలు చస్తారనియా? నా అజ్ఞానానికి విమర్శకులు హేళనచేయకుందురుగాక! నాకు వెలుగు కావలెను. నా అజ్ఞానాన్ని దాచుకుంటే వెలుతు రెట్లా లభిస్తుంది? ఒకయుక్తమైన ప్రశ్న కలుగుచున్నది. పెట్రోలు

తక్కువగా నుంటే, చీకటిబజారులో అంతులేని సరఫరా, నిరాటంకంగా లెక్కలేని అనవసరపు రవాణా ఎట్లా సాగుతూన్నవి?

ఈకంట్రోళ్ళను బీదలకొరకు నిలుపుతున్నాము అంటారు గదా! పైవర్తక ప్రముఖుడు తెల్పిన అంకెలనుబట్టి, ఈకంట్రోలు భాగ్యవంతులకు వరప్రసాదం, బీదలకు ఘోరశాపము అయినది. కొద్దిమంది కీయబడే ఈ గుత్తహక్కులు నిజమై, ఇంత అన్యాయంగా అవి పనిచేస్తూంటే తక్షణం అవి రద్దుకావలసిందే.

## బట్టల కంట్రోలు

"ఖాదీ స్వాతంత్ర్యదీక్షా వస్త్రము" అన్నారు గదా! బట్టకంట్రోలుకు అనుకూలంగా చెప్పదగిన అంశము ఒకటికూడా లేదు. హెచ్చుశ్రమలేకుండా, పెద్దరవాణాసౌకర్యాలు అక్కరలేకుండా, ఖాదీ తయారుచేసికోవచ్చును. మృతిజెందిన రాజ్యాంగం మొదట్లో సైనిక అవసరములకొరకు రైళ్ళువేసింది. పిమ్మట దూది బేళ్ళ ఎగుమతికి, విదేశవస్త్ర దిగుమతికి ఉపయోగించింది. ఇప్పుడట్టి వస్తుకేంద్రీకరణం అవసరమేలేదు. మనఖాదీ మనగ్రామాలలో తయారయి చాలవరకు గ్రామాలకే వినియోగం అవుతుంది. మన సోమరితనమును అజ్ఞానమును కప్పిపుచ్చుటకై, గ్రామస్థులను తిట్టకుందుముగాక.

6-1-48

## అక్రమపు ఒత్తిడి నిలిచిపోవలెను

చాలమంది శరణార్థులు, ఖాళీగా ఉన్న ముస్లిం గృహము లను ఆక్రమిస్తున్నారట. బాష్పవాయు ప్రయోగంచేత గుంపులను పోలీసు చెదరకొట్టుచున్నారట. భరింపరాని చలిలో ముసురులో డేరాలు చాలక ఆరుబైట శరణార్థులుండుట కష్టమే. ఇండ్లు లేక వారు పడేబాధలు ఊహించవగును. కాని ముస్లింకొంపలమీదనే కన్నువేయుట ఏల ? ముస్లింలమీద అక్రమపు ఒత్తిడిచేయుట వక్రబుద్ధిని,అమర్యాదను సూచించును. ఇదివరకే భయపడుచున్న ముస్లింలను బెదరించరాదు. సర్కారు ఇస్తామన్న ఇళ్ళు వద్దని, ముస్లిం ఇళ్ళను కోరుట దుర్బుద్ధికి నిదర్శనము. ఢిల్లీలో ముస్లింలు ఉండకూడదని వారికోరిక అయితే ప్రత్యక్షముగా అలా చెప్పుట మంచిది. కాని రాజధానినగరంలో అలా జరుగుటచే కలిగే ఫలితాలను వారు గ్రహించవలెను.

## సమ్మెల జాడ్యం

బొంబాయిలో ఓడలమీద పనిచేయువారు, ఇతరులు సమ్మెచేయ చూచుచున్నారట. ఇది సమ్మెలకు కాలముగాదు. ఆయా వ్యక్తులకూ దేశానికీకూడా హానికరం. అన్ని రాజకీయ పక్షులూ వీటిని ఆపవలెను.

# నిజమైన ప్రజాస్వామికం

ఔంధు మహారాజు కొన్నిఏండ్ల క్రింద తన ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వము నిచ్చెను. ఆయన కుమారుడుకూడ ప్రజాసేవయే చేయుచున్నారు. ఆయన "విలీనప్రణాళిక"ను షుమారుగా అంగీకరించుటకు నిశ్చయించెను. దానిక్రింద రాజులకు ఉపకారవేతనము ఉండునని పటేల్ తెల్పెను. కాని ఔంధ్ రాజు అలా తీసికొని ప్రజకు భారంకాకుండా ప్రజాసేవవలన లభించే దానితోనే తృప్తిపడునని గాంధీజీ భావం. భారతసమ్మేళనంలో 'విలీనం' అయిన పిమ్మటకూడ, తన రాజ్యంలో తాను అమలు జరుపుతూన్న 'పంచాయతీ' విధానం అట్లే నిలిచియుండవచ్చును కదా అని ఆమహారాజు గాంధిజీని అడిగెను. "మిగత"ఇండియాలో ఉన్న రాజ్యాంగపద్ధతే అక్కడను అమలుపరచవలసియుంటుం దని కేంద్రప్రభుత్వము అభిప్రాయపడింది. ప్రజలు పంచాయతీ రాజ్యాన్ని కోరుకొన్న-చోట, కాదనుటకు ఎవ్వరికీ అధికారంలే దని గాంధీజీ అభిప్రాయం. ఔంధురాచరికము పోవచ్చును. కాని ఆగ్రామాల బృందము అలాగే యుండును. మిగత ఇండియా ఎట్లున్నను వారు పంచాయతీపద్ధతి సాగించుకోవచ్చును. పంచాయతీ ధర్మము ప్రజాసేవచేయుటయే. కర్తవ్యపాలనవల్లనే,హక్కు లేర్పడును. అట్టిహక్కుల నెవ్వరు తొలగించలేరు. భారతప్రజా రాజ్యానికి మూలసంస్థ గ్రామము. ఒకగ్రామం పంచాయతీ రాజ్యం కోరినా, అంటే రిపబ్లిక్కు కాదలచినా, దానిని ఎవరును అడ్డగించరాదు. ఇరువదిమంది కేంద్రంలోకూర్చుని ప్రజాస్వామికం

నడుపలేరు. అది క్రిందినుంచి గ్రామప్రజలచేతనే అమలుజరుప బడవలెను.

### ఎగుమతులు, దిగుమతులు సరితూగవలెను

ఏ సంపన్న దేశములోనైనా, ఎగుమతులు, దిగుమతులు సరిపోవలయు ననియు, లేదా దిగుమతులు కొంచెము తక్కువ యుండవలె ననియు, అనవసరమైన బొమ్మలు వగైరా దిగుమతి చేయరాదనియు, ఈ నియమము పాటించకపోతే దేశం త్వరలోనే దివాలా తీయు ననియు, ఒక స్నేహితుడు వ్రాసిన దానితో గాంధీజీ ఏకీభవించెను. ఇంకొక చిక్కు ఉన్నది. మనం ముడిపదార్థములనుపంపి, తయారైనసరుకు తీసుకొనుచున్నాము. అందువల్ల అనేకనష్టాలు ఉన్నవి. సాధ్యమైనంతవరకు మనదేశం స్వయంసమృద్ధంగా నుండవలెను. శోషణపద్ధతి మీద గాక, పరస్పర సహాయపద్ధతి మీద భారతమునకు, ఇతరదేశాలకు మధ్య వర్తకము సాగవలెను.

## 117

7-1-48

### తప్పుడు ఉపవాసం

ఒకరు ఒక ఉపవాసము చేస్తున్నా మని గాంధీజీ పేర వ్రాశారు. ఆ ఉపవాసము తప్పని గాంధీజీ ప్రత్యుత్తరమిచ్చారు. ఆయన జీవించి ఉన్నంతవరకు ఉపవాసాలు చేయదలచే వారు ఆయనతో సంప్రదించవలెనన్నారు.

## విద్యార్థుల సమ్మె

9వ తేదీన ఢిల్లీలోనివిద్యార్థులు సమ్మె చేయనున్నారట. విద్యార్థులు సమ్మెచేయుట సామాన్యంగా తప్పేనని ఆయన అభిప్రాయము. ఆయన జీవితములో అనేక సమ్మెలు ఆయన నడిపించారు. కాని అన్ని సమ్మెలు న్యాయ మైనవి, నిశ్చయముగా అహింసాపూర్వక మైనవి కావని గాంధీజీ అనెను. విద్యార్థులు ఈ సమ్మెను ఆపవలెను.

## పాకిస్థాన్ శరణార్థుల ఇబ్బందులు

పాకిస్థాన్ శరణార్థుల ప్రతినిధులువచ్చి, మా ఇబ్బందులు తొలగించుటకు మీరేల కృషిచేయుటలే దని గాంధీజీని అడిగిరి. పాపము, వారు గ్రహించలేదు! అచ్చుగా అందు కేకదా గాంధీజీ ఢిల్లీలో నున్నది! స్వాతంత్ర్యం రాకపూర్వం ఉండే పలుకుబడి ఆయనకు ఇప్పుడులేదు. కనుక ఇండియాలో అహింసాయుత తిరుగుబాటుదార్లకు ఆయన నాయకుడుగా ఉండెను. చాలామంది ఆయన మాట వినేవారు. ఎవరు వినకపోయినా, తనకు గోచరించిన సత్యమును ప్రకటించుచుండవలె నని పూర్వపు ధర్మ ప్రవక్తలు తెలిపియుండిరి. ప్రభుత్వాన్ని నడిపేవారు తన స్నేహితులే యైనను, దానిబాధ్యత తనదికాదు. తన సలహాలు నచ్చినపుడు స్నేహంకొఱకో, మర్యాదకొఱకో, ఆ సలహాను వారు పాటించవలెనని గాంధీజీ కోరరు. మంత్రులు, వారి కార్యదర్శులు క్రింది ఉద్యోగులు గాంధీజీమాట వింటే, పరిస్థితులు మరొకవిధముగా నుండెడివి. కాని అలా జరుగుటలేదు. ఆంగ్లపాలకుల నుండి

సంక్రమించిన పరిపాలనా చక్రాన్ని ఈ మంత్రులు శక్తికొలది నడుపుచున్నారు.

## శరణార్థుల కర్తవ్యం

అన్నం, బట్ట, నీడ వారికి అవసరము. వారు మనబంధువులే కదా ! తనకు దొరికే సౌకర్యాలు వారికి దొరకక పోవుట అన్యాయం. దొరికినంత మట్టుకు వాడుకోవలెను. దూదిపఱుపు బదులు గడ్డిచాప దొరకినా వాడుకోవలెను. అన్నం, బట్ట, నీడ దొరకినందుకు, తగిన పని చేయవలెను. కార్మికుడు బల్ల వద్ద కూర్చొని వ్రాయలేకపోవచ్చు; కాని బల్లకు అలవాటుపడ్డవాడు కాయకష్టము చేయగలడు. సరియైన మనోభావము కుదుర్చుకో గలిగితే, ఇప్పుడు వచ్చిన కొద్ది లక్షలను, ఇంకా మరికొందరిని కూడా మనం మనలో ఇముడ్చుకో వచ్చును.

## కరాచీలో సంఘటనలు

సింధు నెమ్మదిగా ఉన్న దని చెప్పినా, గాంధీజీకి నమ్మకం లేదు. హిందువులకు, సిక్కులకే గాక ఇతర ముస్లిమేతరులకు కూడా సింధులో భద్రత లేదు. అల్లరులను ఆపజాల మని చెప్పే పాకిస్థాన్ సర్కార్ ముస్లిమేతరులను వీలైనంత వేగంగా అణు స్తున్నారు. అల్లరులను ఆపలేకపోతే, రెండు రాజ్యాల మంత్రి వర్గాలు వెంటనే రాజీనామా ఇవ్వవలెను. కొంత ఇబ్బంది కలిగి నను పరిస్థితులు క్రమంగా బాగుపడుతవి. కసి తీర్చుకోవలె ననే కోర్కె హిందూ, సిక్కు-జాతులకు గాని, ఆ శరణార్థులకు గాని ఉండరాదు. కరాచీ సంఘటనల వలన వారు భయపడరాదు.

భారత యూనియన్ ప్రజలు సరియైన నడవడి ప్రదర్శించడమే దానికి సరియగు జవాబు.

# 118

8_1_48

అనేకమంది గాంధీజీకి చీటీలు వ్రాసిరి. తన నిన్నటి ప్రశ్నకు జవాబు రాలేదని ఒకరు ఫిర్యాదు చేసిరి. అన్ని చీట్లు చదువుట తన కసాధ్యమనియు, ముఖ్యమైనవిషయము ఉంటే ఆ మిత్రుడు మరొకసారి అడిగి యుండవలసిన దనియు గాంధీజీ తెలిపెను.

## హరిజనులు - త్రాగుడు

సైనికులు, భాగ్యవంతులు త్రాగుచుండగా హరిజను లేల దానిని వదలవలెనని ఒకరు ప్రశ్నించిరి. భాగ్యవంతులు తమ డబ్బు పాడుచేస్తుంటే, బీదవాళ్లుకూడ అదే పని చేయవలెనా? ఇతరుల దురలవాటులను ఎవరూ అనుసరించనక్కరలేదు. ఇరువురిలోను, త్రాగేదురలవాటు ధనికులలోనే తక్కువుండాలి. బీదలు త్రాగి తమ బీదరికాన్ని దుస్థితిని మరచిపోతారు. భాగ్యవంతులకు అలాటి అవసరం లేదు. త్రాగకపోతే సైనికులు పని చేయలేరని ఒక వాదమున్నది. త్రాగు డెరుగని ఆంగ్లేయ, భారతీయ సైనికులను గాంధీజీ ఎరుగును. బీద సాద మొదలగు భేదాలను నిషేధచట్టాలు పరికించవు. ఆ చట్టాలకోసం మనము వేచియుండనక్కరలేదు. దీనిచే హరిజనులకును కార్మికులకును హెచ్చు అపకారము జరుగుచున్నది. అందుచేతనే వాళ్లు త్రాగుడు వదలవలె నని గాంధీజీ కోరెను.

## సత్యాగ్రహము ఏల చేయరాదు?

మీరేల పాకిస్థాన్ పోలేదని ఒకరు అడిగిరి. గాంధీజీ ఇది వరకే జవాబు ఇచ్చియుండెను. ఢిల్లీ పరిశుభ్రమైనపుడు ఆయన పాకిస్థాన్ పోగలడు. పాకిస్థాన్‌లో ఏల సత్యాగ్రహము జరుపరాదని ఒకరు అడిగిరి. అక్కడనైనా అది అమోఘుమే అగు నని ఆయన తెల్పిరి. ఇప్పుడు ఎక్కడా భారతములో సత్యాగ్రహం కనుబడదు. ప్రతిచోట పోలీసుల, సైనికుల రక్షణ కోరుచున్నారు. గద్దెమీాది నుంచి దైవాన్ని దింపి, సేనను ఎక్కించినట్లున్నది.

## భారతంలో సాంఘిక దురభిమానము

పాకిస్థాన్‌లో బానిసలుగా ఉండ నొల్లని హిందువులను, సిక్కులను ఆ సర్కార్ బయటికి తోలివేస్తున్నారు. అంతమంది ఇక్కడనుంచి పోకపోతే, క్రొత్తవాళ్ళకు వసతి ఎలా కల్పింపవీలగును? అని ఒక స్నేహితుడు అడిగెను. సమానమైన సంఖ్య ఇదివరకే వెళ్ళారు. ఇంకా ఈ దేశములో చాలామంది ముస్లింలున్నారు. అజాద్ పిలిచిన సభకు 70 వేల ముస్లింలు వచ్చారు. వారు ఇచ్చటి ముస్లింల ప్రతినిధులు. వీరిని చంపుదామా? తరిమివేదామా? దానికి గాంధీజీ సమ్మతింపరు. సాంఘిక దురభిమానం ఇచట నుండరాదు.

## విద్యార్థులలో కక్షలు

9వ తేదీ సమ్మె కాంగ్రెసు విద్యార్థులది గాక, కమ్యూనిష్టు విద్యార్థుల దట. విద్యార్థులలో ఇలాటి కక్ష రాజకీయాలు

ఉండరాదు. ఉద్యోగాలుకొరకు గాక, ప్రజాసేవ నిమిత్తం వారు సాధ్యమైనంత జ్ఞానం సంపాదించవలెను.

## బహావల్పూరునుండి రాయబారము

ఆ సంస్థానపు శరణార్థుల ప్రతినిధులు వచ్చిరి. మీరాపూర్ నుండి స్త్రీ పురుషులు వచ్చి గాంధీజీతో మాట్లాడుచుండగా, పండిట్ నెహ్రూజీవచ్చెను. మీరాపూరు హిందు సిక్కులను కాపాడుటకు సర్వప్రయత్నములు చేయుదునని, పండిట్ జీ తెల్పెను. బహావల్పూరు శరణార్థులు సంస్థాన పౌరులు గనుక, వారికి ఉద్యోగాలు ఇచ్చుట లేదని ఆ ప్రతినిధులు తెల్పిరి. అలాటి విచక్షణ చేయవద్దని పటేల్ ఉత్తరువు చేసినా, సరిగా అమలు జరుగుట లేదని వారు చెప్పిరి. ఏదో అపోహ ఉండవలెనని, తాను విచారించి మరునాడు తెల్పెద నని గాంధీజీ వారికి మాట ఇచ్చెను.

# 119

9-1-48

## ధైర్యము, సహనము అవసరము

బహావలుపూరు దేవాలయములోనిపూజారి నేడు గాంధీజీని కలిసెను. హత్యాకాండ ప్రారంభ మైనపుడు హిందువులు దేవాలయములో దాగుకొనిరి. అక్కడకూడ రక్షణలేదని బెదరి వాళ్ళున్ను ఆ పూజారియున్ను దొడ్డిదోవను పారిపోయిరని, ఆ పూజారి గాంధీజీకి తెల్పెను. తాను చాలామందిని కాపాడితినని చెప్పి, వెనుక బడిపోయిన వారిని రక్షించమని గాంధీజీకి విన్నవిం

చెను. తన కధికారము లేకున్నా, శక్తికొలది కృషిచేస్తున్నా నని గాంధీజీ తెల్పెను. ఒక రాజ్యము రెండోరాజ్యం యొక్క ఆంత రంగిక పరిపాలనలో జోక్యం కల్పించుకోరాదు. ఈ కాలాన్ని బట్టి ప్రతివాడు అత్యంతధైర్యమును సహనమును కలిగియుండవలెను. తమ మాన ప్రాణములకొఱకై అసువుల నర్పించు వారిని, ఎవ రును అవమానపఱుప జాలరు. నేడో రేపో చావు రాక తప్పదు. దైవాజ్ఞ లేనిదే ఒక గడ్డిపోచైనా కదలదు.

## ఇంటివసతి సమస్య

కొందఱు ముస్లిం స్నేహితులకు ఢిల్లీలో యున్న ఇల్లును పాకిస్థాన్‌నుంచి వచ్చిన హిందువులకు వారు అప్పగించిరి. ఇపుడు ఢిల్లీసర్కారు ఆ ఇల్లు ఖాళీచేయమంటున్న దని కొందరు శరణా ర్థులు గాంధీజీకి తెల్పిరి. ప్రభుత్వానికి ఆ హక్కు యుండవచ్చును. కాని న్యాయముగా అందులోనున్న వారికి మరొక ఇల్లు చూప వలసిన బాధ్యత సర్కారుకు యున్నది. ఆరుబైట అల్లాడు మని చెప్ప వీలుగాదని గాంధీజీ యనెను.

## ఒక అపోహ

బొంబాయిలో రోజూ ప్రతి ఒక్కరికి ఒక శేరు బియ్యం ఇచ్చుచున్నా రని కడచిన వారంలో గాంధీజీ అన్నట్లును, శేరు గాక పావుశేరే ముట్టుచున్నట్లును ఒకరు గాంధీజీకి వ్రాశారు. కాని వారానికి ఒక శేరు ఇచ్చుచున్నా రని తానన్నట్లు గాంధీజీ చెప్పెను. అంటే మనిషికి రోజుకు పావుశేరు కంటె తక్కువ. రోజూ శేరు ఎలా వస్తుంది ఈ రోజులలో ?

## బిర్లా ఇంటివద్ద ఎందుకు ?

బిర్లా ఇంటివద్దకు బీదజనులు రాలే దనియు, ఆయన పూర్వమువలె "భంగీ కాలనీ" లో యుంటే బీదలకు అందుబాటులో నుండుననియు ఒక స్నేహితుడు వ్రాసెను. గాంధీజీ ఢిల్లీ వచ్చినపుడు అది "శవాల నగరు"గా నుండెను. హరిజన్ కాలనీ నిండా శరణార్థు లుండిరి. కాన బిర్లా ఇంట్లో గాంధీజీకి సర్దారు బస ఏర్పాటు చేసెను. ఇప్పుడు భంగీ కాలనీ ఖాళీగా యున్నా, అక్కడికి పోవుట భావ్యముగా నుండదు. ఇక్కడికి ముస్లింలు ధైర్యముగా రాగలరు. భంగీ కాలనీకి వచ్చుటకు జంకుతారు. మంత్రులు ఈసమీపములో నున్నారు. వారు ఇక్కడికి వచ్చుట తేలిక కాదు. వారు తొందర పనులలో నుంటూ, భంగీకాలనీకి వచ్చుటకు చాలా సమయము పట్టును.

## పెద్దమనిషి వేషాలతో దొంగలు

ఢిల్లీలో ఆలాటి దొంగ లున్నారని గాంధీజీ విన్నారు. ఆలస్యం లేకుండా వారిపైన తగుచర్య తీసుకోవలసినదని గాంధీజీ హెచ్చరించెను.

# 120

10-1-48

## క్రమ శిక్షణ

గాంధీజీ సభ ఆరంభించకముందు, ఒక సాధువు సభలో నిలబడి, తాను వ్రాసిన జాబు సభ యెదుట చదివి వినిపించెద

ననెను. గాంధీజీ దానిని తన కమ్మని కోరెను. అప్పుడే సభలో తాను దానిని చదువవలె నని పట్టు పట్టినను, వాగ్వాదముమీద చిట్టచివరకు సమ్మతించెను. ప్రమాణ గ్రంథముల చదివి అన్ని విధాల నిగ్రహం చూపవలసిన సాధువులు ఈలా ప్రవర్తించుట ప్రస్తుత దుస్థితికి నిదర్శన మని గాంధీజీ చెప్పెను. తుదకు ఆ మిత్రుడు కూర్చుండుట తనకు సంతోషమైనా దాని కంత బల వంతము, వాగ్వాదము ఎందుల కని గాంధీజీ ప్రశ్నించెను.

## బహావల్‌పూరు స్నేహితులు

బహావల్‌పూర్ స్నేహితులువచ్చి ఆనాటి ప్రార్థనసభను పాడుచేతురని ఇతరులు తెల్పిరి. కాని అక్కడి 70 వేల మందికి సహాయము చేయమని కేకలు వేస్తూ వచ్చిన జనము గాంధీజీ కూర్చోగానే నిశ్శబ్దంగా కూర్చుండిరి. వారు అల్లరి చేతు రని ఆయన నమ్మలేదు. వారి సౌమ్య మార్గమును అనుసరించ మని ఇతరులకు ఆయన బోధించెను. ఈ మధ్య శాంతంగా ప్రార్థన సభలు జరుగు చున్నందుకు గాంధీజీ సంతసించెను. బహావల్‌పూర్ శరణార్థుల కష్టములు ఆయన గుర్తెఱిగి, సాధ్యమైనంత సాయము చేయుదునని ఆయన తెల్పెను. చచ్చినవారిని బ్రతికించకపోయినా, బ్రతికియున్న వారి మతముతో జోక్యము కలిగించుకో మనియు, ఇప్పటికి మిగిలియున్న హిందువులు, సిక్కులు, అక్కడ క్షేమంగా కాలము గడుపవచ్చు ననియు, ఆ నవాబు సాహేబుగారు గాంధీజీకి కబురుపంపెను. ఇచ్చటి ప్రభుత్వమున్న

సాధ్యమైనంత సహాయం చేయుచున్నది. సింధులోని హిందువులు, సిక్కులు బహావల్పూరులో వారికంటె ఎక్కువ సంఖ్యలో నున్నారు. కరాచీలోని సంగతులు పత్రికలలో పడినదానికంటె చాలా ఘోరముగానున్నవని ఇప్పుడే తంతె వచ్చినది. ఎల్లరకు ఆయన చెప్పే సలహా ఏమంటే, సహనమును, సాహసమును కోల్పోవద్దని. అపజయము కలిగిం దని ఒప్పుకొనవద్దు. ఆవేదన పొందవద్దు. మీా నిఘంటువులో నుంచి అపజయము అను పదమును తొలగించండి. కోపం వీడి, ఓపికతో యోచించి, ఉత్తమ మార్గమును త్రొక్కండి.

## పర్షియా – ఇండియా

ఆనాడు పర్షియా ప్రతినిధి గాంధీజీని చూచెను. పర్షియా ప్రజలు, ఇండియా ప్రజలు ఒకే ఆర్యజాతికి చెందినవా రనియు, చిరకాలపుస్నేహితు లనియు, ఆరాయబారి తెల్పెను. ఆసియా ఖండములో భారతమే పెద్దరాజ్య మనియు, దాని ఔన్నత్యము తమకును ఉన్నతి కల్గించిందని ఆరాయబారి తెల్పెను. గురుదేవు (టాగూరు) పరిషియా పిలుపుమీాద అచ్చటికి బోయి "అచ్చటి జనులు మన స్వజను" లని కనిపెట్టెను. ఇండియా, పర్షియా సంబంధములు ఏరీతినీ చెడకూడదని ఆరాయబారి ఆదుర్దా చెందెను. ఆయన ఎందుకట్లనవలసివచ్చెనని గాంధిజీ అడిగెను. ఈమధ్య బొంబాయిలో కొంతమంది పరిషియన్లకు ఇబ్బందులు కలిగెను. కొందరు చంపబడిరి. వీరుకూడా ముస్లింలు అనేకారణం చేత వెర్రి ఎక్కిన మన ప్రజ అలా ప్రవర్తించియుండవచ్చును.

కాని బొంబాయి సర్కారు తక్షణమే అల్లరులను అణచివేసెను. పర్షియాలోనున్న హిందూ, సిక్కు, ముస్లిం వర్తకులు సఖ్యతతో వ్యాపారము చేయుచున్నారనియు, పర్షియా సర్కారు భారత దేశపు సఖ్యత పోగొట్టుకొనదనియు, ఆరాయబారి చెప్పెను.

## మీ వివేకమును ఉపయోగించండి

కంట్రోళ్ళ రద్దు కల్తీలేని శ్రేయస్సుకాదని, ఒకస్నేహితుడు గాంధీజీపేర వ్రాసెను. ప్రజలే గాంధీజీకి చెవులు, కళ్ళు, చేతులు. వారు చెప్పినసంగతులను ఆయన నమ్మవలసియుండెను. వారందఱు స్వార్థులని ఆయనకు తోచుటలేదు. తాను చెప్పెనని గాక, ప్రతికూలవాదమును విని తమ స్వంత అనుభవముతో సరిచేసుకొని వివేకమును వినియోగించి, స్వతంత్ర అభిప్రాయములను ఏర్పఱుచుకొని ప్రజ ఆవిధంగా నడువవలెను.

# 121

11-1-48

## ప్రార్థన సభలలో శాంతి

నేడు ఆదివారము. ఎక్కువజనము వచ్చిరి. స్త్రీలు, పిల్లలు గోలచేయసాగిరి. స్త్రీలు మాట్లాడవలసియుండెను, తమ పిల్లలను నెమ్మదిగా యుంచలేకపోతేను, సభలో అల్లరిచేయుటకంటె వారు దూరముగా వెళ్ళి కూర్చోవలెను. దేవుడు సర్వోపగతుడు, సర్వబలోపేతుడు, సర్వదయామయుడు, అంతులేని సహనవంతుడు. ప్రార్థన సభలలో గల్లంతు చేసి ఆయన

ఔదార్యమును భంగపఱుపరాదు. గాంధీజీ చెప్పే దానిలో ఏదైన మంచియుంటే, ఆప్రకారము ఆచరించవలెను.

## ఆంధ్రదేశంనుండి జాబు

అందులోని ముఖ్యాంశములు ఇవి— ఉదారమైన పుట్టుక గని సంస్తవనీయమైన జయములను పొందినట్టి కాంగ్రెసులో ఇప్పుడున్న కుళ్ళును బయటపెట్టకపోతే, ఘోరపాపమగును. ప్రజాప్రతినిధులగు శాసనసభ్యులచేతనే, ఈకుళ్ళు పుట్టింది. ఈ కుళ్ళును కూలదోస్తామని కబుర్లు బిగ్గరగా నుడివి, స్వయముగా మరింతచెడుగు చేస్తున్నారు. లైసెన్సులు సంపాదించుటకు డబ్బు తింటున్నారు. ఘోరంగా బ్లాకుమార్కెట్లు చేస్తున్నారు. న్యాయ విచారణకర్తలను కళంకపఱచుచున్నారు. పెద్దఉద్యోగస్థులను పట్టుకొని, చిన్నవారిని బదిలీలు చేయిస్తున్నారు. ప్రతిపక్షంలేని ఈ రాష్ట్రములో ఈ 260 మంది శాసనసభ్యులు నికృష్టమైన బొబ్బలజాడ్యంగా యున్నారు. తెల్లదోపిడీ స్థానే నల్లదోపిడి గాంధ్రను పెట్టుటకేనా స్వాతంత్ర్యంకోసం ఇంతమంది ప్రాణాలు ఇచ్చింది? ఇందిమంది త్యాగాలు చేసింది అందుకేనా? ఈ ఊబిలోనుంచి బయటపడితీరవలెను. వీరిసంఖ్య తగ్గితే కొన్ని చెడుగులు పోతవి. అసెంబ్లీలో 50 మంది, కౌన్సిల్‌లో 25 మంది ఉంటే చాలును. ఈ సూచనను రాజ్యాంగవేత్తలు ఆమోదింతురా? ఈ దోపిడిగాంధ్రనుండి, ఈ తలబరువు. ఖర్చునుండి, ప్రజలను కాపాడెదరా?

## రాజకీయపక్షాలకు విజ్ఞప్తి

వయోవృద్ధుడైన చిరకాల ఆంధ్రమిత్రునినుంచి వచ్చిన లేఖ ఇందలి విషయములను ధృవపఱచుచున్నది. ఏరాజకీయకక్ష అయినాసరే, భారతదేశపు మేలుకొరకే బ్రతుకవలెను. పరిచర్య చేయవలెను అని గాంధీజీ హెచ్చరించెను. అందరు అధికారానికై పెనగులాడితే, ఇక దేశము ఏమికావలెను?

## ఆత్మహత్యవైపు దృష్టి

కొందరు ముస్లిములు గాంధీజీయొద్దకు వచ్చి, ఇప్పటి చిక్కులను వర్ణించిరి. ఎన్నాళ్ళు అవి సహించవలెనో తెలుపమని కోరిరి. కాంగ్రెసు తమను కాపాడలేకపోతే, ఆసంగతి స్పష్టముగా చెప్పితే, ముస్లిములు యుక్తమైనదోవ చూచుకొందురు. తమ స్థానములు వదలవద్దని గాంధీజీ వారికి సలహా చెప్పెను. మతమును రాజకీయములను జాతీయవాదులు కలుపరాదు. పాకిస్థాన్‌లోని ముస్లింలవలె భారతంలోని హిందువులకును వెర్రి ఎక్కి, అలాగే అన్యమతస్థుల వెళ్ళగొడితే, వారును నసింతురు. అన్యులను అణచుట ఆత్మవినాశకరము. ఆలోచనాపరులు దీనిని ప్రతిఘటించవలెను.

# 122

12-1-58

## దేవుడే శ్రేష్ఠమైన సలహాదారు

కొందరు ఆరోగ్యనియమాల ప్రకారము, దానికై ఉపవసింతురు. కొందరు తప్పక ప్రాయశ్చిత్తముగా చేతురు.

ఇట్టివారికి అహింసలో నమ్మకము ఉండనక్కరలేదు. సమాజము వలన కలిగిన తప్పును ఖండించుటకై ఏ ఇతర సదుపాయంలేనపుడు అహింసావాది నిరశనవ్రతం పూనును. అట్టి అవకాశము ఇపుడు గాంధీజీకి లభించింది.

సెప్టెంబరు తొమ్మిదిన, కలకత్తానుండి పశ్చిమపంజాబు పోదలచి మధ్య ఢిల్లీలో గాంధీజీ ఆగెను. కులాసాగానుండే ఢిల్లీ స్మశానపురిగా కన్పడెను. ఛలోక్తులతో చిరునగవులతో వెలయుచుండు పటేల్‌తో సహా, అందరి ముఖానా చీకటి క్రమ్మియుండెను. నాకు స్వాగతము ఇవ్వవచ్చిన సర్దారు భారతరాజధానిలో జరిగిన గలభాను గూర్చి విచారవార్త తెలుపగానే, అవతలి ప్రయాణము ఆపి ఇచ్చటనే నిలిచి, "పనిచేయుము లేక చావుము" అని స్ఫురించెను. తక్షణమే గైకోబడ్డ పోలీసు, సైనిక చర్యలవల్ల పైపైన శాంతి ఏర్పడెను గాని, గుండెలలో క్రోధము ఘూర్ణిల్లుచుండెను. అది ఏక్షణమో బద్దలై బయటబడగలదు. "చేయుటో, చచ్చుటో" అనేవాక్యంలో చెప్పబడ్డచేయుటలోకిరాదు. ఈశాంతి సంపాదన, ఈడులేని సంగడీడైన మృత్యువునుండి ఈ "చేయుట" నన్ను దూరమొనర్పజాలదు. హిందూ, ముస్లిం, సిక్కులమధ్య నేను కోరే హృదయస్నేహము నేడు లేనేలేదు. ఈస్థితిలో ఏదేశాభిమానీ తృప్తిపడజాలడు. చాలరోజులనుండి అంతర్వాణి సైగచేస్తున్నా నేను చూడనొల్లనైతిని. ఇది సైతాను పిలుపేమో యని జంకితిని. నే నెన్నడు నిరాధారుడను కాలేదు. సత్యాగ్రహి ఎన్నడు నిరాశ్రయుడు కాడు. తనది గాని ఇతరులది గాని అయిన

కత్తికి, బదులు ఉపవాసమే ఉత్తమ ఆయుధం. మేము చేయ వలసిన దేమి అని అడిగే ముస్లిం స్నేహితులకు జవాబు చెప్ప లేని నా నిస్సహాయత నాగుండెను కొలుకుచున్నది. ఉపవాసము మొదలిడగానే, ఆ నిస్పృహ పోవును. మూడురోజులనుండి ఇది కుములుచున్నది. మెరుపుతీగవలె తీర్మానము దృగ్గోచరమైంది. హాయి కలిగింది. పవిత్రుడైనవాడు, తన ప్రాణముకన్న అమూల్యమైన వస్తువును ఇతరులకొరకు అర్పింపజాలడు. ఈ చర్యను (తపస్సుకు) తగిన పవిత్రత నాలో ఉందనుకొందును.

## ఆశీర్వదింపతగినది

మీరందరు ఈ నా ప్రయత్నమును ఆశీర్వదించి, నాతోను, నాకొఱకు ప్రార్థన చేయవలెను. రేపు మొదటి భోజనము అయిన పిమ్మటనుంచి ఉపవాస మారంభమగును. కాలనిర్ణయములేదు. లవణములు, పుల్లని నిమ్మరసము, కల్పిగాని కల్పకుండగాని నీరు త్రాగెదను. బయటివత్తిడివలన గాక కర్తవ్య పాలనమును గూర్చిన హృదయ ప్రబోధమువలన, అన్ని సంఘముల మధ్య మానసిక ఐక్యత కలిగినదని నాకు తృప్తికలిగితే అప్పుడు ఈ ఉపవాసము అంతమగును. దీనికి ప్రతిఫలమేమంటే తరిగిపోవు చున్న భారతప్రఖ్యాతిని తిరిగి పొందుట; ఆసియాఖండ హృద యముమీదను, తద్వారా లోకహృదయముమీదను భారతానికి ఇదివరకు ఉండి వేగంగా సడలిపోవుచున్న ఆధిక్యతను తిరిగి సంపాదించుట. భారతదేశము ఆత్మను కోలుపోతే, వివిధబాధలచేత

విచ్ఛిన్నమగుచున్న ప్రపంచముయొక్క ఆశలు అడుగంటిపోవును. స్నేహితుడుగాని, ఎవరైనా ఉంటే విరోధిగాని, నామీద కోపగించకుందురు గాక. మానవ హృదయోద్ధరణకు ఉపవాస విధానము ఉపయోగపడదని నమ్మెడి స్నేహితులు తమ పనులలో కోరుకొను స్వేచ్ఛను నాకును అనుగ్రహింతురు గాక. దైవమే శ్రేష్ఠమైన ఏకైకసలహాదారని నమ్మి మరియొక సలహా లేకుండా తీర్మానించదలచితిని. అట్లే చేసితిని. ఇందు నేను పొరపడియుంటి నని నేను కనిపెట్టగలిగితే, తప్పు దిద్దుకొని దానిని ప్రకటించి వెనుకకు మఱలెదను. అట్లు కనిపెట్టే అవకాశమున్నా స్వల్పమే. ఇది అంతర్వాణిచేసిన స్పష్టమగు సూచన. దీనినిగూర్చి చర్చించ వద్దు. తప్పక ఆమోదింపుడు. భారతము యావత్తుగాని, కనీసం ఢిల్లీగాని, తగిన జవాబు ఇస్తే, త్వరలోనే ఈ ఉపవాసము ముగియవచ్చును.

## మెత్తదనము పనికిరాదు

ఈ ఉపవాసం అంతమైనా కాకపోయినా ఇప్పుడున్న క్షపితిని పరిష్కరించుటలో పిరికిగుండెలు పనికిరావు. నా ఉపవాసాలు కొన్ని నిర్బంధాలుగా ఉపకరించినవనిన్నీ యోగ్యతలనుబట్టి యోచిస్తే నాకు ప్రతికూలమైన తీర్పే వచ్చేదనిన్నీ కొందరు విమర్శించారు. కాని అట్టి విమర్శల ప్రయోజన మేమి? దీని సంకల్పోద్దేశ్యములు సమంజసములని ఋజువు అగుచుండ, ప్రతికూలపు తీర్పులవలన ప్రయోజనములేదు. కర్తవ్యపాలనము

వలె, పవిత్రమైన ఉపవాసము దాని కదే సత్ఫలితము. ఏఫలిత మును కోరి, నే నిది చేయుటలేదు. చేయకతప్పదు. కనుక చేయు చున్నాను. ఉద్రేకరహితముగా పరిశీలించిన పిమ్మట నేను చావ వలసివస్తే, శాంతముగా చావనిండు. అలాటి శాంతి నాకు భద్రమయ్యేయున్నది. భారతదేశం, హిందు, సిక్కు, ముస్లిం మతాలు నాశనమగుతుంటే, నిస్సహాయుడైన సాక్షిగా, నిలిచి చూస్తూయుండుటకన్న, నా మరణము మహోత్కృష్టమైన విమోచనము. వివిధమతముల ననుసరించు జనులకు సమానమైన హోదాను, ఆస్తిప్రాణముల భద్రతను, పాకిస్థాన్ కలిగించలేక పోతే, అపుడు ఇస్లాంయొక్క నాశము తథ్యము. భారతము దీనికి నకలైతే, ఇచ్చటను ఇస్లాం నాశనమును స్పష్టమే. అపుడు రెండుభారత భాగాలలోను ఇస్లాం చస్తుంది. మిగత ప్రపంచంలో బ్రతికేయుంటుంది. హిందూ, సిక్కుమతాలకు ఇండియా తప్ప వేరు ప్రపంచములేదు. నా ఉపవాసమువలన అంతరాత్మలు మేలుకొనవలెనే గాని మొద్దుబారకుండును గాక !

ప్రియతమ భారతభూమిలో ప్రవేశించిన కుళ్ళును కొంచెం తలపుకు తెచ్చుకోండి. భారతజననియొక్క వినమ్రపుత్రుడు ఛోకడు వలసిన బలంతోను, పవిత్రతతోను సుయోగ్యమగు ఈయషధము వేయగలుగుతున్నాడని మీరు సంతసింపవచ్చును. ఆ బలంకాని, పవిత్రత కాని అతనిలో లేకనేపోతే అత డీ భూమికి బరువే. అపుడు అత డెంత త్వరలో అదృశ్యుడైతే, తనకును ఇతరులకును గూడ అంతమంచిది.

ఎవరును బిర్లా ఇంటికి పరుగిడవద్దు. నేను దైవముచేతిలో నున్నాను గనుక, నన్నుగూర్చి ఆదుర్దాచెందవద్దు. ఇది పరీక్షా సమయం. అంతర్వీక్షణ చేసుకొనండి. తమతమ క్షేత్రములలో నుండి మునుపటికంటె ఎక్కువగా కర్తవ్యముల పాలించువారు, నాకును ఉద్యమమునకును తోడ్పడుదురు. ఈ ఉపవాసము ఆత్మ పారిశుద్ధ్యమునకు సాధనము.

## ఆత్మ పవిత్రతకు విజ్ఞప్తి

నిన్న తెల్పిన ఆంధ్రదేశపు ఉత్తరాలు రెండింటిలో ఒకటి నా స్నేహితుడు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి వద్దనుంచి వచ్చినది. అందలి ముఖ్యాంశములు ఏవన "ఇతర చిక్కుసమస్యల మాట అటుంచినా, అన్నిటికన్న గొప్పసమస్య కాంగ్రెసు వాదులకు సంభవించిన నైతికపతనం. ఇతర రాష్ట్రాల మాట నే నెత్తను. మా రాష్ట్రములోని స్థితి శోచనీయము. అధికారము రుచి చూచిన పిమ్మట వారి తలలు తిరిగినవి. దీపము ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోమను సూత్రమును శాసనసభ్యులు అనుసరించుచున్నారు. న్యాయస్థానములలో విచారణ కూడా స్తంభింపచేయు నట్లు తమ పలుకుబడిని వినియోగించి, డబ్బు ప్రోగుచేయుచున్నారు. వీళ్ళ జోక్యంవలన జిల్లాకలెక్టరు మొదలగు పెద్ద ఉద్యోగీయులు కూడా న్యాయ నిర్వహణము చేయ జాలకున్నారు. న్యాయస్థుడైన ఉద్యోగస్థుని మీాద కూడా మంత్రుల వద్ద చాడీలు చెప్పి, వారిని తంటాలుపెట్టుచున్నారు.

స్వరాజ్య మనే సర్వాకర్షణీయ భావముచేత ప్రజలు మీా నాయకత్వం అనుసరించారు. ఆ గమ్యస్థానము చేరినాము. కాని ఆ యోధులకుండిన నైతికనిగ్రహ మంతా సడలిపోయింది. జాతీయ ఉద్యమానికి ప్రబలవిరోధు లని పేరుపొందిన వారితో ఈ స్వరాజ్యవాదులు చేతులు కలుపుచున్నారు. రోజు రోజూ ఈ స్థితి దుస్సహ మగుచున్నది. కాంగ్రెసు, కాంగ్రెసు ప్రభుత్వాలు రోజురోజుకూ అపఖ్యాతి పాలగుచున్నారు. ఆంధ్రలో గత పురపాలకసంఘ ఎన్నికలలో కాంగ్రెసుబలము ఎట్లు నశించినది ఋజు వైనది. ఎన్నికలకు అన్ని ఏర్పాట్లు చేసిన పిమ్మట మంత్రినుంచి అర్జంటుతంతె వచ్చి గుంటూరు ఎన్నికలు ఆపబడినవి. ఇప్పటికి 10 సంవత్సరముల నుండి సర్కారు నియమించిన సభ్యులే ఇచట పని చేయుచున్నారు. ఇపుడు మరల సభ్యుల నియమింతురట. కళ్ళు లేక బాధపడు నాకు స్వార్థ మేమి లేదు. కొందరు రాష్ట్రి జిల్లా కాంగ్రెసుసభ్యులను గూర్చి నాకున్న గట్టి భావా లను నే నెన్నడు దాచలేను. కాంగ్రెసులోని కక్షలు, డబ్బు యందలి తీపి, మంత్రుల దుర్బలము, వీటిచే ప్రజలలో తిరుగుబాటు కలుగుచున్నది. ఇంత కంటె ఆంగ్ల ప్రభుత్వమే మంచిది, అని గట్టిగా చెప్పుచు, కాంగ్రెసును తిట్టుచున్నారు."

భారతదేశ సేవకుడు, స్వార్థత్యాగి యైన ఈతని మాటలను, ఆంధ్రులును, ఆంధ్రేతరులును గమనింతురు గాక. ఆయన వర్ణించిన కుళ్ళు ఒక్క ఆంధ్రదేశపు దురదృష్టమే యని అనుకోనక్కరలేదు. జాగరూకుల మగుదుముగాక!

పటేల్ ఈ మధ్యాహ్నం వచ్చినపుడు మానాదికారణ ములచేత బహావల్పూరు విషయం ఎత్తలేదు. ఆ స్నేహితులను ఓర్పుతో నుండమని కోరెదను.

## 123

13-1-48

మామూలుగా నేటి సాయంత్రముకూడ గాంధీజీ ప్రార్థన సభకువచ్చెను. తాను మామూలుగా ప్రార్థన స్థలమునకు నడచి వచ్చినందుకు ఆశ్చర్యపడవల దని గాంధీజీ ప్రజలను హెచ్చరించెను. మొదటి 24 గంటలలో ఉపవాసము వలన దుర్బల మేర్పడదు. అపుడపుడు 24 గంటలచొప్పున చేయు ఉపవాసము మేలే చేయుచుండును. రేపు నేను నడువలేకపో వచ్చును. ప్రార్థన యందు శ్రద్ధ కలవారు వస్తే భజనలు వగైరాలు జరుపబడును.

### బహావల్పూరు శరణార్థులు

సర్దారుపటేల్ శాఖలో పనిచేయు శ్రీ శంకర్ రాకను గూర్చి కొంత అపోహకలిగింది. సర్కారు నౌకరులు సామాన్య గృహస్థుల ఇంటికి వత్తురనుకో రాదు. అయినా, మరొక పర్యాయము వచ్చుటకు ఆయన తయారుగా నున్నాడు.

### తప్పెవరిది ?

ఈ ఉపవాసానికి ఎవరి తప్పు కారణ మని గాంధిజీని అడిగిరి. ఢిల్లీనుండి ముస్లింలను వెళ్ళగొట్టవలె నని హిందువులు, సిక్కులు బలవంత పెట్టితే, వారు తమ దేశానికి మతానికి చేసే

ద్రోహమే ఆయనకు బాధ కలిగించింది. ముస్లింల మేలు కొఱకే ఈ ఉపవాసము జరుపబడుచున్న దని కొందఱు నిందించిరి. ముస్లింల మేలుకొఱకు అన్న సంగతి నిజమే. అల్పసంఖ్యాకుల కొఱకు, అవస్థలో నున్నవారి కొరకు తన జీవితము పొడుగునను ఆయన కృషి చేయుచుండెను. ప్రతివాడు అలాం చేయవలసిందే. భారతంలోని ముస్లింలయొక్క ఆత్మ గౌరవమును ఆత్మ విశ్వాస మును పాకిస్థాన్ పాడుచేయుటవల్ల ఆయనకు బాధకలిగింది. ఆత్మ విశ్వాసము లేని జనము ఏ రాజ్యాంగము నైనను నిర్వీర్యము చేయుదురు. ఈ ఉపవాసము ముస్లింలకు వ్యతిరేకముగ కూడా చేయబడుచున్నది. హిందువులను సిక్కులను వారు ధైర్యముతో ఎదిరించలేనందుకు ఆయనకు బాధకలిగింది. వారికట్టి శక్తి రావలె నని ఆయన ఉద్దేశ్యము. "ముస్లిం లీగర్లు ఒక రాత్రిలో భారత మిత్రులు కాలే" రని సర్దార్ చెప్పిన దానికి ఆయనను నిందించ రాదు. నేనును నిందించను. చాలమంది హిందువుల అభిప్రాయ మది. అదిఅబద్ధమని మాటలతోగాక చేతలతో లీగర్లే ఋజువు చేయవలెను. నెహ్రూ, సర్దారుల పద్ధతులు వేరు వేరయినా, నెహ్రూ ఆయనను ఎన్నికైన సహకార్యకర్తగా గౌరవిస్తాడు. సర్దారు ముస్లింలకు విరోధి అయితే, పనినుండి విరమించ మని పటేల్‌తో నెహ్రూ చెప్పేవాడే. సర్దారు ఇప్పటికిని గాంధిజీకి గౌరవనీయ స్నేహితుడే. కాని సర్దారు నా "తథాస్తు మనిషి" అని ఒకప్పుడు ప్రజ లతనికిచ్చిన ముద్దుపేరు. అయితే ఇప్పుడట్లా కాదు. మంత్రివర్గంలోని కట్టుబాటు కూడా మంత్రులు గుర్తిం

చాలి. ప్రతిమంత్రి చేసేపనికి మంత్రివర్గమంతా బాధ్యతవహించ వలెను. అందరూ హృదయ పరిశోధన చేసుకుందురని, దానితో పరస్పరగౌరవ విశ్వాసము లేర్పడునని గాంధీజీ నమ్మకం. సైతానును హృదయపీఠము నుండి తొలగించి, అచ్చట దేవుని ప్రతిష్ఠించవలెను.

## హిందువుల, సిక్కుల కర్తవ్యమేమి ?

నీ గురుదేవునికి ప్రియమైన పాట విన్నారుగదా! నీమాట, నీపిలుపు వినేవాళ్ళు లేకపోతే, "ఒంటరిగాపో, ఒంటరిగాపో". ఈపాటను నౌకాలీపాదయాత్రలో ప్రతిరోజూ పాడేవారు. గాంధీజీ దానిని మెచ్చుకొనేవారికి కొన ఊపిరితోగూడను గాంధీజీ చెప్పేదేమంటే:—"పాకిస్థాన్‌లో ఏమి జరిగినాసరే భారతం లోని ఒక్క ముస్లింపై కూడ అక్రమము చేయమని చెప్పే సాహసం హిందువులు, సిక్కులు సంపాదించవలెను. ఎంతగొప్పకోప కారణము ఉన్నా పాపపుపనులు చేయరాదు."

## ఢిల్లీకి పరీక్షకాలము

ఢిల్లీలో నిజమైన శాంతి ఏర్పడినచో, గాంధీజీ ఉపవాసం అంత మగును. ఢిల్లీ పతనముతో రెండు రాజ్యాలు పతనమైపోవును. సుహ్రావర్ది వంటి వానిని మేటి గుండా అంటున్నారు. గుండాలని రుజువైన వాళ్ళ నందరిని బంధించవలసినదే. అతడు గాంధిజీతోనే బస చేసెను. అతడు ఐచ్ఛికముగ ప్రార్థనకు హాజరగుచుండెను. కాని సుహ్రావర్ది కలకత్తాలో శాంతికొఱకు త్రికరణశుద్ధిగా పనిచేసెను. అక్రమముగా హిందూ కొంపల నాక్ర

మించిన ముస్లిం లను బయటికి లాగివేసెను. శాంతి స్థాపనకు ఎన్నాళ్ళుపట్టినా ఫర్వాలేదు. గాంధీజీ ప్రాణం కాపాడుటే ఎవరి ఉద్దేశ్యం కారాదు. భారతదేశాన్ని భారతగౌరవాన్ని కాపాడుటకై కృషి చేయాలి. కాలం పరిపక్వం కాకముందు ఉపవాసం విరమించేటట్లు గాంధీజీకి ఎవరును ప్రలోభం కల్పించరాదు.

# 124

14-1-48

ఆనాటి ప్రార్థన శ్రోతలకు వ్రాతమూలకమైన సందేశం పంపుదామనుకొని మరల మనసు మార్చుకుని గాంధీజీ డాక్టర్లు వద్దన్నను ప్రార్థనసభకు నడిచివెళ్ళెను. ఆయన జీవితము దైవం చేతిలోనున్నది. తాను బ్రతుకవలెనని దైవం తలంచితే, చావు రానేరాదు కదా !

## సందేశముల వరద

దూరంనుండి దగ్గరనుండి తంతెలు వచ్చుచున్నవి. ఉపవాసారంభమున ఇచ్చిన సందేశ ప్రకారము నడిచెదమని హామీ ఇస్తున్నారు కొందరు. అందులో కొన్నిటిని ఏరి ప్యారీలాల్ ప్రకటించబోతున్నాడు. వాటిని పంపువారు హిందువులు ముస్లింలు సిక్కులే గాక ఇతరులును ఉన్నారు, లాహోరునుండి శ్రీమతి మృదులా బెన్ ఇలా వ్రాస్తున్నది. "గాంధీజీ ఆరోగ్యమును గూర్చి ఆదుర్దాపడేవారు ఇక్కడనున్నారు. తాము ఏమి చేయవలెనని ఆయన కోరుదురో తెలుసుకొన, కుతూహలపడు వారు

చాలమందికలరు. పాకిస్థాన్‌లోని రాజకీయ కక్షులలోను సర్కారు పనులలోను ఉన్న ముస్లింలు ఏమి చేయవలయు నని గాంధీజీ కోరును?" ఇట్టి ముస్లింమిత్రు లున్నా రనుటచే గాంధీజీకి కొంత తృప్తికలిగెను. ఈ ఉపవాసము ఆత్మపారిశుద్ధ్యంలో ఒకసాధన. దీనితో సానుభూతికలవా రందరు, వారు సర్కారునౌకర్లయినను రాజకీయ కక్షుల వారైనను అందరూ ఈ ఆత్మపారిశుద్ధ్యసాధనలో తప్పక పాల్గొనవలెను.

## పాకిస్థాన్ కొకమాట

కరాచీలో నుండే సిక్కులమీద క్రూరంగా దాడి చేసి, నిరపరాధులగు స్త్రీలను పురుషులను బిడ్డలను నరికివేసి, దోచుకొని, ఇతరులను వెళ్ళగొట్టి హింసచేసిరి. సరిహద్దుప్రాంతంనుంచి ముస్లిమేతరశరణార్థులను తీసుకొనివచ్చే రయిలుమీద గుజరాత్ పట్టణము వద్ద దాడిసల్పి అనేకులను చంపి, స్త్రీల నపహరించిరి. వీటివల్ల నాకెంతయో దుఃఖముకలుగుచున్నది. ఎన్నాళ్ళదాకా భారతము సహించి ఊరకొనగలదు? ఎన్నాళ్ళదాకా హిందువులు సిక్కులు దీనిని సహింతురని నేను ఆశపడగలను? నేను ఉపవాసము చేయుచున్నను గూడ, ఎన్నాళ్లు సిక్కులు హిందువులు సహనము చూపుదు రని ఆశపడగలను? పాకిస్థాన్ ఈ దుస్థితిని అంతమొందించి తీరవలెను. హిందువులు సిక్కులు పాకిస్థాన్‌కు తిరిగివచ్చి క్షేమముగా నుండేటంతవరకు మేము విశ్రమించ మని పాకిస్థాన్ పవిత్ర హృదయముతో ప్రమాణము చేయవలెను.

భారతములో ఆత్మ పారిశుద్ధ్యపు వెల్లువ బయలుదేరితే, పాకిస్థాన్ పవిత్రం అవుతుంది. గతకాలపు భేదాలు ద్వేషాలు క్రూరకృత్యాలు మరచిపోతారు. జిన్నా కన్న ఆస్తి, ప్రాణాల సంరక్షణ, గౌరవం అక్కడ కడగొట్టు వానికి కూడా కలిగించే పవిత్ర రాజ్యం అవుతుంది. అంతదాకా అది పాపపు రాజ్యమే. ఆ పేరు పెట్టినందుకు నేను పరితాపపడ నక్కరలేదు. కాగితాల మీదకాదు; జోరైనఉపన్యాసాలలోకాదు; పవిత్రత అచ్చట ముస్లిముల దైనిక జీవితంలో కంటికి కనుబడవలెను. అపుడు భారతముకూడా పూర్వపు వైరము మఱచి పాకిస్థాన్‌ను అనుసరిస్తుంది. నేను బ్రతికియుంటే, మంచి చేయుటలో పాకిస్థానును మించవలెనని భారతమునకు సలహానిత్తును. ఈ ఉపవాసోద్దేశ్యం అంతకేమాత్రమును తక్కువ కాదు. ఇపుడు అచ్చటి దుష్టవర్తనను ఇచ్చటి ఇండియన్ లోని మనము అనుకరించుచుండుట మనకు లజ్జాకరము.

## నా స్వప్నం

హృదయపూర్వక మగు సాంఘిక ఐక్యత ఏర్పడవలె నని రాజకీయము లేమాత్రమును ఎరుగని నా చిన్నతనములో నేను కలగంటిని. నాటి కల ఈజన్మలో సార్థకమైనదని చెప్పి ఈవృద్ధుడు ఉప్పొంగి గంతులు వేయును. పూర్వ ఋషులు నిర్ణయించిన పూర్ణాయుర్దాయము, 125 ఏండ్లు బ్రతికే కోరిక తిరిగి మొలకెత్తును. అపుడే మనకు నిజమైన స్వరాజ్యప్రాప్తి కలుగును. చట్టమును, ప్రదేశమును బట్టి మనవి రెండురాజ్యా లయినా, ప్రజల

నిత్య జీవితంలో ఇది ఒకేరాజ్య మని భావిస్తారు. అంత మహో త్కృష్టస్థితి కలుగునా ? అయినను ప్రఖ్యాత చిత్రకారుడు రచించిన ప్రఖ్యాత చిత్రలేఖనంలోని బిడ్డకువలె, అట్టిది లభించేవరకు నాకు సుఖ ముండదు. దానికి తక్కువైన గమ్యం ఏదీ నన్ను తృప్తిపరచదు. అచ్చోటికి నేను చేరగలుగుటకు పాకిస్థాన్ స్నేహితులు తోడ్పడుదురు గాక. ఒకసారి చేరిన-చో అది గమ్యం కాకుండ బోవును. గమ్యమునకు దగ్గర దగ్గర చేరుచుండుటయే మనకు సాధ్యం. ఆ పవిత్ర ప్రదేశము చేరుటకుగాను ప్రతివాడు పరిశుద్ధు డగుటకు అవకాశ మున్నది. 1896 లో నేను చూచిన ఢిల్లీ కోటలోనో, ఆగ్రా కోటలోనో ద్వారముపై వ్రాయబడిన పద్య మొకటి ఉండెను. ఆ పద్యం అర్థ మిది. "ఈ భూమిపై స్వర్గము ఉంటే, అది ఇక్కడనే, ఇక్కడనే, ఇక్కడనే ఉన్నది!" కాని ఆ కోట ఎంత ఐశ్వర్య సంభరిత మైనను, నా ఉద్దేశ్యంలో అది స్వర్గముకాదు. పాకిస్థాన్ దర్వాజా లన్నిటిమీదను ఆపద్యం రచించవలెను. భారతముగాని పాకిస్థాన్‌గాని అట్టి స్వర్గమైనపుడు అందు పైసా లేనివారు, బిచ్చమెత్తువారు, ఉచ్చ నీచ భేదాలు, కోటీశ్వరులగు యజమానులు, తిండి లేని కార్మికులు మత్తుపదార్థాలు ఉండవు. స్త్రీ పురుషుల పవిత్రత భద్రంగా ఉంటుంది. ప్రతి మతస్థుడు తన భార్యకాక పరస్త్రీని తల్లిగానో, తోబుట్టువుగానో, కూతురుగానో వయస్సునుబట్టి చూస్తాడు. అస్పృశ్యత పోతుంది. అన్నిమతాలయందు సమానమైన ఆదరం ఉంటుంది. అందరు ఐచ్ఛికముగా తిండికొరకు కాయకష్టము చేస్తారు. ఈ

మాటలు విన్నవారు, లేక ఈ వాక్యాలు చదివినవారు నేను మంచముమీద పరుండి సూర్యుని వేడి వెలుగుల ననుభవిస్తూ ఈ పారవశ్యములో మైమఱచితే, నన్ను మన్నింతురు గాక! ఈ ఉపవాసం త్వరలో ముగింపవలె ననే కోరిక నాకు లేనట్లు, ఎల్లరు గ్రహింతురుగాక. ఈ పిచ్చివాని పారవశ్యపు కోరికలు ఫలించక పోయినను, ఈ ఉపవాసం విరమింపబడక పోయినను, ఇబ్బందిలేదు. అవసరమైనంత కాలము నేనిట్లు వేచియుండగలను. కాని అచ్చుగా నా ప్రాణమును కాపాడు దృష్టితో ఎవరు ఏ చర్యలు తీసుకున్నను నాకు బాధకలుగును. ఈఉపవాసము దైవ నిర్దేశ్యం. ఆయన కిష్టమైతేనే, ఇష్టమున్నప్పుడు ఇది ముగియును. ఈశ్వరేచ్ఛకు భంగం కలిగించే మానవుడు మునుపు లేడు, ఇక ఉండబోడు.

## 125

15_1_48

### మృత్యువే ముక్తి

నేడు గాంధీజీ ప్రార్థన స్థలమునకు నడచి రాలేకపోయెను. శబ్దవిస్తృతయంత్రం లేనందున, పరుండి చెప్పిన అంశము సభవారికి వినబడలేదు. ఆయన ఇచ్చిన సందేశమును హిందీలోకి అనువదించి సభలో వినిపించిరి.

ఇండ్లలో ఉండేవారందఱకు వినబడునట్లు రేడియో ప్రసంగానికి ఏర్పాట్లు చేశారు గాన, తన కంఠధ్వని వించే ఆ ప్రజకు

తృప్తికొలుపు నని ఎంచి, ఆయన మాటలాడెను. రేపు సందేశం వ్రాయించగల స్థితి ఉండునో లేదో ?

పరులనుగూర్చి యోజించక ప్రతి వ్యక్తియు అంతర్వీక్షణ చేసుకొని సాధ్యమైనంతవరకు తన హృదయమును పవిత్రం చేసుకొనవలెను. అందరు ఏదో ఒకనాడు చావవలసిందే; తప్పించుకొనలేరు. కాన దానిని గూర్చి భయపడనేల ? అనేక బాధల నుండి ముక్తికల్పించే మిత్రుడుగదా మృత్యుదేవత !

## చిత్రవధ

గత సాయంత్రము ప్రార్థన ఉపన్యాసం అయిన 2 గంటలకు, పత్రికా ప్రతినిధులు నన్ను చూడవచ్చిరి. బడలిక వలన వారిని చూడలేక, వారి ప్రశ్నలు వ్రాసి పంపమంటిని. వాటి సంగ్రహం ఈ దిగువ తెలుపబడినది.

1వ ప్రశ్న:- భారతములో ఎక్కడా గల్లంతు లేనపుడు మీరీ ఉపవాసము ఏల మొదలుపెట్టినారు ?

జవాబు:- ముస్లింల ఇళ్ళను బలవంతంగా స్వాధీనపఱచుకొనుటకు మూకలు చేసే గట్టి ప్రయత్నము, అల్లరి గల్లంతు కాదా ? పోలీసులు బాష్పవాయువు ప్రయోగము, తుపాకి ప్రయోగం కొంతవరకు చేస్తేగాని, ఆ మూకలు చెదరి పోలేదు. ఈ విధమైన కుయుక్తులను పన్ని ఆఖరు ముస్లిమును కూడా ఢిల్లీ నుంచి వెళ్ళగొట్టేవరకు నేను వేచియుండుట బుద్ధిహీనతయగును దీనినే ముక్కలు ముక్కలుగా నరుకుట అందును.

2వ ప్రశ్న:- సర్దార్ పటేల్ ముస్లింలకు వ్యతిరేకి యని ఫిర్యాదు చేసినవారికి మీరిచ్చిన జవాబులనుబట్టి, అప్పుడుచెప్పిన సందర్భాన్నిబట్టి ఆయన హృదయపరివర్తనకే ఇది చేయబడ్డదని పటేల్ దేశీయ వ్యవహార మంత్రిత్వముపై ఇది ఖండన యని ఊహ కలుగుచున్నది. ఆయన అవలంబించిన కార్యవిధానమును ఖండించినట్లే అనుకుందురు. ఈ విషయ మును స్పష్టీకరించండి.

జవాబు:- నా జవాబు ఖచ్చితంగానే ఉంది. మరొక అర్థమునకు అవకాశం లేదు. మీరన్న భావము నాకు తట్టనే లేదు. అప్పుడే నాకు అది తోస్తే ముందే మీ అనుమానము తీర్చేవాడను. పటేల్‌కు వ్యతిరేకముగా ముస్లింలు చెప్పే సమాచారాలను బాధపడుచు, అణుచుకొనుచు వినేవాడను. ఈ ఉపవాసం మొదలుపెట్టిన పిమ్మట అలాటి నిగ్రహం అవసరం లేదు. నన్ను, జవహర్‌లాల్‌ను పొగుడుట, పటేల్‌ను నిందించటము తప్పని చెప్పినాను. పటేల్ నిర్మోహమాటంగా మాట్లాడుటచే ఆయన ఉద్దేశ్యాలకు భిన్నంగా కూడా, ఇతరులకు బాధ కలుగ వచ్చును. యావజ్జీవిత విశ్వాసపాత్రుడైన స్నేహితుని అయోగ్యమైన అపనిందలనుండి కాపాడుటకే ఉద్దేశించి, నేనా ప్రకటన చేసితిని. ఆయన ఎవరికి 'తందాన తాన' అనేవాడు కాడు. నాతో ఏకీభవించినపుడు కూడా తనకు నచ్చితేనే అలా చేసే వాడు. అతి సమర్థుడైన రాజ్య నిర్వాహకుడైనను రాజకీయ శిక్షణను వినమ్రతతో నావద్దనే పొంది యుండెను. అదివరకు అతడు మిక్కిలి విజయవంతముగా ఉపయోగించిన అహింసా

ఆయుధమును, పరిపాలనా చక్రములో ప్రవేశపెట్ట జాల నని, ఆయన కనిపెట్టెను. అదివరకు అహింసయని పిలువబడ్డది సాత్విక నిరోధమను మాయసరు కని నేనూ కనుగొంటిని. ఈ సాత్విక నిరోధమువలన పరిపాలకునకు లాభములేదు. తన యజమానుకై తనను నమ్మిన ప్రజలను కూడ అది అవమానపఱచును. సర్దార్ అట్లు చేయజాలడు.

## ఉపవాస ఉద్దేశ్యము

ఈతబ్సీళ్లు తెలిసిన పిమ్మట నేను నా యుపన్యాసమువలన పటేల్ కార్యవిధానాన్ని ఖండించెను అనే వారు ఉంటే అట్టి వారు నన్ను, సర్దారును కాక తమ్ము తామే అవమానించుకొను వారగుదురు. ఎవరు పతనమైనా తమవల్లనే గాని ఇతరులవల్ల గాదు. నా ఉపవాసము భారత సమ్మేళనములో అల్పసంఖ్యాలో నున్న ముస్లింల క్షేమముకొఱకు చేయబడింది. అనుమానము లేదు. కాన ఇచ్చటి హిందూ, సిక్కులకున్న, పాకిస్థానంలోని ముస్లింలకున్న ప్రతికూలంగా ఈ యుపవాసం చేయబడుచున్నది. నాబోటి దుర్బలుడు, అసంపూర్ణుడు చేసిన ఈ ఉపవాసం దాని ఆశ్రయములో నున్నవారికి ఏయాపదలును రాకుండ కాపాడ గలదని నే నాశించజాలను. అందరి ఆత్మపారిశుద్ధ్యమునకై ఈసాధన జరుగుచున్నది.

## అపార్థమునకు అవకాశము లేదు

3వ ప్రశ్న : కరాచీ అల్లరులు, గుజరాతు రయిల్వే హత్యలు జరిగిన వెంట నేను, యు. యన్. ఓ. సభలు జరుగ

నున్నపుడును, మీరు చేస్తూన్న ఈ ఉపవాసమును పురస్కరించుకొని, పాకిస్థాన్ ప్రతినిధులు భారతప్రతికూల ప్రచారం బాహుళ్యంగా చేస్తారు. నిజము నలుమూలలు వ్యాపించి బయటపడుటకు కొంతకాలము పట్టుతుంది. ఈలోపల యు. యన్. ఓ. వద్ద మన వాదానికి దెబ్బతగులుతుంది.

దీనికి పెద్దజవాబు అక్కరలేదు. లోకములో దీనివల్ల సుముఖత్వమే ఏర్పడ్డది. నిష్పక్షపాతంగా ఇండియాదేశపు సంగతులు గమనించేవారు నా ఉపవాస ఉద్దేశ్యమును వక్రపఱుపలేరు. ఇండియా యూనియన్, పాకిస్థాన్ రెండురాజ్యాలలో నుండువారికిని సద్బుద్ధికలుగుటకే ఇది మొదలుపెట్టబడినది. పాకిస్థాన్‌లోని అధికసంఖ్యాకులగు ముస్లింలు సవ్యంగా ప్రవర్తించకపోతే, భారతంలో అల్పసంఖ్యాకులగు ముస్లింల కాపాడజాలరు.

యు. యన్. ఓ. వారు నా ఉపవాస సహాయమున సరియైన తీర్మానానికి వచ్చెదరు; ఈ రెండురాజ్యాలకు సక్రమమైన మార్గము చూపెదరు.

## 126

16-1-48

## దైవానుగ్రహము

గాంధీజీ వ్రాయించి పంపిన సందేశము చదువకముందే, పడుకొన్న మంచముమీదనుండియే, శబ్దవిస్తృతయంత్రము ద్వారా వారికి బోధించెను. క్రిందటి రోజుకంటె, ఆయన కంఠస్వరము బలంగానే యుండెను. ఏ యుపవాసములోను నాలుగవ

రోజున నేడు ఉన్నంతహాయి ఎన్నడును ఆయనకు కలుగలేదు. అది అచ్చుగా దైవానుగ్రహమే. ఈ ఆత్మపారిశుద్ధ్యసాధనలో అందరు పాల్గొన్నచో, చివరదాకకూడా మాటలాడే శక్తి యుండవచ్చును. ఉపవాసం చాలించే తొందర ఆయనకు లేదు. తొందరవలన పనులు పాడవుతవి. ఢిల్లీలో నిజమైన శాంతి నెల కొంటే అది దేశమంతటా వ్యాపించును. రెండురాజ్యములందును శాంతిస్థాపన అయితేనే గాని, బ్రతుకవలెనను కోరిక గాంధీజీకి లేదు.

## సంపూర్ణ సద్భావము

ఆయన సందేశములో చెప్పిన సారాంశము ఏ మంత్రి మండలికైనా సుస్థిరమైయున్న కార్యవిధానము మార్చుట తేలికగాదు. అయినను బాధ్యతగల మనమంత్రిమండలి స్థిరపడిన సంగతిని అస్థిరమొనర్చింది. దేశీయుల కృతజ్ఞతకు వారర్హులు. ప్రపంచంకూడా ఈ ఔదార్యాన్ని మెచ్చుకొంటుంది. ఇది ముస్లింల మెప్పుకోరకు గాక, ఆత్మతృప్తికోరకు చేయబడ్డ పని. నా ఉపవాసము రాజ్యాంగపు దృక్పథము నంతా మార్చెను. ఈ ఉపవాసము లేకపోయినచో, పూర్వపుశాసనము ప్రకారమే వారు నడిచేవారు. భారత ప్రభుత్వము చూపిన ఔదార్యము కల్తీలేని సద్భావప్రదర్శనము. ఇప్పుడు పాకిస్థాన్‌కు పరీక్షాసమయం. వారి ఆత్మగౌరవాన్ని వారే కాపాడుకొనవలెను. ఇప్పటి విరోధం పోయి స్నేహం ఏర్పడవలెను. ధర్మశాసనము కాగితపుశాసనము లను అతిక్రమించును. ఇంగ్లండులో ఒకచిరకాలపు సామెత

కలదు. 'సామాన్యచట్టమువలన న్యాయం కలుగకపోతే, ధర్మము వలన న్యాయము కలుగును' అని. అక్కడ శాసనానికి ఒకటి, ధర్మమునకు వేరొకటి, రెండు న్యాయస్థానము లుండేవి. ఇప్పుడు భారతసర్కారు చేసిన పని అచ్చుగా న్యాయమైంది. దాని సౌష్ఠవమును ఎవరు కాదనజాలరు. దీని కొక పూర్వఉదాహరణ కావలెనంటే, 'మార్లోనాల్లు అవార్డు'ను తీసికోవచ్చును. ఆంగ్ల మంత్రివర్గముయొక్క సమష్టి అభిప్రాయము అది. రెండోగుండ్రబల్ల సభకు వెళ్ళిన అధికసంఖ్యాకులయొక్క తీర్మానం అది. కాని ఎర్వాడాలో చేసిన ఉపవాసముచే, అది తృటిలో తలక్రిందులైనది.

## ఉపవాసానికి తగిన జవాబులు

భారతసర్కారు చేసిన ఔదార్యమునుబట్టి, నా ఉపవాసం ఆపమని కొంద రంటారు. అలా నాకు బుద్ధిపుట్టుటలేదు. ఉపవాసము సాగినకొలది, వైద్యులు ఆదుర్దా చెందుచున్నారు. మూత్రపిండములలోని లోపాన్నిబట్టి ఆకస్మాత్తు మరణం రానప్పటికీ, మున్ముందు ఆరోగ్యభగ్నత కలుగునని వారి భయం. నేను వైద్యుల సలహాతో ఈ ఉపవాసము మొదలిడలేదు. వారి సలహాతో అంతరించేది కాదిది. నా ఏకైకగురువు, నియంత దేవుడే. ప్రమాదరహితుడు సర్వశక్తివంతుడు. ఆయనకు ఇచ్ఛ కలిగితే ఎవ రెన్నిజ్యోతిషములు చెప్పిననుకూడ ఈ శరీరమును నిలుపును. కాని నా బ్రతుకు దేశానికి అవసరమనుకుంటే వైద్యుల మందలింపులవల్ల ప్రజలలో భేదాలు పోయి, ఐక

మత్యము ఏర్పడాలి. స్వతంత్రుల స్వభావలక్షణమగు ధైర్యంతో శత్రువులని అనుమానింపబడ్డవారినికూడా మనం నమ్మవలెను. ధీరుడు అవిశ్వాసాన్ని తృణీకరించును. ఢిల్లీలోయుండే మూడు మతాలవారిమధ్య ఐక్యత ఏర్పడి, ఇతరచోట్ల యుండేమాటలు వారి ఐక్యతను చెరచకుండా యుంటే, నా ప్రతిజ్ఞ నెరవేరుతుంది. రెండురాజ్యాలమధ్య పూర్తియైన స్నేహము ఏర్పడి, ఇక్కడి పౌరులు అక్కడకు, అక్కడి పౌరులు ఇక్కడికి నిరాటంకముగా హాయిగా పోతూ, వస్తూ యుండే అవకాశమేర్పడటమే ఈ యుపవాసమునకు తగిన జవాబని రెండురాజ్యాల ప్రజలు గుర్తించినట్లు తోస్తుంది. ఆత్మపారిశుద్ధ్యం అట్టి ఉత్తమఫలితం అభిలషించును. పాకిస్థాన్ ఇచ్చే జవాబు ఏమి? బుద్ధియుంటే, అనేకమార్గాలు కనబడును. కాని ఆబుద్ధి ఉదయించినదా? అని ప్రశ్న.

## 127

17-1-48

### హృదయపవిత్రీకరణము

ఈ ఉపవాస బలాత్కారమువల్ల ఏపనీ చేయబోకండి. లోగడ ఉపవాసాల వత్తిడివలన చేసిన పనులు ఆ ఉపవాసానంతరము రద్దయిపోయినవి. అది దుఃఖకరమైన విషయం. హృదయ పవిత్రతయే ఆధ్యాత్మిక నిరశన వ్రతానికి సరియైన ఫలితం. ఈ పవిత్రత ఒకమారు కలిగినచో చనిపోవువరకు ఉంటుంది. పెద్దలు

వచ్చునప్పుడు ఇంటికి కొట్టే సున్నం కొన్నాళ్ళదాకా నిలిచియుం టుంది. కాని ఏటేట వెల్లవేయవలసివచ్చును. సవ్యమైన, సంస్తవ నీయమైన ఈ ప్రాబల్యముకన్న ఉపవాసానికి మరియొక న్యాయ మైన ప్రయోజనం లేదు.

## పాకిస్థాన్ కొకమాట

రాజులు, మహారాజులు, సామాన్యులు వద్దనుండి చాల తంతులువచ్చుచున్నవి. పాకిస్థాన్‌నుండికూడ వస్తున్నవి. మంచిదే కాని పాకిస్థాన్ స్నేహితునిగా, వారి క్షేమాభిలాషిగా నే చెప్పే దేమంటే : మీా అంతరాత్మలు జాగృతి పొందకపోతే, పాకిస్థాన్ బాధ్యత వహించవలసిన తప్పులను ఒప్పుకొనకపోతే, పాకిస్థాన్ నాయకులు దానిని స్థిరంగా నిలుపుకోలేరు.

ఐచ్ఛికమైన పునస్సమ్మేళనం నేను కోరుటలేదనుకోవద్దు. ఆయుధప్రయోగము వలన కలిగే పునరైక్యతకు మాత్రం నేను వ్యతిరేకిని. మరణశయ్యపై నుండి నే సనుచున్న దానిని అపశ్రుతి మాటగా యెవరును గణింపకుందురుగాక! పాకిస్థాన్‌వారికి కోపం వస్తుందనే భయముతో నా నిజమైన భావాలను వెల్లడించక పోతే, వారికిని నాకునుకూడ ద్రోహంచేసినవాడ నగుదును. నా యుద్దేశములో తప్పున్న దనుకుంటే, తెలుపండి సర్దుకుంటాను. నేను తప్పేమి చేయలేదు.

## ఉపవాసములో ఆనందము

ఈ యుపవాసము ఎవ్విధమగు రాజకీయపు ఎత్తు గాదు. అంతరాత్మ విధ్యుక్త ధర్మం చూపే అనివార్య మైన మార్గాన

నడుచుచున్నాను. ఆవేదనలో నుండి ఇది పుట్టింది. ఢిల్లీలోని ముస్లిం స్నేహితు లందఱు నన్ను రోజూ కలియుచు ఆ రోజు వార్తలు చెప్పుచుండురు. ఈ శుభసమయమున నన్ను లోభం పెట్టితే ఈ రాజులు, మహారాజులు, ఈ హిందువులు, సిక్కులు ఇందెవ్వరు తమకుగాని, దేశమునకుగాని మేలు చేయలేరు. అందరును తెలుసుకోనండి. ఆత్మ కొరకు ఉపవాసము చేయునప్పుడు పొందేటంత సౌఖ్యము మఱొకప్పుడు నాకు కలుగదు. ఇదివరకు కంటె కూడ ఈసారి నాకు ఎక్కువ సౌఖ్యం కల్గింది. ఎవరును నా ఈ సౌఖ్యాన్ని చెడగొట్టవద్దు. సైతానును వదలి దైవాన్ని దర్శించినా నని చెప్పగలవాడు తప్ప, మఱొకడు దీనిలో జోక్యం కల్పించుకోరాదు.

## 128

18-1-48

### ముందున్న పని

ఆదివారము సాయంత్రము గం. 5-20 కి గాంధీజీ పక్కమీదనుండియే మాటలాడెను. అంతకుముందే వ్రాయించిపంపిన సందేశం పిమ్మట ప్రార్థనా సమావేశమున చదువబడెను. ఆరోజు అందరకు సంతోష దినం. గురుగోవిందసింగు జయంతి అయిన పుణ్యదినమున, అందరి దయవలన తన ఉపవాసం విరమింప గలిగితి నని గాంధీజీ చెప్పెను. ఉపవాస ఆరంభము నుండి తనపై కురిపింప బడుచున్న దయా వర్షమును ఎన్నడును మఱువజాల ననెను. ఢిల్లీపౌరులు, పాకిస్థాన్ శరణార్థులు, సర్కారు నౌకరులు,

ప్రభుత్వము ఎల్లరు ఇందులో పాల్గొన్నారు. కలకత్తాలో కూడా ఈలాటి ప్రేమానుభవమే కలిగింది. అక్కడ శాంతి స్థాపనలో సుహ్రావర్ది చేసిన సాయము మఱువరానిది. ఆయన తోడ్పాటు లేకపోతే, గాంధీజీ కలకత్తాలో యుండేవారే కారు. అందరు గతమును మరువవలెను. అందరియెడ స్నేహం, ఎవరియందు విరోధము లేకుండుట, ఇదే కర్తవ్యమని నేర్చుకోవలెను. ఈకోటాన కోట్ల జనం అందరు దేవతలుగారు, దయ్యాలుగారు. సంఘములోని నేరపుజాతు లనబడువారి యెడ తక్కువస్నేహం కనుపఱతుమా ?

ముస్లింలు ప్రపంచంలో అనేక కోట్ల ఉన్నారు. ప్రపంచమంతతో స్నేహము కోరే మనము ముస్లింలతో ఏల స్నేహము చేయరాదు ? గాంధీజీ జ్యోతిష్కుడు కాకున్నను దేవుడు ప్రసాదించిన వివేకమువలన ఈ ఒక్క సంగతి ఆయనకు స్పష్టమైనది. ఇండియాలోని ముస్లింలను ఏ కారణము చేతనైనా మనము స్నేహితులుగా చేసికొననిచో, ముస్లిం ప్రపంచ మంతా మనకు ప్రతికూలమగును. అంతటితో భారతమునుకూడ కోల్పోదుము. ఈ రెండు రాజ్యాలు అపుడు తిరిగి విదేశీ పరిపాలన లోనికి దిగజారి పోవును.

ఢిల్లీలో నున్న అన్ని మతాలవారు సోదరులులాగ కలిసి మెలిసి యుందుమని హామీ ఇచ్చిరి. తమలో తాము కలహించమని మాట ఇచ్చిరి. ఈహామీలలో పాకిస్థాన్ శరణార్థులుకూడ చేరిరి. ఈశుభారంభము కొనసాగినచో, భారతములోను పిమ్మట

పాకిస్థాన్‌లోను శాంతి ఏర్పడును. ఇది ఒకరిపని గాదు. అందరు త్రికరణశుద్ధిగా సహకరించ వలెను. ఉపవాస విరమణ ఫలితము ఇట్లు పరిణమించనిచో ఉపవాసమును ఆపటమే తప్పు; మాటను మన్నించి భావాన్ని పరిమార్చినట్లే యగును. ఢిల్లీలో జరిగేపని రెండు రాజ్యాలలోను జరుగుట సాధ్యమే. ఇంతదనుక సైతాను వైపు చూచాము. ఇకముందు దైవమువైపుకు తిరుగుదాము. నాలుక తుదనుండి వచ్చే మాటల సేవ మంచిది కాదు. హృదయము దేవునికి ఒప్పజెప్ప వలెను. ఎన్ని పేర్లిడినా దైవము ఒక్కడే. దీనిని గ్రహించినచో విరోధము, అసహనమును అంతమగును.

గీతను గ్రంథసాహెబును చదువునట్లు హిందువులు కురాను చదువవలెను. కురాను చదివినట్లే ముస్లింలు గీతను గ్రంథసాహెబును చదువవలెనుగూడా. చదివినదాని యర్థమును గ్రహించి సర్వమతములను సమానముగా గౌరవింపవలెను. ఆది నుండి గాంధీజీ ఆదర్శము, అనుష్ఠానము అదియే. ఆయన సనాతనుడు; గాని విగ్రహారాధకుడు కాడు. అయినను విగ్రహారాధకులను తృణీకరించడు. ఎల్లెడ సన్నిహితమైయున్న దేవుని కొందరు రాతి విగ్రహములో చూతురు. కొందఱు ప్రమాణ గ్రంథములలో చూతురు. అది మాత్రము ఒక విగ్రహ, స్థూల ఆరాధన కాదా ? రైళ్ళలోనుండి మనుష్యులను క్రిందికి పడత్రోయుట వంటి విచారమైన పనులు ఇకముందు జరుగరాదు.

# ఉపవాస విరమణ

వ్రాసి ఇచ్చిన సందేశములోని ముఖ్యాంశములు పరమ సత్యం పేర- దాన్నే మామూలుగా దేవు డనియెదరు- నే నీ ఉపవాసము మొదలుపెట్టితిని. చిద్రూపమగు ఆ సత్యం లేక పోయినచో, దేవుడే లేడు. దేవునిపేర ఘోరపాపముల నెన్నిటినో సిగ్గులేక చేసియున్నాము. ఇందులో ఏదైనా, ఎవరైనా, ఆ సత్యం పేరుతో చేసినారేమో నే నెఱుంగను. నే నా సత్యమును కీర్తించుచునే, ఉపవాసము నాపితిని. మన ప్రజలు పొందే హృదయావేదన దుస్సహమయ్యెను. హిందు, ముస్లిం, సిక్కుల ప్రతినిధులున్ను, హిందూమహాసభ, రాష్ట్రీయస్వయంసేవక సంఘములయొక్క ప్రతినిధులున్ను, పంజాబు సరిహద్దు ప్రాంతము, సింధులనుండి వచ్చిన శరణార్థుల ప్రతినిధులున్ను, నూరుమందికి మించిన ఘనులను రాష్ట్రపతి రాజేంద్రబాబు ఇక్కడికి చేర్చెను. పాకిస్థాన్ హైకమిషనర్, ఢిల్లీ చీఫ్‌కమిషనర్, ఢిల్లీ డిప్యూటీ కమిషనర్, అజాద్ హింద్ ఫౌజు తరఫున షానవాజ్ ఖాన్ ఆసభలో నుండిరి. పోతపోసిన విగ్రహం పోలిక నిశ్చేష్టుడై పండిట్ నెహ్రూ అక్కడనే యుండెను. మౌలానాసాహెబూ ఉండెను. ఈ ప్రతినిధులు హిందూస్థానీలో సంతకముచేసిన ఒకపత్రమును రాజెన్ బాబు చదివి వినిపించెను. బరువెక్కిన వారి హృదయాలపై బరువు వేయవద్దనియు, ఉపవాసము ముగించి వారి ఆవేదనను అంతమొందించమనియు, వారందఱు వేడుకొనిరి. ఈలాటి స్నేహితులందరి సలహాను నిరాకరించలేకపోతిని. ఏది ఎట్లున్నా,

ఇచ్చుటనుండు ఆరుమతములమధ్య పూర్ణమైన స్నేహముండు ననియు, అది భగ్నముకానట్టి స్నేహ మనియు, వారుచేసిన శపథమును నేను నమ్మకతప్పదయ్యెను. ఆస్నేహము భగ్నమైతే, ఈజాతి వ్రయ్యలగును.

## నా వ్రతోద్దేశము

నాయెదుట విప్పారుచున్న మానవకోటి సేవావకాశమును యుక్తంగా ఉపయోగించుటకు తగిన వివేకమును సామర్థ్యమును దైవము ప్రసాదించుగాక. ఇప్పటి పవిత్రశపథమును నెగ్గిస్తే, మానవసేవ నిమిత్తం నేను పూర్ణాయుర్దాయమును కోరెదను. అది 125 ఏండ్లని కొందరు, 133 ఏండ్లని మరికొందఱు చెప్పు చున్నారు. నే ననుకొన్నదాని కన్న వేగంగాను, నా ప్రతిజ్ఞ నెగ్గింది. వేలకొలది శరణార్థులును ఇతరులును నిన్నటినుండి ఉప వాసము చేయుచుండగా వేరొండు ఫలితం ఎట్లు కలుగును ? గాఢస్నేహమునుగూర్చిన హామీలు వేలకొలది జనమునుండి వెల్లువగా వచ్చుచున్నవి. లోకమంతటినుంచి ఆశీర్వాద తంతెలు వచ్చిపడుచున్నవి. ఇవన్నీ దైవానుగ్రహ చిహ్నాలు కావా ? అక్షరశః నా ప్రతిజ్ఞ సఫలం చేయబడినది. దానిలోపలి యుద్దే శముకూడ సఫలీకృతము కావలెను. అది పరుంటే రెండు రాజ్యాలలోని వివిధమతస్థులమధ్య త్రికరణశుద్ధిగల స్నేహము నెలకొనవలెను. ఇండియాలో చీకటియున్నచో పాకిస్థానులో వెలుతురుండదు. అలా అనుకొనుటయు పొరపాటే. ఇక్కడ చీకటిపోతే, అక్కడకూడ పోతుంది. అలాంటి శుభశకునములు

కనుబడుచున్నవి. పాకిస్థాన్‌నుండి అనేక అనుకూలసందేశాలు వచ్చినవి. ప్రతికూలమైంది ఒక్కటీలేదు. ఈ ఆరురోజులనుండి ప్రత్యక్షంగా దోవచూపుచున్న దైవం, ఇకముందును మనలను నడిపించుగాక !

## 129

19-1-48

### అభినందనాలు – ఆదుర్దా

ప్రపంచం అంతటనుండి భారతీయులు, భారతేతరులు, తమ సద్భావమును ఆదుర్దాను తెలుపుచూ పంపే అసంఖ్యాక తంతెలకు నాకృతజ్ఞతను తెల్పెదను. వీటివల్ల నాచర్య ఎంత సక్రమమైందో ఋజువు అగుచున్నది. అయితే దానినిగూర్చి ఏమాత్రపు అనుమానము కాని నాకుండె ననికాదు. దేవుడు ఉన్నాడనే విషయమునుగూర్చి, ఆయన స్వరూపమగు సత్య మనే దానిని గూర్చి నా కెన్నడు ఏలాటి అనుమానంలేదో, అటులనే ఉపవాసవిషయమునను లేదు. ఇపుడు అభినందనపత్రముల వెల్లువ బయలుదేరినది. ప్రతి ఒక్కరికి కృతజ్ఞత తెలుపజాలను. వారు అలా కోరరుకూడాను. పశ్చిమపంజాబు ప్రధానినుండి, భోపాల్ నవాబునుండి, వచ్చిన రెంటిని మీకు వినిపించెదను. "అన్నిసంఘములమధ్య హృదయసమ్మేళనము కలుగవలెనని మీరు చేసిన విజ్ఞప్తిని రెండురాజ్యాలలోని సత్పురుషులు ఆమోదించకతప్పదు. అలాగే రెండురాజ్యాలమధ్య సమాధానము స్నేహభావం ఉండాలనే విజ్ఞప్తికూడాను. మేము ఈ ఏడాదినుంచి సన్మతి,

సఖ్యత, సద్భావము ప్రోత్సాహపఱచుచున్నాము. మా సంస్థానంలో శాంతిని చెడగొట్టు విచారకరమైన సంఘటన ఒక్కటికూడా జరుగలేదు. మా శక్తికొలది ఈ స్నేహభావము పెరుగుటకు ప్రయత్నించెదము" అని భోపాలునవాబు వ్రాసెను.

పశ్చిమపంజాబు మంత్రి పంపిన తంతెలోని ముఖ్యాంశములు : "ఈ ఉత్తమ ఉద్యమాభివృద్ధికి మీరు తీసుకున్న ఘనమైన చర్యను మా మంత్రిమండలి గాఢంగా ప్రశంసించుచున్నది. అల్పసంఖ్యాకుల ప్రాణ మాన ధనములను కాపాడుటకు సర్వవిధముల కృషి చేయవలెననియు అందరకు సమానపౌరసత్వ హక్కులు ఇవ్వవలసినదే యనియు, చెప్పే సిద్ధాంతమును మేము ఎల్లప్పుడు అనుసరించుచున్నాము. ముందు రెట్టింపు ఉత్సాహంతో అనుసరింతుము. మీ ఉపవాసము విరమించుటకు తగినట్టి అభివృద్ధి ఇండియా అంతటను కలుగుగాక యని ఆపుర్దాపడుచున్నాము. మీవంటి వారి అమూల్యమైన ప్రాణాన్ని కాపాడుటకు ఈరాష్ట్రం చేసే కృషిలో కొఱత ఏమియు ఉండదు."

## ఒక మందలింపు

కొందరు వెర్రిగా పెద్దలను అనుసరిస్తారు. ఇంత తొందరలో ఇంత మంచిఫలితాలు కలుగుతాయని ఆశించి, ఎవరును ఇట్టి ఉపవాసము చేయరాదు. ఎవరైనా పూనుకున్నచో, అతనికి నిరాశకలుగుతుంది. అనాదిదైన ఈ అమోఘ ఆయుధానికి అపఖ్యాతి ఆవరిస్తుంది. రెండులక్షణాలు ఉన్నవాడే దీనికి

పూనుకోవచ్చును. (1) దైవమందు గాఢవిశ్వాసము (2) ఆయన యొక్క అనివార్యమైన ఆదేశము. ఉపవాసమునకు గల హేతువు సక్రమమైనది. కనుక దానికదే యుక్తకాలమనికూడ అంతరాత్మ చెప్పవలెను. కనుక దీనికి దీర్ఘకాలసాధన అవసరము.

## ముందుండే పని

ఢిల్లీ పౌరులకు, శరణార్థులకు ముందు గొప్ప కర్తవ్యమున్నది. పరస్పరం సంపూర్ణ విశ్వాసముతో వారు తఱుచుగా కలియుచుండవలెను. నిన్న చాలమంది ముస్లిం సోదరీలను కలియుట ఆత్మోత్తేజకరముగ నుండెను. వారు నావద్దకు వచ్చుటకు జంకిరి. రమ్మని కబురుపంపితిని. వారు పరదాలో వచ్చిరి. "మీ తండ్రుల ఎదుట తోబుట్టువుల ఎదుట పరదా ధరించరు గదా! నన్ను అంతకు తక్కువగా ఏల తలంచెదరు?" అని గాంధీజీ అనగానే అందరు ముసుగులు తీసివేసిరి. ఇలా జరుగుటకు ఇది మొదటిసారికాదు. నిజమైన వాత్సల్యంయొక్క ప్రభావము ఎంతో ఇక్కడ ఋజువగుచున్నది. హిందు, సిక్కు స్త్రీలు ముస్లింస్త్రీల ఇంటికివెళ్ళి స్నేహం చేయవలెను. పండుగ పబ్బాలకు పిలువవలెను. సాంఘిక పాఠశాలలకుగాక, సామాన్య పాఠశాలలకు ముస్లిం బాల బాలికలను రప్పించవలెను. ఆటపాటలలో అందరు కలియవలెను. ఇపుడుండే "వృత్తి వెలి" పోయి పూర్వపువృత్తులలో ప్రవేశించుటకు ముస్లింలను ఉత్సాహపఱచవలెను. దివ్యమైన నైపుణ్యంగల ముస్లిం పనివాళ్ళు పోవుటచే,

ఢిల్లీకి ఎంతో లోటు వచ్చింది. హిందువులు, సిక్కుల ముస్లింల జీవనోపాధి తీసివేయ ప్రయత్నించుట దుఃఖకరము. లోభసూచకము. ఏ ఒక్కరికి ఏ వృత్తిపైనను ఏకైకహక్కు ఉండరాదు. ఒకరి నౌకరు వృత్తినుండి తొలగించే ప్రయత్న ముండరాదు. మన విశాలదేశములో అందరికి తావుంది. మన శాంతిసంఘాలు నిద్రపోరాదు. "నన్ను మీమధ్య నుంచుకోవలెనంటే ఒక్కటే షరతు. వివిధ సంఘాల మధ్య పరస్పరం శాంతి ఉండవలెను. ఆయుధ ప్రయోగంవలన గాక, ప్రేమానుబంధంచేత అది ఏర్పడవలెను. లోకంలో అంతకన్న సంధానకరణి మరొకటి లేదు."

విద్యుత్తు ఆగుటవల్ల విస్తృత యంత్రం పనిచేయ లేదు. హీనస్వరములో గాంధీజీ మాటలాడినదానిని డా॥ సుశీలనయ్యర్ వ్రాసుకున్న గుర్తులను బట్టి ఆమె వినిపించెను.

# 130

20-1-48

## వివేకోదయంకొరకు అభ్యర్థన

శాంతి శపథ పత్రముమీద సంతకము చేసినవారు సత్య స్వరూపి సర్వేశ్వరుడైన దేవుని సాక్షిగా నుంచుకొన్నారని గాంధీజీ ఆశించెను. హిందూ మహాసభ ఉద్యోగి యొకరు తన బాధ్యతను ఉపసంహరించుకున్నారట. ఇది విచారకరము. ఇచ్చటి పౌరులు, శరణార్థులు ఇతర-చోట్ల సంఘటనల వలన కలవరపడక, స్థిరంగానుంటే, వారు రెండు రాజ్యాలను కాపాడుతారు. పురా

తనమైన ఈ ఢిల్లీ నగరం దౌర్జన్య రహితంగా వర్తిస్తే, దాని ప్రభావము ప్రపంచ మంతా వ్యాపిస్తుంది. గాంధీజీ, నెహ్రూ, పటేల్ వాడేభాషలు వేరుగా నున్నా భావం, ఉద్దేశ్యం ఒకటే. బొంబాయిలో పటేల్ ఇచ్చిన ఉపన్యాసం జాగ్రత్తగా చదివితే, అది ఋజు వగును. వారిలో ఎవరు ముస్లింలకు విరోధి గారు. ముస్లింల విరోధి భారతానికి విరోధియే. ప్రతివారి కనీసకర్తవ్యం ఏమంటే : చట్టాన్ని ఉల్లంఘించి, తామే చట్ట మనుకొని చేసే అమానుష కృత్యాలు పనికిరావు. అమెరికాలోని నీగ్రోలను చమడాలు ఒలిచి చంపిన ఘోర రాక్షస చర్యలను మనం ఖండిస్తాముకదా! మనమే అట్టివి చేయుచో అవి ప్రశస్తము అగునా?

పాకిస్థాన్ ప్రభుత్వము నేను శాంతికాముడనని, ముస్లింల మిత్రుడనని నమ్మి, పాకిస్థాన్ ప్రవేశానికి అనుమతించితే, నే నచటికిపోవచ్చును. ప్రయాణమునకు తగినబలం కలిగిందని వైద్యులు ఒప్పుకొనేదాక వేచి యుండవలెను. రెండు వారాలు పడుతుందన్నారు. ఇపుడు పండ్లరసము, కూరకాయల పులుసు, మేకపాలు పుచ్చుకొనుచున్నాను. ద్రవాలుగాక ఘనమైన వస్తువులు తినుటకు కొంతకాలము పట్టును.

## ప్రధానమంత్రి ఉదారచర్య

ఆయన చిత్తము చింతాక్రాంతమై యున్నది. ఆయన ఇంటినిండా స్వదేశీ విదేశీ అతిథులు ఉన్నా, 1-2 గదులు శరణార్థులకై ఆయన ప్రత్యేకించారు. కష్టంలో ఉన్న శరణార్థి పరుం

డుటకై తన పక్క నిచ్చి చలిబాధ తప్పించుకొనుటకు రాత్రెల్లా ఇటు అటు పచారుచేయగల సౌజన్యశీలి అతడు. ఇతరమంత్రులు, ఉద్యోగస్తులు, ఆస్తిపరులు తమ ఇండ్లలో కొంతభాగము శరణార్థులకై నిలువ ఉంచవచ్చునని అతని కోరిక. భారత నాయకాగ్రగణి పండిట్‌జీచేసిన ఈ అద్భుత త్యాగమును లోకము అంతా మెచ్చుకుంటుంది. నిలువనీడలేని శరణార్థులకష్టాలు గట్టెక్కుతవి. అట్టి అద్భుత త్యాగమూర్తులు మన దేశములో పుట్టినందుకు మనం సంతోషించవలెను. జవహర్ నిజమైన రత్నము. ముస్లిం సోదరులకు హాని కలిగించుట ఇట్టి నాయకులకు హాని కలిగించుటయే.

మనలో అవకాశవాదులు లేకపోలేదు. గాంధీజీ ఉపవాసాన్ని డబ్బుక్రింద మార్చారట. కొన్ని నోట్లు వేసి అమాయకులగు బీదలకు అమ్మినారట. ఇది దుష్టకార్యము.

## కాశ్మీర్ సమస్య

కాశ్మీర్ స్వతంత్రలీగు అధ్యక్షుడను పేరుతో ఒకరు పంపిన తంతిలో ముఖ్యమైన సంగతులు: "హిందూ ముస్లిం ఐక్యతకు మీరు చేయు మహోత్కృష్ట త్యాగం ప్రశంసనీయం. ఇప్పటి గందరగోళమునకు కాశ్మీర్ మూలకారణము. సఖ్యతకు అడ్డము ఇదియే. శాంతిసంప్రదింపులలో దానికి మొదటిస్థానము ఇయ్యవలెను. భారత సేనలను వెనుకకు మరల్చి, హక్కుదారులకు కాశ్మీర్‌ను ఒప్పగించవలెను.

అది బాధకరంగా నున్నది. కాశ్మీర్ సమస్య తేల దను కోండి. హిందువులు, సిక్కులు ఒకవైపునను, ముస్లింలు యింకొక వైపునను, పరస్పరం విరోధులుగా భావించుకుంటూ యుండవల సిందేనా? కాశ్మీర్ మహారాజు, ప్రజానాయకుడైన అబ్దుల్లా పిలిస్తేనే భారతసేనలు అక్కడికి పోయినవి. దండెత్తివచ్చినవారు వెనుకకు మరలితేను, ఫ్రాంచిలోని తిరుగుబాటు దార్లకును, తక్కిన కాశ్మీర్ ప్రజలకును ఈ సమస్యను వదలిపెడితేనూ, అన్యుల సహాయము లేకుంటేనూ, భారతీయ సైనికులు బయ టికి వత్తురు. కాశ్మీరును నిజమైనహక్కుదార్లకు వదలమన్నారు. అది మంచిదే, కాని ఎవరా నిజమైన హక్కుదార్లు? చిట్టచివ రకు కాశ్మీర్ ప్రజలే తమ భవిష్యత్తును నిర్ణయించుకోవలెను. అందుకనే జనవాక్య నిర్ధారణ సంగతి వచ్చినది.

## గ్వాలియర్, భావనగరం, కథియవాడ్ సంస్థానములు

రట్లాంనుండి గ్వాలియర్ ముస్లిం ఒకరు తంతె ఇచ్చారు. "15-16 తేదీలలో హిందువుల ముఠా వచ్చి మాగ్రామం చుట్టు ముట్టి మమ్ము కొట్టారు. ఒకడు చచ్చెను. మా ఇళ్ళు, పైర్లు నాశనముచేశారు. ఉద్యోగస్థులు చర్య తీసుకొనుటలేదు. తగిన యేర్పాట్లు చేయండి." ఈ విషయం నిజమైనచో దుఃఖకరము. సాంఘిక అల్లరులు ఏమూల జరిగినను, మనకే అవమానకరము. కథియవాడ్ సంస్థానా లన్నీ కలిసి ఏకరాజ్యం కావలెనని తీర్మా నించారట. ఇట్టి మంచిపని చేసినందుకు గాంధీజీ వారిని అభినం

ఉంచెను. తన రాజ్యమున బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రవేశపెట్టి ప్రజా సేవకుడుగా పరివర్తన చెందిన భావనగర్ రాజును గాంధీజీ ప్రశంసించెను.

# 131

21-1-48

## ప్రార్థన స్థలంలో బాంబు

నిన్న మంగళవారము బిర్లా ఆవరణలో పడి పగిలిన 'బాంబు'ను గూర్చి అనేకులు ఆదుర్దా చెందుచున్నారు. కలత పొందనందుకు నన్ను కొందరు మెచ్చుకొనుచున్నారు. అదియొక సామాన్య సైనికసాధన యని తాను తలంచెనుగాని ప్రార్థనానంతరంవరకు తనపై ఉద్దేశించిన ప్రయోగముగ తాను అనుకోలేదని గాంధీజీ అనెను. దైవానికే ఎఱుక. మొదటనే అది తెలిసియుంటే తాను ఎలాప్రవర్తించియుండునో. కనుక యిప్పుడు తన్నుమెచ్చుకోవలసిన కారణంలేదు. ఆ ప్రయోగమువలన శరీర పతనమైనను మొగముమీద చిరునగవును, మనస్సులో ద్వేష రాహిత్యమును ఉంచుకో గలిగితే, అప్పుడు యోగ్యతాపత్రం పొందే అర్హత కలుగును. ఎవరును ఆ పొరబడిన యువకుని తిరస్కరించరాదు. గాంధీజీ హిందూమతవిరోధి యని ఆ యువకుడు తలచెనేమో ? మతమును భ్రష్టముచేయు దుష్టుని వధించుటకు ఎవరినైన పంపుదునని దైవం అన్నట్లు గీతచెప్పుటలేదా? ఆ మహా శ్లోకమునకు విశేషార్థము ఉన్నది. తనకన్న భిన్నాభిప్రాయము కలవాడు దుష్టుడు కానక్కరలేదని ఆ యువకుడు తెలుసుకో

వలెను. సజ్జనులు సహిష్ణుతలోగాక దుష్టత్వానికి మరి ఉనికే లేదు. ఈముద్దాయి భ్రమపడినట్లు ఎవరుకూడా తాను సంప్రాప్తుడనని, దుర్మార్గులను శిక్షించుటకు దైవము తనను పంపినాడని భ్రమింపకుందురు గాక. ఈ యువకుడు అనుమతి లేకుండా ఒక మసీదు ఆక్రమించెనట. అది ఒక తప్పు. దానిని ఖాళీ చేయుమన్నపుడు అధికారులను తిరస్కరించె నట. అది రెండవ తప్పు.

## హిందూ మతానికి అపకారము

ఈ యువకుని ప్రోత్సహించిన వారికి నా దొక మనవి. హిందూ మతాన్ని కాపాడుట కిది కాదు మార్గము. దాన్ని కాపాడగలది నా పద్ధతియే. బాల్యము నుండి దాని ననుసరించినాను. దయ్యాల భయమునుండి తప్పించుకొనుటకు రాముని పేరు స్మరించాను. పిమ్మట ఇతర మతాలతో కొంత మంచి పరిచయము కలిగిన తరువాత కూడా హిందూ మతములో స్థిరపడ్డాను. చిన్నప్పటి విశ్వాసము ఇప్పటికిని దృఢముగా నిలిచియున్నది. నేను ప్రేమించి, పోషించి, ఆచరించిన మతాన్ని సంస్కరించే పనిముట్టుగా దైవము నన్ను ఉపయోగించ వచ్చునని నా నమ్మకము. దైవప్రతినిధిగా అర్హుడు అగుటకు ముందు మతములోని ప్రధానసిద్ధాంతములను గూర్చి జ్ఞానానుభవములు ఉండవలెను.

## గోళం వేసినవానిపై జాలిచూపుడు

సిక్కులు తమకు ఈ దుష్కృత్యముతో సంబంధములేదని గాంధీజీకి మనవిచేసిరి. ఆ యువకుడు సిక్కు కానట్లు తనకు

తెలుసు నని గాంధీజీ అనెను. సిక్కు, హిందు, ముస్లిం ఇంపు అతడు ఎవరైతే నేమి, అట్టి దుర్బుద్ధులకు ఆయన గాంధీజీ మేలే కోరుచుండును. వానినివేధించవద్దని పోలీసు ఇనస్పెక్టర్ జనరల్‌తో గాంధీజీ చెప్పెను. మనస్సును మార్చి సరియైన యోచనలకు, చేతలకు అతనిని త్రిప్పవలెను. అతనిమీద కోపపడ వద్దని సభికు లను ఆయన హెచ్చరించెను. తప్పు చేస్తున్నానని అతడు తలంచి ఉండడు. వానిపై జాలిచూపవలెను. తన ఉపవాసమునుగూర్చి హృదయంలో కోపం పెట్టుకొని, పైకి శాంతి ప్రతిజ్ఞ చేసినచో నిజమైన నేరము అట్టివారిదే యగును. నిమిత్తమాత్రుడైన ఆ యువకునిది కాదు. ఆ శాంతి శపథము హృదయపూర్వక మైన దయితే, చిట్టచివరకైనా, ఇట్టి యువకులు సన్మార్గానికి రాక తప్పదు. అగ్నిగోళాలు పడ్డా, తుపాకి గుండ్లు పడ్డా లక్ష్యపెట్టక ప్రార్థనలు జరుపవలసిందే. చదువురాని ఒకబీదరాలు ఈదుష్టుడు పట్టుబడుటకు కారణమైందట. ఆమెచూపిన ధైర్యమునకుగాను గాంధీజీ మెచ్చుకొనెను. మనసు మంచిదైతే, సరియైన యోచన ఉంటే, చదువు రానందువలన లోటేమియు లేదు.

## బహావల్‌పూర్, సింధు

బహావల్‌పూరు స్నేహితులను గాంధీజీ మఱచిపోలేదు. ఈ రోజే ముస్లిమేతరుల క్షేమమునకై సర్వ విధముల తోడ్పడు చున్నామని ఆ నవాబు తంతె పంపెను.

బొంబాయిలోను సింధుదేశపు శరణార్థులనుంచి ఒకతంతె వచ్చింది. సింధులో అచ్చటచ్చట నున్న 15వేల సిక్కులు హత

మారి పోనున్నారు గాన వారిని వెంటనే బయటకు తీసుకుని రమ్మని ఆ తంతె కోరెను. సిక్కుల సర్వనాశమును గాంధీజీ సహించ నేరరు. నెహ్రూసర్కార్ ఇందువిషయములో తన బాధ్యతను సరిగా గుర్తించింది. సింధు సర్కార్, పాకిస్థాన్ సర్కార్ ఈసిక్కులకు పూర్తి రక్షణ చేయవలెను. లేదా వారి నొకచోట చేర్చి, తక్షణం క్షేమంగా భారతానికి పంపించ వల యును. వారి మతమును, వారి గౌరవమును సిక్కులే కాపాడు కొనవలెను. ఇతరులు ఆ హక్కుల నపహరించలేరు.

## తప్పు పోలికలు

ఉపవాస కాలములో ఒకడు ఒక జాబు వ్రాసెను. "1942 లో గాంధీజీ ఖైదులో నుండగా, దేశం దౌర్జన్యంపై పు కొంతవరకు మ్రొగ్గింది. ఈ ఉపవాసములో గాంధీజీ చనిపోయి నచో లోకభీకరమగు హింసాకాండ బయలుదేరుతుంది. అట్టి ఆపద రాకుండుటకై గాంధీజీ ఉపవాసము చాలించవలెను" అని ఆ జాబు. లోగడ ప్రజలు హింసకు పూనుకున్నా, ఇప్పుడీ యుపవాస మరణమువలన హింస చెలరేగు ననుభయము గాంధీ జీకి లేదు. ఉపవాసానికి పూర్వమే ఈ విషయమై ఆయన దీర్ఘా లోచన చేసెను. కృష్ణభగవానుని చావుకు పూర్వము యాద వులు తమలో తాము పోరాడి చచ్చిరి. కాని గాంధీజీ అంత పరిణామము కలిగించగల వ్యక్తి కాదు. అయినను యాదవుల వలె ప్రజలు సోమరులు, దుష్టులు అయితేను, సర్వనిర్మూలనము తప్ప వేరొండు మార్గము లేదని దైవం సంకల్పిస్తేను, దైవము

సామాన్యుడగు గాంధీని అట్టి పనికి నిమిత్తమాత్రుని చేయవచ్చును. దేవుని శరణుజొచ్చెనుగాన ఫలితములనుగురించి గాంధీజీకి ఆదుర్దా కలుగుటలేదు. ఉపవాసములో ఆయనకు తోచిన దానినిబట్టి భారతానికి అలాటి దుస్థితి కలుగుతుందని భయము లేదు.

ఢిల్లీలో ముస్లింలు హాయిగా తిరుగుచున్నారు. అది తృప్తికరము. ఆత్మ పవిత్రతను విడువక తమ హృదయములను సత్యదేవుని ఆలయములుగా వారు మార్చవలెను.

# 132

22_1_48

ఉపవాసంపిమ్మట నేడే ఆయన సభాస్థలికి నడిచివచ్చెను. త్వరలో పూర్తి ఆరోగ్యం కలుగునని ఆశించెను.

## నెహ్రూ చూపిన మార్గం

నెహ్రూ మొదలగు వారు కొంతమంది శరణార్థులకు బస ఇచ్చినా, ఈ సమస్య ఏమాత్రం పరిష్కారం కాదు అని ఒకరు వ్రాసిరి. గాంధీజీ ఆ సంగతి అంగీకరించెను. కాని మహానాయకులు చూపిన మార్గం సామాన్య జనులను తప్పక ఆకర్షించును. తమ రాజుచేసే కొద్దిత్యాగమునైనా, ఆంగ్లేయులు పొగడుచుందురు. అట్లే నాగరికత దేశాలుకూడా జరుపును. మహానాయకులు ఉండుచోట మసలుట సులభమని అసంఖ్యాకులగు శరణార్థులు ఢిల్లీలో మూగుచుండిరి. మనం ఇంకా ఇంద్రియనిగ్రహం నేర్చుకోలేదనికూడా దానివలన ఋజువగుచున్నది.

## బీదరికం లజ్జాకరం గాదు

కాంగ్రెసు అజ్ఞాతవాసములో నుండగా స్వార్థత్యాగం, నిరాడంబర జీవితం, సేవా తత్పరత ఆదర్శంగా ప్రజలకు చూపినారు. అపుడు ఒకలక్ష వసూలుచేయుటకూడా కష్టమైయుండగా ఇపుడు కోటానకోట్ల రూపాయలు కాంగ్రెసు సర్కారు చేతిలో నున్నవి. ఇంకను కొన్ని కోట్లను వసూలు చేయగలరు. విదేశీ ప్రభుత్వంలో నుంచి స్వదేశీ పరిపాలనలోనికి వచ్చిన మార్పు, కనపడకుండా మామూలుఖర్చు చేయవలసినదేనా ? రాజనీతిలో ఆంగ్ల అమెరికాలతో పోటీ చేయవలయునా ? విదేశాలలో భారతప్రఖ్యాతి నిలుపుటకు అట్టి అమిత వ్యయం అవసరమా ? అని ఒకరు ప్రశ్నించిరి. గాంధీజీ ఆ భావముతో ఏకీభవింపడు. గుడ్డకొద్దీ చొక్కా కత్తిరించుకోవలెను. మన బీదరికమును దాచినందువలన గౌరవం లేదు. సాత్వికనిరోధమువలన వచ్చిన మన నైతిక ఆధిక్యతతో పోటీ చేయగలవారు ఇంతవరకు లోకములో లేరు. ఇతరజాతులు సేనమీద ఆయుధములమీద ఆధారపడి యున్నారు. అదే వారి మూలధనము. నైతిక ఆధిక్యతే మన మూలధనము. ఖర్చు పెట్టినకొద్ది అది పెరుగుచుండును. అట్లు కానిచో, విప్లవకరమైన మార్పు చేసే అధికారం కాంగ్రెసుకు లేదు. హెచ్చు జీతాలు తింటున్నారని మన మంత్రులను ప్రజలు విమర్శిస్తున్నారు. ఆ మంత్రుల కుటుంబ జీవితం ప్రజలు ఎఱుగరు. అదివరకు రు 150 తో సరిపుచ్చుకొనువారు ఇప్పుడు రు 500 లు అడుగుటకు సంకోచింపరు. భారతసేవ చేసేవిధానం

అదిగాదు. మనిషివిలువ, అతను సంపాదించే డబ్బుమీద ఆధార పడదు. త్రికరణశుద్ధి యగు కార్యంమీద ఆధారపడును.

## మరల గ్వాలియర్

అచ్చటి ప్రజామండలి ప్రతినిధి గతరాత్రి గాంధీజీని చూచెను. ఆ మహారాజు ప్రజలకు పూర్తి బాధ్యతాయుతప్రభుత్వమును ఇచ్చినందుకు గాంధీజీ ఆశీర్వాదములను ఆ ప్రతినిధి కోరెను. జాతి, మత, కుల భేదములు లేకుండా ముస్లింలయెడ అయిష్టత లేకుండా, బ్రాహ్మణునకున్ను, భంగీకిన్ని, బీదకున్ను, ధనికునకున్ను సమానాదరణ చట్టంలోను, ఆచరణలోను కలిగిస్తే, గాంధీజీ సంతసించును. అప్పుడు మహారాజు ప్రజల ప్రథమ సేవకుడు అగును. పాలకులు, పాలితులు పరిశుద్ధులయితే, ప్రపంచము ఎదుట తలలు ఎత్తి తిరుగవచ్చును. తమ నైతిక ఔన్నత్యమును నిలుపుకొనవచ్చును.

# 133

23-1-48

## నేతాజీ పుట్టిన దినము

నేడు నేతాజీ పుట్టిన దినము. సామాన్యముగా గాంధీజీ జనన, మరణ దివసములను జ్ఞాపకముంచుకోరు. అట్టి నిర్లక్ష్యం మంచిదో చెడ్డదో తెలియదు. కాని నేతాజీ జయంతిని గూర్చి జ్ఞాపకము చేశారు. నేతాజీ హింసను, గాంధీజీ అహింసను విశ్వసించువారు. కాని సుబాస్‌బాబుకు ప్రాంతీయ, సాంఘిక దురభిమానాలు లేవు. ఆయన వీరసైన్యంలో భేదములేకుండా

భారతీయులనందరిని చేర్చుకొనెను. అందుచేతనే అన్యులకు అలభ్యమైన భక్తి, ప్రేమ, విశ్వాసాలు ఆయన చూరగొనెను. హిందూ మతానికి సరియయిన నిర్వచన మిమ్మని ఒక లాయరు గాంధీజీ నడిగెను. గాంధీజీ మతశాస్త్రంలో పండితుడుగాడు. తాను నేర్చుకున్న 'లా'ను అతడు మఱచిపోయెను. కాని సామాన్యుడుగా ఆయన చెప్పే దేమనగా అన్నిమతాలు సమానగౌరవార్హములని హిందూమతం భావించుచున్నది. సుభాసుబాబు అలాంటి హిందువే. ఆ మహామహుని జ్ఞాపకార్థం సాంఘిక వైషమ్యాలను హృదయాలలోనుండి తుడిచివేయవలెను.

## జాగ్రత్తగా నుండవలెను

జహాంగీరుపూరు గ్రామములో ముస్లింల హత్యలు, ఆస్తి లూటీలు, గృహదహనాలు జరిగినవన్నమాట అబద్ధమని అచ్చటికి వెళ్ళి స్వయముగా చూచిన స్నేహితుడు నిన్న తంతె ఇచ్చాడు. సాంఘికవైరం ఏమాత్రములేని వ్యక్తులమధ్య పోరాటము లేదట. ఫిర్యాదులు పంపేటప్పుడు ముస్లింలు చాలా జాగ్రత్తగా ఉండవలెను. అతిశయోక్తి రవంతయు ఉండరాదు. ఇతరుల లోపాలను గూర్చి హీనోక్తి, తన లోపాలనుగూర్చి అతిశయోక్తి- ఇదే ధర్మసూత్రము. ఆ పరిశుద్ధతకు ఇది ఒక్కటే త్రోవ.

## మైసూరు — జునగడ్ — మీరట్

మైసూరులో కలిగిన సాంఘిక కల్లోలాలు గాంధీజీ ఉపవాసంవలన తగ్గలేదని ఒకతంతి వచ్చెను. ఆవిషయం విని

గాంధీజీ చింతనొందెను. అచ్చటి సంగతులను గూర్చి మైసూరు సర్కారు స్పష్టమైన ప్రకటన చేయవలెనని గాంధీజీ కోరెను.

జునగడ్‌లోని పలుకుబడి గల ముస్లింలు తంతె పంపిరి. ప్రాదేశిక కమిషనరును పటేల్ నియమించినప్పటినుండి, తమకు హాయి చిక్కినదని, ఇకముందు తగవులు రావని, జనవాక్య నిర్ధారణలో ముస్లింలు తక్కిన ప్రజలతో కలిసియుందురనీ అందులో తెలుపబడెను.

మీరట్ నుంచి ఒకతంతె వచ్చింది. శాంతి ప్రయత్నాలను శ్లాఘించిరి. జాతీయ ముస్లింలమీద దుర్భావము లేదు. ముస్లింలీగర్లు భారతమందు భక్తి చూపుదురను విశ్వాసమున్నవారికె కలుగలేదు. రాజకీయాలు, మతము వేరుగానుండవలెననియు, అహింస రాజకీయములో పనిచేయదనియు వారు తెల్పిరి. ముస్లింలీగర్లను నమ్మినచో, గాంధీజీ పరితాపపడవలసి వచ్చుననికూడ వారనిరి.

## ద్రోహుల నేమిచేయవలెను ?

రాజకీయాలలో అహింస పనికిరాదని చెప్పే కాలం వెళ్ళిపోయినది. రాజకీయాలలో అపనమ్మకంతో బయలుదేర రాదు. ద్రోహులు ఎచ్చటనైనా, ఏసంఘంలోనైన ఉంటారు. ఇక్కడ ప్రభుత్వాన్ని నడిపే ధీరత్యాగులకు ద్రోహులను శిక్షించు విధం తెలుసును. ముస్లింలతో సోదరులుగా ఉందామని చేసిన శపథాన్ని నిలువబెట్టండి. లీగర్లందరు దుష్టులుకారు. అనుమానా

స్పదమైన పనులు చేసే లీగర్లమీాద సర్కారుకు ఫిర్యాదుచేయండి. వారే వారిని శిక్షింతురు. శిక్షింపవలసింది మీారుకాదు.

ఇంకను అభినందనలు పంపువారికి, గాంధీజీ కృతజ్ఞతను తెల్పెను.

## 134

24-1-48

ఆనాటి సభకు చాలామంది జనం వచ్చిరి. ఏడ్చుచున్న శిశువులతో, తల్లులు ఒకరితో నొకరు అరచుచుండిరి. చప్పుడు చేయవద్దని గాంధీజీ చెప్పగా, కొంతవరకు ఆగిరి. ప్రార్థనానంతరం ఆయన మరల హెచ్చరించగా, కొంచెం ఫలితం కలిగింది.

### ఖైదీల మార్పిడి, స్త్రీల అపహర్తలు

అపహరించబడిన స్త్రీల విషయమై రెండురాజ్యాలమధ్య చేసుకున్న సంధి ఇపుడు సరిగా అమలుజరుగుటలేదని, ప్రాదేశ సర్కారులుకూడా ఈస్త్రీల విషయమై ఒప్పందం చేసుకొనవలయునని పశ్చిమపంజాబు ప్రభుత్వము చెప్పిందని ఒకరు గాంధిజీకి లేఖ నంపిరి. ఆలాటి కోరికకు ఆక్షేపణలేదని గాంధిజీ యనెను. అది కొత్త షరతు అయితే, భావ్యంకాదు. అటు, ఇటు వప్పగించవలసిన ఖైదీల స్త్రీలసంఖ్యతో నిమిత్తములేకుండా వారలను స్వస్థలాలకు పంపివేయుట స్నేహధర్మము. తూర్పుపంజాబులో అపహరించబడిన స్త్రీ ఒకతే యున్నా ఆమెను వాపసు చేయకుండుట పాపము. చెడుచేయుటలో ఉభయులు పోటీపడరాదు. మాట

తప్పినారని ఒండొరులపై ఆరోపణలుచేసుకొనుట రెండురాజ్యములకూ భావ్యంగాదు.

ఈసమయంలో స్త్రీలరొద హెచ్చిపోయెను. కాన, సభ నిల్పివేయబడెను. పిల్లలతల్లులు సభచివర నిలబడవలెనని అపుడు సభలో నెమ్మది యుండునని గాంధీజీ హెచ్చరించెను.

# 135

25-1-48

గత రెండురోజులనుంచి పెరుగుచున్న జనసంఖ్య, నేడు ఆదివారము అగుటచే, మరింత పెరిగెను. గడ్డితోగాని ముతక ఖద్దరుతోగాని తయారైన ఆసనాలు వెంటతెచ్చుకోమని గాంధీజీ సలహా చెప్పెను. తేమనేలమీద కూర్చుండుట మంచిదికాదు.

## ఢిల్లీలో పూర్ణశాంతి యేర్పడ్డది

ఇచ్చట అంతా సరిగానేఉందని తెల్పే హామీలు రోజూ వస్తూ ఉన్నవి. అందువలన గాంధీజీ సంతసించెను. తమలో తాము పోరాడుకుంటూ యుంటే, సామాన్య వృత్తులు కూడా జరుగవు అనేసంగతి ప్రజలు గ్రహిస్తున్నారు. ముందుకు ఇంకొక అడుగువేస్తే బాగుండు నని ప్రతి హిందూ, ప్రతి సిక్కు తనతో కూడా ఒక ముస్లింను సభకు తీసుకొని రావలె నని గాంధీజీ సలహానిచ్చెను.

## మెహరౌలీవద్ద ఉరుసు

మెహరౌలీవద్ద రేపటినుండి ఉరుసు జరుగుతుంది. లోగడ అల్లరులలో ఆ దర్గా కొంత నష్టపడ్డది. దానిని మరమ్మతు చేస్తు

న్నారు. ఇదివరకు హిందువులు ముస్లింలు కలసి అక్కడికిపోయే వారు.

అలా భక్తిశ్రద్ధలతో ఇపుడుకూడా హిందువులు పోగలిగితే మంచిదే. అక్కడికి వెళ్ళ దలంచే ముస్లింలకు పూర్తిగా రక్షణ యుంటుందని హామీ ఇయ్యవలెను. పోలీసుల సహాయం వీలైనంతవరకు తగ్గించవలెను. అసలు పోలీసే లేకుండా, జనమందఱు పోలీసుగా వర్తించవలెను. ఢిల్లీలో చేసిన పని ప్రపంచమంతనూ ఆకర్షించింది. సెబాష్ అని చెప్పే తంతెలు అన్ని ఖండాలనుంచి వస్తున్నవి. 15వ ఆగష్టు స్వరాజ్యస్థాపన జరిగింది. లోకములో ఈడు జోడు లేని పనిఅది. పిమ్మట ఒకజాడ్యం ఏర్పడింది. ముస్లిం, హిందు, సిక్కులు మృగాలవలె ప్రవర్తింపసాగినారు. ఈ ఉపవాసమువల్ల ఆ జాడ్యం కుదిరినట్లున్నది. మరల అది తిరుగుబెట్టకుండా ఉండుగాక !

## నన్ను విడుదలచేయండి

వర్ధా పోదలంచినాను. అక్కడ మీాపనే చేస్తూఉంటాను. రాజన్‌బాబు కూడా అక్కడికి వస్తారు. మీా ఆశీర్వాదం కోరుచున్నాను. నేను లేని కాలంలో సక్రమంగా ఉందురని హామీా కోరుచున్నాను. విదేశ రాజ్యంగా ఎంచవలసిన పాకిస్థాన్ నుండి ఆహ్వానం, లేక అనుమతైనా వస్తే, అక్కడికె పోగలుగుతాను.

## భాషాప్రయుక్త రాష్ట్రవిభజన

గడచిన రెండు రోజులనుండి కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము ఈ విషయం చర్చిస్తున్నది. కాంగ్రెసు ఇదివరకే యీా

సిద్ధాంతం అంగీకరించింది. తాము అధికారములోనికి రాగానే చట్టప్రకారము దానిని అమలుజరుపుతా నన్నది. దేశంయొక్క సాంస్కృతి కాభివృద్ధికి ఈ విభజన దోహదము ఇచ్చును గాన, తక్షణమే ఆ పని చేయదలచింది. కాని అట్టి విభజనవల్ల భారత దేశ ఐక్యతకు భంగం రారాదు. ఆంతరంగిక స్వపరిపాలనఅంటే విచ్ఛిన్నత కాదు. ఏ రాష్ట్రం విచ్చలవిడిగా పోవునని గాని, కేంద్రంతోను, ఇతర రాష్ట్రాలతోను సంబంధం లేని సంపూర్ణ స్వాతంత్ర్యం పొందునని గాని అర్థము గాదు. ప్రతి రాష్ట్రము సంపూర్ణ స్వతంత్ర మైతే, భారతదేశ స్వాతంత్ర్యం పోతుంది; దానితోపాటే రాష్ట్రాల స్వాతంత్ర్యం నశిస్తుంది.

గ్రామస్వరాజ్యంమీాద ఆధారపరచి, భారతదేశ స్వాతంత్ర్యపథకమును కాంగ్రెసు కల్పించింది. గ్రామాలనుండి కేంద్రానికి అధికారము, శక్తియున్ను, కేంద్రంనుండి గ్రామాలకు చైతన్యమున్ను సంక్రమించవలెను. సంకుచిత ప్రాంతీయ దురభిమానము ఏర్పడరాదు. ప్రాంతీయభాషలు పూర్తిగా వికసించవలెనన్నచో భాషాప్రయుక్త రాష్ట్రవిభజన అవసరం. హిందుస్థానీ భారతదేశ రాష్ట్రభాషగా నుండవలెను. ప్రాంతీయభాషల స్థానం అది ఆక్రమింపరాదు. ప్రాంతాలలో అది విద్యకు భాషాసాధనముగానుండరాదు. అందుకు ఇంగ్లీషు అసలే పనికిరాదు. హిందుస్థానీయొక్క కర్తవ్య మేమంటే : భారతదేశంలో రాష్ట్రాలకు అంగాంగీభావం కల్పించుటే. రాష్ట్ర దురభిమానాలు పెంచుకోనక అందరు భారతీయుల మను విశాలభావం ఏర్పడవలెను. అట్లు

యినచో భాషాప్రయుక్త రాష్ట్రవిభజనవలన విద్య, వర్తకము అభివృద్ధి చెందగలవు.

### సరిహద్దు నిర్ణయసంఘం అక్కరలేదు

ఈ కొత్త పద్ధతిలో సరిహద్దులను తేల్చుటకు ప్రత్యేక సంఘం అక్కరలేదు. మనం నిరాకరించిన విదేశీవిధాన మది. ఇపుడు పరస్పర సమ్మతితో సరిహద్దులను తేల్చుకుని అమలుజరు పుటకు ప్రధానమంత్రికి నివేదించవలెను. అది నిజమైన స్వాతంత్ర్యము. సరిహద్దుసంఘందగ్గరకు పోవుట, స్వాతంత్ర్య అభావమే. మన దేశములోని రాష్ట్రాలు ఒకదానిమీద ఒకటి ఆధారపడి, ఒండొరులకు సహాయము చేసుకుంటూ ఉండవలెను.

## 136

26-1-48

### స్వాతంత్ర్య దినము

26వ జనవరి స్వాతంత్ర్యదినము. స్వతంత్రం రాకముందు ఆ ఉత్సవం జరుపుట భావ్యమే. ఇప్పుడో అది చేతికి వచ్చింది. ఆ భ్రాంతి వీడింది. మీకు వీడినా లేకున్నా, నాకు పూర్తిగా వీడింది.

### ఇపుడు మనం చేసే ఉత్సవ మేమి ?

మన భ్రమ పోయిం దని ఉత్సవం జరుపుతున్నామా ? చెడుకాలము అంతరించి మంచి త్రోవ త్రొక్కుచున్నా మని ఉత్సవం చేతామా ? గ్రామంలోని బీదాతిబీదలకుకూడా

బానిసత్వంనుండి విముక్తి కలిగించవని, పట్టణాలకు నగరాలకు ఇక దాస్యం చేయనక్కరలేదని, తాను తయారుచేసిన మంచి వస్తువులను వారిచే కొనిపించే కాలం వచ్చిందని, తానే భారతదేశ జీవకర్ర అని, అందులోనే అన్ని మతాల, తరగతుల సమానత్వం ఇమిడి యున్నదని, ఏ అధికసంఖ్యాకవర్గమూ అల్పసంఖ్యాకులపై అధికారము చేయరాదని వెంటనే ప్రకటించవలెను. వాయిదా వేయవద్దు. ఈ సమ్మెలు వగైరా వాయిదా వేసే జాడ్యానికి చిహ్నాలు. కార్మికుడు తన హోదాను, బలమును తెలుసుకొననిండు. అతనితో పోల్చితే తగిన హోదాగాని, బలంగాని పెట్టుబడిదారుకు లేవు. సామాన్య పౌరునికి కూడా బలం, హోదా ఉన్నవి. సువ్యవస్థితమైన సమాజములో సమ్మెలకు, చట్టవిరుద్ధ చర్యలకు అవకాశం లేదు. ప్రత్యక్షం లేక, పరోక్షం అయిన హింసను నిషేధించ వలెను. ఎక్కడ చేసినా సమ్మెలవల్ల సమ్మెదార్లకు, దేశానికి నష్టము. ప్రాచ్య పాశ్చాత్య దేశాలలోనుండే రాజకీయ జీవితములోని కుతంత్రాలనుండి మనము బయట పడగలమా? మనం రెండు రాజ్యాలుగా విభజింపబడినను మనము స్నేహితులుగా, సోదరులుగా, పరస్పర సహకారులుగా బయట ప్రపంచమునకు కనబడవలెను.

## కంట్రోలు రద్దు - రవాణా

బట్టల కంట్రోలు రద్దు చేసినందుకు అందరు సంతోషించారు. మనకు బట్టల కరువే లేదు. కట్టెల మీాద, బొగ్గుమీాద కంట్రోలు రద్దుచేయుటము చాలా మంచిపని. బీదవానికి ప్రాణ

ప్రదమైన బెల్లం కావలసినంత దొరకుచున్నది. త్వరగా రవాణా ఏర్పాటు చేయవలెను.

ఈవిషయం బాగా తెలిసిన ఒక విలేఖరి వ్రాసిన ఒకజాబు లోని సారము ఏమనగా : కంట్రోలు రద్దు నెగ్గాలంటే, రయిలు రోడ్డు రవాణా సరిగా పనిచేయవలెను. ఇప్పటి రయిల్వే పద్ధతి కంట్రోలుకు, దాని రద్దుకుకూడా హాని కలిగిస్తున్నది. వివిధస్థలా లలో ఉండే ధరలలో అమితమైన తేడా ఉన్నదంటే, ఈరవాణా చిక్కులే కారణము. రోటక్‌లో బెల్లం మ॥ 1కి రు 8-0-0 లు, బొంబాయిలో రు 50-0-0 లు ఉన్న దంటే, రయిల్వే పరిపాల నలో ఏదో గొప్ప లోపము ఉండవలెను. వేలకొలది వాగనులు కదలకుండా నిలచి యున్నవి. నెలలకొలది వాగన్లలో సరుకు దించుట లేదు. లంచగొండితనం చెలరేగుచున్నది. ఒక వాగను సంపాదించవలె నన్న, వందలకొలది రూపాయలు ఖర్చు అగుచు న్నవి. రవాణామంత్రి చేసే ప్రయత్నాలన్నీ వృధాయగుచున్నవి. ఇప్పుడున్న రయిల్వే రోడ్డురవాణావిధానమును కూకటివ్రేళ్ళతో పెకలించి సంస్కరించవలెను. ఈ రవాణా లోపంవలన కోట్ల కొలది బీదలు బాధ పడుచున్నారు. పెట్రోలు రేషనింగ్ తొల గించవలెను. కొద్దిమందికే అనుమతి పత్రాలు ఇచ్చే విధానము పోవలెను. కంట్రోళ్ళ రద్దు జయప్రదం కావలెనంటే, రయిళ్ళు లారీలు సరిగా నడవవలెను. ఆ రవాణా సాగితే లక్షలకొలది టన్నుల ఆహారపదార్థాలు ఇతర సరుకులు బజారులోనికి వస్తవి.

## లంచగొండి పిశాచము

ఈ లంచాల సంగతి కొత్తది కాదు. పూర్వంకంటె మరీ అధ్వాన్నమైంది. బయట ఉండే నిగ్రహం, ఒత్తిడి పోయింది. సంఘము తమకొఱకు నివసించుట లేదని, తాము సంఘము కొఱకు జీవించుచున్నామని, ఈ లంచగొండులు గ్రహించవలెను. అపుడే లంచాలు పోతవి. లంచాలబాధ లేనివారు జాగరూకులై లంచాలు తిను నౌకర్ల మీద నిఘా ఉంచవలెను. ఉత్తమమైన నీతి ఏర్పడవలెను. ఇట్టి విషయములో నిర్లక్ష్యము చేయుట నేరమే. మన సాయంకాలపు ప్రార్థనలు స్వచ్ఛమైనవి అయితే, ఈ లంచపుదయ్యాన్ని చాలవరకు తొలగించవచ్చును.

# 137

27-1-48

## ముస్లింలు - ప్రార్థన సభలు

ఆనాటి ప్రార్థనసభలో ముస్లింలు ఒక్కరే యుండుటచేత గాంధీజీకి ఆశాభంగం కలిగింది. హిందువులు సిక్కులు ఒక్కొక ముస్లింనైనా తీసుకురావలెనని చెప్పిన సలహాను పాటించవలెను.

## మెహరౌలీవద్ద ఉరుసు

గాంధీజీ ఉదయము అక్కడికి పోయి చూడగా, ఎంతో మంది ముస్లింలు కనుపించిరి. అంతకు సమానంగానే హిందువులును, అదేవిధంగా సిక్కులును వచ్చియుండుటచే గాంధీజీ సంతసించెను. ఏవో పుకార్లనుబట్టి లోగడ ఉత్సవాలకంటె ఈ ఏడు

వచ్చిన ముస్లింలు తక్కువ. మానవుని జూచి మానవుడు భయ పడవలసి వచ్చుట లజ్జాకరము. అమూల్యమైన చలువరాతి కట్ట డములు పాడుచేయబడినవి. పాకిస్థాన్ తప్పుచేసినా, లోకమంతా తప్పుచేసినా మన మేల ఆ తప్పు చేయవలెను? గాంధీజీ ఈవయ సున చెడుమార్గం పడితే, ఈ ప్రజలందరు వ్యథ జెందుతారు. ఆయనకో అది మరణంకంటె దుర్భరము. గాంధీజీకి దర్గా షెరీఫ్ కథ వినిపించిరి. అట్టి పవిత్రస్థలముకు తగిన గౌరవము చూపించ వలెను అని ఆయన సలహాచెప్పెను.

## సరిహద్దు ప్రాంతంలో మరికొన్ని హత్యలు

పెషావరు జిల్లా పఱచినార్ శిబిరముపై కొండజాతులు దాడి చేసి 130 మంది హిందు-సిక్కులను నిరపరాధులను చంపి రట. అది విన్నచో కోపము వచ్చుట సహజమే. కాని అది తప్పిదము. ప్రతీకారము చేతామనే కోరిక పుట్టితే, అది శాంతి శపథానికి విరుద్ధము.

## అజ్మీరులో హరిజనులు

అజ్మీరులోని హరిజనులు మురికిలో, దరిద్రంలో మునిగి యున్నారట. అచ్చటి హిందువులు అధికారులు దానిని ఎట్లా ఉపేక్షించారోగదా! ఢిల్లీలోని హరిజన్‌బస్తీలు మురికికూపాలే కాని, అజ్మీరులోవి వీటి తలదన్నినవి. ఈరోత వెంటనే ఆపవలెను.

## మీరుపూర్‌లో బాధితులు

కాశ్మీర్‌లోని ఒక జిల్లా మీరాపూర్. కొండజాతులు దాడి సల్పి అక్కడి స్త్రీలను పురుషులను ఎత్తుకొని పోయిరట.

కొందరు ఆడపిల్లలను వారు చెరబెట్టినారట. అనేకులను పాకిస్థాన్ చేర్చిరట. బందిపోటు దొంగలైనా కొంత ఔచిత్యము చూపవలెను. ఎవరైనను స్త్రీల నపహరించటం దారుణకృత్యం. ఈ కథ నిజమే ఐతే, పాకిస్థాన్ సర్కార్ ఈ అక్రమమును తొలగించవలెను. జవహర్‌లాల్ కూడా ఆవేదన పడుచున్నాడు. ఇస్లాం ఇట్టి చర్యల నామోదించదు. సర్కారుచక్రము మెల్లగా కదులుతుంది. కాని మానవోద్ధరణ కృత్యాలకు ఆలస్యం పనికిరాదు.

# 138

28-1-48

## బహావల్‌పూర్ స్నేహితులకు

బహావల్‌పూరు మిత్రులు గాంధీజీని చూడ దలచిరట, కాని సమయం దొరకలేదని వారు ఫిర్యాదుచేసిరి. గాంధీజీ కొంత వ్యవధినిస్తానని చెప్పెను. కాని సాధ్యమైనంత సహాయము చేయబడుచునేయున్నది. సుశీలనయ్యర్, లెస్లీక్రాసు బహావల్‌పూరు పోయిరి. వారి కృషిఫలితమునకై వేచి యుండవలెనని గాంధీజీ వారితో చెప్పెను.

## ఢిల్లీలో శాంతి

ఇచ్చట శాంతి ఏర్పడింది కాన, అన్నిచోట్ల స్థితిగతులు తప్పక బాగుపడగలవు.

## దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం

దక్షిణాఫ్రికాలోని భారతీయులను అచటి రాష్ట్రాలలోకి స్వేచ్ఛగా పోనీయరు. మానవ మర్యాద రక్షణ కొరకు సత్యా

గ్రహులు వాల్‌కర్టు పోయి అటనుండి మోటారులో జోహానస్ బర్గు చేరిరి. అచట సభ చేసిరి. ఇది సాహసమైన పని. ప్రజలందరు సత్యాగ్రహులైతే, విజయం తప్పదు. అచ్చటి సర్కారు సహనం చూపింది. ఎవరినీ ఖైదు చేయలేదు. ఉద్యమం శాంతముగా సాగినంతవరకు సర్కారు నిర్బంధాలకు దిగనక్కరలేదు. అచ్చటి సర్కారు ఈ సత్యాగ్రహులను కలసి, వారి న్యాయమైన కోరికలను తెలుసుకొని, తృప్తి పఱుపవలెను. ఆ దక్షిణాఫ్రికా, ఈ ఇండియా పాకిస్థాన్‌లు ఆంగ్లకామన్ వెల్తులో సభ్యులే గనుక ఆఫ్రికా వీరియెడ స్నేహముగా ప్రవర్తించవలెను. వీరిలో వీరు పోరాడుట తగనిపని. కాని రంగుభేదాన్ని బట్టి భారతీయులను హీనంగా చూస్తే, ఆఫ్రికా తప్పుడుమార్గం పట్టినట్లే.

## మైసూరులో ముస్లింలు

మైసూరుమంత్రి తంతె ఇచ్చారు. మొదట ముస్లింలు ఇచ్చిన తంతె తప్పట. ఈ ఉపవాసమువలన చాల మేలు కలిగినదని మంత్రి యనెను. బెంగుళూరునగరంలో జరిగిన చిల్లర అల్లరులను పోలీసు లాఠీఛార్జి, కాల్పులు లేకుండానే వెంటనే ఆపిరి. ఆ రాజ్యంలో ఇంకెక్కడ ఈలాంటి గలాభాలు లేవు.

## ముస్లింలు ఒకతంతె ఇచ్చిరి

మైసూరు సర్కార్ కదిలించట. ఆ సంఘటనలనుగూర్చి వారు చేసిన ప్రకటన ముస్లింలు నిర్దోషులని ఋజువు చేసినదట. అచ్చటి ముస్లింలు ఆ రాజ్యము యెడలను, యావత్తు దేశము యెడలను భక్తి భావము కలిగి యుండిరని ప్రకటనలో కలదు.

అతిశయోక్తులు లేకపోతే, అన్ని సంఘాలు కలసి మెలసి బ్రతుకగ నని, ఇది తన చిరకాలానుభవ మని గాంధీజీ చెప్పెను.

## దాతల కొక మాట

రిజిష్టరు చేయబడని కవరులో డబ్బు పంపుట మంచిది కాదు. ఒకపుడు గాంధీజీ తండ్రి సామాన్య టపాలో తనకు ఒక విలువగల రత్నమును పంపి, అది సరిగా చేరిందా అని, ఆదుర్దాతో తంతె పంపెను. నేడు ఒక స్నేహితుడు సామాన్యపు లకోటాలో రు 1000 లు పంపెను. అది లాగివేస్తే ఎంతనష్టం ? అది సరిగా చేరినందుకు ఆ శాఖ ఉద్యోగస్థులను గాంధీజీ అభినందించెను. అన్ని శాఖలలోను నిజాయితీ ఎక్కువగా నుండవలెను. ఇకముందు దాతలు మనియార్డరు ద్వారాను, ఇన్ష్యూరు ద్వారాను పైకము పంపుచుండవలెను.

# 139

29_1_48

## బహావల్పూరుకు రాయబారము

సుశీలనయ్యర్ పంజాబులోని గుజరాత్ వాస్తవ్యురాలు. ఆమెకు అక్కడి భాషలు తెలుసును. ఆమె నౌకాలీలో "మిత్ర బృందం" అనే వారితో కలసి పనిచేసింది. ఆ బృందంలోనివాడే వెస్లీక్రాస్. దైవమును ప్రేమించు సత్పురుషుడు, ఎల్లరకు స్నేహితుడు. బహావల్పూర్ పోదామని ఆయన సంకల్పించాడు. ఆ మాట విని సుశీల బయలుదేరెను. కలిసి పనిచేయుటకు క్రాస్ ఒప్పుకొనెను. క్రాస్నే పెద్దగా నుంచుటకు ఆమె సమ్మతించెను.

సేవాభావముతో అచటికి పోయిరి. నిస్వార్థ సేవలో పెద్ద చిన్న అను భేదముండదు.

## వారి నౌకరు

బన్ను నుండి 40 మంది శరణార్థులు గాంధీజీని చూచిరి. వారు చాలా దుర్దశలో నున్నారు. వారి దర్శనము ఆయనకు ముదము కొల్పెను. గాంధీజీకి తీరిక లేనందున వారి కైఫియతులను బ్రిజకృష్ణ వ్రాసుకొనెను. వారిలో ఒకరు కోపించి, "మా బాధలకు నీవే మూలకారణము. మమ్ము వదలివేసి, హిమాలయమునకు పొమ్మ"ని కేకలు వేసెను. కొందరు గాంధీజీని తిట్టిరి, కొందరు విసుగుకొనిరి, అనేకమంది మెచ్చుకొనిరి. ఎవ రాజ్ఞ ప్రకారము హిమాలయమునకు పొమ్మందురు? అని ఆయన అడిగెను. అంతరాత్మ ఆదేశప్రకారం పోతా నని ఆయన జవాబు చెప్పెను. గాంధీజీ వీరిని తోబుట్టువులుగా చూచెను. దేవుడు ఒక్కడే మనందరికీ స్నేహితుడు. ఇక్కడ ప్రజలు బాధలు పడుచుంటే, విశ్రాంతికొఱకు తాను కొండలకు పోదలచలేదని వారందరు కొండలకు పోతే, వారి నౌకరుగా తాను కూడా వెళ్లుదు ననెను.

## తిండికై దేహశ్రమ

అన్నం, వస్త్రం, ఇల్లు చూపినను శరణార్థులు ఏమీ పని వారు చేయ లేదట. దుర్దశ తొలగాలంటే, సౌఖ్యం కలగాలంటే, అచ్చటి ముఖ్యం కాయకష్టములో ఉంది. తిని, త్రాగి, తందనాలు మెడలను దైవము మానవుని సృజించలేదు. యజ్ఞం చేసి దాని

ఫలితం అనుభవింపమని గీత చెప్పింది. యజ్ఞమనగా దేహశ్రమ. పనిలేక తినే కోటీశ్వరులు పరావలంబులే. వారు కాయకష్టము చేసి తినవలెను. లేనిచో పస్తుండవలెను. వికలాంగులకే మినహాయింపు ఉంటుంది. శరణార్థులు చేయగలిగినవి చాలా పనులు గలవు.

తనమాట వింటే, మన రాజప్రతినిధి, మన ప్రధాని మన కిసానులలోనివారై యుండవలెను. కిసాన్లే నైన రాజ్యానికి వారసులని చిన్నప్పుడు గాంధీజీ చదివెను. భూమిమీద పనిచేసి తినువారే కిసానులు. వారికి చదువు లేకపోయినా ఇబ్బందిలేదు. వివేకము, ధైర్యము, అనింద్య ప్రవర్తన, అనుమానరహితమైన దేశాభిమానము ఉంటే చాలు. సంపద ఉత్పాదకులు గాన వారే నిజమైన అధిపతులు. కాని వారిని మనము బానిసలను చేసినాము.

ప్రభుత్వ కార్యదర్శుల పదవులుకూడ కిసానులే ఆక్రమించవచ్చునని గాంధీజీతో ఒకరనిరి. తగిన అర్హతయున్నచో, ఆ ప్రత్యేక పనికి తగిన పరిచయమున్నచో, ఆయన ఆ సలహాను అంగీకరించును. ఇలాటివారు బయలుదేరితే, ఇప్పుడుండే మంత్రులు, ఇతరులు రాజీనామా ఇచ్చి వీరికి చోటు ఇవ్వవలె నని గాంధీజీ చెప్పెను.

## మదరాసులో అన్నపు కొఱవ

చెన్నపురి సర్కారు తమ రాజధానికి ఆహార ధాన్యాలు సరఫరా చేయించమని కేంద్రమంత్రి జయరామదాసు దగ్గరకు